

# ద్వాదశసూరి చరిత్ర

(రామానుజ చరిత్రతో)

శ్రీ కె. టి. యల్. నరసింహాచార్యులు





తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణ

# ద్వాదశసూరి చరిత్ర

(రామానుజచరిత్రతో)

శ్రీ కె.టి.యల్. నరసింహాచార్యులు




ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

**DWADASASURI CHARITHRA**

(Lives of Twelve Alwars and Ramanuja in Telugu)

by:

K.T.L. Narasimhacharyulu

T.T.D. Religious Publications Series No.:450

© All Rights Reserved.

First T.T.D. Edition: 1997

Copies: 5,000




Published by:

Sri M.K.R. Vinayak, I.A.S.,

Executive Officer,

Tirumala Tirupati Devasthanams

Tirupati.




Printed at:

T.T. Devasthanams Press,

Tirupati.

# ముందుమాట

భగవంతునిపట్ల తైలధారలాగ అవిచ్ఛిన్నంగా ప్రవహించే ప్రేమభావనే భక్తి. సకలకల్యాణ గుణపరిపూర్ణుడైన దేవదేవుడి స్వరూప రూప గుణ వైభవాలను అనన్యప్రేమతో అనుభవించడమే భక్తి. ఇలాంటి భగవద్భక్తి సాగరంలో మునకలువేస్తూ, లోతులుచూసిన శ్రీ వైష్ణవ భక్తశిఖామణులు ఆళ్వారులు. వీరు శ్రీవైష్ణవసంప్రదాయానికి మూలపురుషులు. వీరు పన్నెండుమంది.

భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్,
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
శ్రీ మత్పరాంకుశ మునిం ప్రణతోఽస్మి నిత్యమ్.

ఈ మహాత్ములు ద్రావిడదేశంలో అవతరించి ద్రవిడభాషలో శ్రీమన్నారాయణుడి అనంతకల్యాణ గుణచేష్టితాలను అనన్యభక్తితో నాల్గువేల పాశురాలలో కీర్తించారు. పాశురమంటే పద్యమని భావం.

వీరు తమ పాశురాలలో తిరుమల, శ్రీరంగం, కంచి మొదలైన శ్రీ వైష్ణవదివ్యదేశాలలో వెలసిన భగవదర్చామూర్తులను పలువిధాల ప్రస్తుతించారు. వేదవేదాంత సారస్వరూపాలూ, భక్తి ప్రచురాలూ అయిన వీరి రచనలు నాలాయిర దివ్యప్రబంధమనే పేరుతో ప్రఖ్యాతి వహించాయి.

మహాభక్త కవిశిరోమణులైన ఆళ్వారులు చెప్పిన పాశురాలు విష్ణు దేవాలయాలలో నిత్యపఠనీయాలు. పరాంకుశముని అని పొగడగన్న నమ్మాళ్వార్ సహస్రాధిక సంఖ్యలో పాశురాలు పాడారు. వీరి "తిరువాయిమొళి" భక్తి ప్రపత్తుల స్వరూపస్వభావాలు చాటే దివ్యప్రబంధం. కోమల కాంత పదావళితో మనోజ్ఞమైన మృదుమధురకవితను భక్తలోకానికి అర్పించిన కవిలోక మూర్ధన్యుడు నమ్మాళ్వార్. అలాగే ఆండాళ్ రచించిన తిరుప్పావు విష్ణ్వాలయాల్లో నిత్య పఠనీయంగా ఉన్నది. ద్రావిడ సాహిత్యంలో అసమానకీర్తి గడించిన కవయిత్రి శ్రీగోదాదేవి, ముప్పయి పాశురాల తిరుప్పావునే కాకుండా నాచ్చియార్ తిరుమొళిని కూడ రచించింది.

ఈమే ఆముక్తమాల్యద. కులశేఖరమహారాజు ద్రవిడభాషలో "పెరుమాళ్ తిరుమొళినే" కాకుండా సంస్కృత శ్లోకాలలో "ముకుందమాలా" ప్రబంధాన్ని రచించారు. నారాయణస్తుతిరూపమైన ముకుందమాల బహుళ ప్రచారం పొందిన గొప్పరచన.

యతిరాజు, ఎంబెరుమానార్, ఉడయవరులు, భాష్యకారులు అనే నామములతో విఖ్యాతులైన భగవద్రామానుజులు శ్రీ వైష్ణవ సిద్ధాంతాన్ని సేతువు మొదలు శీతనగపర్యంతం ప్రచారానికి తెచ్చిన మహామహులు. మతత్రయకర్తలలో వీరొకరు.

అలౌకిక ప్రతిభాసంపన్నులైన పన్నెండుమంది పరమయోగుల మరియు రామానుజుల జీవితకవితా తపస్సాధన ఎలాంటిదో ఈ పుస్తకంలో వర్ణించబడింది. సుగృహీతానామధేయులైన శ్రీమాన్ కె.టి.యల్. నరసింహాచార్యులవారు సుందరసులభశైలిలో రచించిన ఈ పుస్తకం ఆంధ్ర పాఠకులను ఎంతో అలరించగలదని మా విశ్వాసం.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

# విషయసూచిక

శ్రీగురుభ్యో నమః
శ్రీమతే రామానుజాయ నమః

# ద్వాదశ సూరి చరిత్ర

## అవతరణిక

శ్రీరంగార్యకృపాపాత్రం రామానుజపదాశ్రయమ్,
శ్రీనృసింహార్య సత్పుత్రం జగన్నాథగురుం భజే.

శ్రీమాన్ వేంకటతాతార్యో వైయాకరణకేసరీ,
అస్మద్దేశికవర్యో మే సన్నిధత్తాం సదా హృది.

రాజచ్ఛ్రీధృతపుండ్ర మనిశం రామానుజాఖ్యం మునిం
కాషాయాంబర మబ్జసన్నిభగళం కాంతోపవీతశ్రియమ్,
భాషాసంస్తుతవాగ్విలాస మమలం బద్ధాంజలిం భాస్వరం
శ్రీవత్సాంకముఖాఖిలార్యశరణం శ్రీభాష్యకారం భజే.

యద్గోసహస్ర మపహంతి తమాంసి పుంసాం
నారాయణో వసతి యత్ర సశంఖచక్రః,
యన్మండలం శ్రుతిగతం ప్రణమంతి విప్రాః
తస్మై నమో వకుళభూషణభాస్కరాయ!

యత్పాదపద్మప్రావణ్యా దభవం జ్ఞానలేశవాన్,
వందే తం విష్ణుభక్తాగ్ర్యం వకుళాభరణం మునిమ్.

నిత్యాభూషానిగమశిరసాం నిస్సమోత్తుంగ వార్తాః
కాంతో యస్యాః కచవిలులితైః కాముకో మాల్యరత్నైః,
సూక్త్యా యస్యాః శ్రుతిసుభగయా సుప్రభాతా ధరిత్రీ
సైషా దేవీ సకలజననీ సించతాన్మా మపాంగైః.

ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ
నారాయణ స్సరసిజాసనసన్నివిష్టః,
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయవపు ర్ధృతశంఖచక్రః.

పాటిబండాన్వవాయేన శ్రీమన్మాధవ శర్మణా
ప్రేరితో౽హం కరోమ్యేతత్ కావ్యం ద్వాదశసూరిణామ్.
చారిత్ర మాంధ్రభాషాయాం గద్యరూప మిదం శుభమ్,
యే పఠంతి నరా భక్త్యా తే నిత్యం సుఖభాగినః.

* * *

# [1] అభివాదయే

శ్రీజగన్నాథదేశికుఁడు మజ్జనకుండు
ఆతండె బ్రహ్మవిద్యాప్రదాత
సద్వినుతచరిత్ర సాధ్వి యాండాళమ్మ
ననుఁగని పెంచి పెద్దనుగఁ జేసె.
త్యాగియౌ వేంకటతాతసుధీమణి
వ్యాకరణము నేర్పె బావగారు
హారితగోత్రుండ యాజుషశాఖలో
వరలితి బ్రాహ్మికిఁ బరమహితుఁడ

వాణి నా మాతగా నిట్లు ప్రకట మగుచుఁ
బాణిఁ గైకొని లిఖియించె భవ్యశైలి
విష్ణుభక్తుల చరితంబు విశదమలిని
నారసింహుండ "విద్యావిశారదుండ."

అక్షతమ్ములతో నక్షరాభ్యాసమును చేసి
యమరంబు నేర్పె నాయనుఁగుఁ దండ్రి
బమ్మెర పోతన భాగవతంబును
బఠియించినాఁడను బాల్యమందె
పాణినీయంబుతోఁబాటుగా నేర్పి రా
భాషలో మర్మముల్ బావగారె
గ్రంథబంధనరూపకళ[2] నేర్చినాఁడను
కరతలామలకంబు కావ్యరచన

సంతతాధ్యాపనంబు నా సహజవృత్తి
తమిళవంగోత్కళాదులు నమరియుండు
సరవి "సాహిత్యరత్న" "భాషాప్రవీణ"
పట్టములఁ గొంటి సుకవులప్రాపు గంటి.

విద్యావిశ్రుత "ముపనిష
దుద్యానపుఁ గోకిల"మ్మిదో మధురముగా
గద్యము నాలాపించును
సద్యాపరనిర్వృతిఁ గన సరసులు వినుఁడీ.

---

1 అపరిచితులగు పెద్దలను చేరినపుడు బ్రాహ్మణులు తమ కుల గోత్రాదులు తెలుపుకొనుట సంప్రదాయము.

2 పుస్తకముల బైండింగు.

శారదనీరదరుచిమై,
పారదసమప్రజ్ఞ నిచ్చి పరిషత్తులలో
చేరి గెలిపించు కవితా,
శారద నేఁగొలుతుఁ జిత్తశాంతికి భక్తిన్.

తెలుగునఁ గవితను చెప్పగ
నలవియె కడు నేర్పు నోర్పు నలవడకున్నన్-
ఇల ప్రాసయతిగణంబుల
నలవోకగఁ బంతులాడు నతఁడె పటిమయౌ.

పద్యంబును గద్యంబును
హృద్యంబుగఁ జెప్పఁగల యహీన ప్రతిభా
విద్యావినోది నగుదుము
సద్యఃస్ఫురణను వెలుంగు సత్కవిసఖుఁడన్.

అలఁతి యలఁతి పలుకు లందముగాఁ గూర్చి
తేట తెలుఁగులోనఁ దేనె జాలు
వారు పటుల మధురభావముల్ పలుక నే
వారు మెచ్చ రట్టి సారకృతిని.

గద్యరచనలో నా యున
పద్యంబగు నైపుణమును వాగ్గుంఫనమున్
హృద్యంబగు ప్రాక్తనకవి
పద్యానుసరణము గనుఁడు. భావుకులారా.

ఏ వేవో కలలందఁగాంచితిని గానీ చారు కావ్యేందిరా
సేవం జేయఁగలాఁడ నంచు మదిలోఁ జింతింపలేనైతి ద్వ
ద్పాదాధీనకటాక్ష మిట్టిదిగనే భావింతు సారస్వత
శ్రీవాత్సల్యము చెందినాఁడ నిను సంసేవించి నారాయణా!

# I ఆళ్వారులు : రసతరంగిణి

"అలపన్నిద్దఱు సూరులందును సముద్యల్లీలఁ గాఁపున్న చె
గ్గలికం దావముఁ బాప నా విజమువఃకంజాతసంజాత పు
ష్కల మాధ్వీకఝరి న్మురారి సొగియుంగాఁ దొక్కి ధన్యాత్ములౌ
నిల పన్నిద్దఱు సూరులం దలఁతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్".

—ఆముక్తమాల్యద

శ్రీసూర్యనారాయణుడు తన యప్రతిమప్రకాశముచే నంధకారము పోగొట్టుటచేతనే లోకవ్యవహారములు నిర్విఘ్నముగా సాగుచున్నవి. కాననే యాతడు లోకబాంధవు డను సార్థకనామముతో ప్రసిద్ధి గాంచినాడు. కాని యీ సూర్యభగవానుని వేడిగూడ మితిమీరినచో దుర్భరమే యగును గదా! అట్టి సూర్యులు పన్నిద్ద రని శాస్త్రవచనము. మర యంత మంది సూర్యుల తాపతీవ్రత భరించుట సామాన్యమా! ద్వాదశ సూరుల యా తాపము తగ్గించుటకై యిలపై నీ ద్వాదశ సూర్యు లవతరించి నారు. వారే పన్నిద్దరాళ్వారులు. వీరు తమ హృదయపంకజములనుండి నిసర్గ సుందరముగా వెలువడిన మధురమధుప్రవాహముచే మురారిని సాక్షాత్కరించి ధన్యాత్ములైన పరమభాగవతోత్తములు. నిర్భర వైష్ణవభక్తి పూర్ణు లగు ప్రపన్ను లీ దివ్యసూరుల నారాధించి వారి వాక్సుధా లహరి నోలలాడి తరింతురు. అంతేగాక వారు చూపిన మధురభక్తి మార్గమున పయనించిన వారు మాత్రమే విష్ణుసాయుజ్య మందగలరు.

భగవంతుని గూర్చిన ప్రేమయే భక్తి. తైలధారవలె నవిచ్ఛిన్నముగా ప్రవహించు భావధారయే భక్తి! దేవుని యెడ ననన్యప్రేమయే భక్తి! శ్రియఃపతి కల్యాణగుణ చేష్టితములును తద్దివ్యమంగళవిగ్రహసౌందర్య మును హృదయదఘ్నముగా అత్యప్తామృతమునువలె ననుభవించుటయే భక్తి!

త్రివిధతాపపరితప్తులగు జీవుల కా భక్తిరసాయన మొక్కటే దివ్య శాంతి కల్గించు రసాయనము. హరిభక్తాగ్రేసరులు శ్రీకులశేఖరులు భక్తి రసామృతసరోవరమగు తమ ముకుందమాలలో నిట్లు వర్ణించి నారు.—

ఇదం శరీరం పరిణామపేశలం
పత త్యవశ్యం శ్లథసంధిజర్జరమ్,

కిమౌషధైః క్లిశ్యసి మూఢ దుర్మతే
నిరామయం కృష్ణరసాయనం పిబ!

ఈ శరీరము నశ్వరము. సంధిబంధములు సడలి యిది యెప్పుడో రాలిపోక తప్పదు. కాన నో దుర్మతి, మందులతో ధనమును కాలమును ఆరోగ్యమును నేల వమ్ము చేసుకొందువు? సంతతారోగ్యప్రదమైన కాయకల్పచికిత్సతో నెనయగు శ్రీకృష్ణరసాయనమును సేవింపుము!

"అమృతం మోక్షదేవాన్నే" అని గదా నిఘంటువు. దేవతల కాహారమగు నమృతముకంటె మోక్షము ప్రథమగణ్య మని తెలుపుటకే యా పదమునకు మోక్ష మను నర్థము ముందియబడినది. శృంగారాది నవరసములు మాత్రమే మన సాహిత్యశాస్త్రమున ప్రసిద్ధ మయి యుండగా నీ భక్తిరసమెక్కడ నుండి యూడిపడినది? అని కొందర డుగవచ్చును. భక్తి యను భావమునకు రసపరిపాకయోగ్యత కల్గించినవా రీ యాళ్వారులే యని పలుకుట యథార్థదూరము గాదు. ఇది యతిశయోక్తి యెంత మాత్రమును కాదు. ఆ చర్చకిది తావునుగాదు.

కొండలపై వర్షము కురియుటచే చిన్న చిన్న జాలులుగా బైలు దేరిననదులు పోనుపోను వృద్ధిచెంది పల్లములకు ప్రవహించి చివరకు సముద్రమున సంగమించును. కాని భక్తినది విషయము పై న్యాయమునకు భిన్నము. ఇది దక్షిణభారతమున ద్రావిడకవుల వాణినుండి సహజసుందరముగా వెలువడి అయత్నముగనే యుత్తరమునకు ప్రవహించుచు కొండ లెక్కి, బండలు దిగి యాదిశ కవధియగు పరమపదమున విరాజిల్లు పరతత్త్వము శ్రీమన్నారాయణునం దైక్యమగును. ఆకసము నుండి కురిసిన వర్షము సముద్రమున లీనమగుచుండగా మర్త్యలోకము నుండి వెలువడిన యా భక్తినది మాత్రము సర్వలోకోపరిస్థితుడగు శ్రీహరి యను మహాసముద్రమున నైక్యమగును. ఇది యెంత చిత్రము, ఈ సూక్తి సత్యమే గదా!

ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్,
సర్వదేవనమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి.

భగవత్తత్త్వమునకును ప్రకృతిని—విద్యకును, అవిద్యకును--క్షరమునకును,--అక్షరమునకును --భేదముగాని, రహస్యముగాని యుండే కలవు. ఈ గీతాసూక్తి మననీయము--

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్,
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్.

ఇం ధక్షరతత్త్వము విలక్షణమయిన యశ్వత్థవృక్షముతో పోల్చబడి నది. ఇతర వృక్షముల వలె గాక నీ రావిచెట్టు తలక్రిందుగా వ్రేలాడు చుండును. దీని మొద లూర్ధ్వముఖము. ఆ వృక్షతత్త్వవేత్తయే బ్రహ్మతత్త్వవేత్త.

"యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః."

మన రాత్రి యా బ్రహ్మవేత్తకు పగలు. వాని పగలు మనకు రాత్రి. అట్టివాడే భగవంతుని శీలసౌదర్యముల నాస్వాదింప నర్హుడు!

కలియుగాదిని అనగా నేటికి సుమారైదువేలవత్సరములకు పూర్వ మవతరించిన శ్రీవైష్ణవసంప్రదాయమునకు--దీనినే శ్రీ భాగవతసంప్ర దాయ మని గూడ నందురు-- మూలపురుషులగువారు పైన పేర్కొనిన యాళ్వారులే. ముముక్షువు--మోక్షార్థి యయినవాడు-- అందును విష్ణు భక్తుడు--ఈ యాళ్వారులనుగూర్చి వీరి భక్తితత్త్వమునుగూర్చి తెలిసి కొని తీరవలెను. ఆలకింపు డీ శ్లోకము—

భూతం సరశ్చ మహదాహ్వయభట్టనాథ
శ్రీ భక్తిసారకులశేఖరయోగివాహాన్,
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోస్మి నిత్యమ్.

పై శ్లోకమున పదునొకండుగురు ఆళ్వారుల పేర్లు గలవు. (1) పొయ్‌గయాళ్వార్ (2) పూదత్తాళ్వార్ (3) పేయాళ్వార్ (4) పెరి యాళ్వార్ (5) తిరుమళిశయాళ్వార్ (6) కులశేఖరాళ్వార్ (7) తిరుప్పాణాళ్వార్ (8) తొండరడిప్పొడియాళ్వార్ (9) తిరుమంగ యాళ్వార్ (10) ఉడయవర్ (11) నమ్మాళ్వార్. వీరికి సంస్కృత నామాంతరము లివి. (1) సరోయోగి (2) భూతయోగి (3) మహాయోగి (4) భట్టనాథులు (5) భక్తిసారులు (6) కులశేఖరుడు (7) మునివాహనులు (8) భక్తాంఘ్రిరేణువు (9) పరకాలయోగి (10) శ్రీమద్రామానుజులు (11) శఠకోపముని--వీరిలో ఉడయవర్లను తీసి

వేయగా మిగిలిన వారికి పదుగురాళ్వారులు అని గూడ వ్యవహారము గలదు. పై శ్లోకమం దీ పదకొండుగురకును ఆండాళ్ అను గోదా దేవిని కూడ కలిపిన పన్నిద్దరాళ్వారు లగుదురు. వీరే ఈ గ్రంథమున పేర్కొనిన ద్వాదశదివ్యసూరులు! ఇందలి 'శ్రీ' భక్తిసార అను పద ములో 'శ్రీ'ని విడదీసి గోదాదేవి యని యర్థము చెప్పుదురు కొందరు.

భగవద్గుణానుభవము నిరర్గళముగా స్వర్గంగవలె వీరి వాక్కులనుండి ద్రావిడభాషారూపమున వెలువడినందున వీరికి ఆళ్వారులు అను పేరు కల్గినది. ఆళ్వారు అనిన కాపాడువారు అని వ్యుత్పత్తి. కవితా సుందరి వలచి వచ్చి వీరి వాక్కులను వరించినది. తమ కవితలతో వీరు మనలను కాపాడుటకే యవతరించినారు. కాననే వీరి కీ నామము సర్వదా సార్థకము. భగవదనుభవపరీవాహరూపమయిన భక్తిసాగరమున మునకలు వైచి యందలి లోతులను కనుగొన్న వారని కూడ నీ మాట కర్థము చెప్పవచ్చును. అంతే గాదు. తమపై నాస్థ కల్గిన బద్ధజీవులను తమతోబాటు భక్తిరసామృతసింధువున ముంచి యుక్కిరిబిక్కిరి చేసి బ్రహ్మానందమున తేల్చుట గూడ వీరికి వెన్నతో బెట్టిన విద్య.

ఈ యాళ్వారు లందరును కలిసి మొత్తము నాల్గువేల పాశు రములు ద్రావిడభాషలో మృదుమధురముగా సహజ సుందరశైలిలో ప్రబంధీకరించిరి. పాశుర మనగా పద్యము. ద్రావిడదేశమున సామాన్య విద్యావంతులు గూడ వీనిని భక్తితో పాడుకొని యానందపరవశులగు చుందురు. ద్రావిడభాషలో నీ గ్రంథసముదాయమునకు నాలాయిర దివ్యప్రబంధ మని పేరు. నాలాయిర మన నాల్గువేల పాశురముల సముదాయము. నాథముని యను కవినాథు డీ ద్రావిడసంహితకు రాగతాళములు కూడ నిబంధించి దీనిని పండితపామరుల కుపాదేయము గావించుట మరొక విశేషము.

మిగిలిన వారి కందరకును నమ్మాళ్వారులు శరీరము. ఇతరులు వీరికి కరపాదాద్యవయవప్రాయులు. ఈ నమ్మాళ్వారులనే విష్ణుభక్తినది కుద్గమస్థానముగా మన పూర్వాచార్యులు వర్ణించియున్నారు. ఈ కవి చతురాననుడు, మహాముని, మహర్షి, భాగవతోత్తములు.

విష్ణ్వాలయముల కేగినపు డచటి యర్చకులు తీర్థమిచ్చి శఠకో పమును మన శిరస్సులపై నుంచుదురు గదా! నమ్మాళ్వారులకే

శఠకోపు లని కూడ మరొక నామము సుడీ! ఆ శఠకోపమునికి ప్రతీకమే యీ శఠకోపము. ఈ శఠకోపులు శ్రీమహావిష్ణువునకు పాద స్థానీయులు. శఠకోపముపై విష్ణుపాదము లుండుట మనము శ్రద్ధగా గమనించిన చూడగలము. శ్రీవైష్ణవసంప్రదాయ ప్రవర్తకులగు శఠకో పమహర్షి భక్తిస్రవంతి కుత్పత్తిస్థానమగు మహాశైలరాజముగా వినుతి కెక్కి నారు. ఈయన మూర్తీభవించిన కరుణరసము. చెడుదారులలో కన్నుగానక సయనించి నరకకూపమున బడినవారి నుద్ధరించు నూత కోల!

వీరిలో పొయ్‌గయాళ్వారు శ్రీమహావిష్ణువు ధరించు పాంచజన్య మను శంఖముయొక్క యంశము. పూదత్తాళ్వారు కౌమోదకి యను గదాంశమునను, పేయాళ్వారు నందకఖడ్గాంశమునను నవతరిం చిరి. పెరియాళ్వారు గరుత్మంతుని యంశమునను, తిరుమళిశయా ళ్వారు సుదర్శనచక్రాంశమునను, కులశేఖరాళ్వార్ కౌస్తుభరత్నాంశ మునను, తిరుప్పాణాళ్వారు శ్రీవత్సలాంఛనాంశమునను, తొండరడి ప్పొడి యాళ్వార్ వైజయంతి యను వనమాలాంశమునను, తిరుమంగ యాళ్వార్ శార్ఙ్గ మను చాపాంశమునను పొడకట్టిరి. నమ్మాళ్వారు విష్వక్సేనుని యంశమునను, కుముదు డను గణాంశమున మధుర కవియును, ఆండాళ్ భూదేవి యంశమునను, ఉడయవర్లు ఆదిశేషుని యంశమునను ఆవిర్భవించిరి. సంసారసర్పసందష్టశరీరులై బాధపడు చున్న జీవులకు స్వస్థత కలిగించుటకై శ్రియఃపతియే యిట్లు వీరి నీ పుడమిపై వెలయ నాజ్ఞాపించెను. భగవన్నిర్హేతుకజాయమాన కటాక్షలబ్ధ దివ్యజ్ఞానముచే పరమకరుణతో నీ యాళ్వారులు లోకోద్ధరణ మెట్లు చేసినారో ముందుముందు వివరముగా తెలిసికొనగలము.

* * *

# II ద్రావిడవేదావతరణము

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడగు శ్రీమన్నారాయణుడు విరజానదీ తీరముననున్న వైకుంఠనగరమును పరిపాలించుచుండెను. దానినే పరమపదమనియు, నిత్యవిభూతి యనియు నందురు. తక్కిన చతుర్దశ లోకములకు లీలావిభూతి యని పేరు. లీలావిభూతికంటె నిత్యవిభూతి వైశాల్యమున మూడురెట్లు విస్తృతము. గురూపదేశమను నావచే సంసారసాగరమును తరించిన విష్ణుభక్తాగ్రేసరు లయిన జీవాత్మలు మాత్రమే యా పదము చేరి మాధవుని దర్శించి తరించు భాగ్యము పొందనర్హులు.

ఆ శ్రీహరి యొక దినమున నిండుకొలువున సుఖాసీనుడై యుండెను. శ్రీభూనీళాపట్టమహిషు లాయనను సేవించియుండిరి. స్వామి సుదర్శనపాంచజన్యములను నితరాయుధములను హస్తముల ధరించియుండెను. అనంత గరుడ కుముద విష్వక్సేనాదులగు నిత్యసూరుల పరివార మాయనను పరివేష్టించియుండెను. కాని పేరోలగమున నున్నను నా స్వామి ముఖ పంకజము మాత్ర మేలనో కృష్ణపక్షచంద్రునివలె వన్నె దరిగి చిన్నవోయి యుండెను. భూలోకవాసులు తా నిచ్చిన కరచరణాద్యవయవములను తన సేవ కుపయోగింపక జ్ఞానేంద్రియాదులను తన ధ్యానార్చనాదులకై వినియోగింపక, మోక్ష మార్గవిముఖులై సదా సంసారసాగరమున మునిగి తేలుచు దరిగానక యందే బాధపడుచు కాలము గడపుచుండుటయే యాయన మనోవైకల్యమునకు కారణము. అయ్యో! తన బిడ్డ లిట్లు చెడిపోవుచున్నారే, వీరిని బాగుచేయుట యెట్లా యని యాయన మిగుల విచారింపసాగెను. కాని వారి నుద్ధరించుట కే దారియును నప్పు డాయనకు తోచలేదు.

త్రిలోకైకనాథుడగు తన భర్తముఖము విచారమేఘాచ్ఛన్నమై యుండుట లక్ష్మీదేవి గమనించెను. వెంటనే యామె స్వామి నిట్లు ప్రశ్నించెను. "నాథా! అవాప్త సమస్తకాములును, ప్రమోద సాగరులును, దుఃఖదూరులుననగు మీ రిట్లు వెత గుందుచుంటకు కత మెద్దియో గదా! భార్య భర్త సుఖదుఃఖములలో పాలు పంచుకొనుట సహజము. మీతో సుఖము ననుభవించుటకే గాని మీ కష్టము

లలో పాల్గొను, నర్హతకును, సౌభాగ్యమునకును నేను నోచు కొనలేదా? అక్కటా! నే నెంత మందభాగ్యురాలను!"

అని పల్కి వాపోవుచున్న లోకమాతను మాధవుడు తన దరికి చేర్చుకొని "దేవీ, ఇంత మాత్రమునకే నీ వింత వంత నందనేల? నామనోవైకల్య కారణము నీకు గాక మరెవరికి చెప్పకొందును! ఆల కింపుము" అని తన మనస్సులోని బాధ నామెకు నెమ్మదిగా వెల్ల డింపగా నిందిరాసుందరి యిట్లు పల్కెను—

"స్వామీ! వీరిని సన్మార్గవర్తులను చేయుటకే గదా పూర్వము మీరు రామకృష్ణాద్యవతారము లనేకములు దాల్చినారు. కాని నా కొక్క సందేహము కలుగుచున్నది. ఈ మానవులను సృష్టించినది మీరే కదా! అట్టిస్థితిలో కొందరను భోగులుగాను, మరికొందరను యోగులనుగాను, కొందరిని పుణ్యాత్ములనుగాను, మరికొందరిని పాపాత్ములుగాను చేసి నారు. వారి కట్టి బుద్ధులు పుట్టుటకు బాధ్యులు మీరుగాక మరెవ్వరు?"

పద్మాక్షు డామె కిట్లు సమాధాన మిచ్చెను--"పద్మాక్షీ! నీ ప్రశ్న సరియైనదే. నేను శిష్టరక్షణ దుష్టశిక్షణలకై యవతారము లెత్తిన మాట నిజమే. కాని నా యీ స్వరూపములను కన్నులార గాంచి కూడ చాలమంది నా మహిమల నర్థము చేసికొనజాలరు. కొందరా యవ తారములపై శత్రుత్వమును, మరికొందరు మిత్రత్వమును పూని యుందురు. ఈ విధముగా ననేకరీతులుగా ప్రవర్తించు చపలచిత్తులను నే నెట్లు తరింపజేయగలను? జీవాత్మల కాత్మయగు నాపై మనసు నిలుపుకొని నన్ను చేరు మని గదా వారికి కరచరణాదులు నింద్రియములు నే నిచ్చినది. కాని వానిని సద్వినియోగపరచుకొని బాగుపడు తలంపు ప్రజలకు లేనిచో నే నేమి చేయగలను? ఇంద్రియములను, మనసును నాపై లగ్నము చేయుట మాని దుర్విషయాసక్తులై జనులు ఘోర నరకములకే దారి చూచుకొనుచున్నారు. జన్మజరామరణ చక్రమున పరిభ్రమించుచు పరమార్థ జ్ఞానమునకై సుంత గూడ యత్నింపని యీ మూర్ఖులకు నే నేవిధముగ బుద్ధి గరపగలనో గదా!

అయినను కట్టకడపట నింకొక యుపాయము తోచుచున్నది. దీనితో మానవలోకము పూర్ణముగా మారవచ్చును. శ్రీరంగము, కంచి, తిరుపతి

మొదలగు దివ్యదేశములందు నే నవతారములు ధరించెదను. వారు నన్ను భజియించి ఐహిక భోగములపై నాసను కోసివైచి ముక్తికాంతా కర గ్రహణము చేయుటకు మరొక సులభమార్గము చూపెదను. నా భక్తులను కొందరను పుడమిపై ప్రభవింపజేసి వారి బోధలద్వారా యాచరణము లద్వారా జీవులకు మోక్షమార్గోపదేశము చేయించెదను. కాన నో కమ లాదేవీ! నీవును, భూనీళాదేవులును మాత్రమేగాక నా యాయుధము లగుసుదర్శనపాంచజన్యాదులును, శ్రీవత్స కౌస్తుభాదులును, అనంత గరుడ విష్వక్సేనాది పరివారమును వసుంధరపై నానావర్ణములందవత రింప వలెను. ద్రావిడభాషలో మీరంద రనేక వైష్ణవభక్తి పూర్ణకావ్య ములు నిర్మింపవలెను. అవి వేదవేదాంత సారస్వరూపములై మద్గుణ వర్ణనాలంకృతములై నవరసాలంకారభాసురములై యపూర్వానంద సంధా యకములు కావలెను. హరిభక్తి ప్రచురములగు నా దివ్యప్రబంధములు నవరసరసితములై కాంతాసమ్మితము లయినందున విశిష్టాద్వైత సిద్ధాం తమునకు భిన్నమైన దుర్మతములను ఛిన్నాభిన్నము చేయగలివు. దక్షిణ భారతదేశమున నవతరించిన వైష్ణవభక్తశిరోమణులు వానిని ద్రావిడ భాషలో లిఖింపగలరు. కాన మీరందరును భూలోకమున నవతరించు టకు సిద్ధము కండు."

శ్రీహరి యాదేశము శిరసావహించి హరిప్రియ యిట్లు పల్కెను: "స్వామీ, మీ సంకల్పము లమేయములు. అయినను మీ కభ్యం తరములేనిచో మేము దక్షిణదేశముననే ఏల యవతరింపవలెనో ఇతర భాషలలోగాక ద్రావిడభాషలో మాత్రమే కావ్యములు సృష్టింపబడుటకు హేతువేదియో సెలవిచ్చిన నానందింతును."

దానికి విష్ణు విచ్చిన సమాధాన మిది–"ఓ పద్మాదేవీ! ఇదియా నీ సందేహము! సరే వినుము. పూర్వ ముత్తర దిక్కున కైలాసపర్వత శిఖర మున పార్వతీపరమేశ్వరుల పరిణయోత్సవము మహావైభవముగా జరి గెను. త్రిలోకవాసులగు నరులును బ్రహ్మాదిదేవతలును నా వివాహమహో త్సవ సందర్శనలాలసులై యట కేతెంచిరి. ఆ మహాజనసమూహ సమ్మర్దముతో నా ప్రదేశ మిసుక వైచిన రాలకుండ కిటకిటలా డిపోయెను. ఆ భారము భరింపజాలక ఉత్తరదిక్కునందలి భూమి జను లంద రొకే ప్రక్క గుమిగూడిన నావవలె నిటునటు కదలాడసాగెను. అంతేకా దా కైలాసపర్వతము తలక్రిందులగుటకు కూడా సిద్ధ మయ్యెను.

ఆ ప్రమాదకరపరిస్థితిని చూచి యచట కేతెంచిన మానవులే గాదు దేవ తలుగూడ ప్రాణము లరచేత బెట్టుకొని "ఓ యీశ్వరా, మమ్మెటుల కాపాడుదువో నీదే భార" మని భయార్తులై మొరపెట్టుకొనసాగిరి.

అపుడు దేవశిల్పియగు విశ్వకర్మ యింద్రాది దేవతలతో నిట్లు పల్కెను--"ఆర్యులారా, ఇపు డీ విపత్సముద్రము తరించుట కొకే యుపా యము నాకు తోచుచున్నది. ఈ యుత్సవమున పాల్గొనుట కగస్త్య మహాముని గూడ నిచటకు విచ్చేసినారు గదా! ఇచట కూడిన జను లందరి భారము రెండువంతులు కాగా కేవల మగస్త్యమహర్షి భారము రెండువంతు లుండును. కాన నాయన తమ నివాసమగు దక్షిణదిక్కు నకు మరల నేగినచో భూమిబరువు సమానమై యీ దుఃఖస్థితినుండి మనము బైటపడగలము."

విశ్వకర్మ పలుకులు విని దేవత లందరును యావల్లోకమునకును సంబంధించిన యీ మహాపద మాన్పుటకై దక్షిణ దిక్కున కేగ వలసిన దని యగస్త్యుని ప్రార్థించిరి. కాని విశ్వకర్మ చేసిన కొంటె పని కగస్త్యునకు కోపము వచ్చెను. ఆయన విశ్వకర్మను "ఓయీ, నే నెంతో కాలమునుండి గిరిజాకల్యాణము చూడ వేడుకపడుచుండగా పానక మున పుడకవలె నీ విట్లడ్డు వచ్చెదవా? నా యానందమంతయు వమ్ము చేసినావు గదా? కాన నీకే గాదు మీ వంశీయులందరకును కష్టించి చేసిన శిల్పములకు తగిన ప్రతిఫలము లభింపకుండుగాక" అని క్రోధాతిరేకముచే నొడలు మరచి వివేకశూన్యుడై శపించెను.

అది విని విశ్వకర్మ యుగ్రుడై ఇట్లు సమాధాన మిచ్చెను. "మహర్షీ! తెలిసియో తెలియకయో నేనొక వేళ తప్పు చేసిన మందలించి క్షమించ వలసిన నీవే యిట్లు వెనుకముందాడక శపించుట పాడియా! మహర్షికి వలసిన సుగుణసంపద, సహనశక్తి నీ కెక్కడివి? నీవా జితేంద్రియు డవు? ఒక చిన్నమాటకే ఒడలికి కారము రాచుకొనినట్లు మండిపడిపోవు చున్నావే! సరే ఇది వినుము. నా పొరపాటుకు నేను ఫల మంది నట్లే దూరాలోచనలేకుండ నన్ను శపించినందుకు నీవు కూడ దారుణ దుష్ఫలిత మనుభవింపుము. నీవు సృష్టించిన ద్రవిడభాష పిశాచ భాషతో సమానమయి పండితులచే నిరసింపబడుగాక! నీ వా భాషకు నిర్మించిన వ్యాకరణము శిష్టులచే గర్హింపబడి గౌరవింపబడకుండుగాక!

దానిని శూద్రాది నీచజనులు మాత్రమే పఠనపాఠనాదియోగ్యభాషగా వ్యవహరింతురుగాక. నీవు, నివసించు ద్రావిడదేశము దస్యుచోరాదులకు నిలయు మగుగాక! బ్రాహ్మణాదులగు నగ్రజాతుల వారందరును ద్రావిడ దేశమును వదలి పోవుదురుగాక! అచట నికపై నివసించు వారందరును మందబుద్ధులు, మాయావులు, లుబ్ధాగ్రేసరులు, కలహప్రియులు నగుదురు గాక!''

విశ్వకర్మ యిచ్చిన యీ ప్రతిశాపముచే నగస్త్యుని కోప మంచులు దాటెను. ఆయన సామాన్య మానవుని వలెనే "చూడు, ని న్నెట్లు హతమార్చి మసి చేసెదనో" యని పలికి విశ్వకర్మమీదకు పిల్లిమీదకు దూకు బెబ్బులివలె లంఘించెను. విశ్వకర్మగూడ నాతనిని మాటలతో మాత్రమేగాక కరప్రహారములతో గూడ నొప్పించుటకు సిద్ధపడెను.

ఇంక నూరకున్నచో ప్రమాదము ముదిరి ముదిరి లోకముల కే ఘోరారిష్టము జరుగునో యని తలచి యచటనున్న దేవతలు, మునులు నతిప్రయాసతో వారిద్దరిలో రేగిన కలహమును శాంతింప జేయుటకై యగస్త్యునితో నిట్లనిరి. "మునీంద్రా, మహాతపోధనులగు మీ రేడ? అల్పబలుడగు విశ్వకర్మ యేడ? లోకక్షేమమును దృష్టిలో నుంచుకొని యాతనిని మాకుగా మన్నింపుడు. మీకు కల్గిన శాపము సంగతి తరువాత చూచుకొనవచ్చును గాని ప్రస్తుతము మిన్ను విరిగి మీద పడునట్లుగా రాబోవుచున్న మహోపద్రవమునుండి త్రిలోకములను రక్షించుటకు మీరు విశ్వకర్మ సూచించిన విధముగా నుమామహేశ్వరవివాహదర్శనేచ్ఛ వదలి దక్షిణదిశ కేగక తప్పదు. మే మందరము మీ పాదములంటి శరణు వేడుచున్నాము. నిస్స్వార్థబుద్ధులును, ఋషిప్రవరులునునగు మీరే మాపై దయ చూపకపోయినచో నిక నెవ్వరు మా మొరాలకింపగలరు?''

దేవతల యీ దీనాలాపములు విని యంత కోపమున నొడలు మరచి యున్న యీ మహాముని మనస్సు గూడ మంచు వలె క్షణములో చల్లనయ్యెను. కాన నాయన వెంటనే తన భార్య లోపాముద్రతో నాలసింపక స్వస్థానమగు దక్షిణమునకు ప్రయాణము కట్టెను. ఆ ఋషి యటనుండి మరలిన ఘటుక్షణముననే కైలాసపర్వతము నలు ప్రక్కల బరువు సరిపోయి యథాపూర్వమయ్యెను. ఇట్లు కొండవలె లోకములపై పడబోయిన యీ మహావిపత్తు దూదిపింజవలె దూర

మాయెను. తర్వాత గౌరీశంకరుల వివాహమహోత్సవము సలక్షణముగా సంపన్న మాయెను.

ఈ విధముగా నగస్త్యవిశ్వకర్మల శాపప్రతిశాపవృత్తాంతములు వివరించి యింక ద్రావిడభాషకు కలిగిన శాపము పోగొట్టి దానికి పరమ ప్రామాణ్యమును నుపాదేయత్వమును కల్గించుటకు తన్ను గూర్చి యా మహర్షి ఘోరతపమాచరించిన విధానమును మహాలక్ష్మికి మహావిష్ణు విట్లు వివరించెను.—

"పద్మాలయా! ఆ రీతిగా నగస్త్యుడు దక్షిణదిక్కు కేగి తన భాష కట్టి శోచనీయస్థితి సంభవించినందుకు చాల విచారించెను. కాని జరిగిన దానికి వెతచెందిన లాభముండదు గదా యని గుండె దిటవు పరచుకొని మరల నా భాషకు పూర్వోన్నత్య మెట్లు కల్గించుటయా యని పలురీతులుగా తలపోసెను. చిట్టచివర కా ముని కొక యూహ మెరపువలె తట్టెను. త్రిలోకైకనాథుడగు నే నొక్కడనే తన భాషకు కల్గిన దుర్దశ నివారింపగల నని యాతడు నిశ్చయించుకొనెను.

వెంటనే యా ఋషి నన్నుద్దేశించి ఘోరతప మాచరించెను. చాల వత్సరములు నియతాత్ముడై యాతడు చేసిన తపశ్చర్యకు ప్రసన్నుడనై నే నాతనికి ప్రత్యక్షమయి వాత్సల్యముతో నిట్లని పల్కితిని. 'లోకశుభంకరుడవగు నో మహర్షీ, ఏదో తగినంత కారణము లేనిదే నీ విట్టి దుష్కరతప మాచరింపవు. కాన నీ తలపులో నున్న వరమ్మును జంకు లేక కోరుకొను మిచ్చెదను!'

నాదర్శన మా మహర్షికి మిక్కుటమగు నానందమును కల్గించెను. వెంటనే యగస్త్యముని ముఖగహ్వరమునుండి నన్ను గూర్చిన స్తుతిస్రవంతి యప్రయత్నముగా నిట్లు నిసర్గసుందరముగా జాలువారెను.—

నమో నమః కారణకారణాయ
నిష్కారణా యాద్భుతకారణాయ,
నమో నమస్తే౽ఖిలసత్త్వధామ
న్నమో నమస్తే జలజాతనేత్ర!

'ఈ జగత్తున దృశ్యమాన మగుచున్న కారణముల కన్నిటికినీ మూలకారణుడ వగు నో దేవాధిదేవా! నీకు నా నమస్సుమనస్సులు. నీవు మాత్రము నిష్కారణుడవు. అద్భుత కారణుడవు.

అఖిలసత్త్వములకును నీవే నిలయమవు. అట్టి జలజనేత్రుడవగు నీకు నా ప్రణామసహస్రములు. నీవు వేదాంతవేద్యుడవు. మహాపండితుడవు. జగజ్జనకుడవు. నిఖిలాంతరాత్మవు. అణువులలో నణువవు. అధికులలో నధికుడవు. నిఖిలజీవాత్మల హృదయ గుహాంతర్వర్తివి. సర్వలోకసాక్షివి!'

ఇట్లు పలురీతులుగా ప్రస్తుతించి యగస్త్యమహాముని చివరకు ద్రావిడ భాషకు కల్గిన దుర్దశను దూరము చేయుమని నన్ను ప్రార్థించెను. అప్పుడు నే నిట్లంటిని—'నీవు చెప్పక ముందే నీ తపస్సుకు కారణము నేను తెలిసికొన్నాను. నీ కోరిక తప్పక యీడేర్తును. ద్రావిడ భాషకు గణ్యత చేకూర్చుటకై పరమ పదమందలి యనంత గరుడవిష్వక్సేనాది పరివారమును నా పంచాయుధములను నేను ద్రావిడదేశమున నవత రింప నాదేశించెదను. నేను గూడ శ్రీభూనీళా దేవులతో శ్రీరంగాది దివ్యక్షేత్రములలో నర్చారూపములను ధరింతును. నా పరివారమంతయు మహాభక్తులుగా నవతరించుటయే గాక వైష్ణవోత్తములై పరమభాగవతశిరో మణులై నా గుణగణములను ద్రావిడభాషలో మృదుమధురసుందరముగా గానము చేసి నాతోబాటాభాషకు గూడ చిరకీర్తి నార్జించి యిత్తురు. కాననే సంస్కృతవేదము కంటె గూడ నీ ద్రావిడ వేదము విశిష్టా ద్వైత సిద్ధాంతపరాయణులగు వారికి మిగుల నుపాదేయము కాగలదు.

ద్రావిడదేశము సర్వత్ర నా యర్చావతారమూర్తులతో నిండి యుం డును. నా యంశమున నవతరించిన మహాభక్త కవిశిరోమణులు నాల్గు వేల పద్యసంఖ్యగల దివ్యప్రబంధములను ద్రావిడభాషలో రచింపగలరు. వానిలో గూడ శఠకోపమహర్షి రచితమగు సహస్రగీతికి లభించు గౌరవ మే యితర గ్రంథమునకును లభింపదు. నిగూఢమైన వేదవేదాంతా ర్థములన్నియును నా భాషలో నా భక్తులు విశదీకరించి యాబాలగో పాలమున ప్రచారమునకు తెత్తురు. దివ్యప్రబంధాధ్యయనహీను డెంత వేదాంతి యయినను నా భక్తుడు కాజాలడు. వేయేల, అట్టివాడు వైష్ణవుడే కాడు. జాతకర్మాది సంస్కారములచేతను నుపనయన వేదా ధ్యయనముల చేతను బ్రాహ్మణునకు ద్విజత్వము రూఢ మగునట్లే, పంచసంస్కార స్వీకారము చేతను, ద్రావిడవేదపఠనముచేతను సదాచార్య సమాశ్రయణము చేతను మాత్రమే వైష్ణవత్వము సిద్ధించును. కాన ద్రావిడ వేదాంత పరిచయ శూన్యుడగువా డెంత పండితుడైనను నట్టి వానికి పరమపదము ముమ్మాటికిని లభింపదు.' ఈ నా మాటలు విని

యగస్త్యమహర్షి యానంద పులకితుడాయె నని వేరుగా చెప్పనక్కరలేదు గదా! శ్రీదేవీ! పై కారణముచేతనే మన మందరము ద్రావిడదేశమున నవతరింప వలసిన యవసరము కల్గినది" అని శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవికి ద్రావిడవేదావతరణావశ్యకతావృత్తాంతము విశదీకరించెను.

* * *

నుండియే తెలిసికొనిరి. ఆనాటి నుండి వారి భక్తివాహిని కడ్డమే లేకపోయెను.

"నియతపులకితాంగీ నిర్భరానందబాష్పా
గళితనిఖిలసంగా గద్గదస్తోత్రగీతిః,
అవ్యృతలహరివర్ణా హర్షవృత్తోవపన్నా
విగతనరకభీతి ర్విష్ణుభక్తి ర్విభాతి."

మహాయోగి ప్రహ్లాదునివలెనే "అడుగడ్గునకు మాధవానుచింతన సుధామాధుర్యమున మేను మరచువాడు"--అయోనిసంభవులై పరమ పవిత్రములయిన పుష్పములనుండి యవతరించిన యీ ముగ్గురు యోగిపుంగవులును శ్రీహరియొక్క నిర్హేతుకజాయమానకటాక్షముచే రజస్తమోగుణములు తమ దరికి గూడ రానందున శుద్ధసత్త్వగుణైక ప్రధానులై భగవద్గుణానుభవానందవాహినిలో మునిగి తేలుచు తద్దివ్యమంగళ విగ్రహ సందర్శనార్తితో తహతహలాడుచుండువారు. వారు బాల్యమున నుండియే యీ భాగవతసూక్తికి పూర్ణముగ లక్ష్యభూతు లయినా రనుటలో సందియ మేమి?

శా. పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాస లీ
లానిద్రాదులు సేయుచున్, దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్, సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా!"

జ్ఞానవైరాగ్యాది దైవీగుణప్రపూర్ణులగు నా మహా భక్తులు మువ్వురును విష్ణుభక్తినొక్కదానినే ధారకపోషకభోగ్యములుగా స్వీకరించి యన్నపానాదుల మాటగూడ తలపెట్టక విషయదూరులై సత్సంగముతోనే సదా కాలము గడపుచుండువారు. విషముబోలిన విషయసుఖములందు మునిగి తేలుచుండు బద్ధజీవు లనిన వారికి జాలి. అట్టివారితో మాటాడుట యట్లుండ నా ముువ్వురును కన్నెత్తిగూడ వారిని కాంచెడివారు కారు. ఇందిరారమణుని సంపూర్ణకటాక్షముచే సద్గుణము లన్నియు పుణికి పుచ్చుకొన్న యా యోగీంద్రులు భగవద్దర్శనకాంక్షతో నిద్రాహారములు సైతము వదలి గ్రామైకరాత్రముగ సంచరింపసాగిరి.

# శ్రీహరిసందర్శనము

ఈ మహాభక్తుల నింతవర కనేకరీతులుగా భగవంతుడు పరీక్షించి వారి విశుద్ధహృదయమును, భగవదేకాంతత్వమును నవగతము చేసికొని నాడు. చివరిసారిగా వారిని విషమపరీక్షకు గురిచేయ దలచినాడు.

అది తిరుక్కోవలూ రను దివ్యక్షేత్రము. అప్పడే సూర్యభగవా నుడు పడమటికొండదాపునకు చేరినాడు. ఇంతవరకు నిర్మలముగ నున్న యాకసమున ఆకస్మికముగా మబ్బులలముకొన్నవి. పెనుతుపాను రేగి నది. ఫెళఫెళార్భటులతో జడివాన కురియసాగినది.

అదే సమయమున పొయ్‌గయాళ్వా రా నగరమున బాటవెంట ప్రయాణము చేయుచుండిరి. ఆ గాలివానలో ముందుకు సాగ శక్య ముగాక యాయన యొక గృహస్థుని ఇంటిముం దాగి "అయ్యా, ఈ తుఫానులో నడువలేకున్నాను. ఈ రాత్రి పరుండుట కిచట కొంచెము చోటిచ్చెదరా" అని యాశ్రయము కోరెను. "అయ్యో, దాని కేమి భాగ్యము! కాని వాకిలియరుగు చాల చిన్నది. దానిపై నొక్కరు మాత్రము విశ్రమించవచ్చును" అని గృహయజమాని పలికి లోని కేగి తలుపు గడియ వైచికొనెను. కన్ను పొడిచికొన్నను కానరాని కటికచీ కటిలో నా రాత్రి కాళరాత్రిని మించి భయంకరముగా నున్నను నా యాళ్వారు హృదయదీపముమాత్రము భగవదాలోకముచే ప్రకాశవంతమై వెలుగొందు చుండెను. కాన నేకాంతమున నున్నను నా యోగి నిశ్చిం తగా భగవంతుని స్మరించుచు వాక్కున తన్నామమే జపించుకొనుచు నా యరుగుపై శయనించెను.

ఒక జాము గడచినది. ఆ పెనుతుపానులోనే తటాలున నొక మెఱుపు మెరసినది. దారి కానక నిలచిన మరొకరా మెఱుపు వెలుగులో నా యరుగువద్దకే చేరుకొనిరి. "కొంతసే పిచట కూర్చొనవచ్చునా" యని యాగంతకు డడిగెను. "దాని కే మభ్యంతరము! కాని ఇచట నొకరు పడుకొనదగిన చోటు మాత్రమే కలదు. ఎట్లో సర్దుకొని మన మిద్దరము కూర్చుందము. రండు, పరవాలేదు" అని ఆ యోగి యాయన నాహ్వానించెను. ఆ యాగంతకుడు పూదత్తాళ్వారే



ఇద్దరును సర్దుకొని యెట్లో యీ చిన్న తిన్నె మీదనే యాసీనులైరి. సంభాషణక్రమములో పరస్పరము హృదయముల నవగతము చేసికొనిరి. దైవచింతనామృతమే యాహారముగ చేసికొని బయట పిడుగులతో జడివాన పడుచున్నను లెక్క సేయక చలికి గూడ భయపడక కూర్చొనియే వా రా నిశిథిని గడుపసాగిరి.

మరి కొంతసేపు గడచెను. ఆ కారుచీకటిలోనే దారి తడవుకొనుచు మరొక రా యరుగుకడకు వచ్చి "అయ్యా! తల దాచుకొనుటకు--చివరకు నిలబడుటకైనను సరే—ఇందేమైన చోటు దొరకునా" యని యడిగిరి. వేదికపై నున్నవా రిట్లనిరి--"ఈ యరుగు చాల చిన్నది. కాన నొకరు పడుకొన దగిన దీనిపై మేము కూర్చొని యెట్లో కాలము గడుపు కొనుచున్నాము. అయిన నేమి మునిగిపోయినది! ఇది మా తాత ముత్తాతల కాణాచి కాదు గదా! దయ చేయుడు. మనము ముగ్గురమును నిలబడియే ఈ నిశాశేషము నెట్లో పుత్తము."

ఆ రీతిగా నా ముప్పు రాచిన్న యరుగుమీదనే నిలువబడి యట్టి ప్రకృతిబీభత్సము గూడ నెంత మాత్రమును లెక్క చేయక భగవద్గుణానుభవామృతపానమత్తులై యొడలు మరచి యుండిరి. వారి ఈ నిర్లిప్తతకు తుదకు శ్రీపతిగూడ నచ్చెరువందెను. వారికి తాను ప్రత్యక్షమగుటకిదియే యద నని మాధవుడు తలచి తానుకూడ వారివద్ద కేగెను. అదృశ్యరూపముతో నా ముప్పురి నడుమ జొచ్చి తన కళ్యాణగుణవైభవమును వారితోబాటు తాను గూడ గానము చేయుచు నానందముచే నొడలు మరచి చిందులు త్రొక్కసాగెను.

నాల్గవవాడు కూడ వచ్చి తమనడుమ త్రొక్కిసలాడుచున్న యనుభూతి యీ ముప్పురు మునులకును కలిగెను. ఎవ రీ యదృశ్యరూపుడని వా రాందోళన చెందసాగిరి. ఒత్తిడి పెరుగుటచే వారియొడలు రాచుకొని నొప్పి యధికము కాజొచ్చెను. వానిని గుర్తించి పట్టుకొనుటకు దీపమయిన లేదే యని వారు తలపసాగిరి.

ఆ వచ్చినవానిని గుర్తించుటకు పొయ్గయాళ్వారొక దీపము కొని తెచ్చిరి. ఆహా అది యేమి దీపము! దాని వెలు గెంత ప్రకాశవంతము! రండు, మనము గూడ నా కుంభ జ్యోతిని దర్శించి జన్మసార్థక్యమందుదము! కాని యది సామాన్యదీపము కాదు. మరి వారి వాక్కు

లనుండి వెలువడిన జ్ఞానదీప మది! అదే యా ద్రావిడగాథ. గాథ యన పాశురము లేక పద్యము.

వైయుం తకళియా వార్వమే నెయ్యాక,
వెయ్యకతిరోన్ విళక్కాక శెయ్య
శుడరాళియా నడిక్కే శూట్టినేన్ శొన్మాలై,
ఇడరాళి నీంగుకవే యెన్రు.

"ఓహో! ఏమి యద్భుతదృశ్యమిది. దీనిని గాంచినంతనే నా యొడలు గగుర్పొడుచుచున్నదే! సాక్షాత్తుగ మహావిష్ణువే నాకు ప్రత్యక్ష మయినాడు. ఆహా! ఏమి నా భాగ్యము. ఎంతో కాలమునుండి యెదురు చూచిన మా స్వామి నాకు ప్రసన్నుడైనాడు గదా! నేటికి నా జన్మ తరించినది. అయిన నీ మహాత్ముని నే నెట్లర్చింప గలను? సామాన్య ధూపదీపాదులతో నీ ఘను నర్చించుట నాబోటి యల్పున కీ సమయమున సాధ్య మగునా? కాన భూమిని ప్రమిదగా చేసి సముద్ర జలమునే నేయిగా నందుంచి ఉష్ణకిరణుడగు సూర్యునే వత్తిగా వేసిన దీపముతో—నీ స్వామి నర్చింతును. దుఃఖసముద్రమునుండి బైటపడగోరి సుదర్శనచక్రహస్తుడగు శ్రీమహావిష్ణువు పాదారవిందములం దీ వాఙ్మాల లను భక్తితో సమర్పించుట తక్క నే నేమి సేయగలను?"

"చిన్నన్న ద్విపద కెఱుగును" అని నుతి గాంచిన శ్రీతాళ్ళపాక తిరువేంగళనాథుడు "పరమయోగివిలాసము" అను తన దివ్యప్రబంధమున ఈ భావమునే యెట్లు సంగ్రహించెనో తిలకించి యానందపులకితుల మగుదమా!

"ధరణి పంలియు సముద్రంబులు నేయి
యరుణు దీపముఁ జేసి యరుణాంశుతతుల
గారాబుచక్రంబు కైఁ బూన్చినట్టి
నీరజాక్షున కిత్తు నీరాజనంబు."

ఇట్టి సూర్యోదయముల నెన్నిటినో పొయ్‌గయాళ్వారు చూచి యుందురు. బాలసూర్యుడు తూర్పుదిక్కున నుదయించు చున్నపుడు ప్రప్రథమమున మనకు దీపశిఖవలె పొడగట్టును. సముద్రగర్భమునుండి వెలికి వచ్చుట కా సూర్యుడను దీపము పడు వేదన చూచినవారు మాత్రమే తెలిసికొనదగినది. అట్టి యద్భుతావహమగు సుందర

ప్రాకృతికదృశ్యములు చూచి యా యానందము దోచుకొనినవా రెంత ధన్యాత్ములు!

భూమిని ప్రమిదగను అందుంచిన సముద్రజలమే నేయిగను---చూచినవారికి కన్నులగట్టును. అట్టివారి కీ యూహ స్ఫురింపక మానదు--" ఆహో, ఈశ్వరు డెట్టి చతురమహాశిల్పి! ఒక చిన్న బొమ్మ గీచి గాని, యొక పెద్ద పద్యము వ్రాసి గాని మన మెంతో గర్వించుచుందుమే; మరి ఇన్ని లోకములు సృష్టించి ఈ కాలచక్రమును హేలామాత్రముగా త్రిప్పునాతనికి మనకంటె నెన్నిరె ట్లహంకార ముండవలెనో గదా! ఈ యూహ యందలి వాస్తవము గుర్తించి పండితమ్మన్యులు తమ గర్వాంధకారము దూరము చేసికొని తా మేదయిన నొక సత్కార్యము చేసినను నది భగవత్ప్రేరణచే చేయబడిన దని, తాము కేవలము నిమిత్తమాత్రుల మని తెలిసికొని వీతమోహాలగుదురు.

సరే, ప్రస్తుత కథాంశమునకు మరలుదము--ఉదయకాల సూర్యుని చూడగనే పొయ్‌గయాళ్వారుకు విష్ణువు సుదర్శనచక్రమే స్ఫురణకు వచ్చెను. తన పాపజాలమును హతమార్చజాలిన దా చక్రమే యని నమ్మి వారు దానిని మిగుల ప్రస్తుతించిరి.

మొదటి యాళ్వా రిట్లు పాడగా నెడముగ నిల్చొని యున్నట్టి పూదత్తాళ్వారుల హృదయపటముపై వ్రేలుచున్న కొలది యజ్ఞానాంధకారమును మటుమాయమయ్యెను. హృదయమందు ప్రజ్వలించుచున్న విశుద్ధజ్ఞాన దీపముతో నా శ్రీహరికి వారిట్లు నివాళి పట్టిరి.

అన్బే తకళియా ఆర్వమే నెయ్యాక
ఇన్బురుకు శిందై యిడు తిరియా--నన్బురుకి
ఞానచ్చుడర్ విళ క్కేత్తినేన్ నారణఱ్కు
ఞానత్తమిళ్ పురింద నాన్.

భక్తినే ప్రమిదగా--ఆర్తినే నేయిగా--భగవద్దర్శన జనితానందమునే వత్తిగా--వేసి అజ్ఞానాంధకారము దూరమగునట్లు పరభక్తి యను నుజ్జ్వల దీపమును నిండుమనంబుతో నర్పించి యర్చించుచున్నాను.

ఈ భావమే ఈ క్రింది పద్యమున గలదు. చూడుడు--

"... ... ... ప్రేమ
పంతియు మితి లేని భక్తియే చమురు
నానందభరిత హృదబ్జంబె వత్తి
గా నొనరించి వికాసమై యాత్మఁ
దిర మొందు జ్ఞానంబు దీపంబుఁ జేసి
పెరిమె నారాయణార్పితముఁ గావించె."

—పరమయోగివిలాసము

మొదటి యాళ్వారు భూమిని ప్రమిదగా చేయుగా, రెండవవారు భక్తినే ప్రమిదగా చేసిరి. వారు సముద్రజలమును నేతినిగా నుపయోగింపగా వీరు తమ హృదయమున సముద్ర జలమువలెనే పొంగివచ్చుచున్న ఆశనే--భగవదార్తినే--నేయిగా చేసినారు. ప్రథములు దీపారాధనకై సూర్యుని వత్తిగా చేయగా ద్వితీయులు భగవచ్చింతననే వత్తిగా చేసి తమ జ్ఞానసంపదనే దీపకాంతిగా చేసికొన్నారు.

ప్రపంచమున మబ్బు క్రమ్మినపుడు సూర్యుడు వెలుగక పోవచ్చును. గాలిచే దీప మారిపోవచ్చును. కాని జ్ఞానదీపమెప్పడును నారిపోవునది కాదు గదా!

తమకంటె ముందిరువు రాళ్వారులును వెలిగించిన జ్ఞానదీప ద్వయప్రకాశ మాధారముగా నచటనే నిలచి యున్న మూడవయోగి పేయాళ్వారు లా భగవానుని దివ్యమంగళవిగ్రహ సౌందర్యమును తనివి తీర కన్నులార గాంచిరి. తమ యెదలో నే మూలనో మిగిలిన యా సుంత యజ్ఞానాంధకారము గూడ దూరము కాగా బ్రహ్మానందపరవశులై పరమాత్మస్వరూపమును నుతించిరి. వారి శ్రీవాక్కు ద్రావిడ భాషలో మృదుమధురార్థగంభీరమగు నీ పాశురరూపమును ధరించినది—

"తిరుక్కండేన్ పొన్మేని కండేన్, తికళుమ్
అరుక్కన్, అణినిరమున్ కండేన్--శెరుక్కిళరుం
పొన్నాళి కండేన్ పురిశంగై కండేన్--
ఎన్నాళి వణ్ణన్ పాల్ ఇంగు."

"ఆహా! ఏమి యానందము! శ్రీ మహాలక్ష్మి యీ నా ప్రాకృత నేత్రములకు కనిపించినది. శ్రీహరి సువర్ణశరీర సౌందర్య మీ నాడు నేత్రాంజలులతో తనివితీర గ్రోలగలిగినాను. పాపాత్ములను సమూల

ముగా ఛేదించునట్టి మా స్వామి హస్తము నలంకరించిన సుదర్శనా యుధమును గూడ సందర్శింప కల్గిన నే నెంత భాగ్యశాలినో గదా! ప్రళయ కాలాభీలమగు పర్జన్యదేవుని గర్జన ననుకరించునట్టి పాంచజన్య మును గాంచి సుకృతిని కాగలిగినాను. నీలఘనాభుడగు శ్రీవైకుంఠుని దివ్యమంగళవిగ్రహము సందర్శించిన సౌభాగ్యవంతుడనగు నా కింక కోర దగిన దేముండును!"

దీనినే తిరువేంగళనాథకవి ఎంత దివ్యముగా వర్ణించెను--

"సిరి గంటి, చెన్ను మించిన మేను గంటిఁ,
గర మొప్పు వదనవికాసంబు గంటిఁ,
నల్లలితావనీస్త నకుంభ కుంభ
పల్లవంబులఁ బోలు పాదము ల్గంటి,
నరసిజ హల శంఖచంక్రాంకుశాంక
చరణముల్ జగదేకశరణముల్ కంటిఁ,
దరణిబింబము చాయఁ దరళించు కనక
సురుచిరాంశుకము నంశుకముఁ గన్గొంటి,
శ్రీ మించు కటితటశ్రీసరిపరణ
దామముల్ మేఖలాదామము ల్గంటి,
వాత్సల్యజలధికై వడి నొప్పుచున్న
వత్సంబుఁ గంటి, శ్రీవత్సంబుఁ గంటి,
జుట్టుఁగ్రైదువు వలచుట్టు శంఖంబు
వట్టి చూపట్టిన బాహువుల్గంటి,
శీతాంశుమండల శతకోటికోటి
రీతిఁ జూపట్టు కిరీటంబుఁ గంటి
మలగుల్రై తెల్లఁదామరలఁ దామరలఁ
గలహించు నిడువాలుఁగన్నులఁ గంటి,
మకరకుండల బాలమార్తాండరుచుల
వికసించు వదనారవిందంబుఁ గంటి."

భగవద్దర్శనకాంక్ష యీ మహర్షుల కీ రీతిగా కాకతాళీయముగా నేక కాలమున నొకే చోట భగవదనుగ్రహముచేతనే నెరవేరెను. అప్రాకృత దివ్యమంగళ విగ్రహుడగు శ్రీహరి నీ లోకస్థులలో ప్రాకృతనేత్రములతో కాంచు సదృష్ట మీ ముగ్గురాళ్వారులకే ప్రప్రథమమున కలిగినది. కాననే వారికి ముదలాళ్వారులు— మొట్టమొదటగా భగవద్దర్శనానందా మృత పానమత్తచిత్తులు—అను పేరు రూఢి అయినది.

శ్రీ మహావిష్ణువు వారి కే విధముగా ప్రత్యక్ష మయినాడో ప్రప న్నామృత మను సంస్కృతకావ్యమునుండి తెలిసికొని యానందింతమా!

శ్లో. "తార్క్ష్యాధిరూఢం, తటిదంబుదాభం
లక్ష్మీధరం వక్షసి పంకజాక్షమ్,
హస్తద్వయే శోభితశంఖచక్రం
విష్ణుం దయార్ద్రం దదృశు స్త మాద్యమ్.
ఆజానుబాహుం కమనీయగాత్రం
పార్శ్వద్వయే శోభితభూమినీళమ్,
పీతాంబరం భూషణభూషితాంగం
చతుర్భుజం చందనరూక్షితాంగమ్.
బింబాధరం కుందసమానదంతం
శరన్నిశానాథ సమానవక్త్రమ్,
నీలాలకం దివ్యకిరీటజుష్టం
కర్ణద్వయే శోభితకుండలాఢ్యమ్.
రత్నాంగదం మౌక్తికదివ్యహారం
కటితటీలంబిత హేమసూత్రమ్,
రత్నాంగుళీయం మణికంకణాఢ్యం
మాణిక్యమంజీర సుపుష్టపాదమ్.
మందారమాలాంచితకేశబంధం
శ్రీకౌస్తుభోద్భాసిత కంఠదేశమ్,
శ్రీవత్సచిహ్నం కమనీయవేషం
వేదాంతవేద్యం మనసో౽ప్యగమ్యమ్.
అప్రాకృతం; దివ్యమనంతరూపం
సద్యోగిగమ్యం గుణసంవియోగే,
అత్యద్భుతం కోటిరవిప్రకాశ-
మనుత్తమం, యత్సనకాద్యగమ్యమ్.

"శ్రీమన్నారాయణస్వామి గరుడవాహనారూఢుడై వారి యనన్య భక్తికి ప్రీతుడై ప్రత్యక్ష మాయెను. ఉరమున లక్ష్మీదేవిని దాల్చిన యాయన నేత్రములు పద్మదళములను బోలినవై యాకర్ణాంత విశాల ములై చూపరులకు చూచిన కొలది చూడవలె నను కాంక్ష కల్గించు చుండెను. సుదర్శన పాంచజన్యాదులను హస్తములందు ధరించిన యా దేవదేవున కిరుపార్శ్వములందును భూనీళాదేవులు కొలిచియుండిరి. నీల మేఘశ్యామమగు నా రమాకళత్రుని శరీరయష్టికి పట్టుపుట్టము వన్నె వెట్టు చుండెను.

శరచ్చంద్రమండలమును బోలిన స్వామి ముఖమండలమున నధరము బింబఫలమును, దంతములు కుందపుష్పములను, ననుకరించి శోభించుచుండెను. నీలాలకాలంకృత మైన శిరమున స్వామి ధరించిన దివ్యమణికిరీటకాంతులు కర్ణద్వయీలంబి కుండలములతో వియ్యమాడుచున్నవా యన్నట్లుండెను. భుజముల రత్నాంగదములు కైసేసి వైజయంతి యను వనమాల గళమున వ్రేలాడగా కటితటమున సువర్ణ సూత్రమును కట్టుకొనిన మాధవుడు చేతులకు రత్నవలయములు దాల్చి, వ్రేళ్ళకు రత్నాంగుళీయములు పెట్టుకొని పాదములకు మాణిక్య మంజీరములు ధరించి మిగుల తేజరిల్లుచుండెను.

ఆ మేఘవర్ణుని కేశపాశము మందారమాలతో గూడి వింత కాంతులీనుచుండెను. కౌస్తుభరత్నముతో బాటు శ్రీవత్స మను పుట్టుమచ్చ గూడ ఆ మహనీయుని ఱొమ్మునకు వింత శోభ గూర్చుచుండెను. ఆ మహామహుడు మనసునకు గూడ నందనివా డయ్యును వేదాంత వేత్తలకు సులభవేద్యుడు. అప్రాకృతదివ్యమంగళవిగ్రహుడును, యుగపదుదిత కోటిసూర్యప్రభాభాసమానుడును; సనకసనందనాది మహామునులకు గూడ నగమ్యుడును నయిన యా యనంతకల్యాణగుణాకరుని గాంచగలిగిన యీ మహర్షిత్రయము భాగ్య మెట్టిదియో గదా!"

సంస్కృత వ్యాకరణసంప్రదాయమునకు మునిత్రయము—పాణిని, కాత్యాయన, పతంజలులు--ఎట్లో, ద్రావిడవేదమున కీ కవిత్రయముగూడ నట్లే ప్రప్రథమ పూజనీయులు.

పరమపదనాథ సందర్శనానంద జనితపారవశ్యముచె శరీరములందు పులక లెగయగా కన్నులనుండి యానందబాష్పామృతధారలు స్రవించుచుండగా వారు భక్తిగీతము లాలాపించిరి. వారి వాగింద్రియముల నుండి యా భక్తిరసామృతప్రవాహ మప్రయత్నముగా ప్రవహించుచున్నదా యను నట్లా మహర్షిపుంగవులు ద్రావిడవాక్కులతో నా కమలనయనుని గుణగణములను మృదుమధుర గంభీరశైలిలో శ్రుతిసుభగముగా గానము చేయసాగిరి. అమృతఝరిని బోలిన యా పాశురముల సంగీతసాహిత్యసౌరభసంపదకు శ్రీమహావిష్ణువు హృదయముగూడ కరగి నీరై ద్రవించిపోయినదన సహృదయులగు నితరుల మాట వేరుగా పలుకవలెనా!

ఈ విధముగా నీ యోగిత్రయ మా రమారమణుని గుణగణాదులను గానముచేయుచుండగనే యా రాత్రి భల్లున తెల్లవారెను. కాని

యెంత చిత్రము! ఉదయ మగుసరి కా తుఫాను జాడయే కానరా దయ్యెను. వారిమృదుమధుర కావ్యగానము శ్రవణానందముగా నాకర్షిం చుటకు సర్వేశ్వరుడు తానే వారి వద్దకు వచ్చెను గదా! ఆయన భక్తపరాధీను డనుట కింతకంటె వేరు నిదర్శన మేల!

వీరు పాడిన ద్రావిడగాథలు "ఇయఱ్పా" అను పేరుగల గ్రంథమున వరుసగా మూడువందలుగా నిబంధింపబడినవి. ఇందు నాల్గు తిరువందా దులు గలవు. ప్రతిదాని యందును నూరేసి పాశురము లుండును. ఇవి వీరి ఆత్మానుభవమునకు, హరిభక్తితత్త్వమునకు, ఉత్తమతాత్త్విక లక్ష్య ములకు ప్రతిబింబములు. ఒక పద్యము చివర గల పదముతో రెండవ పదము ప్రారంభించు క్రమమే అంతాది. దీనిని ముక్తపదగ్రస్త మనవ చ్చును. కావ్యమంతయు నీ నియమములతో నడపుటయే యీ విధ మైన ప్రబంధముయొక్క లక్షణము.

ముదలాళ్వారుల యీ చరిత్ర యెంత సరసార్థయుతమును, నున్నత భావ బంధురముగను నున్నదో గమనించితిమి గదా! సత్కార్యాచరణ మే కొలదిమంది పూనుకొన్నను తప్పక ఫలప్రద మగు నని మనకు వీరి చరిత్ర నిరూపించుచున్నది. "భక్తుఁ డెందుఁ జనినఁ బఱతెంచు భగవంతు" డను నానుడి సత్యదూరము కాదు.

* * *

# IV భక్తిసారయోగి

## తిరుమళిశయాళ్వార్

"మఖాయాం మకరే జాతం చక్రాంశం భార్గవోత్తమమ్,
మహీసారపురాధీశం భక్తిసార మహం భజే.

శక్తిపంచమయవిగ్రహాత్మనే
శక్తిహారజయచిత్తహారిణే,
ముక్తిదాయక మురారిపాదయో
ర్భక్తిసారమునయే నమో నమః."

దక్షిణభారతము ప్రకృతిరామణీయకమునకు మాత్రమే గాక భక్తిర సస్రష్టలగు మహాభక్తకవులకు కూడ పట్టుగొమ్మ. కాననే హిందీ భాషలో "భక్తీ ద్రావిడ ఊపజీ" అను నార్యోక్తి రూఢమయినది. అట్టి దక్షిణదేశ మున చెన్నపట్టణము సమీపమున తిరుమళిశ అను పుర మొకటి గలదు. అది దక్షిణభారతమణికి సీమంతసిందూరరేఖవలె శోభిల్లుచుండును.

వందారుబృందారకసందోహసంసేవిత పాదయుగళుడగు నిందిరా సుందరీవరు డా పురమున విరాజిల్లి యుండెను. ఆ నగరి కదళీ సహకార పనసనారికేళాదిఫలజాతులకును, మాలతీమాధవీపున్నాగాదిపుష్ప జాతు లకును, సర్వసస్యములకును నిలయము. చెరకువిల్కాని నారిని బోలిన యచటి నాగరిక నారులు తనూలతలతో నచ్చరలేమలను, నేత్రములతో బేడిసమీలను నోడించు నట్టి మేనిపసతో మిసమిసలాడుచుందురు.

పూర్వము తన పాదప్రహారముచే విష్ణువును నొప్పించి కూడ నాతని ప్రశంసను గొన్న భృగుమహర్షి సుప్రసిద్ధుడు గదా! తత్పుత్రుడు భార్గవమహర్షి ద్వాపరాంతమున తీవ్రతపశ్చర్యచే లోకసంగ్రహము చేయు నుద్దేశముతో విజనమగు దివ్యతీర్థము నొక దానిని నిశ్చయించి చెప్ప మని బ్రహ్మదేవుని వద్ద కేగి యడిగెను. ఆత డిట్లు పలికెను--"మునీంద్రా, మహావిష్ణువునకు నివాస మగుటచే సర్వతీర్థాతిశాయి యగు తిరుమళిశనగర ప్రాంతము మీ తపశ్చర్య కనుకూలవాతావరణము కల్గించు నని తోచు

చున్నది. అయినను పరీక్షించి యిపుడే తేల్చుకొనవచ్చును. వెంటనే యాతడు విశ్వకర్మను రావించి సకల భూమండలము నొక వైపునను, తిరుమళిశ ప్రాంతము మరొక వైపునను త్రాసులో నుంచి తూకము వేయుమని పల్కెను. అట్లాతడు చేయగా నా పురమే భార మని తేలెను. మహి కంతటికిని సారభూతము గాన మహీసారపుర మని విధాత యా నగరికి నామ మిడెను. నాటి నుండి యా పురము మహీసారపుర మని గూడ విఖ్యాతి గాంచెను.

ఆ నగరోపవనప్రాంతమున నియతేంద్రియుడై భార్గవముని తప మాచరింప గడగెను. తపస్సాధనల నాయన తీవ్రతరము చేయుచున్న కొలదియు తచ్ఛరీరమునుండి విలయకాలాభీలాగ్ని జ్వాలలు చెలరేగి చూప రులనేత్రములను తెరువనీయకుండ చేయుచుండెను. క్రమముగా నీ వార్తతో బా టా తపోగ్నిజ్వాలలు కూడ మింటి కెగబ్రాకి త్రిలోకాధిపతి యగు సురేంద్రుని చిత్తము నాందోళనాయత్తము చేయసాగెను. వెంటనే యాతడు కనకాంగి యను నచ్చర లేమను పిలిచి "శోభనాంగీ, నీవు భూలోకమున నున్న మహీసారపురమున కేగి ఘోరతపస్సమాధిమగ్ను డైన భార్గవుని తపస్సును భగ్నము చేసి రమ్మ"ని యాదేశించెను. ఆ మీనాక్షియు "చిత్తము దేవా" యని యాతని యానతి శిరసావహించి చుక్కలతో గూడిన చందమామవలె సఖీజన పరివృతయై మహీసార నగరమును చేరెను.

ఆ యచ్చరలేమ హవణించు హావభావవిలాసాదులచే నంతటి మహర్షి పుంగవుని హృదయముగూడ మారవికారఘాతముచే నూయలవలె నూగులాడ సాగెను. చివర కాయన చూపు తపస్సునుండి మరలి యాయన వశము తప్పిపోయెను. దర్పకోగ్రప్రతాపసంతప్తమైన యా తాపసుని చిత్తమప్పు డా కనకాంగి యను తలిరుబోడి చెలువ మనియెడు నమృతంపు కొలనులో నోలలాడుచు తిరిగి యాతని వద్దకు రాజాల దయ్యెను.

"అయ్యో కాలు జారినదే" యని యాతడు విచారించెను. కాని వెనుక చింతించుట వెఱ్ఱితనము గదా! గతజలసేతుబంధనముచే లాభము లేదని తలచి యా ముని దివ్యతీర్థయాత్రార్థియై యటనుండి వెడలిపోయెను.

## అవతరణము

కనకాంగి యా మునీశ్వరుని సంపర్కముచే సద్యోగర్భవతియై దబ్బ పండువంటి యొక బిడ్డను ప్రసవించెను. శ్రీమహావిష్ణువు నాజ్ఞచే సుదర్శనచక్రాంశమున నా సుందరాంగికి మహాయోగిలక్షణలక్షితుడగు నొక కుమారుడు మకరమాసమున మఖానక్షత్రమున నుదయించెను. కేవలము దేవకార్యనిర్వహణార్థ మేతెంచిన దైనందున కనకాంగి యప త్యమోహము తనదరికి గూడ రానీయక యొక వేతసకుంజమున నా బాలుని బరుండబెట్టి యా దిగ్విజయవార్త దేవేంద్రున కెరిగింప ద్రుత గతితో నమరావతి కేగెను.

నిర్మానుష్య మయిన యా వనమున నా ముని కుమారుడు వా యెత్తి యేడువసాగెను. సామవేదమును బోలె తన చెవిని బడిన యా రోదనమును విని మహీసారపురనాథు డగు శౌరి కరుణించి తన కటా క్షామృతధారలచే నా బాలుని రోదన ముడిపి యంతర్హితు డాయెను.

తన యేడు పుడిపిన జలజాక్షు డింతలోనే మాయమయినాడే యని యా శిశువు వెత గుంది మరల రోదన మారంభించెను. అత్తఱిని హరిదాసు డను వేణులావకు డొక డా దారిని వచ్చెను. పెదురు పొదల వద్ద పుడమిపై బడి పొరలుచు నేడ్చుచున్న యా శిశువును గనినంతనే యపుత్రుడగు నాతని యెద నుండి వాత్సల్యామృతరస ముప్పొంగి పొరలి ప్రవహించెను. వెంటనే యా మేదరి ముద్దులు మూటగట్టు చున్న యా బాలుని పొదివి యెత్తుకొని శిరము మూర్కొని ఔమ్ము కానించుకొని తన యింటికి తీసుకొనిపోయెను. తిరుమళిశలో నవతరిం చిన యా బాలుడే తిరుమళిశ యాళ్వారు.

బిడ్డలకై మొగమువాచి యున్న యాతని భార్య కా బాలుని చూడగనే పాలు చేపు వచ్చెను. కాని హరిసందర్శన మాత్రముచేతనే కడుపు నిండిన యాతడు పాలు ద్రావక పెడమొగము పెట్టెను. అంతే గాదు, ఉగ్గు బాలను గూడ నాతడు తిరస్కరించెను. మలమూత్ర ములను సైతము ముజ్జగించెను. ఈ విచిత్రోదంత మాలకించి యా యూరివా రందరును నా వింతబాలుని చూచుటకు గుంపులు గట్టి రాసాగిరి.

ఈ బాలుని వృత్తాంత మా గ్రామవాసియగు నొక శూద్రవృద్ధుని చేవినబడెను. ఆతడు మహాజ్ఞాని, పుత్రహీనుడు. బాలుడు కారణజన్ముడే కాని సామాన్యుడు కాడని యాతడు నమ్మెను. రిక్తహస్తములతో నా మహనీయుని వద్దకు బోరాదని యాతడు కొన్ని పాలు పాత్ర మున గొని యా బాలుని చూడ బోయెను. వటపత్రశయాను డగు బాలకృష్ణునివలె చిన్ని వెదురుపేళ్ళ తొట్టెలోపరుండి యోగనిద్రా ముద్రవహించి ముకుళితనేత్రు డయియున్న యా శిశువును దర్శింప గనే యా వృద్ధు డానందపారవశ్యముతో నొడలు మరచెను. వెంటనే క్షీరపాత్ర మాయన యెదుట నుంచి మోకరిల్లి "ఆహారము నుజ్జగిం చిన యో యోగివర్యా, నీవు సామాన్యుడవు గావు. నా బోటివారి నుద్ధరించుట కవతరించిన సాక్షాచ్ఛ్రీమహావిష్ణుడవే నీవు. ఈ పాలు స్వీకరించి న న్ననుగ్రహింపు" మని ప్రార్థించెను. ఆ వృద్ధుని నిర్మలభక్తికి మెచ్చి, బుడుతడు లేచి కూర్చొని యా క్షీర మారగించెను. తన నడవినుండి తెచ్చిన మేదరిసేవల నంగీకరింపని యా బాలుడు తాను తెచ్చిన పాలారగించుట తన సుకృతవిశేషఫలమే యని యా వృద్ధుడు తలచి యానందాతిరేకమున నొడలుమరచెను.

తదాదియు నా వృద్ధుడు ప్రతిదినము భక్తితో పాలుగొని వచ్చుట, యా బాలుడు తనివి దీర వానిని గ్రోలుట జరుగుచుండెను. ఒకనా డా బిడ్డడు వృద్ధునితో ప్రసన్నుడై పలికెను-- "అయ్యా, తండ్రివలె నీ వింత కాలము నన్నీ క్షీరముతో కాపాడినందుకు నాకు చాల నానంద మయినది. ఇపుడు నీ కోరిక తీర్తును. నా భుక్తశేష మీ క్షీరమును గొనిపోయి నీవును నీ భార్యయును త్రావుడు. గతించిన యౌవనము మీకు లభించుట మాత్రమే గాక దానితో బాటుగ నింతవరకు లభింపని పుత్రసంతతి గూడ మీరు బడయగలరు."

బాలయోగివరముచే నా వృద్ధదంపతులు తరుణ భావముదాల్చి కోరిక లీరిక లెత్తగా వివిధశృంగార చేష్టలతో గలసి క్రీడించిరి. ఆ వృద్ధుని భార్యగర్భవతియై నవమాసములు నిండ శుభలగ్నమున బిడ్డను గనెను. పుత్రోత్సాహముచే నొడలు మరచిన యా దంపతు లా బాలయోగిని పలురీతుల వినుతించి తమ శిశువునకు కణికృష్ణుడని నామకరణ మిడి యల్లారుముద్దుగా పెంచుకొనసాగిరి.

మేదరిబాలుడు క్రమముగా పెరిగి పెద్దవా డయ్యెను. ఆయన కేడు సంవత్సరముల వయస్సు వచ్చెను. వృద్ధదంపతు లిచ్చు పాలు మాత్రమే యాయన స్వీకరించుచుండెను. మేదరియింట పెరుగు చున్నందున ఆయన వెదురుతో చేటలు మొదలగునవి యల్లి నగరమున తిరిగి విక్రయించుచుండువాడు.

## యోగాభ్యాసము

కాని తన మనస్సు యోగాభ్యాసమందే లగ్నమైనందున దానిని సాధించి యెట్లు కరతలామలకము చేసుకొనుటయా యని యహో రాత్రము లాయన యాలోచింపసాగెను. జగత్తు కాదికారణమగు వస్తువును యోగమార్గము ద్వారా తెలిసికొనవలె నను కోరిక వయసుతో బాటా మునివరుని యెదలో నెదుగుచునే యుండెను. ఆయన తన యా చిన్ని గుడిసెలోనే యొక మూల కూర్చొని భగవంతునే గురువుగా తలచి యోగవిద్యను సాధింప నారంభించెను. క్రమముగా నా బాలుడు యమ నియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధిభేదములతో నొప్పు నష్టాంగయోగ సాధనలో ప్రవీణుడై బాహ్యవిషయములను దరికిగూడ చేరనీయక హరిభక్తిసారామృతమునే గ్రోలసాగెను.

ఆయన సాధించిన యోగవిద్య కలరి శ్రీహరి విశ్వరూపముతో ప్రత్యక్షమాయెను. సనకాదిమునీంద్రులకు గూడ నందని యా యద్భుతరూపము సందర్శించి యొడలు మరచి యా బాలుడు తైలధారవలె నవిచ్ఛిన్నమయిన భక్తితో నా భక్తపరాధీనుని వేయి రీతులుగా గానము చేసెను. సారవంతమయిన భక్తితో భగవంతుని ప్రత్యక్షము చేసుకొని వినుతించినందున నాటినుండియు నా యోగికి భక్తిసారు డని సార్థక నామ మేర్పడెను.

పదిమంది నడుమ నుండుట భగవచ్చింతన కాటంకమగు నని యెంచి భక్తిసారుడు నగరమునకు సుదూరమున నొక యడవికేగి యోగసాధనతో కాలము గడుపసాగెను.

# పార్వతీపరమేశ్వరులు

ఒకనాడు పార్వతీ పరమేశ్వరులు నందివాహనారూఢులై గగన మార్గమున విహరింపవెడలిరి. తపోనిరతుడై యున్న భక్తిసారు నవలోకించి యా సతి పతితో నిట్లు పలికెను.— "స్వామీ, ఎవ రీ మనుజుడు? నిమీలితలోచనుడై పేలికలంపుల నుడిగిన యీత డెవ్వరో తెలిసికొనినతర్వాతనే మనము ముందు కేగుదము. తన సతిమాట కెదురు పలుక లేక పశుపతి తన వృషభము నచటికే పోనిచ్చెను, పరమశివు డెద్దు దిగి యోగివరు జేరనరిగి "యోయీ, నేను గిరిజాపతిని. నీ యరుదైన తపస్సు మాకు చాల నచ్చెరువు కల్గించినందున మేము ని న్నభినందింప వచ్చినాము. వర మిచ్చెదను గోరు పరమయోగి" యని పలికెను.

భక్తిసారు డాయన కిట్లు సమాధానమిచ్చెను. "అయ్యా, నీవే సంబోధించితివి గదా నన్ను పరమయోగి యని! అట్టి నాకు కోర దగినదేమి యుండును? అయిన నీబోటివాడు వరమిత్తు ననగా కోరక పోవుట గూడ నయుక్తము. కాన నాలకింపుము. ఇదిగో యీ బొంత చూచితివి కదా. దీనిని కుట్టుకొనుచున్నవాడను. మీరు వచ్చినందున నడుమనే వదలి వేయగా సూదినుండి దారము జారిపోయినది. కాన ఈ సూదిబెజ్జములో మరల దారమెక్కునట్లు వర మనుగ్రహింపుము."

ఈ పరిహాసమును భవుడు సహింపలేకపోయెను. రోషావేశముచే నొడలు కంపింప ముకుపుటము లదర "ధూర్తుడా! త్రినేత్రుడ నగు నన్నే యవమానించుచున్నావటరా? నా మూడవకంటిమంట కాహుతి యయిన తుంటవింటివాని కెటువంటి గతిపట్టెనో నీ వెరుగ వని తోచుచున్నది. ఇదె యనుభవింతువు గాక, నీ మిడిసిపాటునకు తగిన ప్రతిఫల"మని పలికి నిప్పుకలతో కణకణలాడుచు మంట లెగయుచున్న ఫాలనేత్రమును తెరచెను. చిటపటధ్వనులతో నయ్యగ్గి పెటపెటలాడుచు పటువైన బ్రహ్మాండభాండమును పగులగొట్టుటకు సిద్ధ మయ్యెను.

భార్గవకుమారుడగు నా యోగివరుడు మాత్రము తక్కువ తినెనా? అంత తక్కువవాడే యైనచో తన రౌద్రరూపముతో లోకములను భస్మముచేయు త్రిపురాంతకు నెదిరించుధైర్య మాతని కుండునా? ఆత

డాలసింపక రుద్రుని నేత్రాగ్ని కడ్డముగా తన కుడికాలు చాచెను. వెంటనే యా పాదమునుండి ప్రళయపయోధిసముద్భవ పర్జన్యపటలి యుద్భవించి యేనుగు తొండములను బోలిన వర్షధారలు కురియసాగెను. శివుని నేత్రమునుండి వెలువడిన యంతటి భీకరాగ్నియును త్రుటిలో చప్పగా చల్లారిపోయెను.

అపుడు పార్వతితో పరమేశ్వరుడు "కంటివే మచ్చెకంటీ, విష్ణుభక్తులమహిమలు! ఇది తెలిసియే నేను వారి జోలికి పోను సుమా! ఇక చాలును పద"మని పలికి యా మునిపుంగవుని మహిమను వేనోళ్ళ బొగడి నిజావాసమగు కైలాసమున కేగెను. పాదనేత్రముతో ఫాలనేత్రుని గర్వమడచిన యా ముని కా నాటినుండి అక్షపాదు డని కూడ నామ మేర్పడెను.

## శుక్తిహారసిద్ధుడు

మాయ యను దారమును గ్రుచ్చి కాల మను సూదితో జీవుల శరీరము లనునట్టి చీకిబొంతలు కుట్టుచుండు మాధవునివలెనే భక్తిసారు డొక్కనాడు తన బొంతను సూదితో కుట్టుకొనుచుండెను. ఆ సమయమున నొక సిద్ధు డా మునీశ్వరు డున్న తపోవన ప్రాంతము మీదుగా నాకాశ మార్గమున బోవుచుండెను. ఆతని వారువము బెబ్బులి. పేరు శుక్తిహారుడు. ముత్తెపుచిప్పలను మెడలో దండగా దాల్చువా డయినందున నాతని కా పేరు వచ్చియుండవచ్చును.

ఆ బెబ్బులి భక్తిసారుని యాశ్రమప్రదేశమును దాటి ముందుకు పోలేక యాకసమున నట్లే నిలబడిపోయెను. సిద్ధు డెంత యదలించినను నది కదలలేదు. కారణ మేమా యని యాతడు నలుదెసల బరికించి చూచెను. వెంటనే యోగరతుడగు భక్తిసారు డాతని కంటబడెను. తోడనే యా సిద్ధుడు బెబ్బులిని దిగి వచ్చి యవనికి చేరి ఆ యోగివరుని మహిమ కెంతో యక్కజపడెను. నీ మహిమ గానలేక నిన్ను దాటి పోదలచిన నా యపరాధము దయతో క్షమింపుమని కృతాంజలియై ప్రార్థించెను. మరియు నిట్లనెను--"స్వామీ, అలౌకిక ప్రభావాన్వితులగు మీ రిట్లు సామాన్యమానవునివలె చీకుబొంత కుట్టుకొనుచుండుట నాకు వింతగా నున్నది. అణిమ, మహిమ, గరిమ,

లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అను నష్టసిద్ధు లను కైవసముచేయు రసగుళిక నొక దానిని నీ కిచ్చెద పుచ్చుకొనుము. దాని స్పర్శచే నినుము బంగార మగును" అని పల్కి గుళిక యీయ బోయెను.

భక్తిసారుడు తన కది వల దని పల్కి తన కాలి కంటుకొన్న మట్టిని నలిపి యుండగా జేసి యాతనిచేతిలో పెట్టి యిట్లనెను– "ఈ గుళికతో మట్టిని బంగారము చేయవచ్చును. దీనిచే మృత్యువును సైతము జయింపనగును."

శుక్తిహారుడు దానిని గైకొని వ్యాఘ్రవాహనము నెక్కి చిత్రకూట శిఖరము చేరెను. ముని యిచ్చిన గుళికమహిమ పరీక్షింపగోరి దానిని చిత్రకూటపర్వతమునకు తాకించెను. వెంటనే యా గుబ్బలి సువర్ణ కాంతు లీనుచు మేరుపర్వతమువలె ధగద్ధగాయమానమై కనులకు మిరు మిట్లు గొలుపసాగెను.

అట్టి యపూర్వమహిమతో తన్ను మించిన యా మునివద్దకు మరలి యేతెంచి శుక్తిహారుడు తన యల్పజ్ఞతను మన్నింపుమని వేడుకొని పలురీతులుగా నాయన యోగమహిమను బొగడి నిజేచ్ఛం జనియెను.

## పంచ సంస్కార లాభము

భార్గవముని కుమారు డయినందున భక్తిసారునిగూడ భార్గవు డని జనులు వ్యవహరింపసాగిరి. ఆ ముని యొక గిరి గుహలో నేకాంతమున తపస్సు చేసుకొనుచుండగా ముదలాళ్వారులగు సరోయోగి, భూతయోగి, మహాయోగులు తీర్థయాత్రలు చేయుచు యాదృచ్ఛికముగా భక్తిసారుని వద్ద కేతెంచిరి. కొంతకాల మాయనతో సత్సంగము చేసి భూతయోగియు మహాయోగియు నెందేని జనిరి. సరోయోగి తన యునికి పట్టగు మయిలా పురమున భక్తిసారులను వెంటబెట్టుకొని యేగెను. అచట నా ముని కొంతకాలము సరోయోగితో గడపెను. భార్గవముని మరల నేకాంత ముగా దివ్య దేశయాత్రకై బయలువెడలెను.

ఈ సారి యా ముని యాత్రలలో మరల మహాయోగిని కలసికొని వారితో కొంతకాలము సంచరించెను. ఆయన భక్తితత్పరతను మెచ్చి

పెక్కు రీతులుగా పరీక్షించి మహాయోగి భక్తిసారులకు పంచసంస్కారములను మంత్రమంత్రార్థములను ననుగ్రహించెను. జగత్కారణవస్తువు నెరుగగోరి యోగవిద్యాభ్యాసాదులు చేసిన భక్తిసారుని విష్ణుభక్తిసారునిగా నొనర్చిన దా మహాయోగియే.

తర్వాత తిరుమళిశ యాళ్వారులు స్వస్థలమగు మహీసారపురమున మంగవల్లీమనోహరుడగు జగన్నాథుని సేవించుచు నష్టాంగయోగపరులై చాలకాలము గడిపిరి.

## గురు పరిచర్య

వేణుపత్రములను బోలిన ద్వాదశోర్ధ్వపుండ్రములు శరీరమున విలసిల్లు భక్తిసారయోగి పుంగవుని మహిమయు ప్రతిభాప్రతాపములును దినదినాభివృద్ధిగా లోకమునందు వ్యాపింపసాగెను. ఆ మహామహుని సాక్షాచ్ఛ్రీ మహావిష్ణువు నవతారమే యని జనులు విశ్వసించి వారిపై భయభక్తులు నెఱపదలపడిరి. ఆ మహర్షివరుడు భూదేవికి కాంచిని బోలిన కాంచీపురమున కొంత కాలము గడుపదలచి స్వస్థలిని వీడి యట కేగెను. అచట లచ్చి యను మచ్చెకంటిని తన పెడదఱొమ్మున దాల్చి శేషునిపై నొయ్యారముగ సొగసు మీర బరుండి యున్న శేషశాయిని సేవించుచుండగా నా మునికి వత్సరములు కూడ క్షణములుగా గడచిపోయెను.

భక్తిసార వరజనితుడగు కణికృష్ణుడు బాల్యమున వారి వద్దనే వేదాంతవిద్యలను నిశ్శేషముగ నభ్యసించెను. కాననే గురుచరణభ్రమరములు తన హృదయసరసీరుహమున సదా పరిభ్రమించుచుండగా నన్య మెరుగక మహీసారపురముననే యాతడు చాలకాలము గడపెను. కాని చిరకాలము గడచినను తన యాచార్యుల సందర్శనము లభింపమి కాయన వెత చెందసాగెను. చివరకు గురువిరహము సైరింపలేక కణికృష్ణుడు భక్తిసారమునిని వెదకుటకై బయులుదేరెను. మార్గమధ్యమున గల నానాదివ్యదేశములందలి విష్ణుభగవానుని యర్చావతారమూర్తులను దివ్యవైభవమును కన్నులార గాంచుచు, వీనులార వినుచు, కాలక్రమమున "నగరేషు కాంచీ" యని ప్రసిద్ధి నొందిన కాంచీపురిని జేరెను. అచట తన గురువును బొడగనినంతనే పెన్నిధిగాంచిన పేదవలె నాతని హృదయరాజహంసి యవధిలేని యానందసాగరమున నోలలాడెను. కాని

తానింతవరకు పడిన విరహతాప మొక్కపరి నీ రీతిగా నాతని నోటి నుండి బయలువెడలి యాతని యెదను కుదుటబరచెను.

"ఆచార్యా! ఎంతో కాలమునుండి మీ దర్శనమునకై నా కన్నులు చంద్రునికై చకోరమువలె తహతహ లాడినవి గదా! నే నే యపరాధము చేసితి నని నన్ను తిరుమలిశలో వీడి మీ రిటకు విచ్చేసినారు? త్వద్వియోగార్తి నేను సహింపగల ననియేనా, మీ భావన? తల్లి, తండ్రి, గురువు, దైవము సర్వము మీరే యని మనమున ఘనముగ నమ్మియున్నానే? నేటి కైన నా యపరాధములు సైచి నాపై గల కినుకను వెనుకకు నెట్టి నన్ను మీ దాసానుదాసునిగా స్వీకరించి కాపాడక తప్పదు. అంతవరకు మీ పాదారవిందములను వదలువాడను కాను" అని పలికి కణికృష్ణుడు వారి పాదములపై కుప్పగూలెను.

శిష్యుని యీ భక్తితాత్పర్యములకు భక్తిసారులు ప్రీతులై రని వేరుగా చెప్పవలెనా! వారి కన్నులనుండి యానందబాష్పధారలే వర్షింపసాగెను. "వత్సా, నీ భక్తికి మిగుల మెచ్చితిని. ఇకముందు నిన్ను వీడను. సదా నీ సేవలు గొనుచునే యుందును. శంక వీడుము" అని పలికి వా రాతని లేవనెత్తి వెన్ను దట్టిరి. తన శిష్యు డిక యజ్ఞానగర్తపతితమగు మూర్ఖమానవలోకము నుద్ధరింపగల డని విశ్వసించిరి. కాననే వెంటనే యాతనిని స్వామిపుష్కరిణిలో తీర్థమాడబంపిరి. ఆతడును శుచియై యూర్ధ్వపుండ్రధారియై వారి పాదసన్నిధికి చేరెను. ఆ శిష్యుని పుత్రునివలెనే తన యూరువుపై కూర్చుండబెట్టుకొని శిరసుపై తన హస్తముంచి దక్షిణకర్ణమున నష్టాక్షరీమంత్రము నుపదేశించిరి. తదనంతరము మంత్రార్థముగూడ ననుగ్రహించిరి. పంచసంస్కారములు గురువుచే గ్రహించిన యా శిష్యుడును జ్ఞానభక్తివైరాగ్యాది సద్గుణములతో గురువునుగూడ మించినవాడని పేరు గడించుకొనెను.

ఈ విధముగా కృతార్థు డైన కణికృష్ణుడు తన్ననుసరించి సేవింపనా మునివర్యుడు తన్నగరసమీపమున నొక గిరిగుహాంతరమున నాసీనుడై యోగవిద్యచే పరబ్రహ్మ సాక్షాత్కారము నంది బ్రహ్మానందముచే నొడలు మరచి దినములు గడుపసాగెను.

# వృద్ధనారి--పల్లవరాయడు

భక్తిసారయోగి దివ్యమహిమలను, భగవద్భక్తిని విని యొక వృద్ధస్త్రీ తదనుగ్రహ మర్థించి యా గుహాముఖమును ప్రతిదినమును శుభ్రము చేసి యరికి రంగవల్లులతో తీర్చి దిద్దసాగెను. దేవపూజకై వలయు పుష్ప ఫలాదులను ధూపదీపాదులను గూడ నామె సమకూర్చుచుండెడిది. ఇట్లు కొంతకాలము గడచుటయు నా యోగిమణి యా సీమంతినిమణి చేయు పరిచర్యల కెంతయు నలరి "యమ్మా! నీ సేవలకు నా మది మిగుల ముద మందినది. నీ కే కోరిక వలసినను జంకు వీడి కోరుకొనుము. నేను నెరవేర్చెదను. నా మాట నమ్ముము" అని పలికెను. "యోగిశిఖామణీ! ఈవు నాయెడ ప్రీతుడవేని యిమ్ము, వరము నే యువతిని గాగ నురుగుణాఢ్య" యని యామె యాతని భక్తితో ప్రార్థించెను.

భక్తిసారమునికటాక్షామృతచంద్రికలు తనపై ప్రసరింపగా నా ముదిత సౌందర్యలావణ్యములచే రంభనుగూడ మించు మించుబోణిరూపము దాల్చెను. త్రిజగన్మోహనాంగియైన యా సుందరి యానందాశ్రువులతో తన నేత్రములు చెమర్చగా నా యోగివర్యుని పాదపంకజములపై బడి "స్వామీ, నన్ను ధన్యాత్మగా చేసిన మీ ఋణ మెట్లు తీర్చుకొనగల" నని గద్గద కంఠియై పలికెను.

యోగీంద్రు డా యింతిని "బాలా, నా యనుగ్రహముచే నిన్ను సకల సంపదలును తమకు తామే వలచి వచ్చి వరింపగలవు. పట్టపురాణులకు వలెనే యసంఖ్యపరిచారికాజనము నిన్ను సేవింపగల దినము రాగలదు. పోయి రమ్ము. సుఖ ముండుము" అని యాశీర్వదించి యుంపెను.

నాడు కాంచీపురమును పల్లవరాయ డను నరవరుడు పరిపాలించుచుండెను. వేటకై యేతెంచిన యా క్షితిపతి మార్గమధ్యమున నా సుందరిని గాంచి మదనమార్గణములకు చిక్కెను. చిక్కుట యేమి, యా బిత్తరి నెత్తుకొని రాజు తన యంతిపురి కరుగుట యేమి, రెండును నేకకాలమున జరిగెను.

ఒక సుముహూర్తమున నా యేణాక్షిని తేదు పెండ్లి యాడి యామెతో బలువెరగుల రతిక్రీడల దేలెను. కాలక్రమమున రాజు యౌవనము సడలసాగెను. మీసములు నెరసి యొడలు ముడుతలు పడసాగెను. నడుము వంగెను. పండ్లబలిమి తగ్గెను. కాని యారామ తారుణ్యము మాత్రము కసుగంద లేదు, వసివాడ లేదు. ఈ వింత కాత డెంతయు చింతించియు తగిన సమాధాన మారయజాలక యొకనా డామెతో నేకాంతమున "లేమా, యేమీ యీ ఘోరకలి? నేనును నీవును సమవయస్కులమే గదా! ఇట్టి స్థితిలో నీవు యథాపూర్వ ముగా నవోఢవైయుండగా నా సర్వాంగములు శైథిల్య మందుటకు గల కారణ మేదియో? నా బింకము సడలుటకును, నీ పొంకము నానాటికి పెరుగుటకును కారణము తెలిసిన నాకును తెలియబల్కుమా!" యని కోరెను.

ప్రాణనాథుని యీ దుఃస్థితి కా మగువ మిగుల వగగుంది యిట్లు బదులాడెను. "నాథా! నే నాదిలో ముదుసలి పడతిని. నా రూపము జూచి నాకే రోతకల్గినందున దానిని రూపుమాపి సురూపవతిని కాగో రితిని. నా కోరిక యెట్లు నెరవేరినదో విన్నవింతును. వినుడు--హరిభక్తి నిధాన మగు భక్తిసారు డను యోగివరు డీ నగరిలో శేషశయానుడగు శ్రీహరిదివ్యతీర్థ సమీపమున యోగరతుడై యుండును. కణికృష్ణుడను శిష్యు డా మునిని కంటిని రెప్పవలె నేమరక సదా సేవించుచుండును. గురునివలె శిష్యుడు గూడ కవిసార్వభౌముడే. కాననే నవనవరసార్థ భాసురాలంకారశైలినొప్పారు. కైతతో నాతడు తన గురువునే గాక యీ గురువునకు గురువగు శేషశాయిని గూడ గొలుచుచుండును.

అట్టి భక్తిసారులు తపస్సు చేయుచుండు గుహాముఖమును నేను గోమయానులేపనముచేతను, ముగ్గులచేతను, నలంకరించి యాతని పరి చర్య చేసితిని. నా శుశ్రూషచే పరితృప్తి చెంది వృద్ధనారినగు నా కాతడు 'యువతివి గమ్మని' వరమనుగ్రహించినాడు. కాననే యీ యోగీంద్రుని యనుగ్రహలేశముచే లభించిన నా యౌవన మేనాటికిని తరుగకపోగా రతి సుఖముల దేలియాడుచున్నకొలదియు పెరుగుచుండుట మీకును ననుభ వైక వేద్యమే గదా! కాన ప్రాణనాయకా, నీవు గూడ నా మహాయోగి సేవలు చేసి స్థిరయౌవన మందుము" అని చిరునగవు మొగమున చిందులాడగా బలికెను.

కాంచీపతియగు నా భూపతి చెవుల కా సతిపలుకులు కలకండప లుకులవలెను తుమ్మముులుకుల వలెను గూడ నేక కాలమున తగిలెను. యోగివరుని మహిమావిశేషముచే తాను గూడ త్రిదశభావము తాల్చ నగును గదా యని యొకవంక నానందమును, మరొకవంక తనవంటి యాగర్భ శ్రీమంతుడు గూడ నితరుల సేవ చేయవలసివచ్చినది గదా యని యాపగవలె నాపరాని క్రోధమును నాతని హృదయమున ప్రభవించి పర స్పరసంఘర్షణతో మిన్నుముట్టెను. ఆతడు సేవకులచే కణికృష్ణుని తనవ ద్దకు రావించి యాతనితో నిట్లనెను--"ఓయీ! మీ గురువును మేము సేవించి యౌవనము పొందదలచితిమి. కాన నాయన నిటకు వెంటనే తోడ్కొని రమ్ము. అంతే గాదు, నీవు చక్కని కవిశేఖరుడ వని కూడ విని యున్నాము. కాన నితరులకు చిక్కని కవితారీతితో నాపై నొక పద్యము కట్టుము. మహార్ఘమణి భూషణాదులతో, నప్సరోరత్నములను బోలిన నయనాభిరామలగు రామారత్నములతో, చీనిచీనాంబరాదులతో, గజతురగాదులతో నేతత్ప్రతిఫలముగా నిన్ను ముంచియెత్తెదను."

కణికృష్ణుడు భగవద్భాగవతానుగ్రహశక్తి యుక్తుడు గాన నించు కంతయు లెక్కగొనక యా తుచ్ఛుని నిట్లు దులిపి వైచెను— "రాజాధమా! శ్రీరమారమణు నెదలో నిలుపుకొని తత్పాదపంకజ సేవ నేమరక చేయు మద్గురువరుడు భక్తిసారుడేడ! నీచుడ వగు నీ బోటి రాజును సేవించు టేడ! మద్గురువు గరళకంఠహిరణ్యగర్భాదులనే లెక్క గొనరు గదా! అట్టివారు నీ వద్దకు వత్తురా! ఏమి నీ మిడిసిపాటు!

నీపై నన్ను కవిత చెప్ప మన నీకు నోరెట్లు వచ్చినది? బ్రహ్మాం డభాండమును బొజ్జలో నిడుకొని పాలసముద్రమున విలాసముగా మఱ్ఱియాకుపై పవ్వళించునట్టి చిన్నికృష్ణు నెన్ను నా జిహ్వ నిన్నెన్న నెట్లు నేర్చు! నీవు నా కొక లెక్కయా? నీ విచ్చునవి నా కేలరా దుర్మదాంధా, నీ జిహ్వ నదుపు లోనికి తెచ్చుకొనుము."

## గురుశిష్యుల దేశబహిష్కారము

కణికృష్ణుని యీ తిరస్కారవచనములచే క్రోధోద్రిక్తుడై పల్లవరా యుడు దండతాడితభుజంగమువలె బుసలు కొట్టుచు విస మమియసా గెను. ఆతడు "నీ గురు వెంత? నీ వెంత? ఒడలు క్రొవ్వెక్కి న

న్నవమానించిన మీరిక నా దేశమున గాని, నా యీ నగరమున గాని యుండరాదు. తత్‌క్షణమే మీరిరువు రీ వీడు వెడలిపొండు. లేకున్న మీ ప్రాణములు మీకు దక్కవు" అని పదరెను.

కణికృష్ణుడు "నీచా, ని న్నీక్షణమున నీఱు చేయగలను. కాని నా తపశ్శక్తిని నీబోటి యల్పుని మట్టుపెట్టుటకై వెచ్చ బెట్టను" అని పలికి యచ్చోటు వాసిపోయెను. నిండుకొలువులో దర్పోద్ధతు డగు నా రాజు తన్ను గూర్చి పల్కిన యవమానోక్తుల ననూనముగా పూసగ్రుచ్చినట్లు భక్తిసారులకు వివరించి కణికృష్ణుడు "ఈ పాపాత్ముని రాజ్యమున నున్న వారికి గూడ పాపమే చుట్టుకొనును. కాన నే నెందేని బోయెద సెల విండు" అని వినతి చేసెను.

"కుమారా, నీ వొల్లని ప్రదేశమున నేను మాత్రము నివసింప గలనా? నీతో పాటే నేనును" నని పల్కి యోగివరుడు శేషతల్పశాయి యగు శ్రీమహావిష్ణువును "స్వామీ, దుర్మదుడగు నీ రాజుపాలనలో నీ దేశమున నిక నుండజాలను. కాన కణికృష్ణునితో బాటు నేనుగూడ పోయెద సెలవి" మ్మని యర్థించెను.

భక్తపరాధీను డగు నా స్వామి "మీ రిరువురును నుండ నొల్లని యీ నగరము నాకును వాసయోగ్యము కాదు. నేను గూడ మీతోడనే వచ్చెద" నని పలికెను. పలుకుటయే కాదు— తన నివాసశయ్యాసనాదుల కుపయోగపడు పాపతేని చాపవలె చుట్టి చంకను బెట్టుకొని రమా సహితుడై వారివెంట వెడలెను. ముందు భక్తిసారులును వారివెంట కణికృష్ణుడును నా దేవుని వెంటనడచిరి. శ్రీరామచంద్రు నడవికేగు తరి ననుసరించు నయోధ్యావాసులవలె నా నగరపరిస్థితి మారెను. భూనీళా పట్టమహిషులు -- పరిజనము -- చివర కా నగరవాసులుగూడ మాధవుని వెంబడించిరి. గజేంద్రార్తి వారణమునకై శ్రీమహావిష్ణువు వైకుంఠపురమునుండి వెడలినప్పుడు పోతనార్యుడు వర్ణించిన పద్యరత్న మిప్పట్టున జ్ఞప్తికి రాక మానదు గదా.

"తనవెంటన్ సిరి, లచ్చి వెంట నవరోధవ్రాతమున్, దానివె
న్కను బక్షీంద్రుడు, దానివెంటను ధను:కౌమోదకీశంఖ చ
క్రనికాయంబును, నారదుండు, ధ్వజినీకాంతుడు, రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాల గోపాలమున్!"

ఈ రీతిగా ప్రజ లందరును వెడలిపోయిన యా నగరము ప్రేత భూమివలె బీడువారి పోయెను. అంతేగా దనేకారిష్టములు పొడసూపెను. అపశకునములుగూడ పొడకట్టెను. హరిభక్తు లరిగిననా డవనీతలము తలక్రిందు గాక మానునే!

## యథోక్తకారి

వృద్ధులైన మంత్రిసామంతాదులు నగరమునకు జరుగబోవు మహా ప్రమాదమును గుర్తించిరి. వారు తొట్రుపడుచు పల్లవరాయని వద్ద కేగి "ప్రభూ, మన నెత్తిపై కొండ విరుచుకొనిపడినది. నగరమే మీ యపచారముచే నశించిపోవలసిన తరుణము దాపురించినది. సరే, జరిగినది జరిగినది. ఇప్పటి కైనను మించిపోలేదు. మీ రేగి క్షమాభిక్ష నర్థించి కణికృష్ణసహితు డగు భక్తిసారు నిటకు రప్పించిననే నగరవాసుల జీవితము యథాస్థితికి రాగలదు. కణికృష్ణుడు మొదట నిప్పులు కురిసినను సహజముగ నుదారుడు గాన తప్పక మీ ప్రార్థనను మన్నించి నడుమ వచ్చిన కోపము నుజ్జగించి వెనుకకు మరల గలడు. ఆ భక్తుని వెంట నీ నగరపాలకదేవుడును, తత్పరివారమును, ప్రజలందరును గూడ మరలి రాగలరు. మీరు నిమ్మకు నీ రెత్తిన ట్లుదాసీనముగా నున్నచో నీయూరే కా దీ దేశము గూడ సర్వనాశమునకు గురి కాక తప్పదు. కాన త్వరపడి వారిని రప్పింపుము. చేతులు కాలిన పిమ్మట నాకులు పట్టుకొనినను లాభము శూన్యము గదా" యని యాతనికి నచ్చ చెప్పిరి.

వారి హితబోధచే రాజునకు వివేక ముదయించెను. వెంటనే వృద్ధామాత్యపురోహితాదిసహితుడై యాత డేగి నగరమునుండి నిష్క్రమించుచున్న భక్తిసారుని పాదపద్మములకు సాగిలి మ్రొక్కి రెండు చేతులతో వారి చరణరాజీవములను వదలకుండ గ్రహించి "తండ్రీ, విత్తమదమత్తచిత్తుడనై కన్ను గానక చేసిన నా యీ తప్పిదము సైరింపుము. నీ కుమారునివంటి నన్ను కరుణింపుము. లేనిచో నా ప్రాణముల నిపుడే బాపు కొందు" నని విన్నవించి చెక్కులనుండి కన్నీరు ధారగా కారగా వలవల దు:ఖించెను.

నవనీతహృదయుడగు నా యోగి కరుణించి పాదములపై బడిన యాతనిని లేవనెత్తి కన్నీరు చేతులతో దుడిచి యిట్లనెను. "ఓయీ, నే

నేమి చేయగలను? నేను శిష్యపరాధీనుడను. కణికృష్ణుని యిష్టమే నా యభీష్టము. కాన నాతని వేడుకొని ప్రసన్నుని చేసికొన్నచో నీవెంట వచ్చుటకు నా కెట్టి యభ్యంతరమును లే" దని పలికెను. వెంటనే పల్లవరాయడు కణికృష్ణుని పాదము లంటి గతమును మరచిపొమ్మని, తనయొక్కని తప్పుకై దేశమంతయు పాడగుచుండగ చూచుచు నూర కుండుట నీతిగా దని, కాంచికి విచ్చేసి తన నగరవాసులను రక్షింపు మని మరి మరి ప్రార్థించెను.

పిన్న లెన్ని తప్పులు చేసినను వారు పశ్చాత్తప్తులైనచో సైరించుట పెద్దల స్వభావము గదా! కణికృష్ణుడు గూడ రాజాపరాధము క్షమించి మరల నా పురము జేర నంగీకరించెను. ఇట్టివి గదా మహాత్ముల యాగ్రహానుగ్రహములు. ముందు భక్తిసారుని కోరికపై శేషాహిశయనుడు, నాయన వెంట భక్తిసారుడు వారివెంట కణికృష్ణుడు, నాతనివెంట నగర ప్రజలును వెనుదిరిగి కాంచినగరమును ప్రవేశించిరి.

భక్తిసారుడు విష్ణువును--"కాంచీపురస్వామీ, కణికృష్ణుడు మరలి యిటు కేతించినాడు. కాన నీవును శ్రీ భూనీళాది సమేతుడవై శేష తల్పమున యథాప్రకారముగా శయనించి భక్తరక్షాదీక్షితుడవు కమ్మని పద్యరూపముగా ప్రార్థించెను. అప్పు డా విష్ణువు తాను భక్తిసారుని వెంట స్వస్థానమును వీడి వెళ్ళి యాతని ప్రార్థనపై తిరిగి వచ్చుట యందరకును తెలియునట్లుగా నెడమచేయి తలక్రింద నుంచుకొని కుడిచేయి నడుమున నొప్పారగా విలాసముగా శయనించెను. తన భక్తుడు చెప్పినట్లుగా చేసినవా డను నర్థము వచ్చు యథోక్తకారి యను పేరుతో నా స్వామి నాటినుండి ప్రసిద్ధు డయినాడు.

అప్పు డా మునివరుడు మాధవుని భక్తపరాధీనతను పెక్కురీతుల బొగడెను. తర్వాత నా యాళ్వారులు కణికృష్ణునితో గలసి యచటనే భగవత్సేవలో చాల కాలము గడిపిరి.

## శార్ఙ్గపాణి

కొంత కాలము తర్వాత మరల నా యోగికి దేశాట నాభిలాష జనించెను. మహాత్ము లెన్నడును నొకే చోట గుదురుకొని యుండరు.

అధీతిబోధాచరణప్రచారములతో దేశమున జాగృతి కల్పించుటయే గదా వారి లక్ష్యము! కాననే కణికృష్ణునితో గలసి తిరుమళిశయాళ్వా రా యా తీర్థముల గ్రుంకు లిడి యా యా దేవుల సేవించి కుంభకో ణము చేరిరి.

ప్రకృతిసౌందర్యమునకు బట్టుగొమ్మయగు కుంభకోణమునకు తన్న గరపార్శ్వమున బ్రవహించు కావేరీనది యొక వింత సొబగు గూర్చుచుం డును. అట గోపుర ప్రాసాద మంటపములతో నొప్పారు భవ్యాలయమున హంసతూలికా తల్పమున దుష్టజనశిక్షకై శార్ఙ్గ మను చాపమును కేల బూని నాగేంద్రునిపై నొయ్యారముగా శయనించియున్న శ్రీవిష్ణువును భక్తిసారులు దర్శించి యానందపారవశ్యమున నొడలు మరచిరి. కొంత వడికి తెలివొంది యెంత త్రావినను తృప్తి కల్గింపని యమృతమును బోలినవా డయినందున యతృప్తామృతనాథు డని పేరందిన యా స్వామి నీ రీతిగా భక్తిపారవశ్యముతో వినుతింపసాగిరి.

"విఖ్యాతే కుంభఘోణే ఫణిపతిశయనే
ప్రాఙ్ముఖో దక్షిణాశా
దిగ్భాగే న్యస్తశీర్షో మృదుపదయుగళం
చోత్తరే సంప్రసార్య,
య శ్శేతే శార్ఙ్గపాణి స్సకలతనుభృతాం
సర్వసంపత్ప్రదాతా
దద్యా న్మే దేవదేవ స్సరసిజనయన
స్సన్నిధిం యోగిలభ్యః.
తామ్రాధరం తరుణపల్లవపాణిపాదం
తారేశకోటినయనం తరణిప్రకాశమ్,
తత్కుంభఘోణనగరాధిప మాదినాథం
తం శార్ఙ్గపాణి మనిశం హృది చింతయామి.
స శార్ఙ్గపాణి స్సరసీరుహాక్ష
స్సమస్త కళ్యాణ గుణాంబురాశిః,
సామప్రియ స్సర్వజనానుకూల:
కరోతు మే మంగళ మార్తబంధుః."

—ప్రపన్నామృతము

పరమయోగివిలాసమందలి యీ శార్ఙ్గపాణి స్తుతిగూడ పఠన పాఠన యోగ్యము, శ్రవణశ్రావణార్హము!

"భద్రనాగేంద్రంబుపైఁ బవ్వళించి
నిద్రించె దేటికి నిర్మిమిత్తముగ
సీతళిం బవళించి తేమి కారణము
నాతోడఁ జెప్పవే ననుఁ గన్నతండ్రి!
ఘనతరం బైన చక్రము కేలఁ బూని
చెనటి రక్కసులఁ ద్రుంచిన బడలికయొ
జలరాశిఁ జొచ్చి రాక్షసుల గీటణఁచి
చెలఁగి వేదములు దెచ్చిన బడలికయొ
క్షీరసింధువు మథించియుఁ గ్రుంకకుండఁ
జేరి మందరము మోచిన బడలికయొ
ముఖదంతకోరకమున జగత్త్రియము
నిఖిలభారంబు నావిన బడలికయొ
పైకొన్న యుక్కు కంబముఁ గొనగోళ్ళఁ
జేకొని వ్రక్కలించిన బడలికయొ
జగము లీరేడును చక్కని యడుగు
చిగురుటాకునఁ గొలిచిన బడలికయొ
గండ్రగొడ్డట రాజకంఠనాళములు
చెండి చెండాడి వైచిన బడలికయొ
దండకావనమున దనుజవర్గంబుఁ
జెండివైచుచుఁ జరించిన బడలికయొ
కౌరవాధిపునితోఁ గనలి తత్పురము
సీరాగ్రమున బెకల్చిన బడలికయొ
యలవి మీరంగ గోపాంగనామణుల
చెలువంపురతులఁ దేల్చిన బడలికయొ
మేలిమి తురగంబు మీఁదట నెక్కి
లీల వయ్యాళిఁ దోలిన బడలికయొ
యీ మెడ నాతోడ నింతయుఁ దెలియ
మాయన్న యెఱిఁగింపుమా."

ఈ రీతిగా తన్ను స్తుతించిన యా భక్తిసార యోగీంద్రుని భక్తి ప్రవత్తుల కలరి యా దేవుడు స్వస్వరూపముతో నాతనికి ప్రసన్ను డయ్యెను. భక్తిసారమునియు "ఆహా! ఏమి నాభాగ్యము. కాంచీపురమున నేను సదా దర్శించి సేవించి యానందించు మాధవుడే యిటగూడ నేడు శేషశాయిపై యదే రీతిగా ప్రత్యక్ష మయినాడు. నేటికి నా జప తపములు, యోగవిద్య సార్థక మయినవి, నా జన్మము చరితార్థ మైనది"– అని పలికి యా శార్ఙ్గపాణిదివ్యమంగళ విగ్రహసౌందర్యము ననుభవించి యాతని కల్యాణ గుణగణములను ప్రస్తుతించెను. ఆ రూప

గుణమాధురీఝరిని చిన్నదైన తన హృదయపద్మమున నిముడ్చుకొనజాల కపోయెను. తద్దివ్యభావస్రవంతి ప్రపన్నజనకోటి నుద్ధరించుటకై రెండు ప్రబంధ కావ్యముల రూపమున నా మహర్షివాణీభాగీరథినుండి, వెలువడి ద్రావిడ భాషలో భవ్యసారస్వతమూర్తిని ధరించెను.

తిరుమలిశయాళ్వారులు రచించినవి రెండు కావ్యములు. వానిలో మొదటిది "ఇయఱ్పా" అను గ్రంథమున చివరి భాగమయిన నాల్గవ తిరువందాది. ఇందు మొదటి మూడు భాగములును పూర్వము సరోయోగి, భూతయోగి, మహాయోగులు రచించినవే. ఇందు 96 గాథలును రెండవ కృతి యగు తిరుచ్చందవిరుత్తమున 120 గాథలును గలవు. కుంభకోణము, శ్రీరంగము, కంచి, తిరుపతి మొదలగు దివ్యదేశము లందలి విష్ణువునర్చావతారమూర్తు లీ కావ్యమున నుతింపబడినవి. వీనిశైలి లలితాతిలలితము మధురాతిమధురము!

ఈ విధముగా భక్తిసారయోగీంద్రులు తమ శీలసంపద చేతను దివ్యప్రబంధ నిర్మాణము చేతను ప్రజల యజ్ఞానాంధకారమును జ్ఞానరవి ప్రకాశముచే దూరము చేసి యంత్యమున శ్రీమన్నారాయణుని చరణారవిందము లలంకరించిరి.

మచ్చు కీ యాళ్వారుల పాశుర మొకటియు, దాని తాత్పర్యమును నందించుచున్నాము.

> "నాన్ముకనై నారాయణన్ పడైత్తాన్ నాన్ముకనామ్
> తాన్ముకమాయ్ చంగరనై త్తాన్ పడైత్తాన్ యాన్ ముకమాయ్
> అందాది మేలి ట్టరివిత్తే నాళ్ పొరుళై
> చిందామల్ కొణ్మినీర్ తేర్న్దు."

"నారాయణుడు చతుర్ముఖుని సృష్టించెను. చతుర్ముఖబ్రహ్మయు, శంకరుని తానే సృష్టించెను. నేను ప్రధానుడనై గూఢార్థమును అందాది యను ప్రబంధమునం దిమిడ్చి తెలియ పరచితిని. మీరు పరిశీలించి ఒక యర్థ మయినను విడువక గ్రహింపుడు."

> అతుకుల బొంత దేహ మిది, యూరయు దోషపుం బుంత యెంతగా
> వెతకిన రంధ్రజాలములె, వింత యొకింతయు లేదు, గాన నీ
> వితరము సుంతయుం గనకు, మేర్పడ గా విను, వంత వాయ, నీ
> వతిదృఢమైన చింత మనసా! హరిపాదము లాశ్రయింపుమా!
>
> —శ్రీ నరసింహస్తుతి

# V శఠకోపయోగి [నమ్మాళ్వార్]

## అవతరణము

వృషభే తు విశాఖాయాం కురుకాపురి కారిజమ్,
పాండ్యే దేశే కలేరాదౌ శఠారిం సైన్యపం భజే.

శ్రీవిజ్ఞానదినోత్తరేఽహని కలౌ వర్షే ప్రమాద్యాహ్వయే
మాసే మాధవనామ్ని భార్గవదినే చర్క్షే విశాఖాభిధే,
లగ్నే శుద్ధచతుర్దశీ తిథియుతే శ్రీమత్కులీరేఽపి చ
క్షిత్యాం ప్రాదురభూత్పరాంకుశముని ర్భాగ్యోదయా న్మాదృశామ్.

మాతా పితా యువతయస్తనయా విభూతి-
స్సర్వం యదేవ నియమేన మదన్వయానామ్,
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా.

ఏది శ్రీముఖసూక్తి యంపొరు శైలి
మానవుల పాపవటలిని మాయఁజేయు,
నే మహాత్ముహృదబ్జంబు నెపుడు విడఁడొ
శంఖచక్రాదిధరుఁడయి సతము విష్ణుఁ
డెవని విగ్రహమండలం బెల్ల ద్విజులు
వేదగతమును దర్శించి వినుతిసేతు,
రట్టి వకుళాభరణసూర్యు నార్తితోడ
వందనముఁ జేతు నే నిదె భక్తిమీఱ!

కురుకాపురి దక్షిణదేశమున పాండ్యమండలమున విరాజిల్లుచున్నది. దాని నిప్పుడు ఆళ్వార్ తిరునగరి అని వ్యవహరించుచున్నారు. భోగభాగ్యసమృద్ధితో పూర్వ మా నగర మలకానగరమును గూడ తలదన్నుచుండెను. ఆ పురవరమున కధిపతి కారియను చతుర్థకులజుఁడగు నరపతి. ఆ రాజుపరిపాలనలో నా మండల మీతిబాధారహితమై నెల మూడు వానలు నిండుగా గురియగా శోభిల్లుచుండెను.

తన్నగరవాసు లందరు నానందసముద్రమున నోలలాడు చుండగా నా జనపతి హృదయసదనము మాత్రము విచారమునకే నిలయ మయ్యెను. కులవర్ధనుండగు కొడుకును గనజాలనందుకే యాతని కట్టి పరితాపము! దానితో నాతనికి రాజకార్యములు సరిగా నిర్వహించుకొనుట గూడ నశక్యమయ్యెను. నిద్రాహారములే కరవయ్యెను.

నాథనాయిక యను స్త్రీరత్న మా భూపతికి సహధర్మచారిణి. పతికి తగిన సతి యని యెల్లర నుతులందుకొన్న దా సతీతిలకము. అట్టి యనుకూలవతి నిల్లాలిగ బడసి గూడ నాతని హృదయము సుతసంతతి హీనతచే వెతగుందుట మానలేదయ్యెను.

చింతాశల్యమునకు చిక్కి సుతముఖకమలావలోకనమునకై తహతహ లాడుచున్న యాతనికి మంత్రిసామంతాదు లొకనా డిట్లు నివేదించిరి– "ప్రభూ! కరుణావరుణాలయుడును, నాశ్రితమందారమునగు నాదినాథ దేవుడు తలచుకొన్నచో మీకు సంతతికల్గుట యేమి లెక్క! ఆయనను ప్రార్థించిన మీ కోరిక తప్పక యీడేరును. కాన వెంటనే యా స్వామి కోవెలకు బైలుదేరుడు."

వారి యీ సూచనమేరకు కారివరుడు నారీమణి నాథనాయిక త న్ననుసరింపగా హరిసన్నిధి కేగి నతులతో నుతులతో నాతని బలు రీతుల బొగడి పుత్రసంతాన మనుగ్రహింపుమని ప్రార్థించెను. శ్రీమహా విష్ణు వాతనియెడ ప్రసన్నుడై "ఓయీ, నాయంశమున నీకు పుత్రు డుదయించును. నీవింక చింతను వీడి నిశ్చింతగా నుండుము" అని అర్చకముఖమున ననుగ్రహించెను.

పరమపదనాథుని కృపాలేశముచే నా కారిదంపతులకు సుతలాభ మను గ్రహించుటకును ద్రావిడవేదప్రాశస్త్యమును ధరణిపై వ్యాపింప జేయు టకును సంతకుముందే శ్రీహరిచే నాదిష్టుడై యనంతు డా యాది నాథదేవుని యాలయప్రాంగణమున చింతచెట్టై వర్ధిల్లెను. ముకుందుని సేనాపతి విష్వక్సేను డా కారిరాజువలన నాథనాయికాగర్భమున ప్రవే శించెను. ఆమె గర్భము దినదినప్రవర్ధమానమయ్యెను. నవమాసములు నిండగా కలియుగాదిని నలువదినాల్గవ దినమున సుమా రయిదువేల సంవత్సరములకు పూర్వము, ప్రమాది వత్సర వైశాఖ శుక్ల చతుర్దశి నాడు విశాఖానక్షత్రయుక్త కటకలగ్నమున రూపసౌందర్యములచే మారుని మించిన యొక కుమారు డా దంపతుల కుదయించెను. చంద్రోదయమున కెదురుచూచుచున్న సముద్రమువలెనున్న యా దంపతుల హృదయమ్ము పుత్రసందర్శనముచే నానందడోలికల నూగులాడెను. మించుదీవనుబోలె మిలమిల మెరయుచున్న యా పట్టిని గాంచిన కారి సంభ్రమానందాశ్చ ర్యములు ముప్పిరిగొనగా నొడలుమరచి భూసురులకు భూరి దక్షిణాదుల నొసగెను. యథావిధిగా జాతకర్మ మొనర్చి రూపజితమారుడగు నా కుమారునకు మారుడని సార్థకనామ మిడెను.



కాని సకలజగత్తులోని యజ్ఞానాంధకారమును తొలగించుట కవత రించిన యీ బాలునిలో ప్రాకృతశిశుచేష్టలు మాత్రము కానుపింపలేదు. అందు కా తలిదండ్రులు మిగుల వగల బొగిలిరి. అది సహజమే కదా! ఆతడు కనులు తెరువడు. ఏడు పసలే లేదు. స్తన్యపానాదు లంతకంటె కోరడు. ఇటు నటు చలింపడు కూడ. మలమూత్రవిసర్జన మొదలే లేదు! అయినను ఆ బాలుని శరీరము మాత్రము బాలసూర్యుని వలె దినదినమునకును నప్రాకృత తేజస్సుతో ప్రకాశించుచు వృద్ధిపొందసాగెను. ఆ బాలు నే యోగశక్తి వరించినదో గదా!

ముఖ్యముగా నాథనాయిక తన కుమారుని గాంచి. పడిన పరితాప మున కంతులేదు. "అయ్యో! బిడ్డకై మేము మొగము వాచి ప్రార్థిం పగా నిట్టివానిని దైవము మా కనుగ్రహించుటకు మేమేమి పాపము చేసినామో? ఇట్టి బాలుని చూచి నా గుండె పగులకున్నదేల" అని యామె విలపించుచుండగా వారి యెడ ప్రసన్నుడై యాదినాథుడు కరు ణించి యా దంపతుల కిట్లానతిచ్చెను. "పరమ భాగవతోత్తములారా! మీరు ధన్యులు. కాననే జగత్తులోని యజ్ఞానాంధకారము దూరము చేయునట్టిపుత్రుడు మీ కుద్భవించినాడు. ఈతని భారము నాపై నిడి నిశ్చింతగా మీరింటి కేగుడు. ఈత డెట్టి ఘనకార్యము లొనర్చునో మీరే చూచి యానందింప గలరు!"

"విధివిలాస మవిలంఘనీయము, దైవ మిచ్చిన బాలు నా దైవ మునకే సమర్పింతము. తా నిచ్చిన బిడ్డను తానే కాపాడుకొనుగాక" యని నిశ్చయించి యా దంపతు లా బాలు నా యాలయ ప్రాంగణ మున నున్న చింతచెట్టువద్దకు కొనిపోయిరి. బంగరు గొలుసులతో తూగు టుయ్యేల నొకదాని నా చెట్టు కొమ్మలకు కట్టించిరి. పీతాంబరములతో పీతాంబరునివలె నొప్పు నా బాలు నందు పరుండజేసి దుఃఖభారముతో గుండియలు బ్రీల వెనుదిరిగి చూడకుండగనే నిజనివాసము నెట్లో చేరిరి.

ఆ దంపతు లటు వెడలగనే యా బిడ్డడు కేసరికిశోరము వలె నా తొట్టెనుండి లంఘించి చింతచెట్టు తొఱ్ఱను ప్రవేశించెను. సహస్ర సూర్యప్రభా భాసమానమగు నాతని ముఖమండలము జ్ఞానప్రభలచే వెలుగొందు చుండెను. వైకుంఠనాథుని యాజ్ఞచే విష్వక్సేను డాత నికి పంచసంస్కారముల ననుగ్రహించెను. బద్ధపద్మాసనస్థుడై యా

బాలయోగి పద్మదళాక్షుడగు రమాపతినే తన హృదయపద్మమున నిలిపి సదా ధ్యానింప దొడగెను. మౌనియై ధ్యానస్తిమితలోచనుడై, అష్టాంగ యోగమున నా యరవిందదళాయతాక్షుని దివ్య మంగళవిగ్రహ సౌంద ర్యమును, ఆతని కళ్యాణగుణ చేష్టితములను అనుభవించుచు పదునారు సంవత్సరములు గడపెను. శ్రీనారాయణపాదపద్మయుగళీ చింతా మృతాస్వాదమత్తచిత్తుడగు నా యోగి కిహలోకప్రసక్తియే లేకపోయెను. కారి కుమారు డయినందున కారిమారులని, పరమతస్థుల కంకుశప్రాయు డగుటచే పరాంకుశులని, భక్తి పరిపూర్ణుడై నందున నమ్మాళ్వారు లని ఆయనకు నామము లొప్పెను.

ఆతని యనన్య భక్తిప్రపత్తుల కానందమంది యాదినాథ దేవు డాతనికి తాను ధరించిన వకుళమాలికను-పొగడ పూల దండను అర్చకద్వారమున ననుగ్రహించెను. దానిని ధరించిన యా యోగివరు డలౌకికమహిమాన్వితుడును దివ్యతేజస్సంపన్నుడు నయ్యెను. వకుళ మాలాధారి యగుటచే నాయన వకుళభూషణుడుగూడ నయ్యెను.

## మధుర కవి

చైత్రే చిత్రా సముద్భూతం పాండ్యదేశే గణాంశజమ్,
శ్రీపరాంకుశసద్భక్తం మధురం కవి మాశ్రయే.
హస్తస్థతాళద్వితయం ప్రపద్యే
శఠారివాగ్వ్యాస ముదారకీర్తిమ్,
మాధుర్యసంశ్లిష్టకవిత్వయుక్తం
మహత్త్వసంభావిత భక్తితత్త్వమ్.

కురుకాపురికి సమీపమున తిరుక్కోవళూరను దివ్య దేశము కలదు. అందు నారాయణు డను బ్రాహ్మణోత్తముడు వర్ణాశ్రమాచార ధర్మముల నేమరక శ్రీహరిభక్తితో కాలము గడపుచుండెను. ఆ మహనీయునకు కుముదుడను సేనేశుని యంశచే నొక కుమారుడు వకుళభూషణభాస్క రునకు ముందరుణునివలె నుదయించెను. ఆ బాలు డుపనీతుడై సకల విద్యలు సర్వ శాస్త్రములును బాల్యముననే యభ్యసించెను. భక్తిజ్ఞాన వైరాగ్యసంపన్ను డగుటయేకాక త్రిమూర్త్యాత్మకుడగు శ్రీమన్నారాయ ణునిపై మధురమగు కవితను చెప్పగలిగినందున మధురకవి యను నామ ముతో వ్యవహరింపబడుచుండెను. ఒక్క కవిత్వమే కాదు, అతని గుణ

గణములు, ప్రవర్తనాదులు అన్నియు మధురమే యయినందున ఆతని కా పేరు సర్వథా చరితార్థ మయ్యెను.

భాగవతచూడామణియగు నా ద్విజోత్తముడు దివ్యతీర్థ సందర్శనాభిలాషియై యుత్తరదేశమునకై బయలు వెడలెను. మాయాద్వారకావంతి కాశికురుక్షేత్ర గయా ప్రయాగాదు లను దర్శించి బదరీనాథుని సేవింప నరిగెను. ఆ స్వామిసేవలో కొంత కాలము చక్కగా గడపి తిరుగు ప్రయాణమున నయోధ్య చేరెను. శ్రీరామచంద్రుడు లక్ష్మణాదిసోదర సమేతుడై నడయాడిన ప్రదేశము లట కన్నులపండువుగా దర్శించి యా వైష్ణవోత్తము డమందానందకందళితహృదయారవిందు డయ్యెను. ఒక నాటి రాత్రి యాతని కొక దివ్యతేజము తూర్పు దిక్కున కంటబడెను. 'అది దావాగ్నియా, కాకున్న నా తేజస్సు యొక్క స్వరూపస్వభావము లెట్టివై యుండనోపును!' అని యాతనికి సందియ ముదయించెను. మరు నాటిరాత్రి గూడ నా తేజ స్సాదిక్కుననే తోచినందున దాని మూలము తెలిసికొన వేడుకపడి మధురకవి కాలినడకను బైలుదేరెను. మార్గమధ్యమున నున్న తీర్థములను దర్శించుచు నిను మయస్కాంతముచేత వలె బలముగా నాకర్షింపబడి పగలు ప్రయాణించుచు రాత్రులం దా తేజమును చూచుచు క్రమముగా కొంతకాలమునకు కురుకాపురి చేరెను. ఆ పట్నముగూడ దాటిపోగా నాతని కిక నా తేజస్సు దృష్టిగోచరము కాలేదు. అప్పు డా జ్యోతికి మూలతత్త్వ మా నగరముననే యుండునని నిర్ణయించుకొనెను.

మరల నా నగరమున కాయన వెనుదిరిగి వచ్చెను. అచట వకుళభూషణముని దివ్యచేష్టితములను గూర్చిన గాథ లాయన చెవిని బడెను. వెంటనే యా మహాకవి యాదినాథస్వామి కోవెల కరిగి ఆదిశేషునిపై శ్రీమహావిష్ణువును బోలి చింతచెట్టుతొఱ్ఱలో విలసిల్లుచు రూప సౌందర్యములచే కందర్పుని దర్పమును గూడ హరించుచున్న శఠకోప యోగీంద్రుని దర్శించెను. ద్వాదశాదిత్యులు నేకమై యీ వకుళభూషణభాస్కరుని యందు వెలుగొందుచున్నారా యనునట్లు ద్వాదశోర్ధ్వపుండ్రములతో కన్నులపండువు చేయుచున్న యాయనను దర్శింపగనే మధురకవి వెంటనే హర్షపులకితాంగుడై సాష్టాంగదండప్రణామ మాచరించెను.

నిమీలితలోచనుడగు నా శఠకోపు నెదుటకేగి మధుర కవి కరతాళ ధ్వని చేసెను. వెంటనే యా యోగి కన్నులు కొద్దిగా తెరచి మరల

మూసికొనెను. మధురకవి యాయనను "ప్రకృతి కడుపున బుట్టిన జీవు డేమి తిని యెట్లు బ్రతుకును?" అని ప్రశ్నించెను. "దానిని తిని యట్లే బ్రతుకు"నని యా ముని వాక్కునుండి సమాధానము వచ్చెను. తన సమస్యకు భావపూర్ణమయిన యట్టి సమాధాన మిచ్చినవాడు సామాన్య మానవుడు కాడని, గొప్ప తత్త్వవేత్త యని యాతడు దృఢ పరచుకొనెను. వెంటనే యా యోగిపుంగవు నెడ నాతని భక్తిశ్రద్ధలు ద్విగుణీకృత మాయెను.

రెట్టించిన భక్తిప్రపత్తులను మకరందముతో నిండిన తన హృత్ప ద్మమును మధురకవీంద్రు డా యోగీంద్రునకు సమర్పించి వినయవినమి తోత్తమాంగుడై కృతాంజలియై యిట్లు విన్నవించెను---

"స్వామీ! నేటికి మీ దర్శనముచే నా జన్మము ధన్యమైనది. కాని భవదవాగ్నిదగ్ధుడనగు నేను కడతేరు మార్గముకూడ నాకు మీరు చూపక తప్పదు. ఇక మీ పాదారవిందములే నాకు శరణ్యము. మీరే నాకు దైవము." ఇట్లు పలికి తనను గట్టిగా శరణుజొచ్చిన యా శిష్యసత్తముని నమ్మాళ్వారు లవ్యాజకటాక్షముతో తనయంత వానినిగా చేయుటకు దృఢనిశ్చయులైరి. ముక్తి నొసగు సులభోపాయ మా మౌనివరు డాయన కుపదేశింపదలచెను. శ్రీ పరాంకుశ కృషీవలుడు సారవంతమగు నా భక్తకవి మానసక్షేత్రమును తన సదుపదేశహలముతో దున్ని జ్ఞానబీజము లచట నాటెను. ఆ యుపదేశసార మిది:-

"చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అని మూలతత్త్వములు మూడు. చిత్తు అనగా జీవుడు, అచిత్తు అనగా ప్రకృతి. ఈ రెంటికి అధిపతి యయిన వాడే ఈశ్వరుడు. ఆతడు సర్వస్వతంత్రుడు. జీవుల కాతని సేవయే ప్రధానకర్తవ్యము. ముక్తిమార్గములగు కర్మజ్ఞాన భక్తిప్రపత్తులలో చివరిదే భగవంతుని చేర్చు సులభోపాయము. అదియే ప్రశస్తతమము గూడ. సదాచార్యుని సమాశ్రయించి తద్ద్వారా యీశ్వరునందు తన భార మర్పించుటయే ప్రపత్తి. ప్రపత్తిచేత సర్వజనులకు పరమపదలా భము తథ్యము.

వకుళభూషణముని నాటిన యీ యుపదేశబీజము మధురకవి యాళ్వారుల మానసక్షేత్రమున వెంటనే యంకురించి తీగెలుసాగెను. తర్వాత మొగ్గతొడిగి పూలుపూచి ఫలించెను.

## ఆగమావతరణము

"వేదము వేదమే; ద్రవిడవేదము వేదమునున్ బ్రబంధమున్
వేదసమూహసారమును వేదశిరోర్థనిరూపకంబు లో
కాదరభాజనంబగు సమంచిత కావ్యము నయ్యె నిట్లుగా
నేది కొఱంత? యిద్ది పఠియించినవారికి శ్రీపరాంకుశా!"
—శ్రీపరాంకుశ శతకము

శ్రీ వకుళభూషణులు నిర్హేతుకభగవత్కృపాలబ్ధమయిన కవితా పరిమళమును తన యెదలో దాచుకొనలేకపోయిరి. దాని నా మహర్షి దుర్విషయాసక్తులై తమ సృష్టికర్తయగు పరమేశ్వరుని చేరజాలని ప్రజా సామాన్యము నుద్ధరించుట కెట్లు వినియోగించెనో ముందు ముందు తెలిసికొందము.

క్రమముగా నాయనలో పరభక్తి పరజ్ఞాన పరమ భక్తులు వృద్ధిచెంద సాగెను. దైవదర్శన కాంక్షయే పరభక్తి. తత్సంగమకాంక్ష పరజ్ఞానము. సంగమము కల్గిన తర్వాత తన స్వామిని వదల నిచ్చగించలేకపోవుటయే పరమభక్తి. చంద్రునికై చకోరమువలె భగవత్సంయోగమునకై యా భక్తుడు మిగుల తహతహ జెందసాగెను. దానికై యాయన తనపై నాయికాభావము నారోపించుకొన్నాడని. గూడ మనము ముందు తెలిసి కొనగలము.

అనన్యవిరహపీడితుడగు నా భక్తవరుని యార్తికి ప్రీతుడై శ్రీహరి గరుడవాహనారూఢుడై నీలమేఘనిభాకారముతో, పీతాంబరము మిగుల శోభిల్లుచుండగా, శంఖచక్రాదులు ధరించి, శ్రీభూనీళలు తన్ను కొలుచు చుండగా నమ్మాళ్వారులకు ప్రత్యక్షమయ్యెను. వెంటనే శఠకోపు లానం దపారవశ్యముచే నోడలు మరచిపోయిరి. కొంతవడి కెట్టకేలకు తెలి వినంది పరబ్రహ్మసందర్శనానందముచే కనులనుండి ముక్తాఫలములువలె నానందబాష్పములు కురియగా ని ట్లాయోగివరుడు తలపోసెను. "ఆహా, ఏమి నా భాగ్యము. నేటికి స్వామి ప్రత్యక్షమైనాడు గదా! ఏమి యా వాత్సల్యము. ఏమి యా స్వామిత్వము, ఏమి యా సౌశీల్యము, ఏమి యా సౌలభ్యము, ఏమి యా గాంభీర్యము. సద్గుణముల కన్నిటికి నీతడే యాకరము కదా! అట్టివానిలో నీ గుణము లుండుటలో నబ్బుర మేమి? ఈ స్వామి రూపమాధురిని నా నేత్రాం

జలులతో ద్రావి ఈత డెచటికిని పారిపోకుండ నా హృదయపంజరమున నిపుడే కట్టివైచెదను." ఈ రీతిగా నా శ్రీహరిదివ్యమంగళవిగ్రహ కళ్యాణగుణసౌందర్యములను తనివిదీర ననుభవించి అపూర్వవాఙ్మాధు రితో నవరసములు జాలువార దేశభాషయగు ద్రావిడమున పలురీతులుగా గానముచేసెను. ఆయనవాణి ద్రావిడవాణికి నవరసార్థభావబంధురా లంకార మయ్యెను. సంగీతసాహిత్యములు స్తనద్వయముగా శోభిల్లగా వాణి యా కవి రసనపై మనోహరలాస్యము చేసెను. మచ్చు కొకటి రెండు ద్రావిడ పాశురములను తాత్పర్యముతో, నిచట పొందు పరచు చున్నాను.

కూఱాయ్ నీఱాయ్ నిలనాకి క్కొడువల్లశురర్ కుల మెల్లామ్
శీఱా వెరియుమ్ తిరునేమి వలవా తెయ్వ క్కోమానే
శేఱార్ శునైత్తామరై శెన్దీమలరుం తిరువేంగడత్తానే
ఆఱావన్బిలడియే నున్నడిశేర్ వణ్ణ మరుళాయే.

"శత్రుసంహారకమయిన సుదర్శనచక్రమును చేత ధరించి తిరుమ లయందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! నా పాపములను పోగొట్టి నీ భక్తుడనైన నన్ను నీ పాదములందు ఇపుడే చేర్చుకొనుము. ఇక నీ విరహము సైరింపజాలను."

"వానో మఱి కడలో మారుతమో తీయకమో
కానో వరుంగిత్తు కండిలమాల్ - ఆనీన్ఱ
కన్ఱు యురత్తా మెఱిన్ఱు కాయుతిర్ త్తార్ తాళ్ పణిందోమ్
వన్ తుయరై యానా మరిన్ఱు."

"శ్రీకృష్ణుడు వ్రేపల్లెలో పెరుగుచున్నాడని, వానివలన తనకు మృత్యువు తప్పదని తెలుసుకొని కంసు డా బాలుని సంహరించుట కనేక మాయలు పన్నెను. ఆ పసివానిని సంహరించి రమ్మని ఒక రాక్షసుని పంపగా వాడు ధేనుకాసురుడై కృష్ణుని సమీపించెను. మరొక రాక్షసుడు వెలగచెట్టు రూపము దాల్చి తన కాయలందు విషము ధరించి దారిలో నుండెను. వాడే కపిత్థాసురుడు. భయంకరమైన కొమ్ములతో తనను పొడుచుటకువచ్చుచున్న యా ధేనుకాసురుని కృష్ణు డవలీలగా మేకపిల్ల వలె నెత్తిపట్టికొని వెలగచెట్టుకు వేసి కొట్టెను. కాని విచిత్రము. ఆ యసురు లిద్దరు కృష్ణుని దెబ్బతాకిడికి హతమైరి.

అంతేకాదు, ఆ యిద్దరు రాక్షసులు నశించుటతో పాటు మానవుల పాపపటలము పటాపంచలయ్యెను. వింత యేమన, ఆ పాపము చుట్టుపట్టుల నెక్కడను పొడకట్టలేదు. అది ఆకసమున కెగిరిపోయినదో, సముద్రపు టలలలోబడి కొట్టుకొని పోయినదో, గాలిలో కలిసినదో, అగ్నిలో కాలిపోయినదో, లేక అడవిలో కలసిపోయినదో! తర్వాత నా పాపము కనుపింపనే లేదు. ఏ మాశ్చర్యము!"

ఈ విధముగా శఠకోపస్వామి శ్రీమన్నారాయణస్వామిని ప్రార్థింపగా నాత డమందానందముతో భక్తవత్సలుడై నందున ని ట్లానతిచ్చెను. "సుగుణమణీ, నీ వేల జన్మించితివో నీకు తెలియకున్నదా! నన్ను దర్శించుట కుపయోగించు విశిష్టాద్వైతభక్తిదర్శనగ్రంథజాలమును ద్రావిడ భాషలో నిర్మింపుము. తర్వాతనే నీవు నా సాయుజ్యమందగలవు."

ఈ విధముగా శ్రీపతి యానతిచ్చి యంతర్హితుడుకాగా శఠవైరి యా మురవైరినే సదా మనమున నిలుపుకొని తదీయ కల్యాణగుణ చేష్టితములను వివరించి మోక్ష మార్గమును బద్ధజీవులకు కరతలామలకముగా ననుగ్రహించు ద్రావిడసంహితను నిర్మించెను. సంహిత యనగా జీవకోటికి మిగుల నాత్మహితము కల్గించునదని యర్థము. శ్రీశఠారి వాక్కులు నవరసరసితములు. దివ్యప్రేమ సౌరభవర్షి సువర్ణ చాంపేయ సుమములు. మానవుల పాలిటి కైహికార్తిహరములగు పీయూష చషకములు. పాపాత్ముల దురితలతల కా ప్రబంధములు లవిత్రసదృశములు.

వకుళభూషణుల హృదయాంబుజమున బుట్టిన యా దివ్యప్రేమ సౌరభాంకూరములు స్వామిసందర్శన జనితానందరసాతిరేకమున నా కవిశేఖరుని జిహ్వాగ్రమునుండి వెలువడుట తోడనే విరాడ్రూపము ధరించి యక్షరపదభావము భజించి ద్రావిడాగమరూపమున విశ్వమంతటిని తమ పరిమళములతో వాసింపజేయసాగెను.

ఇట్లు మన యాళ్వారులు భక్తిపూర్ణులై దక్షిణ భారతదేశమున గల ముప్పదియొక్క తిరుపతులలోని విష్ణుదేవుని యర్చామూర్తులను నుతింపసాగిరి. అట్లే ఉత్తర మధురలోని శ్రీకృష్ణుని గూడ పాడిరి. ఆ కవియొక్క భగవత్పరితాపైక తీవ్రతకు మెచ్చి తిరుపతి, శ్రీరంగము, కుంభఘోణము మొదలగు దివ్యదేశములందలి విష్ణువుయొక్క యర్చావ.

తార మూర్తులాయన వద్దకు తమంత తామే వచ్చి ప్రత్యక్షమైరి. అంతే గాదు, ఆయన కూర్చుండి యున్న చింతచెట్టు కొమ్మలను బట్టుకొని నిలబడి "ఓ భగవత్కవీ, ముందు నాపై పద్యములు చెప్పి నన్ను ధన్యుని జేయుము, కాదు ముందు నాపై బల్కుము" అని అహమహమికతో వచ్చి గుంపుగట్టి కోరసాగిరి! చూచితిరా ఈ విచిత్రము!!

ఈ విధముగా నా కవి లోకమూర్ధన్యుడు—

అరవిందభవసవర్యాప్త గోవింద
చరణారవింద నిష్యందమరంద
వారిధారాకారవర వారిపూర
పూరితగంభీర భూరినిర్ఘోష
రంగ దభంగ సంభ్రమ భరోత్తుంగ
గంగాతరంగ వైఖరులు దీపింప"

--పరమయోగి విలాసము

తన రసవద్వాగ్వైఖరితో స్వస్థలమును వదలకయే యెదుటకు వచ్చిన యా యా హరిమూర్తులను పాడిపాడి వారివారి గుణగణములను గానము చేసిచేసి యిహ జన్మమందే భగవత్సందర్శనముచే ధన్యులైరి.

అట్లావిధముగ నప్రయత్నముగ లభ్యమయిన శఠకోప కవితామృతమును చెదరిపోకుండ మధుర కవీంద్రుడు తన లేఖినిచే లిపిబద్ధముచేసి మన మందర మా యమృతము గ్రోలుటకు కారణభూతు డయ్యెను.

నమ్మళ్వారులు చతుర్వేదసారముగా నాల్గు ప్రబంధములను నిబంధించిరి. మొదటిదగు ఋగ్వేదసారము 'తిరువిరుత్తము'న 100 పాశురములను, యజుర్వేదసారము 'తిరువాశిరియం' అను రెండవదానిలో 7 పాశురములను, మూడవది అథర్వణవేదసారము 'పెరియ తిరువందాది' లో 87 పాశురములును గలవు. నాల్గవదైన యీ గ్రంథము చరమ ప్రబంధము—మోక్ష ప్రబంధమని- వినుతి కెక్కెను. అదే యీ తిరువాయ్మొళి. ఇది ఛాందోగ్యోపనిషద్వివరణ మని ప్రసిద్ధము. దీనిలో 1102 పాశురములు గలవు. ఇందు పది శతకము లున్నవి. శతకమునకు పత్తు అని వ్యవహారము. ప్రతి పత్తునందు పది దశకము లుండును. ఒక్కొక్క దశకమున 10 పాశురములును, ఫలశ్రుతి ఒక పాశురమునను నుండును. ఈ దశకమునే తిరువాయ్మొళి అని గూడ

నందురు. ఒక్కొక్క దశకమునకు 11 పాశురములు చొప్పున పత్తుకు 110 పాశురము లుండును. ఈ లెక్కను పది పత్తులకు 1100 పద్యము లయినవిగదా! ఒక దశమున కేశవాది నామములు 12 చెప్పుటచే రెండు పాశురము లెక్కువ యయినవి. ఈ విధముగా మొత్తము గ్రంథమునందు 1102 కలవు.

ద్రావిడమున నున్న యీ గ్రంథనిర్మాణమున నొక సారస్యము కలదు. అదే అంతాదిక్రమము. పద్యము ముగించిన చివరిపదముతో మరల తర్వాతిపద్య మారంభింపబడును. దీనిని ముక్తపదగ్రస్తమని గూడనందురు. ఈ రీతిగా వేయి పద్యములు గూర్చి యొక వాఙ్మయహారము నిర్మించుట భగవత్కటాక్షలబ్ధ కవితావిభవులకే గాని యితరులకు సాధ్యము కాదు గదా!

ఈ గ్రంథమున అర్థ పంచకము--స్వస్వరూపము, పరస్వరూపము, పురుషార్థ స్వరూపము, ఉపాయ స్వరూపము, విరోధి స్వరూపము— అనునవి వివరింపబడినవి. ఆత్మ యొక్క స్వరూపస్వభావములు తెలిసికొనుటయే స్వస్వరూపము. పరమాత్మస్వరూపజ్ఞానమే పరస్వరూపము. జీవుడు దేవుని పొందినందున గలుగు ఫలవివరణము పురుషార్థ స్వరూపము. భగవంతుని జేరు మార్గవివరణమే యుపాయస్వరూపము. దేవుని జేరుట కెదురగు విఘ్నపరంపరల నెరుగుటయే విరోధిస్వరూపము. తిరువాయ్‌మొళి ముఖ్యముగా ద్వయమంత్రార్థ మనబడు మంత్ర రత్న వివరణము. లక్ష్మీసహితుడగు నారాయణుని సేవించిననే మనము సర్వదుఃఖములనుండి నిర్ముక్తులమై విష్ణుసాయుజ్య మందగలమని యది తెలుపును.

ఈ విధముగ నజ్ఞానాంధకారమును తొలగించి భగవద్దర్శనరూపసార స్యతము ననుగ్రహించిన తన గురువగు నమ్మాళ్వారుల నాశుకవితాధారతో యేకాదశీ పర్యసమమగు నేకాదశ సూక్తములతో మధురకవీంద్రుడు మధురముగా నుతించెను. దీనిలో భగవంతునికంటె గూడ భగవంతుని చూపిన ఆచార్యుడే పరమపూజ్యు డను రహస్యము సోపపత్తికముగా నిరూపింపబడినది. కాననే తిరువాయ్‌మొళి పఠించుటకు ముందుగా మధురకవి ఆళ్వారులు రచించిన యీ ఆచార్యస్తుతిని శ్రీవైష్ణవులు తప్పక పఠింతురు. అదే 'కణ్ణినుణ్ శిరుత్తాంబు'.

# కవితా వైభవము

"ఋషిం జుషామహే కృష్ణతృష్ణాతత్త్వమివోదితమ్,
సహస్రశాఖాం యోఽద్రాక్షీ ద్ద్రావిడీం బ్రహ్మసంహితమ్!"

మానవుని కానందానుభూతి కల్గించుటకు కళ లవతరించినవి. తా ననుభవించిన శోకము శ్లోకముగా వెలువరించి విశ్వశ్రేయోదాయక మగు కావ్యము నిర్మించుట కవిబ్రహ్మ కొక్కనికి మాత్రమే చేతనయిన కార్యము. ఈ లోకమును సృష్టించిన బ్రహ్మ వారివారి కర్మల ననుస రించి మానవుల లలాటములపై వారిని నిర్మించునపుడే సుఖదుఃఖములు తీర్చి దిద్దును. కాని ఆ వ్రాత వ్రాసిన బ్రహ్మకు గూడ తెలియదు. మరి మన కెట్లు తెలియును? చతుర్ముఖుడగు బ్రహ్మవలె గాక చతుర ముఖుడగు కవిబ్రహ్మ చేతనకోటిని దుఃఖదూరులను చేసి రసానందాబ్ధిలో ముంచెత్తును!

అట్టి కవులలో మూర్ధన్యుడు వాల్మీకి మహర్షి. విశ్వసాహిత్యము నకే ఆ మహర్షి ఆదికవి. "కవతే సర్వం జానాతి, సర్వం వర్ణయతి, సర్వం సర్వతో గచ్ఛతి వా కవిః" అని కవి శబ్దమునకు వ్యుత్పత్తి. సర్వమును ఎరిగి వర్ణింపగలవాడే కవి. "కవిః క్రాంతదర్శీ". త్రికాల వేదిమాత్రమే కవిశబ్ద వాచ్యుడు. "ఋషయో మంత్రద్రష్టారః." మంత్ర ద్రష్టలు ఋషులు. "మంతారం త్రాయతే ఇతి మంత్రః." స్మరించిన వారిని కాపాడునదే మంత్రము. కాగా పూర్వపు మహర్షులకు, కవులకు ఈషణ్మాత్రమును భేదము లేదు. ఋషులు విశ్వహితైకకాంక్షులు. ఆ హితమును గూడ సహృదయులహృదయములకు నొప్పి కలుగకుండ సరస ముగా నందించుటలో వారు కావ్యశిల్పము నాశ్రయించువారు. కాదు కాదు, శిల్పమే అట్టి మహర్షుల వాక్కులను వలచి వచ్చి ఆశ్రయించినది.

చరిత్ర తెలియజేయుచున్నంతలో అట్టి మహర్షుల కోవకు చెందిన వారు వాల్మీకి. తరువాత శఠకోపమహర్షియే. నిర్హేతుకభగవత్కటాక్ష జన్యమగు వీరి వాగ్ధోరణియే తిరువాయ్‌మొళి యను దివ్య ద్రావిడ ప్రబంధము. దీనిలోని పద్యములను పాశురము లందురు. పాశుర మనగా అందమైన స్వరము అని యర్థము. ఈ పాశురములకు సాహి త్యపు విలువ మాత్రమే గాక చక్కగా పాడుకొనుటకు గూడ వీలుగా రాగతాళములు గూడ వీనికి నాథముని యను మహాకవి నిబంధించెను.

"శ్రియఃపతి యింత చక్కని కవితాసంపద నా కనుగ్రహించినాడు గదా! వీని నాతని కల్యాణపరంపరాస్తుతికే తప్ప యితరుల కై ట్లుప యోగింపగలను?" అని ఆళ్వారులు నిశ్చయించుకొనిరి. "విశ్వశ్రేయః కావ్యం" అని గదా నన్నయభట్టారకుని సూక్తిగూడ!

పూర్వాలంకారికులు సాహిత్యమునకు, కావ్యమునకు నే లక్షణ ములు నిర్వచించినారో అవన్నియు కొరతలేకుండ నీ దివ్యప్రబంధము నెడ గూడ నన్వయించును. కాని యీ గ్రంథము ద్రావిడభాషలో నుండుటచే దానిలోని కవితాగుణములు వర్ణించుట కిది తావు గాదు. కాన నిందలి ప్రధానలక్ష్యము మాత్రము నీట వివరింతుము.

"విద్యయా అమృతమశ్నుతే" అను సూక్తము విద్యకు ప్రధాన లక్ష్యమును బోధించుచున్నది. విద్యచే--అధ్యాత్మ విద్యచే--అమృతము లభింపగలదని దీని యర్థము. అమృత మనగా నిచ్చట మోక్ష మని యర్థము. ముముక్షువులకు మోక్షమే గదా అమృతముకంటెగూడ వాంఛ నీయము! జన్మజరాదుఃఖమరణ నివృత్తియు, భగవత్సందర్శనానందమును మోక్షపదమున కర్థములు. విద్యకు లక్ష్యములు గూడ నవియే.

ఇట్టి కవితాసంపదను తమ కనుగ్రహించిన యీ పరాత్పరు నీ కవి యభినందించిన పద్యములనిట కొన్నిటి నుదాహరింతును--ఈ మహర్షి పాశురముల కనువాదముగా నిచ్చిన పద్యములు శఠకోపగీతామృతము లోనివి. తద్రచయిత కీ. శే. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల వేంకటరాఘవా చార్యులుగారు--తుని.

ఉ. ఓలగ మొప్పనున్న భువనోత్తమశాసనశీలు నన్మహీ
పాలు, తురంగరాక్షసవిభంజను, నావలి సన్నుతించి తెం
గేలు మొగిడ్చి, మ్రొక్కు లొసగించి, మనోహరశబ్దమాలికా
జాలము నిచ్చికొ౦దగిన సంపదఁగంటిఁ ని కేమి లోటగున్.

నిండు కొలువున్న సర్వజగత్పాలకుడు శ్రీమన్నారాయణుని విను తించి అంజలిబంధముతో మ్రొక్కి చక్కని వాగ్రూపమాలికల నాత నికి సమర్పింపగల కవితాసంపదకు నోచుకొన్నాను గదా! నా కింకేమి లోపము?

ఉ.“నీలవిశాలనేత్ర, రమ నిత్యనివాసముసేయు పేరెదఁ
గ్రాలెడు వాని, పెద్ద యనురాగవుఁ గమ్మలవాని, దేవతా
పాలకు గాటపుం గయితపాటల మాలలఁ బూజఁ జేసి, యీ
నేలఁగలట్టి క్లేశసరణిఁ నదలించితి; భాగ్య మెట్టిదో!” 342

నీలోత్పలదళాక్షియగు నిందిరాదేవి తన హృన్మందిరమున వెలుగుచుండగా విశాలనేత్రములతో భక్తులను పరిపాలించు ఆ శ్రీ మహావిష్ణువును సాంద్రమధురకవితా గానమాలలతో పూజించి యిహలోకమున గల బాధ లన్నిటిని పోగొట్టుకొనగలిగిన నే నెంత భాగ్యశాలినో గదా!

చ.“అవిరళనిత్యమోదచరమావధిఁ దేలెడు నచ్యుతుఁ, గుణా
ర్ణవు, నళినాక్షు, దివ్యజననాయకునిఁ గలకాలముఁ వచః
ప్రవిమల గానమాలికలఁ బ్రస్తుతిఁ జేసిన భాగ్యశాలినై
యవిరళనిత్యమోదచరమావధి నేనును నోలలాడితిఁ.” 343

సాంద్రానందచరమసీమలో మునిగితేలుచుండు సద్గుణాకరుడగు దేవాధిదేవుని సదా నిర్మల వాగ్రూప గీతమాలికలతో ప్రస్తుతించుచున్న నేను గూడ సాంద్రానందచరమ సీమలో మునిగి తేలియాడితిని.

ఉ.“తన్ను ననన్యులై కొలుచు దాసుల దోసము తూల గౌఁగిటఁ
గొన్న వరుఁ, విహంగతురగుఁ, సమిదుత్సుక చక్రహస్తు వా
గున్నతగానమాలికల నోపి నుతించిన భోగభాగ్య సం
పన్నుఁడ నాదు నాత్మఁ బరమాత్మయొనర్చిన దెట్లొయుంగుదుఁ” 344

సదా తన్నే కొలుచు దాసుల దోషములు నశించునట్లుగా వారిని గట్టిగా కౌగిటఁగ్రుచ్చియెత్తు గరుడవాహనారూఢుని, భక్తాపకారిదుష్టజన శిక్షకై సదా తన సుదర్శన చక్రాయుధమును కేల సిద్ధముగావించుకొనియుండు నా దివ్యస్వరూపుని నోపికతో నుతింపగల్గిన భోగభాగ్యముల కేనాడో పెట్టిపుట్టినాను. కాని నాయాత్మ నా పరమాత్మ యెట్లు సృజించెనో తెలిసికొన జాలనైతిని గదా!

మ.“మనకుఁ బువ్వనఁ గాఁ పురంబుఁగొను పద్మాదేవి, కానంద మి
చ్చును, భూమిస్థులకుం దివస్థులకు నీశుం డౌను; శీతాబ్ధిపై
శనివిష్టాంఘ్రితలుఁ, జగజ్జనకు జాడల్ చాటుపాటల్ సువా
క్యనిరూఢిఁ రచియించు నాకుఁ బరమాకాశస్థులుఁ సాటియే?” 348

భక్తులగు మనకును పద్మాలయయగు నిందిరాసుందరికిని నానంద ప్రదు డా మహనీయుడు. దేవమానవుల కీశ్వరుడు. జగజ్జనకుడగు నతని జాడ తెలియజేయు చక్కని పాటలు నిర్మించు నా కే దేవతలు సాటి కాగలరు?

శా. తానే యిష్ట మదాత్మనా నొకంటియై దైవాతి నావల్కులన్
నేనే పల్కిన నవ్యకావ్యమను భంగిన్ వెల్లడిం జేసి, స్వీ
యానూనోక్తులఁ దానె దన్ బొగడు మాయావర్తి మూర్తిత్రయే
శానుం డాద్యుఁడు నాకు మ్రు బలుకు నేఁ జాడఁ బదుల్ దీర్చెదఁ. 642

ఆ పరమాత్మయే నా యాత్మయైనాడు. నేనే పల్కిన నవ్యకా వ్యము వలె దీనిని నా వాగ్రూపమున వెలువరించినాడు. ఈ విధముగ నాతడు తన వాక్కుతో తన్ను తానే పొగడుకొనుచున్నాడు. నేను నిమి త్తమాత్రుడను. త్రిమూర్త్యాత్మకుడు, మాయామయుడునగు నాతడు నాకంటె ముందే తన్ను గూర్చి తాను నా జిహ్వతో పలుకుకొనుచు గూడ నాకే యీ ఘనత కట్టబెట్టుచున్నాడు. చూడు డా భక్తపారిజాతమునకు నాపైగల యవ్యాజవాత్సల్యము. నిర్హేతుకజాయమాన కటాక్షము. అట్టి కరుణాసాగరునకు నేనేమి ప్రతి సేయగలను.

మ. "ఇతఁడే మూల మటన్న జ్ఞానమును నా కిప్పించి, నా జిహ్వపై
కుతుకం బొప్పఁగ ముందె చొచ్చి, రసవద్గాఢప్రబంధంబుఁబా
వితులౌ ముఖ్యులు నైన భక్తులకుఁ దృప్తింగూర్ప తాఁ దానె కీ
ర్తితుఁడౌ మత్కృతికారకుం; డితని మూర్తిన్ నేమఱ నేర్తునే?" 688

ప్రపంచమున కితడే యాది, ఇతడు మాత్ర మనాదియను జ్ఞాన మును నా కీతడే కల్గించినాడు. ఇట్టి పవిత్ర సరస ప్రబంధము భక్తులకు తృప్తికల్గించుటకై లిఖియించి తనచే తానే కీర్తింపబడుచున్నాడు. నా యీ కృతికి కర్త యాతడే కాని నే నెంత మాత్రమును కాను. అయి నను నేతద్గ్రంథకర్తను నేనే యను కీర్తిని మాత్రము తానే నాకు కట్టబెట్టినాడు. అట్టి యీతని దివ్యమంగళస్వరూపము నేను మరువ గలనా!

ఉ. శీలరవౌ గ్రహించుటకు శిక్షితమౌ, ననులక్షణంబు, ర
మ్యాలపనంబునై, భగవదర్హమునైన కవిత్వభంగికిఁ
జాలని జ్ఞానహీను, నను, స్వప్రతిమాను నొనర్చి నా వచో
జాలము నుర్విపైఁ బఱచు చంద మెనర్చె; నదెట్టి ప్రీతియో! 685

శ్రీమన్నారాయణుని భవ్యశీలసంపద నవగాహన చేసికొనుటకై సుశిక్షితమును, సర్వకావ్యలక్షణసంపన్నమును, రమ్యాలాపయుతమును, భగవదేకార్థమునునగు కవితారీతిని సృష్టించుట కే మాత్రమును తగని పరమమూర్ఖుడనగు నన్నాతడు తనయంతవానినిగా చేసి నా కావ్యకళను ప్రపంచమున సులభముగ శీఘ్రముగ వ్యాపించు నుపాయము చేసెను. ఆయనకు నాపై నెంత ప్రేమయో గదా?

చ. "పరమ కవీశ్వరుల్ మధురపాటవచిత్రకవిత్వచాతురీ
నిరతులు నుండ, స్వీయమహనీయచరిత్రము వారికైత చే
త రచనఁ బొంద కిప్డు ముదంబున నన్విడకుండి, నాకె నా
పరమపదాధినేత నిజభవ్యకవిత్వముఁ గూర్పఁ గూర్చెడిన్." 686

ఆశుమధురచిత్రశీఘ్రరీతులతో నొప్పారు చతుర్విధ కవితలు నిర్మించుటలో మేటియగు కవీశ్వరు లనేకు లుండగా తన మహనీయచరిత్రము దరికైన వారి కవితను చేరనీయకుండ మార్జాలకిశోరన్యాయము ననుసరించి నన్ను మాత్రము వదలిపెట్టకుండ నాచే నా పరమపదనాథుడు భవ్యకవితానిర్మాణము చేయించుటకై బద్ధకంకణుడైనాడు. ఆహో, యేమి చిత్ర మిది!

శా. "వైకుంఠాధివిభుండు నా యఘమునున్ భంగించు శుద్ధుండు నన్
జేకొన్నాఁడు, తనంతవానిగను నాచే స్తుత్యుఁడౌ చుంట నే
వైకుంఠుం డగునట్లు, స్వీయ విషయప్రాంచత్కవిత్వప్రశు
ద్ధాకారుండగు నట్లు, లెంచె; నతనిఁ ధ్యానించినం దీరునే?" 687

"బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" అను సూక్తము ననుసరించి వైకుంఠనాథుడు నా పాపములు నిర్మూలించి పరిశుద్ధునిచేసి నన్ను స్వీకరించినాడు. తన్ను స్తుతించిన మాత్రముచేత నన్నుగూడ తనయంతవానినిగా చేసినాడు. ఆయనను పాడియున్న నేను గూడ భ్రమరకీటకన్యాయముచే తనంతవాడ నగునట్లుగా నన్ననుగ్రహించినాడు. నేనెంత తపస్సు చేసినను నింతవాడను కాగల్గియుండెడివాడనా? ఇపుడు దీని నే విధముగా తీర్చుకొని దయామయుడగు దేవుని ఋణమునుండి విముక్తుడను కాగలను?

మ. "ఇఁక మా చెయ్యది వాని సత్కృతికి? లేదే యాత్మనాఁ, జిత్తగిం
చి కనంగా నిపు డాత్మయు న్నిగుల కా శ్రీదేవు సొత్తయ్యె; స్వీ
యకృపాబోధక సాధుమంజుల కవిత్వారంభుఁ గావించు సా
మికిఁ జేయన్ బ్రతిమొందొకింతయును భూమిన్నింగినిం గల్గునే? 690

వాని యీ సత్కార్యమునకు బదు లేమి గలదు? పోనీ యమూల్య మగు ఆత్మపదార్థము నాది కలదు గదా! దాని నాతనికి సమర్పించిన కొంత ఋణమును తీర్చుకొనినట్లగునేమో! అయ్యో, ఏమి నా వెఱ్ఱి! సకల పదార్థములును అతనివే యయియుండగా ఈ నా ఆత్మమాత్ర మాతనిది కాకుండునా! అన్నిటికంటె గొప్పదియగు మృదుమధుర భగవత్కవితను నా కనుగ్రహించిన యాతనికి ప్రతిగా సమర్పించుటకు భూమ్యాకాశములలో ఒక్కటియు నాకు కన్పించుటలేదు కదా!

కోమలకాంత పదావలితో నొప్పారు మృదుమధుర భగవత్కవిత నను్గ్రహించిన యీ కవిలోకమూర్ధన్యుని ఋణము మన మెట్లు తీర్చుకొనగలము! వారి కవితచేతనే భగవంతుని స్తుతించి మోక్ష మార్గాన్వేషకుల మగుటయే మన కనిష్ఠకర్తవ్యము సుడీ!

## వకుళభూషణనాయకి

యో మని ర్నాయికాభావ మాత్మన్యారోప్య చక్రిణః,
హరిం ప్రాప శఠారాతిం తం వందే భగవత్కవిమ్.

శా॥ "కామోత్కంఠతఁ గోపికల్, భయమునఁ గంసుండు, వైరక్రియా
సామగ్రిఁ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులుఁ
బ్రేమఁ మీరలు భక్తి నేము నిదె చక్రిం గంటి మెట్లైన ను
ద్దామధ్యానగరిష్ఠుడైన హరిఁ జెందఁ వచ్చు ధాత్రీశ్వరా!"
---భాగవతము

గాఢ భగవత్కామవాంఛతో గోపికలును, భయముతో కంసుడును, వైరముతో శిశుపాలాదులును, బంధువులై వృష్ణివంశీయులును, ప్రేమతో పాండవులును, భక్తితో నారదాదిమహామునులును, భగవంతుని దర్శింప గల్గిరి. తీవ్రధ్యాననిష్ఠులు మాత్రమే దేవుని దర్శింపగలరు.

ఏ రీతిగా భజించినను భగవంతుని చేరనగును. కాని భగవంతుని చేరవలెనను పరితాపము జీవుడు తీవ్రముగ ననుభవించుటమాత్రము మిగుల నవసరము. అట్టిపరితాపము తీవ్రము కానినాడు భగవంతుడు మనకు పట్టుబడడు. అతని జేరుటకు నవవిధభక్తి మార్గములు కలవు. పోతనార్యుని వాక్కులలో వీని నిట్లు పేర్కొనవచ్చును—

మ. "తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్, చింతనం
బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి, స
జ్జనులై యుండుట భద్రమంచు దలంతున్; సత్యంబు దైత్యోత్తమా!

త్రికరణశుద్ధిగా నీశ్వరునితో భక్తి నెరపుట, తత్కల్యాణ గుణ వర్ణన నాకర్ణించుట, దాస్యము చేయుట, నమస్కరించుట, చేతులతో పూజించుట, నేత్రములతో సేవించుట, మనస్సుతో తెలిసికొనుట, వాక్కుతో దివ్యనామసంకీర్తనము చేయుట, చింతించుట-అనునవే నవ విధ భక్తులు.

కాని గోపికలవలె భగవత్కామము నిలుపుకొని తత్సంయోగమునకు తహతహ లాడుటయే పైమార్గము లన్నిటిలో భగవంతుని చేరుటకు సులభోపాయము. త్రికరణశుద్ధిగా సఖ్యము నెఱపుటలో బిడ్డవలె గూడ దేవునిపై వాత్సల్యము నెఱపవచ్చును. ఇట్టి వాత్సల్యభావమునకు రస పరిపాకము కల్పించినవారిలో పెరియాళ్వారు అను పేరుగల విష్ణుచిత్తు లగ్రేసరులు. వారి కవితామాధురి గ్రోలదలచినవారు గోదాగ్రంథమాల లోగడ ప్రచురించిన భాగవతసార మను కావ్యమును పరిశీలింపనగును. ఆ మహాకవివలెనే సూరదాసుగూడ శ్రీకృష్ణుని తన బిడ్డగా తలచి ఆయన దివ్యమంగళవిగ్రహ సౌందర్యమును కల్యాణగుణసంపదను ఎంతో మృదు మధురముగా సూరసాగర మహాకావ్యమున హిందీలో చిత్రించినాడు. దానిని రుచి చూడగోరువా రీ గ్రంథమాల ప్రకటించిన భ్రమరగీత లను, ప్రచురింపబోవు సూరసౌరభమును నాస్వాదించి ఆ మాధుర్యము తెలుగున గూడ ననుభవింపనగును.

ఆండాళ్ అను నామాంతరము గల గోదాదేవి శ్రీరంగనాథునిపై తన విరహార్తిని వాగ్రూపమున ప్రకటించి చివరకాయననే భర్తగా పొంది ఆయనయందే యైక్యము కాగలిగెను. ఆమెకవితామాధుర్యము చవిచూడ దలచినవారు ఈ గ్రంథమాల వారి గోదాసూక్తిమాలను పరిశీలింపనగును. ఈ కవయిత్రి పద్ధతినే అనుసరించి కృష్ణభక్తాగ్రేసరురాలు మీరాదేవి హిందీలో చక్కని బాణీలో హృదయమునకు హత్తుకొనునట్లుగా సంగీత సాహిత్యముల నేకముచేసి ఆర్ద్రగునట్లు భక్తిగీతములు పాడెను.

కాని నాయికావిరహమును పురుషుడు అనుభవించి దేవుని పాడి నట్టి భక్తకవులకు నమ్మాళ్వారులే మార్గదర్శకులు. నమ్మాళ్వారను మాటకు మన యాళ్వారులని యర్థము. భక్తిప్రవాహపూర్ణనది యని భావము. వారి సూక్తులలోని భక్తిరససమృద్ధి ప్రపంచమునందలి యే భాషాసారస్వతములందును గూడ గోచరింపదనుట యతిశయోక్తి కాదు.

"మన ఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః"

మనస్సే గదా మనుజుల బంధమోక్షములకు కారణము! దైవ ప్రార్థనకు సుముఖముగనుండుట కా మనస్సు నీ కవిశిరోమణి యెట్లు మచ్చిక చేసుకొనుచున్నారో తిలకింపుడు—

ఉ.తేనియ, పాలు, నేయి, సుధ, తీయని చక్కెర మేళవించుచున్
బానముఁ జేసిన ట్లనుభవంబగు నా మధుసూదనుండునున్
నేనునుఁ గూడి కూడి కమనీయరసంబులఁ దేలియాడ, నో
మానసమా! శరీరమున మంచితనంబున నీవు నిల్చుటన్." 121

తేనె, పాలు, నేయి, అమృతము అనువానిలో చక్కెర మేళవించి చేసిన పంచామృత మెంత మధురముగానుండునో అట్లే హరినామకీర్తనామృత మాధుర్యముచే నే నొడలు మరచి యుండుటకు కారణము---మనసా, నీవు నాపై దయచూపుటయే గదా!

"స్త్రీప్రాయ మితరం జగత్" అను నానుడి భక్తలోకమునకు చిర పరిచితము. భగవంతు డొకడే పురుషుడు. ఇతరు లందరు స్త్రీలే. సదా కలసియుండిన విసుగు తప్పదు. తినగా తినగా గారెలు గూడ చేదగునుగదా! కాననే వియోగానంతర సంయోగమునకు మన యాలంకారికులు విలువ నిచ్చినారు.

నాయిక తన భర్తను వదలియున్నపుడు పడు తాపమును వీరు శ్రియః పతికై యనుభవించినారు. పకుళభూషణులు నాయికాభావము తమపై నారోపించు కొని విరహజ్వరార్తితో నెట్లు వెచ్చ నూర్చుచున్నారో మన ముగూడ అవగాహనము చేసుకొని దాని ననుభవింప బ్రయత్నించతము గాక! కాని ఆ యోగిమనఃస్థితి నే కొంతయైన నలవరచుకొన్ననే గాని మన కది సాధ్యము కాదు సుమండీ—

గీ.“అబ్జముఖి యీపె భక్తిచే నాడి యాడి
భావము కరంగ నీ కతల్ పాడి పాడి
కంటఁ దడిఁ బెట్టినట్టిసల్ కాంచి కాంచి
నారసింహ యటంచుఁ బల్కుచుఁ బిల్చు.” 131

ఆళ్వారునాయకి భక్తి పరవశయై దైవమును ప్రత్యక్షము చేసికొనుటకై విసుగులేక నాట్యమాడినది. హృదయము కరగున ట్లాతని కథలు పాటలుగా పాడిపాడి యలసిపోయినది. అత డెంతసేపటివరకును రానందున కన్నీ రప్రయత్నముగా జాలువారగా దశదిశలు పరికించి ‘ఎందుంటివి నారసింహా!’ యని పలుమారు పిలిచినది.

గీ.“లక్కయును మైనమును నగ్గి ప్రక్కనున్న
కరణి ఖిన్నమనస్సునఁ గరగె నీమె
కరుణఁ జేయవు రావణాసురపురారి!
యేమి సాధన మింక నేను నేమిఁ సేతు?” 133

లక్కయు మైనమును నగ్నిస్పర్శచే కరగి పోవునట్లే యీమె గూడ భగవంతుని తలపగనే - అతని నామము చెవిని పడగనే - ద్రవించిపోవును.

గీ.“చపలబాలిక యీపె! విశాలలోల
నేత్రములనుండి బొటబొట నీరు కారు
నిహతలంకేశ! యీ యేణనేత్ర కింక
దృష్టిసౌందర్యమును వాడనీయకయ్య!” 440

వియోగతాపతప్తయైన ఈమె కనులనుండి దుఃఖాశ్రువు లెడతెగక స్రవించినందున యీ నాయకి నేత్రసౌందర్యము దెబ్బతినునో యేమో గదా! శ్రీరఘురామా, అట్లు జరుగనీయకుమా, నీకు పుణ్యముండును.

మ.“కనులం గ్రూరుకు రేఁబవ ల్గనదు కైఁగన్నీళ్ళుజల్లున్ నమ
స్సునఁ గావించును సంకు, చక్రమని యేడ్చున్ గుండుఁ గెందామరల్
కనులంచు న్నిను వీడలే నని క్షితిఁ గైనంటు శ్రీరంగ భూ
మిని వీనాంచితనీరసీమ మనుసామీ! యీమె కేమయ్యెడున్?” 611

ఈమె రాత్రింబవళ్ళు నిద్రకు మొగము వాచినది. కన్నీటితోనే చేతులు కడిగికొనుచు విష్ణువు ధరించు శంఖ చక్రములకై పరితపించును. “కృష్ణా, నిన్ను వీడలే”నని కుందుచుండును. శ్రీరంగనాథా, ఈమెగతి ఏమి కానున్నదో గదా!

సీ. "మల్లికా గంధిలమలయగంధవహంబు
చెలరేఁగి ననుఁబట్టి చీల్చసాగె,
నందమైన 'కురంజి' యనెడు స్త్రీరాగంబు
వినవచ్చె, నస్తంగతుని విభాను
గొనిన సంధ్యాకాలమును భ్రమింపఁగఁ జేసె;
నరుణాభ్రరుచిజాల మడలు పెట్టె,
ఫుల్లమనోహరపుండరీకాక్షుండు
మనసామి వల్లవజనవృషభుఁడు

తే. సింహగమనుండు మాయుండు చిక్క బట్టు
కొని పరీరంభ మొనరించుకొనిన స్తనభు
జములఁ గొంపోయి యొంటిగా సాగి మనము
చేరుకొను తాన మెందేని నేర మకట. 881

మల్లెపూల సువాసనలతో గుబాళించు మలయవాయువు నన్ను పట్టుకొని చీల్చివేయుచున్నది. కురంజి యను రాగము శ్రవణ గోచర మగుచున్నది. సూర్యుని మ్రింగిన సాయంసంధ్య నాకు మోహము కల్గించుచున్నది. ఆకాశమెఱ్ఱవడుట చూచి నా మనస్సు గూడ ప్రియాను రాగరక్త మగుచున్నది. వికసన్నవపద్మదళాక్షుడును, మన వల్లవీపల్లవుడు నునగు మాయకృష్ణుడు వచ్చి ఊపిరాడకుండ బిగికౌగిట జేర్చిన స్తనము లను భుజములను కల్గియుండికూడ కాంతుడులేని నే నెట్లీ యేకాంతము గడుపుదును? అయ్యో! ఎందు జొత్తును!

సీ. "ఉత్తరపవనంబు లుల్లమందునఁ జొచ్చి
విచ్చెడి నే నెంత విగతభాగ్య;
నకట! చల్లని యుత్తరాశానిలంబులె
మండెడి గాడ్పులై యుండసాగె;
నాశింపఁ దగు చల్లనైన జాబిల్లియె
వేడిమిఁ గల చంద్రబింబ మయ్యె!
నతిమృదు కుసుమశయ్యయె నాకు వేడెక్కె;
పొలువు రెక్కలు గల పుల్గుతేని

గీ. తేజిఁగొను విష్ణుదేవుఁడన్ దేఁటి తినగ
నాదు స్త్రీత్వసువంబు జీర్ణత్వ మొందె;
వగలడంగక నాత్మలోఁ బొగులుకొనియె
సాయ మింతయు నా మన సీయకుండె. 841

ఉత్తరవాయువు నా గుండెలనే చీల్చివేయుచున్నది. అయ్యో, నే నెంత దౌర్భాగ్యురాలను! దక్షిణమారుతమే నా పాలిటికి వడగాడ్పయి నది. చల్లని వెన్నెలలు గురియు నెలరాజే సలసల క్రాగుచున్న యినుపగుండువలె న న్నిట్లు వేపుచున్నాడు గదా! మెత్తని పూలపాన్పే నా కిపుడు వేడి కల్గించుచున్నది. చక్కని ఱెక్కలుగల గరుడుని వాహనముగా దాల్చిన విష్ణు వను తుమ్మెద యనుభవింపగా నా స్త్రీత్వమను పుష్పము జీర్ణమయిపోయినది. నా మనస్సు పూర్తిగా నా వశముతప్పినది. అయ్యో, నే నేమి సేతును?

తనపై నాయికాభావ మారోపించుకొని భర్తయగు శ్రీమన్నారాయణునితో నైక్యమందుటకు తహతహలాడిన యీ వకుళభూషణ నాయకియొక్క భక్తిరసమెంత సుపరిపుష్టముగా నీ సరసకవితాసంహితలో నిరూపితమైనదో తలచుకొన్న మన యొడలు పులకరింపకమానునా?

## సందేశము

మ."హరికంటెన్ బరమై శరణ్యమిఁక లేదంచున్ నిరూపింప, భూ
భరమున్ మాన్పగ నుత్తరంపు మధురన్ బ్రాపించి తాఁ బుట్టె మీ
సిరి; 'కృష్ణార్పణమస్తు' టంచుఁగని యుజ్జీవింపు డీ, నందియుం
బొరయుంబోకుఁడి వాని యర్థములె కావో? యన్ని; లే వన్యముల్."
810

ఈ ఆళ్వార్లు జీవుడు దేవుని చేరుటయే సర్వదుఃఖనివారణోపాయమని తేల్చి చెప్పినారు. అడుగడుగునను ఇది మనకు వీరి కావ్యముల ద్వారా సువ్యక్త మగుచునే యుండును.

సామవేదసారమగు చివరి గ్రంథమునకే వీరి కృతులలో ప్రాముఖ్యము గలదు. మోక్షమార్గము నరచేత నరటి పండొలిచి యిడినట్లు సులభముగా చూపును గాన దీనికి చరమప్రబంధమను పేరు ప్రసిద్ధమయినది.

గీ.అశ్రమమహోన్నతానందు నజ్ఞజన వి
వేకదాత స్థిరజ్ఞామరైక నేత
భాసురంబును దుఃఖనివారణమగు
పదమె యాశ్రయ మని పట్టి బ్రతుకు మనస!

ఓ మనసా! ఎక్కువ శ్రమపడకుండగనే మహోన్నత బ్రహ్మానంద మిచ్చునట్టి, అజ్ఞానులకు వివేకమిచ్చునట్టి, స్థిరజ్ఞానులగు అమరులకు గూడ రక్షకుడైనట్టి, సకల దుఃఖనివారకుడైనట్టి ఆ శ్రీమన్నారాయణుని పదపద్మములనే రక్షకముగా తలచి బహుళదుఃఖప్రదమగు నీ జీవితము నెట్టెటో గడపుకొనుము!

నేను నాది అను భావము మొదలంట బెరికివేసి విశ్వేశ్వరు నాశ్రయింపుడు. ఆత్మ లన్నిటికిని ఆత్మ కాననే అతడు విశ్వాత్ముడు. అతడే మీకు మేలు కలిగింప గలడు—

క. "మీరలు మీయది యనునది
వేఱు మొదలు నూడఁబెరికి విశ్వేశ్వరునిన్
జేరుఁడీ, ఆత్మల కంతకు
మీరిన యాధిక్య మేది? మేలొడఁగూర్చున్." 13

త్రికరణములను మొదటినుండి స్వాధీనముచేసుకొన్నచో నీ స్వామిని తప్పక చేరుకొనగలవు—

క. "మనసును, వాకును, కాయము
ననఁబడు మూడింటి వితము నారసి వీనిన్,
మునుమున్నె లొంగఁబఱచి
కొనుమా! నీ సామిఁ జేరికొనుమా వినతిన్." 20

భక్తుడగువా డనన్యమైన భగవత్ప్రేమను తైలధారవలె నెడతెగక నా విశ్వేశునిపై ప్రవహింపజేయుచునే యుండును. మన కరచరణాద్యవయవములను భగవత్కైంకర్య మను సత్కార్యమునందు గట్టిగా లగ్నముచేయవలెను. ఈ భావము నీ కవి యెంత నిష్కర్షగా చెప్పినారో!

గీ. "పట్టు విడుపును లేని యా పరమపురుషు
పజ్జఁ బాయదు మనసు; తద్భజన మెపుడు
చేయుచుండును జిహ్విక; కాయమును ప
రవశతను బొంది లేచి నర్తనము సేయు." 53

దీనినే వేర్వేరు కవు లెట్లు చిత్రించినారో చూతము.

శ్రీ కులశేఖరులు--

జిహ్వే కీర్తయ కేశవం; మురరిపుం చేతో భజ; శ్రీధరం
పాణిద్వంద్వ సమర్చయాచ్యుతకథాః శ్రోత్రద్వయ త్వం శృణు;
కృష్ణం లోకయ లోచనద్వయ, హరే ర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం,
జిఘ్ర ఘ్రాణ, ముకుందపాదతులసీం మూర్ధన్నమాధోక్షజమ్.

బమ్మెరపోతన--

చ. "హరి భజియించు హస్తములు హస్తము, లచ్యుతుఁ జేరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు, చక్రధరుఁ జేరెడు చిత్తము చిత్త, మిందిరా
వరుఁ గను దృష్టి దృష్టి, మురవైరి నుతించెడు వాణి వాణి, య
క్షరుకథ లాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁ బో భువిన్!"

కాసుల పురుషోత్తమకవి--

ప. "హరి భజియింతునే, నహరహంబు హరి న్నుతియింతు భక్తితో,
హరికి సపర్య సేతు హరి కంజలు లిత్తు మనోహరంబుగా,
హరిసరియైన దేవత యజాండమున న్నహి యంచు నెంచ శ్రీ
హరిపురిఁ జేరవచ్చు మనసా! హరిపాదము లాశ్రయింపుమా."

శ్రీమన్నారాయణస్వామి తన్ను నమ్మికొల్చిన వారికి సర్వసౌఖ్యములను అనుగ్రహించి ఇక వానిని వదలకుండ కాపాడును సుమండీ--

శా. "కన్నుందమ్ములనుండి సమ్మదమునం గన్నీరునుం గాఱు శ్రీ
మన్నారాయణదివ్యనామ మది యేమాత్రంబు విన్పించినన్
మన్నాథుం దరిసించి చేరునెడ ప్రేమంజేర్చి రేయింబవల్
నన్నున్నన్నఁన్నఁజేయునమ్మి విడఁడేనాఁ డేమి యాశ్చర్యమో."

ఇందు గలఁ డందు లేఁడని
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలఁడు; దానవాగ్రణి, వింటే!

అను నీ భాగవతసూక్తికి జోడైన భావన యాళ్వారుల కావ్యమున గని పులకితులు కండు---

మ. "కలఁడెచ్చో హరి యన్న పిన్నుడువుల్ ఖండించి యిచ్చోటనుర్
గలఁడా? యంచునుఁ గంబమున్ విఱువ నక్కంబంబునం బుట్టి ని
స్తులరోషాప్తి హిరణ్యు జక్కడఁచెఁదోడ్తో మా నృసింహుండు, త
ద్బలమాహాత్మ్యము లాను కాదనుచు వాదా? యెంత హాస్యంబగున్!"

ఒక యర్చకుని మాట ననుసరించి స్తంభమున నుద్భవించి దుర్గ్గుణాకరుడగు హిరణ్యకశిపుని వధించిన శ్రీలక్ష్మీనరసింహస్వామి భక్తుల సంకటముల నెందుకు తీర్పడు?

శత్రువులు నవ్వగా, బంధువు లేడ్వగా సర్వదుఃఖములు కల్గించు లౌకికవ్యవహారము లిక మేము చేయలేము స్వామీ! నీ పాదారవిందములను చేర్చునట్టి మృత్యువునే మా కనుగ్రహింపుము—

ఉ."గొంగలు నవ్వ, బందుగులు గొల్లున నేడ్వ, నచింత్యదుఃఖ మె
ల్లం గలిగించు లౌకికకలాపము లేల కృపాళు మాకు, ను
త్తుంగతరంగ సంకలితతోయధిమంథన! నీ పదంబె చే
ర్పం గల మృత్యువుం గను నుపాయము నా కెఱిఁగింపు సత్వరా."
381

భాగవతోత్తములలోనే భగవంతు డుండును. అతని యస్తిత్వము వేరుగా లేదు. అట్టి శ్రీహరిచరస్వరూపులగు భక్తులను కాంచగనే మన పాపములు పటాపంచలయిపోయినవి. కలిదోషములు హరించినవి. ఇక యముని క్రూరకార్యకలాపములు మూలపడినట్లే. ఎటు చూచినను హరిభక్తిసామ్రాజ్యమే వృద్ధిచెందగలదు.

ఉ.అంబుధివర్ణుదాసు లిల యంతట దిర్గుచు పాడి యాడి స్వే
చ్ఛం బచరింపఁ గంటి, విహ జీవుల పాపము మాసెఁ, బాసె ఘో
రం బగు నారకంబు, కలి గ్రున్ననె, న య్యమధర్మరాజు బా
ఱింబడు వారె లే రిఁక; నవృద్ధి నమృద్ధి నమృద్ధి కావుతా."

"కలౌ స్మరణాన్ముక్తిః" అన్నారు గదా! ఆ రీతిగా కలిదోషములు నశించుటకు కృతయుగమే ఈ భువిపై కవతరించినట్లు, పరమపదము నుండి నిత్యసూరు లను పేరుగల భక్తులే ఈ యిలపై కవతరించినట్లు, సముద్రమువలె పొంగి ముందుకు సాగి వచ్చుచున్న శ్రీపతిభక్తులు తమ సామగానముతో ఆ శ్రీహరిని పాడుచు యావత్ప్రపంచమును విపదంబుధిని మగ్నము కాకుండ కాపాడుదురు గాక. మీరంద రా భాగవతోత్తముల నాశ్రయించి తరింతురు గాక యను మహాసందేశము నాళ్వారులు మనకు పైపద్యమున ననుగ్రహించుచున్నారు.

భార్యాపుత్రులు, ఆప్తులు, బంధువులు మొదలగు వారందరును మన వద్ద ధన మున్నంతవరకే యీగలవలె చుట్టును మూగుదురు. ఎట్టి

మాయోపాయముల నయినను మనపై ప్రయోగించుటకు వెనుదీయక దానిని మన చేతులనుండి సంగ్రహించి ఎక్కడవా రక్కడకే తొలగి పోదురు. కాన పైజెప్పిన బంధువులు మొదలగు వారిపై ప్రేమ వదలి దశ దిశలందును వ్యాపించియుండి యన్నింటిని తనయందే లయము చేసికొను సర్వేశ్వరుని భజించుట తప్ప మీకు వేరు దిక్కేదియు లేదు సుమండీ---'

మ. కొనఁ బెండ్లాములు బిడ్డ లాప్తులునుఁ దక్కుంగల్గుఁ జుట్టాలుఁగ
న్గొను నల్లప్పుడె కూర్తు, రొండపుడు పొందుల్ జార్తు, రష్టాశలం
దును క్రిందన్ బయినున్న యన్నిఁ దనయందున్ బొందు సర్వేశు భ
క్తిని జీవించుట తక్క దిక్కు మరి యేది? మీకు లేదే సుఁడీ. 801

భార్యలు మనలను రక్షించుటకై వచ్చినట్లు నటింతురు. చేతికే మైన చిక్కు నవకాశము కనుపించిన జెలగలవలె పట్టుకొని పీల్చి పిప్పి చేయుటకుగూడ వెనుకాడరు. ఒక్క యమ్ముతో సప్తసాలములను పడ గొట్టిన నీలమేఘునిభాంగుడగు మన శ్రీకృష్ణనే సర్వరక్షకుడుగా తలచి కొలిచి మనుడు. తక్కిన బంధము లన్నియు బూటకములు.

మ. "చెలులున్ రక్షకులట్లు పట్టుకొనుచున్ చేఁజిక్కు మేలున్న చో
జెలగల్ వోలిక జ్ఞాతి బంధువులు పైసాఁ బీల్తు; రేకాస్త్రని
ర్దలితోత్పాటితసప్తసాలు, మన యుట్రశ్యాముసే నేతగా
గొలువం బూని మనుండు తక్కునవి బొంకుల్ వ్యర్థసంబంధముల్." 802

తామేమో పెద్ద వ్యవహారదక్షు లయినట్లును, పురుషులు తెలివిత క్కువ దద్దమ్మ లయినట్లును స్త్రీలు తలతురు. అట్టివారి మోహ జాలమున చిక్కుకొని కృత్రిమభోగాదుల ననుభవించువారు తర్వాత ఘోరనరక యాతనలను గూడ ననుభవింపకమానరు. కాన క్రూరరాక్ష సుల నణచి లోకసంగ్రహము చేసిన శ్రీకృష్ణనే యా రాక్షసులను మించిన మీ యరిషడ్వర్గమును చీల్చి చెండాడు మని ప్రార్థించి శరణు వేడుడు. అంతకంటె సుఖమందుటకు మీకు మార్గాంతరము లేదు.

మ. తమ కార్యజ్ఞతఁ దామె మెచ్చికొని పొంతన్ దేనియల్ చిల్కు వా
క్యములన్ బల్కెడు స్త్రీలతో మధురభోగంబందువా రాద ట
న్యమునుం గందురు; భీకరాసురులఁ జెండన్ బుట్టు శ్రీకృష్ణ దా
స్యముఁ జేపట్టి మనుండు, లేదు సుఖమన్యం బంతకన్నన్ జుఁడీ. 805

మ. కులముల్ నాల్గిటి కంటె హీను లవిపేకుల్ చండచండాల జా
తులవారైన, సుదర్శనాంచితభుజన్ ద్వోతేంద్రనీలాంగుదా
సుల మంచున్ మది నమ్మిరేని, యులదాసుల్, వారి సేవించు దా
సులునున్ వారల దాసులు న్మనకుఁ బూజ్యుల్ స్వాములున్ నిచ్చలున్.
269

చతుర్వర్ణములకు గూడ జెందనివారైన చండాలురు గూడ హరిపాదసేవ నవిచ్ఛిన్నముగా జేయకల్గియుండినచో నట్టివారికి దాసానుదానుల మగుటయే మన కర్తవ్య మను నీ భావ మెంత మధురము!

శ్రీహరికంటె రక్షకుడు మరొకరు లేరు. భూభారము మాన్పుటకే అత డవతరించినాడు అని నిరూపించుటకు మీ పుణ్యముపండి ఉత్తరమథురానగరిలో నాత డవతరించినాడు. కాన నిక ముందు మీ రేపనిచేసినను "సర్వం శ్రీకృష్ణార్పణమస్తు" అని పల్కి ఫలాపేక్షవదలి శ్రీకృష్ణునికి దానిని ధారపోయుడు. సందియ మందనేల? ఈ కనుపడునవన్నియు వానికి చెందినవే. ఇతరులకు వీనితో నెంత మాత్రమును సంబంధము లేదు.

## కణ్ణినుణ్ శిరుత్తాంబు

ఆచార్య స్స హరి స్సాక్షాత్ చరరూపీ న సంశయః,
మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యా చ్ఛాస్త్రపాణినా.

మూర్తీభవించి సంచరించు శ్రీమహావిష్ణువే ఆచార్యుడు. అజ్ఞానాంధకారమగ్నమగు జీవకోటికి తన యాచరణ యను పవిత్రకరావలంబనము ననుగ్రహించి వారికి జ్ఞానోపదేశ మాయన చేయును. శ్రీమహావిష్ణువే ఆచార్యుడై అవతరించి జీవుల నుద్ధరించును. ఈ చిన్నకావ్యము గురుభక్తి బోధకము. ఇది మిగుల చిన్నదియు మహత్తరమును గాన తెలుగున దీని యనువాదము నందించుచున్నాను. ద్రవిడము నందువలె దీనిని కూడ నంతాది క్రమమున పరమమధురముగా రచించిన "సంగీతసాహిత్యకళానిధి" శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగా రీ సందర్భమున మన కభినందనీయులు!

'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అనగా ముళ్ళుగల సన్నని చిన్న కన్నె త్రాడు అని అర్థము. వేదాంతవాక్యములచే గూడ ననిర్వచనీయుడగు

నా కృష్ణుడు తల్లిచేతబట్టుకొన్న చిన్న ముళ్ళత్రాటితోనే కట్టబడెను గదా! అట్లే భక్తులయిన వా రెట్టి పరుషవాక్కులతో నుతించినను ఆశ్రితజనరక్షాదీక్షితుడగు నా శ్రీహరి వారియెడ తప్పక ప్రసన్నుడయి తీరుననుటయే దీనిచే ప్రతిపాదింపబడు మహార్థము. కాని యా దేవుడు గూడ సదాచార్యుని ద్వారా సమాశ్రయించిననే గాని మనకు సులభుడు కాజాలడని గూడ నిందార్థము గర్భితము.

గీ. వాంఛఁ జిఱుత్రాటిచేఁ గట్టువడిన పెద్ద
మాయకాఁడగు నాప్రభు మాటకన్నఁ,
గురుక కధ్యక్షుఁడగు శఠకోపు స్మరణ
నొల్కు నమృతంబు రుచియించు నాల్క కెపుడు. 1

గీ. నాల్క నిండారఁ బాడి యానంద మంది
తిని, దదంఘ్ర్యబ్జములు పట్టితివి, దదన్య
దేవు నెఱుఁగను, శఠకోపదివ్యగీత
సరసగానమ్ము సేయుచు దిరుగుచుందు. 2

గీ. తిరిగి దేవాధిదేవు సుందరవినీల
శోభ మీఱెడు నెమ్మేనుఁ జూడఁ గంటి;
నహహ! సముదారుఁడౌ కురుకాధినాథు
దాస్యమున భాగ్య మిద్ధి లబ్ధమ్ము నాకు. 3

గీ. నాదు నైచ్యముఁ జిత్తమునం దలంచి
తల్లియై తండ్రియై కొఱంతలను బాపి
ప్రోచు గుణపూర్ణుఁ డామ్నా యములకుఁ జిక్క
కెల్లఁదీసిన శఠవైరియే ప్రభుండు. 4

గీ. ప్రభుని సొత్తగు నాత్మ నా వశ మటంచు
నమ్మి మున్నంతయుఁ బరాంగనలను గోరి
యుంటి, బంగరుమేడల నొప్ప, కురుక
యధిపు సేవ సమర్థుఁడ నైతి నింక. 5

గీ. ఇంత నె క్కాలమును స్థిరవృత్తిఁ దనదు
భవ్యగుణములు వొగడెడి భాగ్య మిడెను,
పర్వతోత్తుంగ సౌధాళిఁ, బరగు కురుక
పతి యిఁకెన్నఁడు నన్ విడువండు కనుఁడు! 6

గీ. కవినమం గారితనయుండు కరుణ నా పు
రార్థితోరుతరాఘము లణఁచినాఁడు
చాటెదను గాక యెల్ల దిశలను దెలియ
ద్రవిడకవి నేత శ్రీ శఠారాతి కరుణ. 7

గీ.కరుణఁ గొనియాడు దాసనికరము కరము
హర్షమందఁగ వేదరహస్యములను
ద్రావిడమ్మున వేయిగీతములఁ దెల్పి
నతని కృప యి జ్జగమున నాఢ్యమ్ముచాల. 8

గీ.చాల మోక్షార్థులకు వేదసారములను
బాడి, నా మనమున స్థిరపఱిచినాఁడు;
గుణగరిష్ఠుఁడు శఠకోపగురునిఁ బ్రేమ
నాశ్రయించినదాని కియ్యది ఫలమ్ము 9

గీ.ఫలము లేకున్న, విముఖులౌ వారినైన
చర్యలను దిద్ది సుముఖులఁ జల్పు పికర
వాంచితారామయుత కురుకాధినాథ!
నీ పదమ్ముల నర్థింతు నేను బ్రీతి. 10

గీ.ప్రీతి హరిఁ గొల్చుచుండువారి పయి నెంతొ
వత్సలుండగు కురుకాధిపతికి దాసు
డై మధురకవి సెప్పిన యర్థములను
నమ్మువారికి పరమపదమ్ముపదము! 11

## విష్ణు సాయుజ్యము

ముక్త్వోర్వీ ర్దినపూర్వపక్ష షడుదఙ్మాసార్ద వాతాంశుమత్
గ్లౌ విద్యుద్వరుణేంద్రధాతృ మహితః సీమాంతసింధ్వాప్లుతః,
శ్రీవైకుంఠ ముపేత్య నిత్య మజడం తస్మిన్ పరబ్రహ్మణః
సాయుజ్యం సమవాప్య నందతి సమం తేనైవ ధన్యః పుమాన్.

ఈ విధముగా నాచార్య ప్రపత్తిని పొగడి గురుచరణము లందే సర్వభారము నుంచి మధురకవి కాలము పుచ్చసాగెను. పరాంకుశమునియును ముప్పదియైదేం డ్లాపరమాత్మను పాడి పాడి యీ యిహలోకమునే కలియుగ వైకుంఠము చేయుటకు పాటు పడిపడి యిక భగవద్విరహము సైరింపలేక వైకుంఠధామముచేరి శ్రీమన్నారాయణుని సాయుజ్యరూప మోక్షము నందిరి.

తన యాచార్యుడు పరమపదముచేరుట మధురకవికి చాల బాధ కల్గించెను. వకుళభూషణభాస్కరాస్తమయముచే కురుకానగరమేకాక యిహలోక మంతయు నంధకారబంధురమయ్యెను. తన జీవితశేషము నెట్లో గడుపకతప్పదుకాన మధురకవి ఆళ్వారు లా చింతచెట్టుకు సమీ

పమునసే తన యాచార్యులగు వకుళభూషణుల కొక యాలయము నిర్మించెను. అందు వారి యర్చామూర్తిని ప్రతిష్ఠించి నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవాదులతో కొంతకాలము పూజించి తానుకూడ కాల క్రమమున శ్రీమహావిష్ణువు పాదారవిందములందైక్యమగుటకు శరీరము చాలించి పరమపదము చేరనరిగెను.

తిలకమాహ న కాచిదపి శ్రుతా
త్రిజగతాం మృగశీర్షసముద్భవా,
స్ఫుటతరం వకుళాభరణీయవాక్
పురుష మాది మశేషవదై రపి.

పిత్రాది స్వకలవిధోఽపి బంధువర్గో
యస్యాసీ త్సరసిజవాసినీ సహాయః,
అవిన్యు ర్ఘనకరుణారసావసేకై
రార్ద్రా మే వకుళభృతః కటాక్షపాతాః.

* * *

# VI విష్ణుచిత్తులు [పెరియాళ్వార్]

"జ్యేష్ఠాస్వాతిభవం విష్ణురథాంశం ధన్వినః పురే,
ప్రపద్యే శ్వశురం విష్ణో ర్విష్ణుచిత్తం పురశ్శిఖమ్."

"గురుముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషాన్
నరపతిపరిక్లృప్తం శుల్క మాదాతుకామః,
శ్వశుర మమరవంద్యం రంగనాథస్య సాక్షాత్
ద్విజకులతిలకం తం విష్ణుచిత్తం నమామి."

దక్షిణదేశమున పాండ్యరాజ్యము సుప్రసిద్ధము. పాడిపంటలకును, భోగభాగ్యములకును, సిరిసంపదలకును నెలవయిన యా రాజ్యమున ధన్వినవ్యపుర మందమయిన నగరము. దానికి శ్రీవిల్లిపుత్తూరని వ్యవహారనామము. శ్రీమహావిష్ణువునకు పరమానందకరమగు నా పుణ్యతీర్థము త్రిలోకవిశ్రుతము.

"క్షీరాబ్దివాసం స విహాయ భూమ్యాం
తత్రావిరాసీ ద్వటపత్రశాయీ,
సంరక్షణార్థం భగవాన్ముకుంద-
స్తత్రాగతా స్సప్త మహార్ణవాశ్చ."

"బ్రహ్మాదయ స్సర్వసురాసురేంద్రా
వాణీముఖా స్సర్వసురస్త్రియశ్చ
సేవార్థ మేతే నివసంతి విష్ణో-
ర్దేవర్షయ స్తత్ర చ నారదాద్యాః."

ప్రళయకాలమున పాలసముద్రమున మఱ్ఱియాకుపై నొంటరిగా బండుకొని యున్న చిన్నికృష్ణు డచ్చట నేమియు తోచక ఈ నగరమునకు విచ్చేసినాడు. ఈ పట్టణస్వామి దేవాధిదేవు డా బాలకృష్ణుడే. ఆ సప్తసాగరములే యిట సప్తసాగర సరోవరమయినవి. బ్రహ్మరుద్రాదులగు దేవతలు నారదాది మహర్షులు గూడ నీ స్వామిని సేవించుట కిచట నిత్యనివాస మేర్పరచుకొన్నారు.

ఆ నగరమున ముకుందార్యు డను బ్రాహ్మణోత్తముడు కలడు. ఆయన యిల్లాలు పద్మావతీదేవి. చిరకాలము వారికి బిడ్డలు లేరు. సంతానలాభమునకై యా జాయాపతులు పలుతీతులుగా వటపత్రశాయిని

ప్రార్థించిరి. ఎట్టకేలకు వారి కోరికలు ఫలించెను. ఆ దంపతులకు క్రీ. శ. 725 వ సంవత్సరమున క్రోధనవర్ష జ్యేష్ఠమాసమున స్వాతీనక్షత్ర యుక్త భానువారమున నొక పురుషశిశు వుదయించెను. గరుత్మంతుని యంశమున జన్మించిన యీ శిశువునకు—సదా విష్ణువునే మనమున మననము చేయువాడయినందున విష్ణుచిత్తు డని నామకరణము చేసిరి. పెద్దయైన తరువాత ఆయనకు పెరియాళ్వా రని భట్టనాథులని గూడ పేర్లు రూఢ మాయెను. ద్విజోచిత సంస్కారము లాయన యథాకాల మున నందెను.

ప్రహ్లాదునివలెనే పెరియాళ్వారు గూడ బాల్యమునుండి భగవన్నా మమునే ధారకపోషకభోగ్యములుగా భావించువారు. భాగవతమున చెప్ప బడిన—

క.“తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్,
వందనార్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్
చింతనం”

—బను నవవిధభక్తులును కలియుగమున మరొక వ్యక్తి లేనందున నా భక్తవరునే యాశ్రయించినవా యనునట్లుగా నా మహాయోగి విష్ణుసేవానిరతి యొప్పారెను. భగవంతుని దశావతారములలో నేది సర్వజనసులభమయినందున యారాధనీయమా యను శంక చిరకాల మా భక్తుని వదలలేదు. వా రీవిధముగ మనసులో ననుకొనిరి.

ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః,
నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మథురాం పురీమ్.

“వటపత్రశాయి క్షీరసాగరమున నాగపర్యంకము నుజ్జగించి ఉత్తర మథుర కధిపతియగు శ్రీకృష్ణుడుగా నవతరించినాడు. ఆతడు నందగో కులమున గోపగోపీజనమధ్యమున తాను గూడ నొకడుగా కలసిమెలసి తిరుగుట భక్తజనసులభుడు కాగోరియే గదా! వెన్న తిన్నా డని యిత రులు చెప్పిన కొండెములు వినివిని వారి పోట్లు పడలేక చివరకు తెచ్చికోలు కోపముతో తల్లి యశోద యాతని ఱోట గట్టెను గదా! తత్ప్రతీకారకాంక్షియై తుంటరి కృష్ణుడు యమునానదిలో దూకి క్రూర కాళీయాహివిషపు కోరలకు జిక్కగా నా తల్లి “అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయం” అను భవభూతినానుడిని జ్ఞప్తికి తెచ్చుచు శిలలు కరగు నట్లుగా నెంతో విలపించినది గదా!”

ఈ దుస్సంఘటనను తనమానసాదర్శమున భావించుకొని శ్రీవిష్ణు చిత్తుల హృదయ మెట్లు కోప భయ హర్ష జుగుప్సాదిభావ సంచార శబలిత మయ్యెనో యెట్లు వర్ణింపనగును!

వా రింకను నిట్లు తలపోసిరి—"భక్తులకై యాతడెన్నో బాధ లను భవించినాడు. అయినను నీ నాటికిని మథురా ప్రాంతము నాతడు వీడలేకున్నాడు.

అట్టి శ్రీకృష్ణుని తన కుసుమదామముచే బంధింపగల్గిన కంసదాసుడు సుదాము డెంత ధన్యజీవియో గదా! శిష్టజనుల ననేకరీతులుగా పీడించుచున్న కంసుని మేనమామ యని యైనను కనికరింపక సంహరించుటకే యా భక్తజనపరాధీనుడు సిద్ధపడెను. ఇంతలో ధనుర్యాగము చూడరమ్మని కంసుడు పిలిచినాడని యక్రూరుడు గోకులమున కేతెంచి కబురు చెప్పెను. ఇక నేమి, ఆడబోయిన తీర్థ మెదు రయినట్లు కృష్ణుని రొట్టె విరిగి నేతిలో పడినది. దుష్టకంసవధార్థమై యాతని భుజము లుప్పొంగెను. కంసుని హతమార్ప నదను దొరికినది గదా యని కృష్ణ బలరాము లక్రూరుని వెంట బైలుదేరిరి. మథురను వారు ప్రవేశింపగనే కంసుని సేవకుడు సుదాముడను మాలాకారుడు---

"అద్య మే సఫలం జన్మ సుప్రభాతా చ మే నిశా."

—"స్వామీ, నేటికి గదా నా జన్మము సఫలమయినది. ఈ దినము సుప్రభాత మని పలికి కంసునకు తా సీయవలసిన వివిధ పరిమళవిలసితసుమనోమాల నా నీలఘనశ్యామునకు సమర్పించి యర్చించి కృతార్థుడైనాడు కదా! కాన మాలాకరణముతో నీ వటపత్రశాయియగు శ్రీకృష్ణు నర్చించుటను మించిన భగవత్కైంకర్య మితర మేమి గలదు!"

ఈ రీతిని మనమున ఘనముగా నిశ్చయించినవారై పెరియాళ్వారు తమ నగరిలో వడపెరుంగోయిలుడయాన్ నామాంతరముతో నొప్పారు వటపత్రశాయికి తులసీ పుష్పమాలాకైంకర్యము చేయసాగిరి. మాలాకైంకర్యముతోబాటా భక్తవరుడు భాగవతతదీయారాధనలో నెట్లు నిమగ్నులయి యుండువారో శ్రీకృష్ణరాయ కవిశిరోమణియొక్క యీ పద్యమణి తెలుపును—

"ఆ నిష్ఠానిధి గేహసీమ నడుమే యాలించినన్ మ్రోయు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలున్, దివ్యప్రబంధానుసం
ధాన ధ్వానము, నాస్తి, శాకబహుతా, నాస్త్యుష్ణతా, నాస్త్యపూ
పో, నాస్త్యోదనసౌష్ఠవం చ కృపయా భోక్తవ్యమన్ పల్కులున్."

## పాండ్యరాజు

విల్లిపుత్తూరుకు పదిమైళ్ళ దూరమున పాండ్యరాజధాని మధురా నగరి కలదు. గోపీమానసచోరుడును భక్తపారిజాతమును నగు శ్రీకృష్ణున కుత్తరమధుర విహారభూమి కాగా నీ మధుర సర్వవిద్యాకేంద్రమై సకలకళారంగస్థలమై ప్రాచీన దాక్షిణాత్యశిల్పముల కాలవాలమై వాపీకూపతటాకాదులచే సుమనోహరమై గిరినదీ పుష్పితారామాదిపరిపుష్టమై ప్రకృతిసౌందర్యమునకు పట్టుగొమ్మయై విరాజిల్లిన సువిశాల నగరరాజము.

వల్లభదేవుడను రాజా మధురానగరిని రాజధానిగా చేసుకొని పాండ్యరాజ్యమును పరిపాలించుచుండెను. ప్రజలను బిడ్డలవలె చూచుకొనునా రాజన్యుడు ధర్మప్రభువని కీర్తింపబడుటలో నబ్బుర మేమి! ప్రజలకష్టనిష్ఠురముల నరసి తన రాజ్యవ్యవస్థయందలి లోటుపాటులను సరిదిద్దుకొనుట కా రాజు మారువేషముతో రాత్రులందు తన పట్టణమున సంచరించువాడు.

ఒకనాటి రే యా ఱేడు ఛద్మవేషధారియై బ్రాహ్మణవీథిలో నేగుచుండెను. ఒక యింటియరుగుపై నాగంతుకు డొక డొంటరిగా శయనించి యుండెను. రాజాయన వద్ద కరిగి "మీ రెవరు? ఏమి పనికై యిటకు విచ్చేసితిరి? అభ్యంతరము లేనిచో చెప్పవేడెద" నని యడిగెను. "ఆర్యా, నేను ద్విజుడను. తీర్థయాత్రాపరుడనై కాశీగంగలో స్నానమాడి సేతుదర్శనమున కేగుచున్నా" నని యాతడు సమాధానమిచ్చెను. మరల నా రా జిట్లు పలికెను. "ద్విజోత్తమా, పుణ్యతీర్థము లనేకములందు గ్రుంకులిడి దైవసందర్శనముచే ధన్యజీవు లయిన మిమ్ములను దర్శింపగల్గిన నా పాపపటలి యిపుడే పటాపంచలయినది. ఏదైన మంచి పద్యము వినిపించి నన్ను కృతార్థుని చేయుడు." ఇది విని యా బ్రాహ్మణుడు తన మధురకంఠముతో భావస్ఫోరకముగా నీ శ్లోకము చదివెను.

వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్ నిశార్థ మర్థం దివసం యతేత,
వార్ధక్యహేతో ర్వయసా నవేన, పరత్ర హేతో రిహ జన్మనా చ.

వర్షాకాలమున కవసరమగు పదార్థజాతమును మిగిలిన యెనిమిది మాసములందును మానవుడు కష్టపడి సేకరించి యుంచుకొనవలెను. రాత్రికి కావలసిన వస్తువులు పగలే సంపాదింపవలెను. ముదిమి మీదపడినప్పు డవసరమగు వస్తువులను ధాన్యాదులను పడుచుదనముననే గడింపవలెను. పరమున కవసరమగు పరమార్థము నీ జన్మములోనే పొంద యత్నింపవలెను.

ఈ శ్లోకార్థము వల్లభదేవు నెంతో యలరించెను. తోడ్తోడనే యాతని హృది కదియే యలజడి గూడ కల్గించెను. ఐశ్వర్యమున కుబేరుని బోలిన యా రాజచూడామణికి మొదటి మూడు విషయములను గూర్చి చింతింపవలసిన యవసరమే యుండదు గదా! అత డిట్లు తలపోసెను—"ఇక నేను పరమార్థలాభమునకై గట్టి కృషి చేయ కతప్పదు. అయ్యయ్యో, ఇంత కాలమ్ము వ్యర్థమాయె గదా! మానవుని యాయుస్సూత్ర మెప్పుడు పుటుక్కు మని తెగి పోవునో యెవ రెరుగుదురు?" రాజేంద్రుని యప్పటి మనస్సు భర్తృహరి యోగీంద్రుని యీ పద్యభావమునే మననము చేసుకొని యుండును—

ఉ."ఆయువు వీచిచంచలము, యౌవన మల్పసుఖోదయంబు, పు
ష్పాయుధకేళిజవ్యసుఖ మస్థిర, మర్థము వాంఛవోలె సా
పాయము, భోగముల్ మెఱపులట్లు చలంబు, భవాబ్ధిలంఘనో
పాయము బ్రహ్మచింతనము బ్రాయక సేయుఁ డు సజ్జనోత్తముల్."

సరే, ఆ నరపతి "పరలోకాప్తికి పరతత్త్వజిజ్ఞాస యవసరము గదా! అట్టి పరతత్త్వము నిర్ణయించుటకై వేదవేదాంతవేత్తలగు పండితులను పిలిపించి సభ చేయింపవలె" నని నిశ్చయించెను.

## విష్ణుచిత్తుల యాందోళనము

మరునాడు వల్లభదేవు డా బ్రాహ్మణుని తన దర్బారుకు రావించి ఘనముగా గౌరవించెను. సంవత్సూర్ణనాముడగు తన పురోహితుని

పిలిపించి "ఆర్యా, పురుషార్థప్రదమగు వస్తు వేదో శాస్త్రప్రమాణ పూర్వకముగా పండితులచే తెలిసికొనవలసి యున్నది. మోక్షప్రాప్తికిని జగదుత్పత్తికిని మూలమగు పదార్థము నెరుగనిదే జన్మకు సార్థక్యము లేదు గదా! కాన వెంటనే వేదవేదాంతవేత్తలగు పండితశ్రేష్ఠులను దేశదేశములనుండి రప్పింప యత్నములు చేయుడు" అని పలికెను. "చిత్త" మని సంపత్పూర్ణుడును, మంత్రులను కలసికొని యందుకు తగిన సన్నాహములు కావించెను.

నిర్ణీతసమయమునకు ముందే నానాదేశములనుండి పండితప్రవరులా మహోచర్చలో పాల్గొనుట కేతెంచిరి. వారికి పెద్ద పెద్ద భవనములు విడిదిగృహములుగా కల్పించి అతిథ్యసత్కారాదులలో వారి కెట్టి లోటును జరుగకుండున ట్లేర్పాట్లు దివ్యముగా జరిగెను. రాజాజ్ఞానుసారము పరతత్త్వశుల్కమును రాజసభలో తోరణస్తంభమునకు వ్రేలాడదీసిరి. పరతత్త్వనిర్ణయము నిష్పక్షపాతముగా జరిగినపుడు మాత్రమే యా ధనముమూట తెగి క్రింద పడును. వాదమున గెలిచిన పండితుడు మాత్రమే దానిని గైకొన నర్హుడు---ఇది నియమము.

ఆ సమయమున తన్నగరపాలకు డైన వటపత్రశాయియగు దేవు డిట్లు తలపోసెను. "ఈ పండితులు పండితమ్మన్యులు మాత్రమే. వీరిలో నొక్కరికైనను యథార్థమైన శాస్త్రజ్ఞానము లేదు. భక్తిప్రపత్తు లంతకంటె సున్న. ఏ కొంతమందికో యితరులకు బోధించుట వరకు మాత్రమే చేతనగును గాని తా మాచరించుట కాదు. అట్టి వారి జ్ఞాన మజాగళస్తన సదృశమే గదా! వీ రందరకును కుక్షింభరత్వమందు మాత్రమే యాస్థ గాని పరతత్త్వజిజ్ఞాస సుంత యేని లే దనుటలో నీషణ్మాత్రమును సందేహము లేదు. పరతత్త్వ మనిన నేమో తామే యెరుగజాలనివా రితరులకు దాని నెట్లు బోధింపగలరు? "స్వయం తీర్ణః పరాం స్తారయతి" యన్నారు గదా! తాను తరించిన గదా యితరులను తరింపజేయగలనా లేదా యను ప్రశ్న!

ఎంతోకొంత విద్య నేర్చిన పండితుల సంగతియే యిటు లుండ మూర్ఖులగు పామరప్రజల మాట తడవనేల? కాన నిపుడు శ్రీ భాగవతసంప్రదాయమును పరిరక్షించి వ్యాపింపజేయుటకు మత్కైంకర్య ప్రవణుడు, భాగవతసేవాపరతంత్రుడు, విషయవాసనచే లవలేశము గూడ

కలుషితాంతఃకరణుడు కానివాడును నగు భట్టనాథుడే సమర్థుడు. తద్ద్వార మునసే యీ పని చక్కగా జరుగగలదు.''

ఈ రీతిగా నిశ్చయించిన యా శ్రీమహావిష్ణువు పెరియాళ్వారులకు కలలో కానుపించి ''భక్తాగ్రగణ్యా, నీ భక్తిప్రపత్తులను వాని మూల మున వైష్ణవభక్తితత్త్వమును లోకమున వ్యాపింపజేయవలసిన సమయ మాసన్న మయినది. పాండ్యరా జేర్పరచిన పరతత్త్వసభకు నీవేగి విష్ణు పారమ్యమును స్థాపింపుము. కాన నీ వాదనైపుణిని ప్రదర్శించి సభను సమ్మోహితము చేయుటకు సిద్ధము కమ్ము లెమ్ము'' అని పలికి చేతితో తట్టి లేపెను.

అతర్కితముగా లభించిన స్వామి స్పర్శకు పులకితదేహులై విష్ణుచిత్తులు తద్దర్శనాకాంక్షులై వెంటనే కన్నులు నులుముకొనుచు శయ్యనుండి దిగ్గన లేచి దివ్యమంగళవిగ్రహ విశిష్టుడగు రమాధవుని దర్శించిన తమ ధన్యతకు తామే యానందపరవశులైరి. కాని వారి కా సంతోషము క్షణములోనే మటుమాయ మయ్యెను. వేదవేదాంతవిద్యావిశారదుల యెదుట విద్యాగంధ మిసుమంతయు లేని తాను శాస్త్రచర్చలందు పాల్గొని లక్ష్మీరమణుని పరతత్త్వముగా నిర్ణయించుట సాధ్యమా? ఈ మాటలు తలచుకొన్నంత మాత్రముననే భీతితో నా కాలుసేతులు చల్ల బడుచున్నవే! ఈ మోయజాలని బరువు నెత్తుకొని పది మందిలో పరా భవ మందుటకంటె ముందుగనే యిది నావలన గా దని తప్పుకొనుట లెస్స గాదా?

స్వామికైంకర్య మన్న నెగిరి గంతు వైచి యగ్నిలో దూకుట కైనను తాను సిద్ధమే. కాని పరతత్త్వనిర్ణయ మేడ? తా నేడ? స్వామి యాలయసమ్మార్జనమా, బిందె తీర్థము తెచ్చుటయా, పల్ల కిని భుజములపై మోయుటయా, ఆలవట్టముతో విసరుటయా లేక దీపారాధన చేయుటయా? వాదమన్న మాట విననే తల కంటగిం చునే, యట్టివాడు వాదికేసరు లనేకులు గూడిన విద్వత్సభలో తగుదు నమ్మా యని పరతత్త్వనిర్ణయమునకు పూనుకొనుటయా?

కవితా ప్రావీణ్యఫణీశుడును, సాహితీ సమరాంగణ సార్వభౌము డును, తెలుగున కమ్మని వైష్ణవకవిత చెప్పి ''దేశభాషలందు తెలుగు

లెస్స" యను ప్రతిష్ఠను మన భాషకు కలిగించినవాడునునగు శ్రీకృష్ణ దేవరాయల 'యాముక్తమాల్యద' లోని యీ పద్యమునందు పై భావమును తిలకించి యానందపులకితులు కండు!

మ. "గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారవల్యంకికా
వహనంబో, వనమాలికాకరణమో, వాల్లభ్యలభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్రధృతియో, ద్రాగ్దీపికారోపమో,
నృహరీ! వాదము లేల లేరె యితరుల్ నీ లీలకుం బాత్రముల్."

తన మనస్సులో నీ పై తలపు లన్నియు భట్టనాథులు స్వామికి నిస్సంకోచముగా మొరపెట్టుకొనిరి. కాని యది యంతయు శ్రీహరి మ్రోల చెవిటివాని చెవిని శంఖ మూదినట్లే యయ్యెను. పై పెచ్చా యఘటనఘటనాసమర్థు డా భక్తుని—

క. "నీయిచ్ఛయె? మిన్నకపో
వోయి మునిప్రవర! నిన్ను నొప్పింతును భూ
నాయకునభ—నిందులకై
నీ యత్నము వలవ, దవల నే నున్నాఁడన్."

అని గద్దించి యీ పని నీకు తప్ప దని శాసించెను. విధి లేక విష్ణుచిత్తులు విద్వత్సభ కేగుట కంగీకరించిరి. తటాలున నిదుర మేల్కొనిరి. కల కల్ల యే యయ్యెను. స్వామియాదేశము శిరసావహించి విష్ణుచిత్తులు ప్రయాణమయిరి.

## పరతత్త్వనిర్ణయము

సంపత్సార్ణుడు విద్వత్కవి. ఆయన యాధ్వర్యమున సభాసన్నాహములు పెద్ద యెత్తున జరుపబడెను. వివిధాగమవేదులగు పండితప్రకాండులా మహాసభ నలంకరించిరి. మూర్తీభవించిన బ్రహ్మతేజమును బోలిన విష్ణుచిత్తులను గాంచగనే మహారాజు సంపత్సార్ణునితో గలసి యెదురేగి వినయవినమితోత్తమాంగుడై తత్పాదపద్మములకు సాష్టాంగనమస్కారము లొనర్చి లోనికి తెచ్చి సింహాసనాసీనుని గావించెను. ఆ మహర్షిని తగు రీతిగా నర్ఘ్యపాద్యాదులతో నర్చించి తన్ను ధన్యాత్మ్ముగా భావించుకొనెను.

సామాన్యుడగు నొక యాలయసేవకున కిట్టి యనర్ఘపూజ జరుగుట యా సభలోని విద్వజ్జనులకు హృదయశల్య మయ్యెను. వా

రసహిష్ణులై రాజపురోహితునితో నిట్లు పలికిరి—“వేద మన్న నేదో, వేదాంత మని దేనిపేరో, శాస్త్రార్థ మని దేని నందురో, తెలియని యీ బడుగుబాపని నిందరి మహాపండితుల మ్రోల నింత ఘనముగా నర్చించుటయా? ఇట్టి యల్పుని పూజించిన రాజును గుణదోష విచక్షణదక్షు డన జెల్లునా? ఈ పాఱునికి గాయత్రి యన నేమో గూడ తెలిసినట్లు లేదే? ఇట్టి యజ్ఞానియా పరతత్త్వనిర్ణయకర్త! ఆరామపోషణాదులచే భగవన్మాలాకారవృత్తిలో జీవించిన నీతడు జీవించుగాక. ఈయన జన్మించిన పురశ్చూడశాఖ బ్రాహ్మణజాతిలో నికృష్ట మైనది. అట్టివానిని విద్వద్గోష్ఠీమహిత మగు నీ రాజసింహాసనమున ప్రతిష్ఠించిన నీకే గాదు, మాకందరకు గూడ తలవంచుకొనవలసిన దుఃస్థితి నీవు కల్గించినావు. నీ విట్టి యరసికుడ వని ముందుగనే తెలిసిన నింత శ్రమపడి యిట కేల వచ్చెడివారము. ఇక మా దారిని మేము పోయెదము. పరతత్త్వనిర్ణయ మా యనామకునిచేతనే చేయించుకొమ్ము.” తర్వాత వా రా సభనుండి లేచిపోవ సిద్ధమైరి.

ఈ విధముగా రూక్షముగా పలికిన యా పండితులను పురోహితుడును మంత్రియును మంచి మాటలతో నెట్లో శాంతింపజేసి కూర్చుండబెట్టిరి. సభ యతిప్రయత్నముచే మరల నిశ్శబ్దమయ్యెను.

భట్టనాథులు విశిష్టాద్వైతసంప్రదాయము ననుసరించి వైష్ణవపరతత్త్వమును ప్రతిపాదించి ప్రతిష్ఠించుటకు ముందు శ్రీమహావిష్ణువును మనసా ధ్యానించిరి. విష్ణు వాయనచిత్తముననే స్థిరముగా నెలకొని యా మహర్షికి సర్వవేదవేదాంతసారమును కరతలామలకము గావించెను. తదీయజిహ్వాగ్ర సింహాసనమున తానే యాసీనుడై విష్ణుచిత్తులచే నిట్లు పలికించెను—

“సర్వార్థా వేదగర్భస్థా వేద శ్చాష్టాక్షరే స్థితః,
అష్టాక్షరస్తు ప్రణవే అకారే ప్రణవః స్థితః.
యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః,
తస్య ప్రకృతిలీనస్య యః పరస్స మహేశ్వరః.
సమస్తశబ్దమూలత్వా దకారస్య స్వభావతః,
సమస్తవాచ్యభూతత్వా ద్బ్రహ్మణోఽపి స్వభావతః
వాచ్యవాచకసంబంధ స్తయో రర్థా త్ప్రతీయతే
అక్షరాణా మకారోఽస్మి గీతాచార్యేణ భాషితమ్,

అకార ఏవ సర్వాత్మా హ్యకారో విష్ణువాచకః,
అకారవాచం స్త్రైవం విష్ణురే వేతి గీయతే.

అకారవాచ్యో భగవాన్విష్ణు ర్నారాయణః పరః,
సర్వవేదాంతవాక్యైశ్చ సర్వస్మా త్పర ఉచ్యతే.

నారాయణాత్పరో దేవో న భూతో న భవిష్యతి,
ఏతద్రహస్యం వేదానాం పురాణానాం చ సమ్మతమ్.

సత్యం సత్యం పున స్సత్య ముద్ధృత్య భుజ ముచ్యతే,
వేదాచ్ఛాస్త్రం పరం నాస్తి న దైవం కేశవా త్పరమ్".

సర్వపదార్థములు వేదమున నిమిడి యున్నవి. వేదమష్టాక్షరీమంత్రమున నుండును. అట్టి నారాయణాష్టాక్షరి ప్రణవమున-ఓంకారమున-నుండును. ఆ ఓంకారమునకు అకారము మూలము. వేదముల కాదిని ఓంకార ముండును. అ ఉ మ, వీని కలయికయే ఓం. కాన వేదములకు మూలమయినది, అనగా మొదట నుండునది, అకారమే-'అ' అను నక్షరమే. వేదాదియైన ఆ అకారమే వేదాంతమునకు-బ్రహ్మవిద్యకు-మూలము. బ్రహ్మమే పరతత్త్వము. కాన పరతత్త్వమునకు మూలము గూడ అకారమే. ఈ దృశ్యమానమగు ప్రకృతిని సృష్టించినవాడే పరుడు. వాడే స్థితిలయకర్త గూడ. ఆ పరుడే పరమాత్మ. ఆతడే బ్రహ్మము లేక పరబ్రహ్మము. 'అక్షరములలో నేను అకారమును' అని గీతాచార్యుడు గూడ పల్కినాడు గదా! అకారమే సర్వమునకును ఆత్మ; అట్టి అకారము విష్ణువునే చెప్పును. ఇతర దేవతల నది యెంత మాత్రము చెప్పదు. అకారవాచ్యుడగు నా విష్ణుభగవానుడే పరతత్త్వము, శ్రీమన్నారాయణుడు. మోక్షప్రదానార్హత బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో విష్ణువున కొక్కనికే గల దను విషయమును "మోక్ష మిచ్ఛేత్ జనార్దనాత్" అను నభియుక్తోక్తి గూడ ఋజువు చేయుచున్నది గదా! కాన అకారవాచ్యుడగు శ్రీహరి యొక్కడే మోక్షప్రదాత యనుటలో విప్రతిపత్తి యెంత మాత్రమును లేదు.

విష్ణువునుండి యుద్భవించిన యీ జగ త్తాతనిలోనే యుండి యాతనిలోనే లీన మగును. కాన నారాయణుని మించిన పరతత్త్వము "న భూతో న భవిష్యతి". నేను పైన ప్రతిపాదించినదే నిఖిల వేదపురాణసారము. కుడి చేయి యెత్తి ఘోషించుచున్నాను. వేదములను మించిన శాస్త్రమును, కేశవుని మించిన పరతత్త్వమును

కంచుకాగడా పెట్టి వెదికినను నీ జగమున కానుపింపదు. ఒక్కమారు గాదు. ముమ్మాటికి నిదియే సత్యము.''

పరతత్త్వనిర్ణయ మిట్లు స్థాపింపబడగానే పరతత్త్వశుల్కపు మూట తెగి విష్ణుచిత్తుల పాదముల మ్రోలపడెను. వెంటనే వారది స్వీకరించిరి. వల్లభదేవ మహారా జాయనను 'విష్ణుచిత్తా' యని సంబోధించెను. "జయ విష్ణుచిత్తార్య, జయజయ పరతత్త్వనిర్ణాయక, జయజయ జయ పాండ్యదేశాధీశ్వర వల్లభదేవ మహారాజా" యని యా విద్వద్రాజసభ దిగ్దిగంతములు ఘూర్ణిల్లగా కరతాళధ్వనులతో మారుమ్రోగెను. శ్రుతి సమ్మతముగా చతురయుక్తులతో పరతత్త్వనిర్ణయము గావించిన విష్ణుచిత్తుని, కరుణించుటకు శ్రీమహావిష్ణువు గరుడవాహనారూఢుడై శ్రీభూనీళా దివ్యమహిషులతో ననంత విష్వక్సేనాది పరివారముతో సాక్షాత్కరించెను. బ్రహ్మరుద్రాది దేవతలు నారదాదులగు మహర్షులు గూడ నా దేవుని వెంట నా సభాస్థలి కేగుదెంచిరి. విష్ణుచిత్తులేగాక యా సభలోని వారందరును శ్రీమహావిష్ణువును దర్శించి బ్రహ్మానందమందిరి.

## మంగళాశాసనము (తిరుప్పల్లాండు)

మహారాజు, శ్రీ విష్ణుచిత్తులను గజారోహణము చేయించి యూరేగించెను. ఛత్ర చామరాదులు పూని రాజులును, మంత్రిసామంతాదులును నాయనను సేవించుచు వెంట నేగిరి. పురోహితుడు సితచ్ఛత్రమును బట్టెను.

ఇంతమంది విద్వత్ప్రకాండులను గెలిచినందున తన భక్తునకు బ్రహ్మ రథము పట్టుచున్నారు గదా యని తమి నాపు కొనలేకయును, ఇతరుల యానందమున పాలుపంచుకొనుటకును, శ్రీహరి యా రాజసభలో విష్ణుచిత్తులకు ప్రత్యక్షమయ్యెను.

నిర్హేతుకజాయమానకటాక్షముచే, భక్తవాత్సల్యముతో భగవంతుడు తమకు ప్రసన్ను డైనందులకు భట్టనాథు లుద్వేలానందసాగరలహరిలో నోలలాడిరి. కాని స్వామికి నమస్కరించి వేనోళ్ళ బొగడుటకు బదు లా మహావిష్ణువుభువనమోహన దివ్యమంగళవిగ్రహసౌందర్యమునకును తత్కల్యాణ గుణసంపదకును ప్రాకృతజనుల దృష్టి యెక్కడ తగులునో

యని భీతచేతస్కు లైరి. యుక్తాయుక్తములు తడవక గజఘంటలనే తాళముగా చేసికొని హృద్యమును మృదుమధురమునగు ద్రావిడపాశుర గానముతో స్వామి నాశీర్వదించిరి. దానినే మంగళాశాసన మనియు నందురు. వారపుడు భగవద్గుణాతిశయమును గానము చేసిన ద్వాదశగాథాత్మక మగు నా కృతికి తిరుప్పల్లాండు అని పేరు. మొదటి పాశుర మిది.

ప. పల్లాండు పల్లాండు పల్లాయిరత్తాండు పలకోడి నూరాయిరం
మల్లాండ తిండోళ్ మణివణ్ణా ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు.

దివ్యస్థలములలో ద్రావిడవేదాధ్యయనము చేయుటకు ముందు వీరు పాడిన ఈ తిరుప్పల్లాండును ముందు పఠించిన తరువాతనే మిగిలిన వాని ననుసంధింతు రన్నచో దీని ప్రాముఖ్యము తెలియనగును. కాననే దీని సంపూర్ణానువాదము సుప్రసిద్ధ చక్రవర్తులు శ్రీ శ్రీనివాససోదరులది యందించుచున్నాము. ఇందుల కనుమతించిన ఈ సహృదయశిరోమణు లకు మా కృతజ్ఞతలు!

## తిరుప్పల్లాండు

1. హరి నీల కోమల శ్యామలదేహ
క్రూర కంస నిష్పిష్ట ఘోరచాణూర మల్లనిబర్హణ
మహిత బలిష్ఠ బాహోయుగళ!
నీదు పాదారవింద
సౌందర్య నమధిక సంవత్సమృద్ధి
బహువత్సరమ్ములు బహువత్సరములు
బహుసహస్రాబ్దముల్
బహుకోటి లక్షవర్షముల్
కొఱలేక వర్ధిల్లుగాక

2. అడియేనులకు నీకు నెడబాటు లేమి
వేనవేలేడులు విలసిల్లుగాక
దక్షిణవక్షాన దప్ప కాళరణమై
నిత్యము నివసించు అమ్మవారికిని,
వలకేల వెలుగుచు
ప్రతిభటపటలి దహియించివేయు
సుదర్శనమ్మునకు
సైన్యవిన్యాసావసరముల
మొరసి జయవెట్టు

శ్రీపాంచజన్యమ్మునకును
బహుసహస్రాబ్దముల్
బహుకోటిలక్షవర్షముల్
కొఱ లేక భద్రమౌ గాక

3. కైంకర్యపరులె రం
డంకురార్పణవు మట్టితో
కల్యాణమంటపమ్మునకు
భోగదాసులను మా పాదకు రానీము
తరతరమ్ములనుండి
దైవతాంతరము
తంత్రాంతరమ్మును
మంత్రాంతరమ్ము
సాధనాంతరమును
సాధ్యాంతరమ్ము
విషయాంతరము లేక
వెలసెడివారము.
ఆ లంక దిరుగాడు నసురాళి నెదిరి
అరికట్టి మరుమాడు
అంబుజాక్షునకు
అభిలషింతుము మంగళాశాసనంబు.

4. మూలప్రకృతి జేరి
స్థూలసూక్ష్మములు తనువులు
బాధ నొందక ముందె వచ్చి
అన్యప్రయోజనాయాసదూరులము
మా సంఘమున జేర
మనసయ్యె నేని—
అభ్యంతరము లేదు
అరుదెంచు వేగ
దేశదేశమ్ములు తెలివొందునట్లు
కోరికమెయి
“నమో నారాయణాయ”
అనుచు పాడుడు
మంగళాశాసనమ్ము.

5. బ్రహ్మాండభాండ నిర్వహణైకదక్షు
రాక్షసాక్షౌహిణీ ప్రమథనదీక్షు
అల హృషీకేశు దాస్యముసేయు కులము
నధికరించియు
తత్పదాబ్జముల్ పట్టి

వేమారుు నోరార నామముల్ నుడివి
భగవద్విముఖపూర్వవాసనల్ విడిచి
బహుసహస్రసహస్ర వర్షంబు
లిట్లె అలరజేయుడు
మంగళాశాసనంబు.

6. నేను నా తండ్రియు వాని తండ్రియును
వాని తండ్రియు తాత
వాని తండ్రియును తాతయు
ఇట్లేడుతరములనుండి
తలకక
దాస్యంబు సలుపుచున్నాము.
శ్రవణతిర్నక్షత్ర సమయమందు
తరణి గ్రుంకెడు వేళ
నరసింహు డగుచు నావిర్భవించి
ప్రహ్లాదవిరోధి
ఘనశాత్రవు
హిరణ్యకశిపుని ద్రుంచు నతని
బాలారిష్ట మంటకుండంగ
అలపింతుము
మంగళాశాసనమ్ము.

7. జ్వలను నేలెడి దీప్తి గల మాలవోలె వెలుగు
సుదర్శనచిహ్నంబు
వెలుగు భుజముల
తరతరమ్ములుగ
అనన్య కైంకర్యపరులమై గడుపుచున్నాము.
కపటరణమ్ముల గడి తెలి పోరు
బాణుని సేనతో
బాహుసాహస్రి
నెత్తురు బొత్తిల్ల
తుత్తునియలుగ ఖండింప
వరపరాక్రమచక్రమంపు
అఘటనఘటనాసమర్థున
కెపుడు నాచరింతుమ్ము మంగళాశాసనమ్ము.

8. సురుచిరఘృతపూర్ణసుప్రసాదంబు
వట్టెడు విడియంబు
భవ్యహారములు
మహితకుండలములు
మలయగంధమ్ము

కరుణించి
దాసుల బరిశుద్ధిచేయు
ఫణిరాజవైరి విభ్రాజితధ్వజున
కాచరింతుము
మంగళాశాసనమ్ము.

9. తను కట్టివిడుచు పీతాంబరంబూని
సావడ వివులు ప్రసాదంబు మెసవి
తాలిచి వీడు తోమాలలు దాల్చి
సేవించువారము
చెప్పిన పనులు చక్కగా దీఱిచి
శ్రవణోత్సవమున
ఫణిరాజశయ్యపై బవళించి
కోర్కి సేవ సాయించెడి
శ్రీ మనోనాథ!
ఆచరింతుము
మంగళాశాసనమ్ము.

10. దేవరవారల సేవచేసికొన
స్వామి!
మా నొసళుల వ్రాసిననాడె
అహమును, కైవల్య, మైశ్వర్య ముడిగి
పుత్రపౌత్రకళత్రమిత్రులతోడ
దాసు లుజ్జీవించు ధన్యత గలిగె.
నాటెంపు రోహిణీ నక్షత్రమందు
ఉత్తరమథురలో నుద్భవంబంది
కాళియఫణిఫణాగ్రముల నర్తించి
కంసుని ధనువును ఖండించినట్టి
అధిప!
నీ కిదె మంగళాశాసనమ్ము.

11. పరమపవిత్ర
ఓ పద్మాకళత్ర!
ఒక తప్పు తగవు గల్గక
ధరానతికి దివ్యహారంబగు
తిరుకొట్టియూరి
వరప్రపన్నులకు నిర్వాహకోత్తముడు
తావకదాస్యైకభావాభిమాని
శ్రీ సెల్వనంబి పోలిక
సర్వశేషివగు నీ
కనాది దాస్యప్రయుక్తుండనై రహించుచు

నమో నారాయణాయ
అని తిరునామమ్ము లన్నియు బలికి
ఆచరించెద
మంగళాశాసనమ్ము.

12. పరమపావనుడగు పరమేష్ఠి శార్ఙ్గి విషయుపై
సాయించె
విల్లిపుత్తూర వెలసిన మునిరాజు విష్ణుచిత్తుండు
ఈ తిరుప్పల్లాండు
నెంతయు ప్రేమ
నీ కాల మా కాల మే కాల మనక
మననంబు సల్పెడి మహితాత్ము లెల్ల
శౌరి కెప్పుడు
"నమో నారాయణాయ"
అని సల్పుదురు
మంగళాశాసనమ్ము.

ఈ విధముగా ఘనగౌరవము నందిన పెరియాళ్వారులను వల్లభదేవుడు సువర్ణ శిబికాధిరూఢులను గావించి ఛత్రచామరాదులతో భూరిభేరీకాహళాది మంగళవాద్యములతో దిక్కులు పిక్కటిల్లునట్లుగా పరిజనపరివారముతో వారి స్వస్థలము శ్రీ విల్లిపుత్తూరునకు పంపెను. తన్నగరవాసులు విష్ణుచిత్తుల యీ విజయము విని బ్రహ్మానందపడి వారిని తగురీతిగా సత్కరించి గౌరవించిరి. తర్వాత యథాప్రకారముగా పెరియాళ్వారులు వటపత్రశాయికి మాలాకైంకర్యము చేయుచు కాలక్షేపము సేయసాగిరి.

## కవితావిభవము

పెరియాళ్వారనగా పెద్ద ర‌క్షకు లని యర్థము. ఆళ్వారు లందరిలోను వీరు పెద్దవారని— గొప్పవారని—ఆ పదము భావము. వీరి పెద్దతన మే విషయమున నని మనకు శంక కలుగ వచ్చును.

తనకు ప్రత్యక్ష మయిన విష్ణువు వటపత్రశాయియే గాని వేరు కాదని వారికి తోచెను. అంత గొప్ప స్వామిని గూడ బాలమాత్రునిగా భావించి యాశీర్వదించుట చేతనే వారు మహోన్నతులు—ఉదారగంభీరభావులు కాగలిగిరి. కాననే వారి తిరుప్పల్లాండును ద్రావిడ వేదాధ్యయనమునకు ముందు గానము సేయుదురు.

సదా శ్రీకృష్ణుని మనమున భావించుకొనుచుండువారు గాన నీ యాళ్వారు తమ యద్భుతకావ్యము ముదలాయిరములో శ్రీకృష్ణుని బాల్యక్రీడలు పఠితల కన్నులకు గట్టినట్లు వర్ణింప గల్గిరి. ఇతర భాషలలోని మహాకవుల కీ యాళ్వారు కవు లెంత మాత్రమును తీసిపోరని వీరి కావ్యప్రబంధములు చదివినవారు తెలుసుకొన గలుగుటకుగాను వీరి పాశురములకు కొన్నిటికి తెలుగుపద్యానువాదము నిచ్చుచున్నాను. అనువాదకర్త శ్రావ్యకవితా విశారద శ్రీమాన్ మాడభూషి గోపాలాచార్యులు. వీరు ద్రావిడ దివ్యప్రబంధములను చాలవరకు పద్యకావ్యములుగ ననువదించి యాంధ్రశారద కుడుగరలుగా సమర్పించిన సుకృతాత్ములు. శ్రీగోదాగ్రంథమాలలో వీరి కావ్యములు—భాగవతసారము, తిరుమాల, కులశేఖర సూక్తిమాల, గోదా సూక్తిమాల, ప్రియాన్వేషణము అను గ్రంథములు వెలువడి సాహితీరసికుల మన్నన లందుకొన్నవి.

క్రింది యుదాహరణములతో నీ యాళ్వారుల కవితావిభవ మెంత యుచ్చకోటికి చెందినదో, వీరి భావనాపటిమ యెంత సహజసుందరమో తెలియనగును. అంతేగాదు—ఈ కవి భక్తిరసముతో బాటు వాత్సల్య రసమును గూడ సృష్టించుటలో సిద్ధహస్తు లను విషయము మనకు కరతలామలకము కాగలదు.

యశోద తన కన్నయ్యకు లాలిపాడిన రీతి నీ పద్దెమున గాంచి యానందింతము.

వ. "మాణిక్యపార్శ్వల ప్రభలన్
మధ్యలో వైరాల సిరులన్
రాణించు బంగారు దోలన్
రంగైన చిన్న యుయ్యాలన్
వాణి రాణిగ నొప్పవాఁడే
పంపించెరా పావ లాలీ
మాణవకవామనా లాలీ!
మహిని గొల్చిన దేవ! లాలీ"

క్రింది పద్యమున కవి తమ్ము యశోదగాను కృష్ణుని తన ముద్దు బిడ్డగాను భావించుకొనుచున్నారు. దీర్ఘకాల మా బిడ్డ చనుగుడువక నిద్రపోవుచుండెను. ఆ బిడ్డను లేపి చనుగుడువ నుద్యమించిన తమ భావోద్రేకమును కవి యిట్లు వర్ణించెను.

సీ. "అహిశయ్య నిదురించు యదువంశవృషభమా!
మేలుకో చను గ్రోల మేలుకొనుము!
నిన్న రాతిరి గూడ చన్ను గుడ్వగ లేదు
మిట్టమధ్యాహ్నంబు మేఱ మీఱె,
ఇంకను నీరాక కెదురుఁజూచుచు నుంటి
నేల మేల్కొనవొకొ నే నెఱుంగ,
పొంకంబు దొరఁగి నీ బొజ్జ వాడెను గాదె
పొంగారు చనుబాలు పొర్లునట్లు,
తే. సుస్తనంబులపైన నీ సొంపు లొలుకు
చిన్నినోటిని జక్కగాఁజేర్చి నీవు
పాలు గ్రోలెదు నానందపరవశమునఁ
గాల దన్నుచు గ్రోలుమా కడుపు నిండ."

యశోద కృష్ణుని సుగుణములను ప్రశంసించుచు నీతని జన్మదినోత్సవ సమయమున మంగళస్నానమునకు పిలుచుచున్నటుల భావించుకొని దాని నిట్లు వర్ణించుచున్నారు—

"అసుర చన్ను గుడుచుచుండ నాలమందయాండ్రు నిన్
విసముఁ గుడుచువానిఁ జూచి వేగ నన్నుఁ బిలువ నీ
వెనకు భయము వీడి వచ్చి తీపి చన్ను గుడిపితిన్
ఉసిరిక లిడి నీరు గాచి యుంచినాను కాగునన్
అసలు నీలమణివి రార అమితకీర్తిశోభితా!
మసలకుండ నీర మాడ మాన్యరార నారనా"

తల్లి వెన్నదొంగ నభ్యంగన మాడించిన తర్వాత నాతని తలదువ్వుట కెంత యత్నించియు కృతకృత్యురాలు కాలేక పోయెను. చివరకామె యొక యుపాయ మాలోచించి "కాకీ, నా బిడ్డకు తల దువ్వ రావే" యని పిలుచుచు నా బిడ్డకు వినోదము కల్పింపసాగెను. అప్పుడామె కాకిని సంబోధించుచున్న భావము తమపై నారోపించుకొని విష్ణుచిత్తులు తమ యనుభవము నిట్లు చిత్రించుచున్నారు.

"నీల పెండ్లికొమరు, డితఁడు—నిత్యసూరివరుల మేటి
ఆలయంబు "పేఱ" లోన—నరయ లేరు వీనిసాటి,
ఏలు మాధవుండు వీఁడె—యేదు నేడుతరములకును
శ్రీలలనకు ధవుఁడు వీని—సిరికురులను దువ్వుటకును
ఏలు వీని కురుల దువ్వ—ఇచటి కల్లరావె కాకి!
నీల పెండ్లికొడుకు కురుల—నీవె వచ్చి దువ్వు కాకి!"

కృష్ణుడు గొల్లల యిండ్లలో దూరి స్వేచ్ఛావిహారము చేయుచుం డగా నోర్వలేని వ్రజకాంత లాతనిపై నిట్లు కొండెములు పల్కిరి.

సీ. వెన్న దిగమ్రింగి కుండల విఱుగఁదన్ని
  విఱుగు కుండల మ్రోతల వినుచు నిలిచి
మేలు లొనరించు నీ కృష్ణ మేటి వగల
  నావలే మమ్మ నీ బిడ్డ నావుకొనుము
పుండులో చింతపండును బోయునట్లు
  దుడుకు లింటింట నొనరించు దొరలకంటె
దాని నెటు గంటివో కాని పిలిచి యింట
  నిలుపుకొను మో యశోదమ్మ నిలుపుమమ్మ?

శ్రీకృష్ణుని కురుల విరుల నలంకరించుటకై పిలుచు యశోదాదేవి మనోభావ మిందు వర్ణితము.

మకరంద మాధుర్యమహిమంబులను మించు
  సరళార్ద్రగుణముల పరలు దేవ
భాండంబులో నుండు వచ్చిపాలను నెట్టి
  భాండంబుతోఁ ద్రావఁ బరులు నగరె!
సాంద్రకాననమునఁ జక్కని పచ్చిక
  పట్టుల నెమకుచుఁ బశుగణముల
మేపుచు దిరుగ నీ మేఘవర్ణపు మేను
  వాడిపోవునుఁ బోవ వలదు వలదు

తే. కానలోపల నీ జాడ గాంచు మందు
  నరయఁజాలము మా జాడ లరయు విపు
పూల ముడిచెదఁ జంపకపుష్ప మిదిగొ
  రమ్ము నంపంగి ముడిచెద రార సామి!

పరువమున నున్న గొల్లపిల్లలు తుంటరి కృష్ణుడు తమ్మనేకవిధముల బాధించుచున్నా డని, మానరక్షణకై తమ ప్రాణములు తీసికొనకతప్పని దుఃస్థితి దాపురించిన దని యశోదతో మొరపెట్టుకొన్న యీ పద్య మెంత హృద్యము.

ఏటి యిసుకల నాడు మా పయి
నేటి బురదల విసరి వైచెను
నీట నుండ కడెంబు చీరను
నీతి వరలుచు నవహరించెను
దాటి పోవుచు గాలికంటెను

త్వరితగమనము తోడ బఱచెను
బోటు లందరు వాని వెంబడి
పోవ నింటను దూఱ నిలుచును
మాటి మాటికి నెంత వేడిన
మారు పల్కఁరు సొమ్ము లివ్వరు
నేటితో నిక బ్రతుకు ముగిసెను
నెలత నమ్మిక బ్రతుక నివ్వఁరు."

సీతమ్మవద్ద కేగిన హనుమంతు డీ గుర్తామెకు తెలియ జెప్పి తాను రామదూత నని యా తల్లికి నమ్మకము కల్గించెను.

సీ. చిత్రకూటంబున జేరి యచ్చట మీరు
విహరించుచుండిన వేళయందు
క్షుద్రకాకం బొండు కుత్సితబుద్ధితో
స్తనసీమ మెల్లగాఁ దడవఁ జూచి
బ్రహ్మాస్త్రమును దర్భపై బ్రయోగించిన
పెనుమంటతో నది వెంటఁ దరుమ
సకలలోకంబుల సంరక్ష వేఁడియు
శరణంబు గాంచక సంచరించి

తే. యన్యగతి లేక దిక్కిదె యభయ మభయ
మనుచు శ్రీరామపదయుగ్మ మాశ్రయించి
పాహి యను గాకి, జంపక వదలి దాని
యొక్క కంటిని గ్రుచ్చిన దొక్క గుర్తు.

* * *

# VII కులశేఖర పెరుమాళ్

కుంభే పునర్వసౌ జాతం కేరళే కోళి పట్టణే,
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే.

ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే,
తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్..

"ఓ నరకాంతకుడైన మురాంతకా! దివిమీదనుండనీ, భువిమీద నుండనీ, ఒకవేళ నరకముననే యుండనీ నే నది లెక్క చేయను. శరత్కాలవికసితారవిందములను గూడ తమ శోభచే తిరస్కరించునట్టి నీ చరణములను నేను చింతింపగల్గునట్లు మాత్రము నాకు వర మనుగ్రహింపుము."

పై భావముగల యీ క్రింది శ్లోకమును—

"దివి వా భువి వా మమాస్తు వాసో
నరకే వా నరకాంతక ప్రకామమ్,
అవధీరితశారదారవిందౌ
చరణౌ తే మరణేఽపి చింతయామి."

దానికి ఈ యనువాద గేయమును—

నాకమో భూలోకమో మరి నరకమో పున్నాకమో
చీకు చింతయులేక నా కౌగాక నావాసంబుగా
శ్రీకరా! శరదంబుజాత శ్రీకములు నీ పాదముల్
సాకు లేక భజించెదన్ మనసా, భవాంతమునందునన్.

—నేడు మనము విజయవాడ యాకాశవాణినుండి తరచుగా వినుచునే యుందుము. ఆ శ్లోకము శ్రీ కులశేఖరుల దని చాలమందికి తెలిసి యుండును. కాని గేయము "సంగీత సాహిత్యకళానిధి" "ఉభయకవి మిత్రులు" శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు (విజయవాడ) వారిదని చాలమంది యెరిగి యుండక పోవచ్చును.

పైని జెప్పిన ఈ కవికులశేఖరులే విష్ణుభక్తకులశేఖరులగు కులశేఖర చక్రవర్తి. వీరినే కులశేఖరాళ్వారు అని గూడ ద్రావిడమున నందురు.

శ్రీ కులశేఖరులు కలియుగ ప్రారంభమున క్రీ.శ. 767వ సంవత్సరమున జన్మించిరని చరిత్ర చెప్పుచున్నది. వీరు కుంభమాసమున పునర్వసు నక్షత్రమున కేరళదేశమున కోళి పట్టణమున శ్రీమహావిష్ణువుయొక్క కౌస్తుభరత్నాంశమున జన్మించిరి.

ఏ కొలది దైవభక్తి కలవారైనను ఈ కవికులశిరోమణి యగు కులశేఖరచక్రవర్తి కూర్చిన ముకుందపాదారవిందార్పిత సుమనోమాల యగు ముకుందమాలను స్వీయకంఠమాలగా చేసికొనక మానరు.

కృష్ణ త్వదీయ పద పంకజపంజరాంత-
మద్యైవ మే విశతు మానసరాజహంసః,
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే?"

ఓ శ్రీకృష్ణా! నీ పాదపంకజపంజరమును నా మానసరాజహంస యిపుడే ప్రవేశించు గాక. ప్రాణావసాన సమయమున వాతపిత్తశ్లేష్మములతో నిండి కంఠము పెకలి రానప్పుడు నీ స్మరణ నే నెట్లు చేయగలను?

ఈ భావమునే గీర్వాణవాణియగు సంస్కృతభాషా ప్రచారమునకై తమ తనుమానప్రాణము లంకితము చేసిన శ్రీమాన్ తి.కాం. తిరువేంగళాచార్యులు (చిత్తూరు) వారెంత యందముగా పద్యబద్ధము చేసినారో!

నీ పదపద్మపంజరము నిప్పుడు నాదగు చిత్తహంసకున్
గాపుర మిప్పుడే యగును గాక, కఫంబులును వాతపిత్తముల్
రాపిడి పెట్ట గంఠమును రమ్యతరంబగు నీదు ధ్యాన మీ
పాపికి నాకు ప్రాణములు వాసెడునప్పుడు గల్గనేర్చునే?"

నలువది శ్లోకరత్నములు గల యీ ముకుందమాల ప్రతివారును నిహపరలాభమునకై కంఠహారముగా ధరింపదగిన మణిమాల.

ద్రావిడదేశాంతర్గతమగు కేరళదేశమున కోళి యను పట్టణము గలదు. దృఢవ్రతుడను మహారాజు ప్రజారక్షణ దృఢవ్రతుడై యా రాజ్యమును పాలించుచుండెను. చిరకాల మాయనకు బిడ్డలు లేరు. శ్రీహరి కటాక్షముచే చివర కొక పుత్రరత్న మా రాజదంపతులకు గలిగెను. ముద్దులు మూటగట్టుచున్న కొమరుని మోము చూడగనే

యాతని యానందమున కవధి లేక పోయెను. తన సంతోషమునకు చిహ్నముగా నా రాజేంద్రుడు బ్రాహ్మణులకు భూరిదక్షిణలు, శుద్ధ సువర్ణగవాశ్వహస్తులు నిచ్చి తనను ధన్యాత్మునిగా నెంచుకొనెను. లేకలేక పుట్టిన యా బిడ్డతో నాతని నిలయ మానందనిలయమే యయ్యెను. కులవర్ధనుండగు కొడుకు గానని యట్టి లాఘవాస్పదుని యాలయము లయము గదా?

అమిత తేజస్కుడగు కుమారునకు తండ్రి తమ రాజకులమునకు శేఖరుడుగా నవతరించినందున కులశేఖరు డని సార్థకనామ మిడెను. చౌలోపనయనాది సంస్కారములను సకాలమున యథావిధిగ జరిపించెను. వేదవేదాంగములందును ధనుర్వేదమునందును నా బాలుని కృతహస్తుని గావించెను. గురువు సాక్షిమాత్రుడు కాగా, నేకసంధాగ్రాహి యగు నా బాలునకు బాల్యముననే సర్వవిద్యలును సహజరీతిగా కరతలామలక మయ్యెను.

పూర్ణిమాశశాంకుని బోలె షోడశకళాపరిపూర్ణుడైన పుత్రుని చూచుకొని దృఢవ్రతు డానందసాగర డోలికల నూగసాగెను. యుక్తవయస్కుడగు బాలుని యౌవరాజ్యమున పట్టము గట్టి యా రాజేంద్రుడు విశ్రాంతి తీసుకొనెను.

## రాజ్యపాలనము

కులశేఖరభూపతిపాలనలో దేశమంతయు సుభిక్షమై వెలుగొందెను. అవు డీతిబాధ లెటు పోయినవో కూడ నెవరికిని తెలియదు. పరీక్షిన్మహారాజు కాలమునందు వలెనే ధర్మదేవత నాల్గు పాదములతో నడచెను. రథ గజ తురగ పదాతి రూపాత్మకమగు చతురంగబలమును సుపరిపుష్టము చేసి యరివీరభీకరుడగు నా నరపతి---

ద్వి."ఖండన ప్రతిభట వరభటవీర
గండమండలకాండ కాండవేదండ
దండధరోద్దండ దండకోదండ
దండదండన బాహాదండంబు చేత"

--పరమయోగి విలాసము

—సర్వసర్వంసహాచక్రమును నవక్రవిక్రమాటోపముతో నేలెను.

సర్వదిగ్విజేతయగు నాతని ప్రతాపానలమున కోడి శత్రురాజులు గిరిగుహలనే స్థిరనివాసముగా చేసుకొనిరి. ఈ రీతిగా నిహతకంటకమగు తన రాజ్యము నా రాజు ధర్మరాజై పరిపాలించుచుండగా ప్రజలు దానిని రామరాజ్యమే యని ప్రశంసింపసాగిరి. పుత్రుని సర్వజన సమాదరణను పరిశీలించి దృఢవ్రతచక్రవర్తి సంతృప్తితో రాజ్యభార మంతయు కుమారునకు కట్టబెట్టి సతీసమేతుడై వానప్రస్థాశ్రమ నిర్వహణకై సుదూరారణ్యభూముల కేగెను.

కులశేఖర చక్రవర్తి పరిపాలనలో మేకయు బెబ్బులియు నొకే రేవులో నీరు త్రావెను. "గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం" అను నభియుక్తోక్తి ననుసరించి యా రాజు బ్రహ్మజ్ఞానులగు బ్రాహ్మణోత్తములకు గోసహస్రములను దానము చేసెను. చేతి కెముక లేకుండ దానము చేయు నా సమ్రాట్టువద్దకువచ్చిపోవు యాచకుల కంతే కన్పట్టకపోయెను. ఆయన ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడువాడు. తన ప్రజనెవరు హింసించినను వెంటనే శిక్షింపక విడిచిపెట్టువాడు కాదు. కాన నా చక్రవర్తి కీర్తికాంతిపుంజము దిగ్దిగంతములందును ద్రుతగతితో వ్యాపించెను.

రజస్తమోగుణములు మచ్చుకైనను నా భూపతిని చేరలేదు. సత్త్వగుణైకశీలుడగునట్టి కులశేఖరచక్రవర్తిపై నిర్హేతుక కరుణ వహించి విష్వక్సేను డేతెంచి పంచసంస్కారముల ననుగ్రహించెను. ఆచార్యసమాశ్రయణము నందిన కులశేఖరులు భక్తిజ్ఞానవైరాగ్యసంపన్నులై ప్రహ్లాదుని యీ సూక్తికి సర్వదా లక్ష్యభూతులై యొప్పారిరి—

సీ. "తనయందు నఖిలభూతములందు నొక భంగి
   సమహితత్వంబున బరగువాఁడు
పెద్దలఁ బొడఁగన్న భృత్యుని కైవడిఁ
   జేరి నమస్కృతుల్ సేయువాఁడు,
కన్నుదోయికి నన్యకాంత లడ్డం బైన
   మాతృభావముఁజేసి మరలువాఁడు,
తల్లిదండ్రులయందు ధర్మవత్సలతను
   దీనులఁగావఁజింతించువాఁడు,

తే. సఖులయెడ సోదరస్థితి జరపువాఁడు,
దైవతము లంచు గురువులఁదలచువాఁడు,
లీలలందును బొంకులు లేనివాఁడు
లలితమర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప!"

—పోతనామాత్యుడు.

ఈ విధముగ భగవత్స్వరూప రూపగుణ విభూతులందు లగ్నమన స్కుఁడగు కులశేఖర మహీపాలునకు సంసారసాగరమును తరించి పరబ్రహ్మ సందర్శనానందము నందవలె నను కోరిక నానాటికి ప్రబలము కా జొచ్చెను. కాన నా సూరిశేఖరుడు సంసారవిషయములతోబాటు రాజ్య విషయములను గూడ బొత్తిగా పట్టించుకొనక నిర్లిప్తుడై చరింపసాగెను.

మహాజ్ఞాని యైన యా చక్రవర్తి యర్థకామములను తమదరికి గూడ చేరనీయలేదు. విషమ విషయవలయ సంబద్ధులగు బద్ధజీవు లతోడి పొత్తును పూర్తిగా వదలివై చెను. దేహమే యాత్మ యను భ్రాంతితో ప్రవర్తించు సంసారుల నడుమ సంచరించుట ఆయనకు కారావాసమువలె దుర్భరమయ్యెను. కాననే యట్టివారి సంగము సంపూ ర్ణముగా విసర్జించి భగవద్విషయమునందు మాత్రమే లగ్నచిత్తుడాయెను. రాజ్యమును గూడ భగవత్కైంకర్య రూపముగనే పాలింపసాగెను.

శ్రీ విభీషణుడు—

"పరిత్యక్తా మయా లంకా మిత్రాణి చ ధనాని చ,
భవద్గతం మే రాజ్యం చ జీవితం చ సుఖాని చ."

—రాజ్యమును, మిత్రులను చివరకు జీవితసర్వస్వమగు భార్యను సైతము వదలి శ్రీరామచంద్రుల పాదారవింద మూలమును శరణు జొచ్చినట్లే—శ్రీకులశేఖరుడుగూడ రాజ్యమును శ్రీవైష్ణవులగు భాగ వతోత్తముల వశము గావించి విష్ణుభక్త్యైకప్రవణుడై తద్దాసానుదాసుడై హాయిగా కాలము పుచ్చెను.

శ్రీహరి యర్చావతారములలో నా చక్రవర్తికి శ్రీ వేంకటేశ్వర స్వామిపై గల మక్కువ మిక్కుటము. కాననే యాయన "అయ్యో, వేంకటాద్రియందలి యొక సోపానము కాగల్గినచో నేను సదా యా ప్రవా

ళాధరుని దర్శించుచు తదానందాతిరేకమున నొడలు మరచి యుందును గదా! ఇపు డా స్వామి ముఖసందర్శనమునకు నోచుకొననివాడ నయితిని గదా" యని వెతగందువాడు.

ఈ భావమే ఆయన ద్రావిడమున రచించిన ఒక పాశురములో ప్రతిబింబించినది---

ప. "శెడియాయ్‌వల్ విసైకళ్ తీర్క్కుం తిరుమాలే
నెడియానే వేంగడవానేన్ కోయిల్ వాశల్
అడియారుం వానవరు మరుందైయరుం కిడంది యంగుం
పడియాయ్ కిడందున్ పవళవాయ్ కాణ్బేనే."

దీనినే శ్రీమాన్ మాడభూషి గోపాలాచార్యులవారిట్లు తెనిగించి నారు---

గీ. "పాపఫలరూపభవదుఃఖ మాపు దేవ
అమరు లప్సరసలు భృత్యు లలమి యిచ్చు
నీదు వాకిటి మెట్టౌచు నీ పగడపు
మోవి గాంతునో వేంకటభూధరేశ!"

# శ్రీరంగయాత్ర

పౌరాణికులవలన కులశేఖరు లొకనాడు శ్రీరంగనాథుని దివ్యమహిమల నాకర్ణించిరి. ఇక నేమి? శ్రీరంగ మేగి యచట నా స్వామి దర్శనము చేయజాలనివాని జన్మము వ్యర్థమని వారి కనిపించెను.

"శ్రీరంగయాత్రా శ్రీరంగయియాసా చైవ నారద,
ఉత్తారయతి సంసారా న్నిత్యవాసస్తు కిం పునః?"

శ్రీరంగయాత్ర చేసినవారికి మాత్రమే గాక యా యాత్ర చేయ దలచినవారికి గూడ ముక్తి కరబదర సదృశ మని పురాణాదులు నొక్కి వక్కాణించుచున్నవి గదా! ఇక శ్రీరంగమున నిత్యనివాసము చేయువారు జీవన్ముక్తులే యగుదు రనుటలో సందియ మేమి? అను భావము గల పై పద్య మా రాజర్షి మనస్సున గట్టిగ బట్టెను. వెంటనే యీ యూహ వారికి తట్టెను. "ఈ శరీరము నశ్వరము. యౌవనము ఝరీవేగతుల్యము; పరువము ఫేనసదృశము; సంపదలు తటిచ్చంచలములు; దారపుత్రాదు లాశ్మశానగమనులు. హరిసందర్శనానంద

మొక్కటే నిత్యము; శ్రీరంగరాజసేవ యొక్కటే బ్రహ్మానంద సంధాయకము. కాన నిక భార్యాపుత్రాదులతో బాటు రాజ్యము గూడ త్యజించి నేను శ్రీరంగ క్షేత్రమున నిత్యనివాస మేర్పరచు కొందును." ఈ యూహతట్టుట యేమి---నేను శ్రీరంగము బైలుదేరుచున్నా నని కులశేఖరులు నగరమంతటను చాటబంచుట యేమి---రెండు నొకేపరి జరిగెను.

చక్రవర్తికి మిగుల కూర్చు మంత్రిసామంతాదు లీ వార్త విని మిగుల కలత చెందిరి. "మొదటనే మన రాజు భగవద్భాగవతాచార్యకైంకర్యనిరతుడు. దానికి తోడు శ్రీరంగమున కేగినచో నాయన భగవదేకార్పితమనస్కుడై ఇక నింటిమాట రాజ్యముమాట స్మరింపక పోవుట తథ్యము. కాన నీ రాజు నిల్లు వదలనీయరాదు" అని యొక పన్నాగము పన్నిరి. యాత్రకై గొప్పగొప్ప సన్నాహములు జరిగెను. చక్రవర్తి కొంతమంది యాత్రికులతో నొక సుముహూర్తమున నిల్లు వదలెను. మార్గమధ్యమున నా రాజర్షికి ద్వాదశోర్ధ్వపుండ్రధరులై నిరంతరభగవన్నామోచ్చారణ పరాయణు లగు శ్రీవైష్ణవోత్తము లెదురుగా నేగుదెంచిరి. వారిని చూడగనే రాజు తటాలున ప్రయాణ మాపివైచెను.

క్రింది శ్లోకములు వారి మనమున సదా మెదలుచుండుటయే దానికి కారణము---

"పూజనా ద్విష్ణుభక్తానాం పురుషార్థోఽస్తి నేతరః,
తేన తద్ద్వేషతః కించి న్నాస్తి నాశనమాత్మనః.
షష్టి ర్వర్షసహస్రాణి విష్ణోరారాధనే ఫలమ్
సకృద్వైష్ణవపూజాయాః కలాం నార్హతి షోడశీమ్."

విష్ణువును సేవించుటకంటె తద్భక్తులసేవయే విశేషఫల ప్రదము. విష్ణుభక్తులను ద్వేషించుట యన తన గోయి తాను త్రవ్వుకొనుటయే. అరువదివేల సంవత్సరములు శ్రీహరిని పూజించిన ఫల మొక్కపరి శ్రీవైష్ణవు నొక్కనిని పూజించుటలో పదునారవవంతు గూడ గాదు.

ఇక శ్రీరంగయాత్ర యను కోరిక నా రంగనాథునికే వదలివైచి కులశేఖరు డింటికి మరలి యానా డభ్యాగతులగు భాగవతశేఖరుల యాతిథ్య సత్కారములలోనే బ్రహ్మానంద మనుభవింపసాగెను. నాటి నుండి ప్రతిదిన మిదే తీరున శ్రీవైష్ణవ తదీయారాధన యవ్యాహత

ముగా జరుగసాగెను. ఈ రీతిగా శ్రీరంగయాత్రకు నిరవధిగా ఆటంక మేర్పడెను.

## రామాయణశ్రవణము

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసా దాసీత్సాక్షా ద్రామాయణాత్మనా."

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథాత్మజుడుగా నవతరింపగా నాతని దివ్యమంగళ స్వరూపమును కల్యాణగుణ పరంపరను వర్ణించు టకు వేదమే శ్రీమద్రామాయణరూపము ధరించి శ్రీరామచంద్రుని యెదుట చేతులు కట్టుకొని నిలబడెను.

"కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్."

శతకోటిగ్రంథపరిమిత మగు శ్రీరఘురాముని దివ్యచారిత్రమున నొక యక్కరము మనసార పల్కిననను జన్మ జన్మాంతర మహాపాతక ములు గూడ మొదలంటు నశించిపోవు నన సామాన్య పాపముల మాట చెప్పనేల?

"శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పదమేవ వా,
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా."

రామాయణమునందలి యొక పాదముగాని చివరికొక పదముగాని భక్తితో చదివినచో నట్టి వారితో బాటు విన్న వారు గూడ పర బ్రహ్మసాయుజ్య మంది పరమానంద మందగలరు.

శ్రీకులశేఖరులు ప్రజల నపత్యసదృశముగ కాపాడుట మాత్రమే గాక విష్ణుభక్తిని గూడ వారిలో వ్యాపింపజేసి వారి యిహపరములకై పాటుపడు చుండువారు. కాననే వారు తమ కొక్కరికొఱ్ఱె మాత్రమే గాక విశ్వశ్రేయస్సును దృష్టిలో నుంచుకొనియే ముకుందమాల రచించిరి. వారి రాజ్యమునందలి ప్రతివ్యక్తికిని నా కృతిరత్నము కంఠాభరణమై విల సిల్లెను. అంతేగాదా కవిశేఖరులా ద్రావిడభాషలో పెరుమాళ్ తిరుమొళి యను నూరుపద్యముల కావ్యమును గూడ హృద్యముగా నిర్మించిరి.

ప్రజలను విష్ణుభక్తిప్రబోధముచే కాపాడుట కవతరించి నందుననే కులశేఖరులకు ఆళ్వారు అను పేరు సార్థక మాయెను. ద్రావిడముతో బాటు సంస్కృతమున గూడ మధురభగవత్కవిత చెప్పినందున వీరికి పన్నిద్దరాళ్వారులలో ప్రత్యేక స్థానము కలదు.

ద్వయమంత్రార్థ ప్రతిపాదక మగు శ్రీమద్రామాయణ పఠన శ్రవణములందు మాత్రమే వారు తమ జీవితశేషము గడుపనిశ్చయించుకొనిరి. రామాయణము వేదప్రతిపాదకమగు పరతత్త్వమును నిరూపించు భక్తిగ్రంథము. అది నవనవోన్మిషద్రస పూర్ణాలంకారశైలీవిరాజితము. ప్రియాసదృశ మయినందున ప్రతియొక్కరి హృదయము నాకర్షించునట్టి దని ఘనత వహించినది. కాననే శ్రీకులశేఖరులు ప్రతిదిన ముదయమున వాల్మీకిరామాయణపారాయణము చేయుచు మధ్యాహ్నమున నందలి రహస్యార్థములను పౌరాణికులచే విని యాకళింపు చేసుకొని బ్రహ్మానంద సబ్రహ్మచారి యగు రసానందమున మునిగి తేలుచుండువారు.

శ్రీమద్రామాయణమును మించిన ముక్తిసాధనము మరొకటి లేదని తలచి కాలక్షేపము చేయుచున్న ఆ యాళ్వా రొకనా డీ శ్లోకము పౌరాణికునిచే శ్రవణానందముగా నాకర్ణించిరి---

శ్లో. "చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి.
ఋషయోఽభ్యాగమం స్తత్ర ద్రష్టుకామా స్తదద్భుతమ్.

భీమబలులగు పదునాల్గువేల రక్కసులు, ఖరదూషణాదులు కంచు రథముల నెక్కి మంచి పదునైన యాయుధములు చేబూని ప్రళయ భీకరసింహనాదములతో జనస్థానమున తన్నెదిరింపగా నా క్రూరులతో ధర్మాత్ముడగు శ్రీరాము డెట్లు బలగము లేకుండ నొంటరిగా యుద్ధము చేయగలడు? అని మనస్సున బాధపడుచునే వనవాసులగు మహర్షు లా పరమాద్భుతదృశ్యము చూచు కుతూహలముతో జనస్థాన సమీపమున నిసుక పైచిన రాలకుండ గుమికూడిరి.

ఎప్పుడో జరిగిపోయిన కథ గాక యీ సంఘటన ప్రత్యక్షమున నిప్పుడే జరిగి తనకే ఘోరవిపత్తు సంభవించినట్లు వారనుభూతిచెందిరి. ఆహా, ఆ మహాత్ముని భక్తి సంపద మన మందరముగూడ గర్వింపదగినది గదా! కాననే యీ వార్త చెవిని బడగనే వా రొక్కమారుగా నదరిపడిరి.

"ఎంత ఘోరము, జగత్పిత యగు శ్రీరామచంద్రు నేకాకిగా చూచి యింతమంది క్రూరమాంసాశనులు వారిని చుట్టుముట్టుటయా? ఈ దురుసుతనము నే నెట్లు సహింపగలను? నేనే యేగి యా ముక్కిడి రక్కసి మూకల నుక్కడగించి నా తండ్రిని కాపాడుకొందును" అని పలికి ధనుర్బాణ ఖడ్గాద్యాయుధములను, కవచమును ధరించి ఆ యధర్మ యుద్ధమును నిరోధించుటకు చతురంగసైన్యముతో తత్ క్షణమే బయలుదేరెను.

హఠాత్తుగా తమ రా జిట్లు బైలుదేరుటకు కారణము తెలియక మంత్రు లెంతో తల్లడిల్లిరి. రాజీవిధముగ నున్నటులుండి తగిన కట్టు దిట్టములు చేయక దేశమువీడి పోయినచో ప్రజలలో నరాజకము వ్యాపింపకమాన దని వారి భయము. కాన వెంటనే మంత్రు లా రాజును మరలించుటకు మంచియాలోచనచేసిరి. సమర్థులగు వైష్ణవో త్తము లూర్ధ్వపుండ్రధారులై రాజు కెదురుగా వచ్చి యిట్లు పలికిరి—

> "చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్,
> అర్ధాధికముహూర్తేన రాఘవేణైవ సంగరే.
> తేన ధర్మాత్మనైకేన నిహతాని నృపోత్తమ.
> తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్,
> బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే."

"ఓ రాజా, శ్రీరాముడు రెప్పపాటు కాలములో చతుర్దశసహస్ర సంఖ్యాకు లగు నా రాక్షసుల నొకే బాణమున సంహరించివేసినాడు. శత్రుసంహారముచేసి మహర్షులకు పరమసుఖము కలిగించినాడు గదా యని యానందాతిరేకముచే నొడలు మరచినదై పదిమంది చూచుచున్నారే యని యాలోచనగూడ తట్టని జానకి తన భర్తను గాఢపరిష్వంగమున బంధించెను. ఆహో, ఏమి శ్రీరాముని సుకృతము! ఆయన కెంత మధురపురస్కారము ప్రతిఫలముగా లభించినది."

భాగవతోత్తముల యీ పలుకులు కులశేఖరుల చెవుల కమృత ప్రాయమై సోకెను. వెంటనే యీ రాజర్షి యానందముతో కాగలకా ర్యము గంధర్వులే తీర్చినట్లు శ్రీరాముడే వారిని మట్టుపెట్టినాడు గదా! ఇక నా కీ ప్రయాణ మేలయని తలచి వెనుకకు మరలిరి.

## భక్తిపారవశ్యము

కులశేఖర చక్రవర్తి భక్తి సామాన్యమానవుల కలభ్యము. కాననే వారు భక్తిపారవశ్యమున నప్రతిములు. విష్ణుభక్తుడు కానివాని మొగము చూడనని, వారు ప్రతిన బూనిరి. కాన నా మహీపాలుని రాజ్యమున విష్ణుభక్తి విహీనుడు మచ్చుకైనను కాన్పింప డాయెను. ఆ రాజ్యమున నెటుచూచినను హరిభక్తియే తాండవమాడుచుండెను. శ్రీవైష్ణవులతో గలసి యా రాజచంద్రుడు హరిభక్తి కథామృతమును గ్రోలుచు కాలక్షేపము చేయుచుండువాడు.

రామాయణశ్రవణము చేయునపు డానందపారవశ్యముచే నొడలు మరచిన యా రాజు నేత్రములనుండి కన్నీరు మున్నీరై కాలువలు గట్టును. భక్తిప్రాచుర్యముచే శరీరము పులకాంకితమగును. కంఠము బొంగురువోయి నోటమాట పెగులదు. ఈ యలౌకికానందానుభూతిని కనిపెట్టిన పౌరాణికుడు శ్రీరాముని జయమును వర్ణించుపట్టులు మాత్రమే ఆ రాజుకు వివరించి రాముచు కష్టములు గల్గించు ఘట్టములు తడవక దాటవేసెడివాడు.

వృద్ధ పౌరాణికు డొకనాడు కార్యాంతరమున గ్రామాంతర మేగ వలసివచ్చెను. కాన నాయన కుమారుడు పురాణము చెప్పుటకు వచ్చెను. కథ చక్కగా సాగిపోవుచుండెను. కులశేఖరులు తదేకలగ్నమనస్సుతో నాలకించుచుండిరి. విషమఘట్టములు రాజువద్ద పరామర్శింపరాదని తన తండ్రి చేసిన కట్టడి మరచి పౌరాణికుడు సందార్భానుసారముగా రావణుడు సీత నెత్తుకొని లంకకు వెళ్ళిన ఘట్టము చెప్పసాగెను. అపు డీ శ్లోకము చదివెను---

"జహార రావణ స్సీతాం బుధః ఖే రోహిణీ మివ."

---బుధుడు రోహిణిని పట్టుకొనినట్లు రావణుడు సీతను ఎత్తుకొని పోయె నను మాట చెవిని బడగనే కులశేఖరులు త్రొక్కిన త్రాచువలె బుసకొట్టుచు లేచిరి. క్రోధాతిశయముచే వారి కనుబొమ లదరెను, ముకుపుటము లుబ్బెను, నేత్రగోళములనుండి యగ్నికణములే కురిసెను. బెబ్బులివలె గాండ్రించుచు "ఎవడురా! జానకి నెత్తుకొని

పోయినవాడు? వీరాధివీరుడను నే నుండగనే నా తల్లి నపహరించుకొని పోవుటకు వాని కెన్ని గుండెలు? చూడు డిప్పుడే వాని వంశమును పరివారమును సమూలముగ సంహరించి యా పదితలల పురుగును నేలబెట్టి కాల రాచి మా యమ్మను కసుగందకుండ గొనితెత్తును" అని పలికి కవచశరాసనధారియై ఉన్నవా రున్నటుల నొంటరిగా బైలు దేరిరి. రాజు పిలువకపోయినను మంత్రి సామంతాదులు, చతురంగబలము నేలయీనిన ట్లాయన వెంట నడువసాగిరి. ఆ చక్రవర్తి నెవ్వరును విరమింప సాహసింపజాలరైరి. వారి యానాటి సంరంభము మిన్ను మన్నేకమైనట్టి ప్రళయసమయమున హద్దులు దాటి పొంగిన సముద్రము ప్రపంచమును ముంచివేయు పరిస్థితియే దాపురించినదని ప్రజలు భీత చేతస్కులై ప్రాణము లఱచేత బెట్టుకొని ఏమి జరుగునో చూత మని నిరీక్షింపసాగిరి. పరమాద్భుతమగు నారాజు యొక్క భక్తిపారవశ్యమును, సంగర వినోదమును చూడగోరి సిద్ధసాధ్యగంధర్వాది దేవత లాకసమున గుంపులుకట్టి యనిమేషనయనములతో చూడసాగిరి.

ఆ రాజర్షి విసవిస నడచి యిసుమంతయు భయము లేక సముద్రము జొచ్చిరి. సముద్రమునుదాటి గదా రావణుని లంకను ప్రవేశింపవలెను! అపారసేనావాహిని గూడ ఆయన వెంట హరిహరీ యని కడలిని ప్రవేశించెను. "అయ్యో, ప్రజావత్సలుడగు మహారాజారీతిగ సముద్రమున బడిపోవు చున్నాడే? ఇక మన గతి యేమి" యని ప్రజలు భయాందోళితమనస్కులై తల్లడిల్లసాగిరి. వారి నేత్రములనుండి దుఃఖాశ్రువులు కాలువలు గట్టెను.

అట్టి కఠినపరీక్షనే గదా భగవంతుడు భక్తులపై ప్రయోగించునది! ఆ విషమపరీక్షలో గూడ కులశేఖరులు నెగ్గి రనుటలో సందియము లేదు గదా! కష్టములలో భక్తులను కాపాడుటకై కంకణము కట్టుకొన్న భగవంతుడు కులశేఖరులను చూచుచు నూరకుండునా? వెంటనే శ్రియఃపతియగు సర్వేశ్వరుడు శ్రీరాముని రూపము దాల్చి లక్ష్మణుడు వెంటరాగా సీతాదేవి పాణిపల్లవమును తన కెంగేల గీలించి యా సర్వేశ్వరుని కెదురేగుదెంచిరి—"వత్సా, నే నుండగా నీ కేల నోయి యీ శ్రమ! బంధుమిత్రాది సహితముగా నేనే రావణుని వధించి మాతల్లి జానకి నిదే వెంట బెట్టుకొని వచ్చుచున్నాను" అను భావ మా రామచంద్రుని మొగమున ప్రతిఫలింపగా దర్శించి కులశేఖరు లానందబాష్పకణికాతరళీకృతలోచనాంతు లైరి.

ఆహా! అది యెట్టి పరమాద్భుతదృశ్యము! దానిని వర్ణింప సాక్షాచ్ఛ్రీవాల్మీకిమహర్షి దివినుండి భువికి దిగి రావలసినదే! కులదైవము శ్రీరామచంద్రుని తమ చర్మచక్షువులచే దర్శించిన యా యానందము హృదయపాత్రలో నిమడక కులశేఖరమహర్షి వాక్కునుండి యెట్లు వెలువడినదో యీ ద్విపదవలన తెలిసికొన గలము—

## రామాయణ సంగ్రహము

ద్వి. "దశరథ నందన! తాటకా జైత్ర!
దశరథకౌశికాధ్వరవిఘ్నహరణ!
హరచాపభంజన! యువనిజారమణ!
పరశురామాభంగ పటుతపోహరి!
గురువాక్యపాలన! గుహవంద్య! మౌని
వరదాయి! దండకావనభూవిహారి
కుటజనన్నుత! మౌనికులనత! పంచ
వటవాస! రాక్షసవర గర్వహారి!
ఖరదూషణాదిరాక్షస కంఠదళన!
శరభిన్నమారీచ! శబరీప్రసన్న!
వాలిశాత్రవ! మాల్యవద్గిరివాస!
పాలితసుగ్రీవ! పౌలస్త్యవరద!
కంధిబంధన! దశకంఠసంహారి
బంధురనిర్జరపతిముఖ ప్రణుత!
భూమిజానంయుత! పుష్పకారూఢ!
స్వామి! రాఘవ! భరద్వాజ పూజార్హ!
సాకేతపురనాథ! జగదేకనాథ!
నా కులస్వామి! పై నాకులస్వామి!

—పరమయోగి విలాసము

ఇట్లా శ్రీరామచంద్రుని స్తుతించి యా పరమభాగవతోత్తముడు సముద్రమున దిగుట మాని గట్టు నెక్కుటకు వెనుకకు దిరిగిరి. ఇదే యదనని శ్రీరాము డదృశ్యుడయ్యెను. తన నయనములముందు నడయాడిన రామచంద్రుని మధుర మంజులమూర్తి చిటికెలో మటుమాయము కాగానే కులశేఖరులు పడిన పరితాపమున కంతము లేదు. "ఏమి నా దౌర్భాగ్యము! పుట్టుదరిద్రుడు భూరిశేవధిని సేవించిన ట్లును, జాత్యంధుడు నేత్రలాభమునందినట్లును నా యిలువేలుపును

కన్నులార గాంచగలిగిన నా సుకృత మింతలోనే దుష్కృతముగా మారి నదా? నే నెంత పాపాత్ముడను" అని యా మహాభక్తుడు దుఃఖముతో విలవిలలాడెను. చివర కెట్లో గుండె రాయిచేసుకొని యిల్లు చేరెను.

## చౌర్యారోపణము

కులశేఖరచక్రవర్తి చేయు భాగవతకైంకర్యమును తదీయారాధన మును అద్భుతము, అపూర్వము. వేనకు వేలు శ్రీవైష్ణవులను వారు మృష్టాన్న భోజనములచేతను వస్త్రువాహనాదులచేతను సంతృప్తి పరచు చుండువారు. షడ్రసోపేతముగా పంచభక్ష్యపరమాన్నములతో విందు లారగించినవా రాయనను "స్వస్త్యస్తు తే మహారాజకులశేఖర భూపతే" యని దీవించి పోవుచుండువారు. పెక్కు మాట లేల, తన రాజ్యమునే యా చక్రవర్తి, వైష్ణవుల కధీనము చేసి భగవద్గుణానుభవ భాగవతకైంకర్యములందే కాలక్షేపము చేయువారు.

వారి ఈ ప్రవర్తన మంత్రుల కెంత మాత్రము నచ్చలేదు. వా రిట్లు రహస్యాలోచన సలిపిరి— "ఈ రాజునకు రాజ్యకార్యచింతయే పట్టలేదు. భగవద్భాగవతచింతతోనే యిట్లితడు కాలము పుచ్చుట దేశా రిష్టదాయకము. ఈతనికి పిచ్చి యెత్తినది. సందియము లేదు. అట్లే కానిచో నిద్రాహారముల నైతము: వదలి యీత డిట్లు వైష్ణవులతోడిదే తనలోక మని తలచునా? ఆహా, ఎట్టి రాజనీతిజ్ఞున కెట్టి దుఃస్థితి దాపురించినది! ఈ పిచ్చి మూలమ్ముననే యాయన సముద్రములో దిగి ప్రాణములు పోగొట్టుకొనుటకు కూడ వెనుదీయలేదు గదా? దైవ యోగము చేత మాత్రమే మనరా జెట్లో బ్రతికి బైటపడుట తట స్థించినది. వేళయు పాళయు లేక వైష్ణవు లంతఃపురమున గూడ సంచరించు చుండుట చాల చికాకు కల్గించుచున్నది. రాజకార్యప్రవృత్తు డైనపుడుగూడ వీరు మన రాజును పట్టుకొని పీడించుచున్నారు గదా! అది రాజుకు బాధాకరముగా తోచకపోగా పైపెచ్చు వారి నందర నాతిథ్యసత్కారములతో గౌరవించి పంపుచున్నాడు! పోనుపోను రాజు భగవత్సేవనుగూడ మించి భాగవతసేవనే భుక్తిముక్తిదాయకముగా నెంచి తన సర్వస్వము తత్సేవలోనే వ్యయపరచుచున్నాడు. ఇట్లే మరికొంత కాలము జరిగిన ఈ రాజ్యమునకు ముప్పు వాటిల్లి తీరును. కాన

ప్రభుభక్తులమగు మన మేదో యుపాయముచే రాజుకు శ్రీవైష్ణవులపై నవిశ్వాసము కలిగింపక తప్పదు. అపుడు మాత్రమే మనము రాజహితైషులము కాగలము.'' ఈ విధముగా నాలోచించి వారది ఫలించుటకు తగిన సమయమునకై తమితో నిరీక్షింపసాగిరి.

ఒకసారి శ్రీరామనవమి వచ్చెను. ఆ యుత్సవ మహోసంరంభము చూచి యానందించి తీరవలసినదే గాని వర్ణింపనలవి గాదు. నాడు శ్రీసీతారాముల కల్యాణమహోత్సవమునకై నిర్మింపబడిన యాకసము నంటు పందిళ్ళవలన సూర్యరశ్మియే కంటికి కానరాలేదు. పన్నీటి కల యంపి చల్లుటచే బాటలు సువాసనలు వెదజల్లసాగెను. స్తంభములకు గట్టిన యరటిబోదెలు వింత సొబగు లీనుచుండెను. ధ్వజపటము లా రాజచంద్రుని కీర్తిపతాకలవలెనే యాకాశమున నెగుర సాగెను. శంఖ భేరీమృదంగాదుల శ్రవణసుఖనాదములతో సామవేదగానములతో నచట నున్న వారి కొకరి పలుకు మరొకరికి వినబడుట గూడ లేదు.

ఇక భక్తకవిశేఖరులు శ్రీకులశేఖరుల యానందమేమని వర్ణింప నగును? శ్రీసీతారాముల తిరుమంజన (అభిషేక) సమయ మాసన్న మాయెను. దేవాలయార్చకులు స్వామివారి సొమ్ములను జాగ్రత్తగా తీసి భద్రపరచిరి. అభిషేకము జరుగు చుండెను. వేదవేదాంతపారంగతు లగు శ్రోత్రియవైష్ణవులు శ్రీమన్నారాయణుని విరాట్ స్వరూపమును చిత్రవిచిత్ర రీతులతో వర్ణించు చుండిరి. నృత్తగీతవాద్యములతో శోభాయమానముగా జరుగుచున్న యా యుత్సవ మా రాజశేఖరులు కన్నుల పండువుగా సందర్శించుచుండిరి. వారి మన మితర విషయముల నెంత మాత్రమును స్మరించుట లేదు. కన్నుల కా యర్చావిగ్రహ సౌందర్యము తక్క మరేమియు కానుపించుట లేదు. సుభగశ్రుతి నాదమే గాని యితరము వారి చెవికెక్కుట లేదు. ఆ వేడుకయందే వారి హృదయము పరిపూర్ణముగా లగ్నమైయున్న తరుణము చూచి— మంత్రులు, అర్చకులు తీసి యుంచిన స్వామివారి ముక్తాహార మపహరించి వెంటనే దానిని రహస్యస్థలమునకు పంపివైచిరి.

అభిషేకానంతరము స్వామివారికి ఆభరణము లలంకరించు సమయ మాసన్న మాయెను. కాని మౌక్తికమాల కానరాలేదు. అర్చకుల పాదముల క్రిందనుండి నేల జారిపోయెను. హారము కాన రాలేదని తచిత్తులై వారు చక్రవర్తికి నివేదించిరి.

పిడుగువంటి యీ వార్త కులశేఖరుల గుండెనే పగుల గొట్టెను. వారి కనులముందు చీకట్లు గ్రమ్మెను. "ఇది సంభవమా? నే నెదురుగనేయున్నాను. నా కనులమ్రోలనే యింత దారుణము జరిగినదే! స్వామివారి కింత ద్రోహము తలపెట్టిన యీ తుంటరు లెవ్వరు? ఈ చండశాసనుని కంట దుమ్ముకొట్టి వారు తప్పించుకొనగలరా! సరే, నిజ మిపుడే తేల్చక తప్పదు" ఇట్లు తలచి యీ రాజు మంత్రుల కిట్లు కఠినముగా కట్టడి చేసిరి--"దైవద్రవ్యాపహారిని నేను క్రూరముగ శిక్షింపక వదలిపెట్టువాడను గానని మీరును నెరుగుదురు గదా? కాననా చోరు నే విధముగా నైనను పట్టి తెండు. లేకున్న మీ ప్రాణములు మీకు దక్కవు, జాగ్రత్త."

మంత్రులు వారి చెవిలో నిట్లు చెప్పిరి---"ప్రభూ, నిజము దాచక చెప్పెదము. ముందు మా కభయమిండు. మీహృదయ మెరిగియే మేము చౌర్యాదు లీ రాజ్యమున జరుగకుండ వేయి కన్నులతో కని పెట్టుచున్నాము. ఈ పరిస్థితిలో నితరు లెంత మాత్రమును నీ దొంగతనము--- విశేషించి మీయెదుట---చేయ జాలరు. మా కొకటి తోచుచున్నది. మీ రిచ్చిన యలుసును పురస్కరించుకొని శ్రీవైష్ణవులే ధనాశావిష్టులైన యీ నింద్యకృత్యము కావించియుందురు. సందియ మేల? మంత్రాలయము నందును, నంతఃపురమందును, రాజసభయందును గూడ స్వేచ్ఛగా సంచరించు భాగవతోత్తముల దుష్కృత్యమే యిది. రాజ్యహితైక కాంక్షతో మాకు తోచినది, మేము నమ్మినది విన్నవించినాము. ఆ పై మీ చిత్తము. ఈ రాజ్యము మరల బాగు పడుట యెన్నటికో గదా! మా విన్నపము మీకు తప్పుగా దోచిన క్షంతవ్యులము.

## శపథము

ఇది వినగనే కులశేఖరచక్రవర్తి పరిస్థితి త్రాచుపాము కాటుతిన్నట్లాయెను. మొగము వివర్ణ మాయెను. అయినను నుద్వేలముగా పొంగివచ్చిన క్రోధమున కది యదను గాదని నిగ్రహించుకొనిరి. తన మడిమాన్యము లనుభవించువారై యుండిగూడ మంత్రు లీ రీతిగా తా నత్యంతము భక్తిశ్రద్ధలు నెరపుచున్న భాగవతోత్తములపై చౌర్యారోపణ చేయుటయా? వారి కిది యసహ్యదారుణవేదనాజనక మయ్యెను.

విషమును బోలిన రాజ్యవిషయముల నిక విసర్జింపక మార్గాంతరము లేదని తలపోసిరి. భాగవతోత్తములపై తమ మంత్రులు మోపిన యారో పణలోని సత్యాసత్యములను బట్టబయలు చేయవలసిన సమయము సమీపించినదని వారు నిర్ణయించిరి.

"మంత్రులారా! మీనీచప్రలాపములు కట్టిపెట్టుడు. పరమవిషయా సక్తులగు భాగవతోత్తములు పరధనమును—అందును దైవధనమును—అ పహరించు ఘోరమున కెప్పుడును పాల్పడరు. ఇది ముమ్మాటికిని ధ్రువము. ఈ విషయమును ప్రమాణపూర్వకముగా నిపుడే యంద రకును ఋజువుచేసెదను. ఇదే నా శపథ మాలకింపుడు. దైవనింద గాని తద్భక్తుల నిందగాని విన్నవాడు సుకృతహీనుడై నరకకూపమున బడు ననగా నా నిందలు చేయువాడే గతి చెందునో యెట్లు చెప్పనగును? అట్టివారి జిహ్వోచ్ఛేదము చేయవలె నని శాస్త్ర నిర్ణ యము. త్రిమూర్తులలో విష్ణువే ప్రముఖుడు గదా! జగత్కారణమగు నా విష్ణువునకు భక్తులయినందున విష్ణువు కంటె గూడ వైష్ణవులే ముఖ్యులు. అట్టి శ్రీవైష్ణవుల నింద నెట్లు సహించుట! నేటికి నే నిట్లు భాగవతదూషకుల మొగములు చూడవలసి వచ్చినది గదా! దీనికి ప్రతిఫలముగా నే నెట్టి నరకయాతనల నందవలసి యున్నదో!" అని పలికి కులశేఖర భూపాలుడు సచేలస్నాన మాచరించి వచ్చి భాగవతస్మ రణ చేయుచు రాజగోపాలదేవుని సన్నిధిని నిశ్చలుడై— "భాగవతులు పరమపవిత్రులు, ధనాశ వారికెన్నడునునంటదు, అట్టి వారు చౌర్యమున కెంత మాత్రమును పాల్పడరు. దాని కిదే సాక్ష్యము" అని పలికి బుసకొట్టుచున్న నల్లత్రాచును తెప్పించి చేతబట్టుకొనిరి. ఆ రోమ హర్షక దృశ్యము చూచి మంత్రుల పై ప్రాణములు పైనే పోయెను. వెంటనే వారు తాము దాచిపెట్టించిన ముత్యాలహారము తెప్పించిరి. వైష్ణవులపై తాము చౌర్యారోపణము చేసినందుకు కూడ కారణము తెలిపిరి. రాజ్యహితార్థము చేసిన తమ తప్పిదము క్షంతవ్య మని శ్రీవైష్ణవులను, రాజును గూడ పాదములు పట్టుకొని వేడికొనిరి.

ఈ సంఘటనతో నిహముపై మహావిరక్తి కల్గిన కులశేఖరు లిట్లు తలపోసిరి—

"వరం హుతవహజ్వాలాపంజరాంతర్వ్యవస్థితిః,
న శౌరిచింతావిముఖజనసంవాసవైశసమ్."

మాళ్ తిరుమొళి గూడ ఈ విషయమునే రుజువు పరచుచున్నది. "కలౌ వేంకటనాయకః" అని ప్రసిద్ధి గాంచిన శ్రీనివాసుని యొక్కయు ఇక్ష్వాకుకుల దైవతమగు శ్రీరంగనాథుని యొక్కయు గుణానుభవసందోహమును వర్ణించుటచేత మాత్రమే గాక ఈ కులశేఖర పెరుమాళ్ రచించిన దగుటచేతనే ఈ గ్రంథమున కీ పేరు సర్వధా తగియున్నది.

మిగిలిన యాళ్వారుల మీద కంటె రామానుజాచార్యుల వారు వీరియెడ మిక్కుటమగు శ్రద్ధాభక్తులు కల్గియుండు వారు. దీనికి పెరుమాళ్ తిరుమొళి ప్రారంభమున తద్రచయితను స్తుతించిన రామానుజుల ఈ ద్రవిడగాథయే సాక్షి--

ప."ఇన్నముద మూట్టుకే నింగే వా పైం గిళియే
తెన్నరంగం పాడవల్ల శీర్ పెరుమాళ్--పొన్నిల్
శిలై శేర్ ముదలియర్ వేల్ శేరలర్ కోన్ ఎంగళ్
కులశేకర నెన్నే కూరు."

'అందమైన ఓ రామచిలుకా, విల్లువలె వంగిన కనుబొమలు గల మీనలోచనల కాకర్షణీయుడును, మదనసుందరుడునునగు మా చేర కుల శేఖరుడగు కులశేఖరుని నామామృతముతో మా వీనులకు విందుచేసి నీవు మా జన్మము సార్థకము చేయుము. ఏలయన నా కవికులచక్రవర్తి శ్రీరంగనాథుని గుణగానము చేసినందున సకలకల్యాణ గుణసంపత్పరిపూర్ణుడగు పెరుమాళ్ళే అయినాడు సుమా! ఈ పనిని నీ వూరక చేయ నక్కరలేదు. దీనికి ప్రతిఫలముగా నమృతమువంటి ఖండశర్కరతో నీకు విందుచేసెదను. కాన నాలసింపక రమ్ము.

హే మర్త్యాః పరమం హితం శృణుత వో వక్ష్యామి సంక్షేపతః
సంసారార్ణవ మాపదూర్మిబహుళం సమ్యక్ప్రవిశ్య స్థితాః,
నానాజ్ఞాన మపాస్య చేతసి నమో నారాయణాయేత్యముం
మంత్రం, సప్రణవం ప్రణామ సహితం ప్రావర్తయధ్వం ముహుః.
---ముకుందమాల

ఉ."నీవు దయాసముద్రుఁడవు, నిన్నుమగొన్న నఘంబు దూలు, నీ
చే వరమంది సత్కవిత సేతును, నీ కొఱకై నమస్కృతుల్,
నీ వలనన్ ప్రభావితుఁడ, నీకు సమర్పణసేతు సర్వ మో
శ్రీవర, త్వత్స్వరూపమున చిత్తము హత్తెను, కావు రాఘవా!
---శ్రీనరసింహస్తుతి

* * *

# VIII గోదాదేవి [ఆండాళ్]

"కర్కటే పూర్వఫల్గున్యాం తులసీ కాననోద్భవామ్,
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగ నాయకీమ్.

నీలాతుంగస్తనగిరితటీసుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధ మధ్యాపయంతీ,
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుంక్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః.

శ్రీవిష్ణుచిత్తులు వటపత్రశయనుని సన్నిధిలో తులసీవనమును నితర పుష్పజాతులను పెంచుచుండు వా రని ముందే చెప్ప బడినదికదా! అంతేగాదు. వారు వేర్వేరు రంగులు గల వివిధసుమరాజితో సప్తవర్ణసంకలిత మగు నింద్రధనుస్సువలె కన్నులకు మిరుమిట్లు గొల్పునట్లు మాలలు కట్టి యా సుమమాలలు తన్నగరపాలకుడు శ్రీమహావిష్ణువునకు సమర్పించి ధన్యు లగుచుండువారు. ఆ పనిలో వారి కెంతో తృప్తియు నానందమును కలుగుచుండెడివి.

## బాలాలాభము

పూర్వము నాగలితో నేలదున్నుచుండగా జనకరాజర్షికి పుత్తడిబొమ్మ సీతాదేవి చేతికి చిక్కినది గదా! సరిగా నట్లే యీ భట్టనాథులు తులసీ వృక్షమూలమును త్రవ్వి పాదుచేయుచుండగా నొక ప్రాణము గల యపరంజిబొమ్మ వారి కంటబడెను. కర్కటమాసమున పుబ్బానక్షత్రమున క్రీ.శ. 776 వ సంవత్సరమున కంటబడిన యీ బాలికను పెన్నిధిని గన్న పేద చందమున తనవెంట కొనిపోయి పెరియాళ్వారులు తమ భార్య కిచ్చిరి. వా రామెకు 'కోదై' యని నామకరణము చేసిరి. చూడిక్కొడుత్త నాచ్చియార్, ఆండాళ్ అని అరవమునను-- గోదాదేవి, ఆముక్తమాల్యద అని సంస్కృతమునను ఆమెకు నామాంతరములు గలవు. కన్నబిడ్డకన్న నెక్కువ మక్కువతో నా దంపతులా లేమను పెంచసాగిరి.

ఆ బాలిక శుక్లపక్షచంద్ర రేఖవలె సర్వజన నయనానందకరముగా నెదుగ సాగెను. భూదేవి యంశమున జన్మించినదని నమ్మి యా

బాలిక నితరులుగూడ నెంతో గౌరవప్రేమలతో చూచుచుండువారు. ఆమె అవయవము లపూర్వలావణ్యముతో తళుకు లీనసాగెను. భక్తి జ్ఞానవైరాగ్యము లీమెలో రూపు గట్టుకొన్నవా యనునట్లుగా నామె చూచువారి హృదయములను దోచుకొనుచు కుందనపుబొమ్మవలె నడయాడసాగెను. తండ్రియే యామెకు పంచసంస్కారములు చేసెను. కౌమరిత సద్గుణముల కా మహర్షి యొకవంక యొడలు తెలియని యానందమున మునిగి తేలుచుగూడ వేరొక వంక నీ రాకాచంద్రికకు సద్గుణసోము డగు వరుడెట్లు లభించునా యని యాందోళన చెందసాగిరి. ఆడుబిడ్డను కనినప్పటి తలిదండ్రుల యానంద మామెను తగిన వరునికి కట్టబెట్టినప్పుడు మాత్రమే చరితార్థమగును గదా!

## మాలాధారణము

మగువలకు మాల్యము లన్న సహజముగ సరదా. అందును సుకుమారియు నతిలోక లావణ్యవతియు, నప్రాకృత దివ్యమంగళవిగ్రహయు నగు నా బాలిక యలంకారప్రియయగుటలో నుంతయేని వింత యుండదు గదా! సహజ సౌందర్యము నినుమడించు పూలమాలలు ధరించుట యా లేమకు చాల నిష్టము. కాని తాను తోటలో తిరిగితెచ్చి పూలు గ్రుచ్చుకొని ధరించుట కొంత శ్రమకే కారణము గదా!

తన కోరిక యెట్లు సిద్ధించునా యని యనుకొనుచునే యుండగా నామెకు మెరపువంటి యూహ తట్టెను. తండ్రి యెట్లును వటపత్రశాయికై మాలలు కట్టి సిద్ధము చేయుచునే యున్నాడు. తా నంత యందముగా నాపని చేయజాలదు గదా! అయినప్పుడు తండ్రి కట్టియుంచిన మాలికలు తీసి సిగలో ముడుచుకొనిన నెట్లుండును? ధరించి చూచినగదా దానియందము తెలియుట.

ఈ భావము మదిలో తట్టగనే యామె పూల తట్టలో స్వామికై తండ్రి కట్టి యుంచిన యొక మాల తీసి శిరస్సున ధరించుకొనెను. వెంటనే యామె తనప్రతిబింబము నద్దములో చూచుకొనెను. ఆహో, ఏమి సౌందర్యము, ఏమి లావణ్యము. ఆమెకు తన యందము తానే కబళించి వేయవలెననిపించుచున్నదే! అయిన ఈ నా యందము ననుభవించి నాయానందమున పాలుపంచుకొను సొగసుకా డెందున్నాడో యను

మధురోహ గూడ నొకపరి మదిలో మెదలి యామె కపుడపుడు గిలి-గింతలు పెట్టుచుండెడిది.

ప్రతిదిన మిట్లు జరుగుచునే యుండెను. కాని యే రహస్యమును నెల్ల కాలము దాగియుండదు గదా! ఒకనాడు పూలమాలలు తండ్రి తీసుకొని పోవుచుండగా నొక వెండ్రుక వారి కంటబడెను. అపుడు తండ్రి యనుమానించి కొమరిత నడుగగా నామెయు తప్పనిసరి యైనందున తన తప్పు నొప్పుకొనెను. ఇది తెలియగనే తండ్రిశిరమున పిడుగు పడిన ట్లయ్యెను. కన్నులు చీకట్లు క్రమ్మెను. ఎంతో ప్రేమతో పెంచుకొనిన యా కొమరితపై సైతము వారికి జుగుప్స, క్రోధము మొదలగు భావము లేకకాలమున జనించెను. కాని యామె ఏకైక పుత్రికయు భూమ్యంశజనితయు గాన నెట్లో నిగ్రహించుకొని "ఏమమ్మా, యిట్టి యపచారమునకు పూనుకొన్నావు. గతం గతమ్. ఇకముం దెన్నడు నిట్టి తప్పు చేయకు" మని మందలించెను. తన బిడ్డ ధరించిన నిర్మాల్యమును భగవంతున కర్పింప మనసురాక కోవెలకు పోవుటగూడ యాయన మానుకొనెను. 'అయ్యో, నేడు నా స్వామికి కట్టియుంచిన మాలను గూడ నర్పింపలేని హతభాగ్యుడ నయితిని గదా!' యని యాయన మిగుల వనటచెంది శయ్యపై మేను వాల్చెను. అలసి యుంటచే వారికి వెంటనే కునుకు పట్టెను.

స్వప్నమున వటపత్రశాయి వారికి ప్రత్యక్షమై "యేమి భట్టనాథా! స్వహస్తనిర్మిత సుమమాల లీ నాడు తెచ్చి నీవు నాకు ధరింపజేయ కుండుటకు గత మేమి?" యని యడిగెను. విష్ణుచిత్తులును "స్వామీ, నా కొమార్తె మహాపచారమే దీనికి కారణ"మని పలికి భయముతో తద్వృత్తాంతమంతయు పూసగ్రుచ్చినట్లు ఆ స్వామికి నివేదించెను.

## ఆముక్తమాల్యద

అది విని భగవానుడు మందహాసవికసిత వదనారవిందాంచితుడై యి ట్లానతిచ్చెను—"ఓయీ, పిచ్చిబ్రాహ్మణుడా, ఇదియా నీ సందియము! నీ తెచ్చు పూలమాలలు నీ బాల ముడిచి విడిచినవని నేను చిరకాలము క్రిందటనే యెరుగుదును. కాననే వాని నంత ప్రేమతో నేను ధరించుటయు గూడ. నీవు నే డా మాలలు తేనందున నాకు

కన్ను మూత పడుటలేదు. అసలు మనసున కేమియు తోచుట లేదు. అయినను నేటి కెట్లో యీ నిశాశేషము వేగింతుము. రేపటినుండి మాత్రము నీవు త్వత్పుత్రి శిరోజధృత మగు మాలలు నాకై తీసుకొని రాక తప్పదు సుమా!" యని గట్టిగా కట్టడి చేసి యదృశ్యుడాయెను.

విష్ణుచిత్తు లులికిపడి లేచిరి. ఇంతవరకు కన్నుల యెదుట నున్న మహావిష్ణువు మాయ మగుట వారికి చాల బాధ కల్గించెను. కాని విష్ణు వానతిచ్చిన సంగతి స్మరణకు రాగానే వారికి పట్టరాని యానందము కలిగెను. "అహో, నే నెంత ధన్యాత్ముడను. ఇంతవరకు మూఢు డనై కన్నతల్లి గోదాదేవిని సామాన్య మానవకాంతగా దలచినాము. శ్రీమహావిష్ణువు ననుగ్రహమునకు పాత్రురాలు కాగల్గిన నా పుత్రియు, తజ్జనకుడనైన నేనును నెంతో భాగ్యశాలులమైతిమి గదా! నేటికి నా జన్మము తరంచినది" అని వారు తమకు కల్గిన యానందము లోన నిముడ్చుకొనలేక యెదుట నున్న వారికి గూడ దానిలో పాలు పంచి యిచ్చిరి.

ఇక పెరియాళ్వారు తనకొమార్తెను మామూలు స్త్రీవలె గాక భక్తి పూర్వకముగా మహాలక్ష్మి యను భావముతోనే చూడసాగిరి. నాటినుండి గోదాదేవికి ఆముక్తమయిన—తాను ముడిచి విడిచిన—మాల్యములను భగవంతున కిచ్చునది అను నర్థము నిచ్చు 'ఆముక్తమాల్యద' యను పేరు సార్థక మాయెను. చూడిక్కొడుత్తనాచ్చియార్ అను మాటకు గూడ నిదే యర్థము.

ఈ యాముక్తమాల్యదచరిత్ర మా పేరుతోనే గొప్ప ప్రబంధ కావ్యముగా శ్రీకృష్ణదేవరాయలు "దేశ భాషలందు దెలుగు లెస్స" యని పొగడొందబడునట్లుగా నిర్మించెను. అది నారికేళపాకమున నున్నను భగవంతునకు నారికేళఫలములవలె రసపిపాసువులకు మిగుల నుపాదేయమయినది.

## తిరుప్పావు (వ్రతాచరణము)

విష్ణుకైంకర్యనిరతయై యొప్పారు గోదాదేవి జ్ఞానభక్త్యాది దైవీగుణ సంపన్నయై భూతులసి వలెనే దివ్యసౌరభావహ కా జొచ్చెను. జ్ఞాన

వైరాగ్యాదు లగు నప్రాకృతిక గుణము లామెలో పదుగురాళ్వారులను మించి వికసింపసాగెను. మగవానిని మగవాడును, మగువను మగువయు ప్రేమించుట ఉన్నత స్థానాధిరోహణమును బోలె దుష్కరము. స్త్రీని పురుషుడు కాని, పురుషుని స్త్రీ గాని ప్రేమించుట పైనుండి క్రిందికి జారుటవలె సులభము. కాననే గోదాదేవి భగవంతుని ప్రేమించుట యత్యంత సహజవిషయ మాయెను. తాను ధరించి వదలిన పూల మాలల నహో భాగ్య మని తలచి స్వీకరించు వాని నే మగువ యైన ప్రేమింపకుండ యుండగలదా! అందును సాక్షాత్తుగా వటపత్రశా యియే తన నిర్మాల్యానురాగి యయ్యె ననుట యే ముదితకు ముదము కలిగింపకుండ నుండగలదు?

నందాదులకంటె కృష్ణప్రేమ గోపికలయందే యధికముగా భాసించె నని వేదవ్యాస మహర్షి గూడ శ్రీమద్భాగవతమున వక్కాణించి యుండెనుగదా! కాననే పురుషులకు భగవంతునిపై నుండు ప్రేమ కంటె స్త్రీలకు దేవునిపై నుండు ప్రేమ యధికార్తియుతము; సద్యః ఫలదము. గోపికలు గృహారామ క్షేత్రాదులను, పతిపుత్రాదులను, మాన మర్యాదలను పరిత్యజించి యహర్నిశ లా శ్రీకృష్ణు నెట్లు భజించిరో యట్లే గోదాదేవి కూడ విష్ణువునే సదా భజించుచు నేకాంతమున నాతని గలసి యెప్పుడెప్పుడు రమింపగలనా యని తహ తహ చెందసాగెను.

తన పుత్రిక హరిసంయోగమునకై పడుచున్న పరితాపమునకు విష్ణుచిత్తుల హృదయ మగ్ని ప్రక్కనున్న లక్కవలె కరగిపోయెను. కాన వారు ప్రియసంయోగమునకై తమ ముద్దు పట్టికొరక యుపాయము తెల్పిరి—"అమ్మా, పూర్వము గోపికలు కృష్ణుని భర్తగా పొందుట కొక వ్రత మాచరించినారు. అదియే ధనుర్మాస వ్రతము!" అనిపలికి దాని విధానముగూడ నాయన తన పుత్రి కుపదేశించిరి.

"హేమంతే ప్రథమే మాసి నందవ్రజకుమారికాః
చేరు ర్హవిష్యం భుంజానాః కాత్యాయన్యర్చన వ్రతమ్."

ఇక నేమి? భగవత్ప్రేమపారంగతయు మహాభాగయును నగు గోదా దేవి యా కాత్యాయనీవ్రతమును భక్తితో నాచరింపసాగెను. నీటిలోచేయి పెట్టిన గడ్డకట్టు చలిలో నుషఃకాలమున లేచి శీతలజలస్నాన మాడి హవిష్యాన్నము నొంటిపూట భుజించుచు గోపిక లాచరించిన వ్రతమునే

యామె యాచరించెను. దానితో బాటు ప్రతిదినము మురహరుపై నొక్కొక్క పాశురము కట్టి పాడసాగెను. ఈ విధముగ దినమున కొకటి చొప్పున నామె కట్టి పాడిన ముప్పది పాశురములు గల దివ్య ప్రబంధమే తిరుప్పావు. సంపత్కర మగు వ్రత మని యీ పదమున కర్థము. సంపత్కర యగు స్త్రీ యని గూడ నర్థాంతరము. ఇది గాక నాచ్చియార్ తిరుమొళి యను 140 గాథలు గల కృతి గూడ రచించి ద్రవిడ సాహిత్యమున నెన లేని కీర్తి గడించిన కవయిత్రి గోదాదేవి. ఈమె భావముల నాధారము చేసుకొనియే అనన్యార్తియుతయు హిందీ భక్త కవయిత్రియు నగు మీరాదేవి వ్రజకిశోరునిపై రాల్లరగునట్లు విరహ కవిత లల్లి యావద్భారతమును తన కవితాసుధలో ముంచి యెత్తెను.

## వరవరణము

అస్తు, ప్రస్తుతాంశములకు వత్తము. యోగ్యవర సంయోగమునకై తహ తహ లాడుచున్న పుత్రికను చూచి తజ్జనకుడు గూడ—

పతిసంయోగ సులభం వయో దృష్ట్వా చ మే పితా,
చింతార్ణవగతః పారం నావసా ద్బ్లవో యథా.

భర్తతో కలసి కాపురము చేయదగిన వయస్సులో నడుగు పెట్టిన జానకిని చూచి వికలమనస్కుడైన జనకరాజర్షి వలెనే వ్యగ్రచేతస్కుడాయెను. తన తండ్రి తనకై పడు వెతను గాంచి హరిప్రియ యైన గోదాదేవి యిట్లు పల్కెను—"తండ్రీ, నేను విష్ణువును తక్క తక్కొరుని వరింపను. న న్నాతడే రక్షించును. నీ విక చింత వీడి నిశ్చింతగా నుండుము." ఆ మాట విని విష్ణుచిత్తులు మనస్సున కలతదేరి యిట్లనిరి. "తల్లీ—

అష్టాదశ స్థలా న్యత్ర పాండ్యదేశే రమాపతేః,
కేరళేషుమహాభాగే దివ్యదేశా శ్చతుర్దశ.
ద్విచత్వారింశ దిత్యాహు శ్చోళదేశస్థలాని హి,
తే త్రయోవింశతి ర్దివ్యదేశా స్తుండీరమండలే,
ఉదీచ్యాం దిశి దివ్యాని స్థలా న్యేకాదశ స్ఫుటమ్.

నూటఎనిమిది వైష్ణవ దివ్య దేశము లీ యిలపై గలవు. దక్షిణమున పాండ్యదేశమున 18, కేరళమున 14, చోళదేశమున 42,

తుండీరమండలమున 23, ఉత్తర భారతమున 11 గలవు. ఈ దేవుల యవతారముల వైభవములను వివరించెదను. నీ కిష్టమైన దేవుని వరింప నగును.

గోదాదేవి యవధానముతో వినుచుండగా వా రాయా యర్చామూర్తుల వైభవమును, మహిమాతిశయమును వీనుల విందుగా వివరింపసాగిరి. ఉత్తరమధురాపతి శ్రీకృష్ణుని చరిత్ర వినగానే యామె యురఃప్రదేశమున పులక లంకురించెను. రమణీ మనోహరు డగు పద్మావతీరమణుని వృత్తాంతము వినుచుండ నామె రమణీయ ముఖాంబుజము రక్తాశోకమయ్యెను. కాని శ్రీరంగనాథుల సౌందర్యసౌశీల్యసౌకుమార్యాదుల నాకర్ణించిన యామె ముఖము రాకేందుబింబమే యాయెను. ఆ యరవిందదళేక్షణ శ్రీరంగ రాజుని మహిమోదయ మాకర్ణించుచునే యమందానంద మందెను.

విష్ణుచిత్తుని ప్రార్థనానుసారము 108 దివ్యదేశములందలి విష్ణువు నర్చామూర్తులును గోదాదేవికి ప్రత్యక్షమాయిరి. వా రందరిలో భువన సుందరవిగ్రహు డగు శ్రీరంగనాథునిమీదనే యామెకు మోహ ముదయించెను. త న్నామె పూర్వమునుండియు ప్రేమించుచున్నదని తెలిసికొని యామెపై బద్ధానురాగు డయ్యెను. చివర కాయితర దేవత లందరును స్వస్థలములకు మరలి పోయిరి.

## విరహవిపంచి

గీ. "శ్రుతులు పలికించి యుష్మదంకితములైన
కృతులు పాడంగ వీణ పట్టితిని గాని
కటకటా! ఏమి చెప్పదు, కంఠమునకె
గాక హస్తమునకును గాద్గద్య మొదవె."

---యను భావము ప్రకారమామె రంగనాథుని పై తాను రచించిన గాథలు వాక్కుతో పలుకుచు వీణపై పలికింపదలచి యాతని స్మృతి మాత్రముచేతనే గొంతుబొంగురు వోయి చేతులు తడబడుటచే రెండు పనులను చేయజాలక పోయెడిది.

అంతేకా దా సీమంతిని---

గీ. "ఏగిరి నీ పాదములచెంత కెట్లు వచ్చి
వ్రాలుదునో యన్న యుత్సుకత్వంబు గలదు;

సాధ్యసాధన మైన షక్షములు జంట
హృదయమున కుండి; లేదు శరీరమునకు."

శ్రీరంగపతీ, ఎంతకాలము నన్నిట్లు వేపుకొని తిందువయ్యా! ఒక్క ఎగు రెగిరి వచ్చి నీ పాదపంజరమున చిక్కు కొనవలె నని గుండె గుబ గుబ లాడుచున్నది. కాని యయ్యో, హృదయమునకు రెక్కలు గలవు గాని శరీరమునకు లేకపోయె గదా! నే నెంత మందభాగ్యను, కానిచో నొక పిట్టనై పుట్టి యుండిన నా భర్త నీ క్షణమున చేరి యుండనా? అని దిగు లందుచుండెడిది.

నానాటికి పూచికపుల్లవలె నగుచున్న తన బిడ్డ శరీరస్థితి గాంచి జితేంద్రియులగు విష్ణుచిత్తుల హృదయము గూడ వశము తప్పిపోయెను. "అయ్యో, చిదిమి దీపము పెట్టదగిన నాపట్టి కొడిగట్టిన దీపమై పోయినదే! రంగనాథునంతటి వాని నల్లుని చేసుకొనదగిన శక్తి నా కెక్కడిది? నీకు కావలసిన దేవుని పతిగా తప్పక తెచ్చెద నని బీర ములు పలికితినే! ఇపుడెట్లు దానిని నెరవేర్చుట! పేద బాపడను. నే నా స్వామి కోరిన కోరిక లెల్ల నీడేర్చుటయును, నాస్వామి నాపుత్రిని పెండ్లాడుటయునునా? ఏల యీ యడియాస! తనకై నాపట్టి విరహ విపంచి నాలాపించుచుండగా నాతడు నిష్కరుణుడై చూచుచు నెట్లూర కున్నాడో గదా! అయినను పెంచిన నాకు బాధ గాని నా బిడ్డనుగూర్చి యాతని కేమి పట్టినది? ఈమెకు వివాహము చేసి యీమెతో బాటు నా హృదయతాపము గూడ ఎట్లు శమింప చేసుకొనగలను!" అని వా రొకనాడు చింతించుచునే నిద్రించిరి.

వనట గుందుచునే నిద్రించిన విష్ణుచిత్తులకు స్వప్నమున రంగనా థులు దర్శనమిచ్చి యిట్లానతిచ్చిరి—"మామా, యేల మీకీ విచారము! సామాన్య జనులవలెనే మీరు కూడ మీపుత్రికై చింతించుటయా! పుత్తడి బొమ్మ గోదాదేవి నన్ను వరింపగా కాదనునంతటి యరసికుడనా నేను! అంత యవివేకినా! సిరిరా మోకా లొడ్డువారుందురే! నీవు త్వరగా నీ దుహితను వెంటబెట్టుకొని శ్రీరంగమున కరుగుదెమ్ము. అటనే యామెను శాస్త్రసమ్మతముగా వివాహ మాడి మీవిచారము దూరము చేసెదను" విష్ణుచిత్తు లులికిపడి స్వప్నవృత్తాంతమును నెమరు వేసుకొని యది యంతయు తన బిడ్డకు చెప్పి యామెగుండెను తేలిక పరచి యానందాంబుధి నోలలాడించిరి.

ఇపుడు చూడవలయును గోదాదేవి ముఖము! ఆమె దుఃఖ మంతయు నెటుపోయినదో యేమో! ఒక్కమారుగా నామె వదనార విందము యుగపదుదితశతసంఖ్యాక చంద్రబింబమే యయ్యెను!

కష్టములతో కష్టములు కలసి ప్రయాణించినట్లే సుఖములు గూడ కట్టకట్టుకొనియే ఒక్కొక్కప్పుడు వచ్చును. ఆమె మనోరథమును పండించుట కది ధనుర్మాసము గూడ నయ్యెను.

కాన నామె తాను పూర్వము కృష్ణు నర్చించిన రీతిగనే రంగనాథు నర్చించి తాను రచించిన తిరుప్పావు ప్రబంధములోని యొక్కొక్క పాశురము ప్రతి దినమును భక్తితో వినిపించుచు పొంగలి నుషః కాల ముననే స్వామి కారగింపు జేసి దానిని మాత్రమే భుజించి దినశేషము గడపునది. ఈ విధనుగా ధనుర్మాస మంతయు వ్రతాచరణముతో గడ చెను. మాసావసానమున శ్రీరంగనాథు డామెకు కలలో కానుపించి "కొమ్మా, నీ తపస్సునకును, హృదయపరిపక్వతకును మిగుల మెచ్చి తిని. నీ కోరిక తప్పక యీడేర్తును. కాన నీ తపోనియమములు వీడి నేడు సర్వభోగములు ననుభవింపుము" అని యానతిచ్చెను. స్వామీ యానతిని గోదాదేవి సర్వభోగముల ననుభవించిన సుదినము గాన నా దినమునకు భోగియను నామ మేర్పడెను.

## గోదాకల్యాణము

రంగనాథుడు తన యాలయాధికారుల కిట్లు వాక్రుచ్చెను--"మంగళ వాద్యములను, ఛత్రచామరాదులను, పరిజనమును వెంట నిడుకొని మీరందరును శ్రీవిల్లిపుత్తూరున కేగి యటనుండి విష్ణుచిత్తాత్మజ నిటకు సబహుమానముగా గొని తెండు. ఆమెను నే నిచట పెండ్లియాడవలసి యున్నది." వారును శీఘ్రమే శ్రీవిల్లి పుత్తూరునకు మందిమార్బల ముతో నేగిరి. విష్ణుచిత్తుని శిష్యుడు వల్లభదేవుడు గూడ గోదాదేవి వెంట చతురంగబలముతో శ్రీరంగమునకు బయలు వెడలెను.

సువర్ణశిబికలో వధువు నారోహింపజేసిరి. ఛత్రచామరాదులతో భేరీకాహళాదికర్ణ భేది నినాదములతో పెండ్లివారు బయలుదేరిరి. ధన్వి నవ్యపురమునుండి శ్రీరంగమువరకును గల మార్గమంతయు రంగురంగుల

పూలతో, తోరణములతో పందిళ్ళతో నలంకృతమయ్యెను. శ్రీరంగ మా నాడు కలియుగ వైకుంఠమే యై కన్నులపండువు చేయసాగెను. చోళచేర పాండ్యాదిదేశ ప్రజ లందరును నా పెండ్లిని కన్నులపండువుగా గాంచుట కచట గుమికూడిరి.

శ్రీరంగక్షేత్రమునందలి సప్తప్రాకారములును కదళీక్రముక స్తంభా దులతో నలంకరించిరి. నేలయంతటను ముత్యాల ముగ్గులు పెట్టిరి. శుభముహూర్తమున వధువును మంగళ స్నానము చేయించిరి. అనంతర మామె రంగనాథునే మనసార ధ్యానించుచు సువర్ణ శిబికాధిరూఢయై స్వామిసన్నిధికి బయలు దేరెను. శ్రీవైష్ణవులు సంస్కృత ద్రావిడ దివ్య ప్రబంధముల నధ్యయనము చేయుచు నడువసాగిరి. ఆ వెంట సర్వాలంకారాలంకృతము లగు రెండు భద్రగజములును, రెండశ్వ రాజ ములును నడువసాగెను. తర్వాత నందమున నచ్చరలేమల నతకరించునట్టి వేశ్యాంగనలు నృత్యగీత వాద్యములతో తత్రత్యజనమును వినోదింపజే యుచు నేగిరి. వధువుపల్లకికి రెండు వైపులను భట్టనాథుడును, వల్లభదేవుడును నడచిరి. స్వస్తివాచనములు పల్కుచున్న ద్విజపంక్తి శతసహస్ర సంఖ్యలో వారి ననుగమించెను. చివర సువర్ణ వేత్రహస్తులు బరాబరులు సేయుచు నడువసాగిరి.

ఈ విధముగా వాచామగోచరమహావైభవముతో నా యూరేగింపు ప్రధాన ద్వారము ప్రవేశించెను. ఆ మహోత్సవము చూడ నేతెంచి యుట్టాలికల నెక్కిన లలనాజనము వధువుపై మంగళలాజలు కురిపించిరి. ఆవరణసప్తకమున ప్రదక్షిణ మాచరించి గోదాదేవి శంతనుమండపము ప్రవేశించెను.

అంతకు ముందే శ్రీరంగపతియు మంగళస్నాన మాచరించి సర్వా లంకారధారియై వధ్వాగమనకుతూహలియై సిద్ధముగా నుండెను. సుముహూ ర్తమున సులగ్నమున ద్విజ దేవాగ్ని సన్నిధిలో రంగనాథుడు గోదాదేవిని పాణిగ్రహణము కావించి యతులితానందము నందెను. ఇది యామె కెంత సంతోషకారణమో వేరుగా వివరింపనక్కరలేదు గదా!

రంగేశుని యర్ధాంగలక్ష్మి యయిన యామె శేషతల్పమున శయ నించి యున్న మూలవిరాట్టును చేరి సేవింప నెంతో కుతూహలపడెను. కాన శంతనుమండపము వీడి రంగవిమానమునకు ప్రదక్షిణము గావించి

శేషశయ్యను చేరెను. శ్రీరంగనాథుని లావణ్యసౌందర్యములను మనసార ననుభవించిన యా సాధ్వి శేషతల్పము నధిరోహించి తత్పాద మూలము చేరుకొనెను. అంతే-యిక నామె మరల కనుపించ లేదు.

ఇది చూచి యచటివా రందరు మిగుల నక్కజంపడిరి. కాని విష్ణుచిత్తుల దుఃఖమున కంతు లేదు. మిగుల వగల బొగులుచున్న యా తపసితో శ్రీరంగనాథు డిట్లనెను. "మామా, ఏల మీకీ విచారము! మీరు గూడ మాపుత్రి మిమ్ము వీడినందుకు ప్రాకృతు నివలె దుఃఖించుట యుచితమా? సాగరునివలె మీరుగూడ నాకు మామ యయినందుకు మిగుల గర్వముతో బాటు ఆనందముగూడ ననుభవించుచున్నాను. మీరు నా కిచ్చిన మీతనయ నాలో లీన మయినది. ఆమె మానవావతారముపని తీరిపోయినది. ఆమె చర్యలనే తలచుకొనుచు ఆమె రచించిన వాఙ్మాలికలనే మననము చేసుకొనుచు కాలము గడుపుట లెస్స. కాన మీరిక చింత వీడుడు." విష్ణుచిత్తు లును కారణజన్ముఁరాలగు తనపుత్రిక తన్ను వీడినందుకు కుందుట మాని శ్రీవిల్లిపుత్తూరున కేగి పూర్వము వలెనే మాలాకైంకర్యముతో వటపత్రశాయిని కొలుచుచు నెనుబదియైదవ వత్సరమున విష్ణుసాయుజ్య మందిరి.

శ్రీరంగనాథుడు ప్రత్యేకముగా గోదాదేవి కొక యాలయము కట్టించి నిత్యోత్సవాదులతో నామెయర్చన కేర్పాటు చేసెను. నాటినుండియు దివ్యదేశ మయిన ప్రతి విష్ణ్వాలయమందును గోదాదేవిని ప్రతిష్ఠించి యర్చింప నారంభించిరి. పన్నిద్దరాళ్వారులు--కనీసము గోదాదేవి, శఠ కోపులు, రామానుజులు, తిరుమంగయాళ్వారులుగల విష్ణ్వాలయములే దివ్యదేశములు.

## కవితాసు(మ)మాల

భాగవతోత్తములగు రసికవరులారా!

మన తల్లి యాండాళమ్మచరిత్ర మింతలోనే ముగిసి పోయిన దేమా యని వింత పడుచున్నారా? కేవలము వింత పడుటయేకాదు, ఇట్టి పూర్ణభగవదార్తిసముపేత యగు మానవకాంత ఎన్ని జన్మలెత్తి తపిం

చినను సులభుడు గాని దేవాధిదేవుని వివాహమాడగనే తత్పాదములం దైక్యమగుటయా యని వెతగుండువారు గూడ మీలో కొంతమంది యుండకపోరు. కాని నిజ మిదియే సుడీ!

ప్రతివారును నెప్పడో యొకప్పుడు, వా రెంతటివారైనను గానిండు, పంచత్వ మందక తప్పదు. కాని తన మనుగడచే నెవ్వడు పదిమందిని జీవింపచేయగలడో వాడే మహాపురుషుడు; మహాత్ముడు. గోదాదేవి భూదే వియంశమున నవతరించిన కారణజన్మురాలే యయినను ప్రారంభము నుండియు మానవోచిత సాధనలనే చేసినది. తీవ్రతపస్సాధనచే నెట్టి మహాఫలము నయినను సాధించవచ్చు నని తన పవిత్రాచరణచే రుజువు చేసినది. తాను ధరించిన సుమమాలలతో మాత్రమే గాక తాను రచిం చిన వాఙ్మాలలతో గూడ తన మనోహరుని బంధించి వశముచేసుకొన గలిగిన సాధ్వీతిలక మామె. కాననే విష్ణుచిత్తు లామెను "అమ్మా, వట పత్రశాయిని నీకొప్పునధరించిన పూలదండలతో వశము చేసికొనిన నీవు నా యాండాళువే" అని యానందవివశులయి శ్లాఘించిరి. ఆండాళ్ అనగా రక్షించునది యని యర్థము.

సత్య మేమన మనతల్లి గోదాదేవి తన జనకు నొక్కనినే యల రించుట కవతరింపలేదు. మరి మనబోటి బద్ధచేతనులను గూడ ఏ దారియు గానరాని సంసారసాగరమునుండి తరింపజేయుటకే యావ ర్భవించినది. ఆమె వాఙ్మాలను—కవితాసుమాలను—మన మర్థానుసం ధానముతో కంఠమున ధరించినచో తప్పక మోక్షార్హులమై భగవత్పాదా రవిందముల నందగలము.

ఈమె రెండు గ్రంథములు రచించిరి. వానిలో భక్తపారిజాతమగు తిరుప్పావు సుప్రసిద్ధము. ఇందలి ముప్పది గాథలును, ముప్పది మణి పూసలే. కాన ఫలశ్రుతి యైన చివరి పాశురమునే యుదాహరణముగా నిచ్చుచున్నాను—

వఙ్గక్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై
త్తిఙ్గళ్ తిరుముగత్తు చ్చేయిళైయార్ శెన్ఱిఱైఞ్జి
అఙ్గప్పఱైకొణ్డవాత్తై, అణిపుదువై
ప్పైఙ్గమలత్తణ్డెరియల్ పట్టర్పిరాన్ కోదై శొన్న
శఙ్గత్తమిళ్ మాలై ముప్పదు న్దప్పామే
ఇఙ్గప్పరిశురై ప్పా రీరిరణ్డు మాల్వరైత్తోళ్

తెజ్జన్ తిరుముగత్తు చ్చెల్వత్తిరుమాలాల్,
ఎజ్జుమ్ తిరువరుళ్ పె త్తన్నుఱువ రెమ్బావాయ్.

దీనికి తెలుగులో ననంఖ్యాకములగు ననువాదములు గలవు. అయి నను నవనవముగా నవతరించిన యీ పద్యమును రసికజనులు పరిశీలిం తురుగాక. ఏతత్కృతికర్త భగవత్కవి శ్రీమాన్ తిరుమల పంచాంగం వేంకటాచార్యులు గారు (గుంటూరు)—

సీ.క్షీరాబ్ధిఁ జిర్కిన శ్రీధవు గేశవు
సమ్యగలంకృత చంద్రముఖులు
చేరి, సంప్రార్థించి స్థిరమైన కోరికల్
పొందిన రీతిగఁ బుడమియందు
శ్రీవిల్లిపుత్తూర సితపద్మమాలికల్
తాల్చిన భట్టరు తనయ ద్రవిడ
భాషను వరమవౌ పద్యమాలికలను
ముప్పది పాయించె నొప్పిదముగ
తే.భక్తి వీనినిఁ బఠియించు భక్తవరులు
నాల్గు భుజభూధరంబుల వెల్గునట్టి
యరుణలోచనముల నొప్పు హరి కటాక్ష
మంది, సుఖసంపదల గాంతు రనవరతము.

—గోదాదేవిసాహిత్యమును పూర్తిగా తెలిగించి మించిన వారు శ్రీమాన్ మాడభూషి గోపాలాచార్యకవి యని లోగడనే తెల్పినాము. వీరు రచించిన కొలదిపద్యము లీ తల్లి కవితాసారభాస్వాదనాకాంక్షుల యుపయోగార్థమై యందిచ్చుచున్నాము. ఇవి నాచ్చియార్ తిరుమొళి కనువాదమైన శ్రీగోదాసూక్తిమాలయను కృతిరత్నములోనివి.

పరిమళించిన కన్నెవలపునే శ్రీరంగనాథునకు కర్పూరహారతిగా నివే దించిన మహాప్రేమతపస్విని గోదాదేవి. ఈమెకు సాటి రాగలిగినది యుత్తరభారతవాసిని, హిందీకవయిత్రి మీరాదేవి యొక్కతె మాత్రమే. గోదాదేవి యొక్క భగవద్విరహార్తియే నాచ్చియార్ తిరుమొళి యను 140 పాశురములు గల సరససుందరకృతిరూపము దాల్చినది. ఈ కృతిమాధుర్యము పూర్తిగా గ్రోలదలచినవారు మూలగ్రంథము చదివి తీరవలయును. అందరకు నది శక్యముకాదు గదా! కనుకనే దానిభా వము కొంతవరకు తెలిసికొని మన తెలుగువారు గూడ నానందించుటకు వీలుగా కొన్ని యనువాద పద్యము లిం దిచ్చుచున్నాము.

ఆండాళమ్మగారు భగవద్దాస్యానందమే తన కామినీత్వపూరక మని నిశ్చయించి తన్ను శృంగారనాయకుడగు వేంకటేశ్వరుని చేర్చుమని మన్మథునే గురువుగా వరించి ప్రార్థించుచున్నారు.

"తెల్లనన్న యినుకఁ దెచ్చి దిటముగాగ దిద్ది తీర్చి
తెల్లవారు మున్నె యేట తీర్థ మాడి యిధ్మసమితి
ముల్లు లేక విర్చరించి వూన్కి నగ్ని రగులఁ జేసి
పొదలి మదన! మీకు నేడు పూని తయ్య నేడు మమతి
కొల్ల గాగ దేనె లొలుకు క్రొత్త విరులశరము దొడిగి
కూర్మిఁ గదలి వన్నె వాని గుర్తులివుల నెదను వ్రాసి
అల్ల బకుని జంపె నెవఁడొ ఆతని పార్శ్వలక్ష్యమందె
అటులె నేను చేరి నిలిచినట్టు లేసి గనుమ వాసి."

మన్మథపూజకై గోదాదేవి స్నానమాడు చుండగా కొంటెకృష్ణు డామె వలువలు చంక నిరికించుకొని పొన్న చెట్టెక్కి వెక్కిరించుచు కూర్చొన్నాడు. తన చెలులతో పాటు తాను గూడ వలువ లిమ్మని గోపికలవలెనే యామె కృష్ణునిట్లు యాచించుచున్నారు.

కోడికూతకు ముందె యీ దొన గ్రుంకినాముర! చూడు మల్లదె
వేడివేల్పును మొలచె తూర్పున—పెల్ల శేషశయాన! నీ కిది
పాడి యౌనొకొ రావె, రావిక పాట్లు బడిలెమి చాలు చాలుర
నేడు వారము నేను నానతి—వేగ వలువల నొసగి పంపుర.

విప్రలబ్ధ యగు నీ నాయకి వేంకటేశ్వరుని యనుగ్రహమును బడ యుటకై వసంతమున తాను పెంచిన కోకిలను దూతగా పంపుచున్నది—

"పొన్నవిరజాజులను బొంకమగు పూలవనిఁ
బొల్పెసగు కోకిలవరేణ్యా!
సన్నుతగుణాఢ్యు మనసామియగు మాధవుని
సాంద్రమణి వర్ణు మణిమౌళిన్
సన్నుతి యొనర్పగనె సంకువలయంబు లిటు
జారిపడు కారణ మదేమో
చెన్నలర నన్నతఁడు చేరినటు పిల్చి చిర
జీవనము కల్గి మను మోయీ."

తనకు భగవంతునితో పెండ్లి యయినట్లు కల గని యా సంగతి యామె తనచెలికత్తెతో నొక పద్యదశకమున చెప్పినారు. దానికి వారణ

మాయిర మనిపేరు. శ్రీవైష్ణవులు దీనిని వివాహములలో నాల్గవదిన మున గానము చేయుదురు. మొదటిపద్య మిది—

వారణంబులు వెయ్యి వలగొని వచ్చుచుండc బ్రదక్షిణంబుగ
నారణుండు దయాప్రపూర్ణుcడు నడచి రాగలc డంచు నెదురుగ
చేరులెల్లెడ బూర్ణమంగళస్వర్ణకుంభము లెత్తినా రని
తోరణంబులు నాటినా రని తొయ్యలీ! కల నేను కంటిని.

భగవంతుని యధరసుధారసమును పాంచజన్య మను శంఖము సదా పానము చేయుచుండును. అది గ్రోల దలచిన వారి కా శంఖ మాటంకము గదా! తనవంటి భగవదాశ్రితుల యనుభవమునకు ప్రతికూలముగా ప్రవర్తింపవల దని యామె దాని నిట్లు ప్రార్థించుచున్నారు—

చ. "కవురవుతావిజిల్కు నొకొ కంజసుమంబులగంధ మొల్కునో
మెవుడు ప్రవాళము ల్దొరయు నెట్టిని వాతెర తీవుగుల్కునో
రిపుకరిదంతభంజనుcడు శ్రీధరు మోవిరుచిన్ సుగంధ మే
నిపు డెడ గోరితిన్ జెపుమ యేపున మ్రోగెడు పాంచజన్యమా."

విరహాగ్నితప్తయైన ఆండాళ్ భగవత్సాన్నిధ్యము గోరి తన దుస్థితిని నీలమేఘు నిభాంగు డగు శ్రీవేంకటేశ్వరున కెరిగింపు మని మేఘుని యర్థించుచున్నారు—

ఉ. "నీలవితానము న్వలెనె నింగిని బర్వి చెలంగు మేఘమా!
కాలువ లొప్ప వేంగడవుకాంతుcడు నావిభుc డేడి? చంటిపై
చాలుగ జారు బాష్పములు సన్నగిలెన్ మెయి నాదు స్త్రీత్వమున్
గూలగ జేయుగా నతని గొప్పతనంబున కొప్పకుండునే"

తన యాత్మను హృదయమును నపహరించుటయే గాక తన చేతి కడియములు గూడ చాల వదులుచేసిన శ్రియఃపతిని తలచి యా తల్లి యిట్లు క్రుంగి కృశించుచున్నది—

చ. "తన మది మెచ్చి చేత హరి దాల్చెడు శంఖము నేల పోలవో
మనమున మెచ్చి నే దొడుగు మానితకంకణశంఖము ల్చెలీ
అనలముఖోరగున్ వలచి యాతcడు రంగడు పాముపాన్పుపై
మనమిడి తూగు గాని నను మన్నన చేయcడె అమ్మ! అమ్మరో!"

సిగ్గుపడి యింట నుండిన ప్రయోజనములే దని తన్ను తన నాథుడైన శ్రీకృష్ణుని విహారభూమి యగు మథురాప్రదేశమునకు గొని పొండని సఖీజనము నామె ప్రార్థించుచున్నారు—

సీ. "చక్కని కరమందుఁ జక్రంబు దాల్చిన
మెప్కో గానిసె గాని యితరజనులఁ
జూడ లే మని తాము చొక్కంపు చెంగావి
రవికతోఁ గనులకు రక్షకట్టి
క్షుద్రు లీ జనములఁ జూడ లజ్జించుచు
నావరణంబులో నడగి యుండి
వానికై యుప్పొంగు వక్షోరుహంబుల
దిలకింపుఁడీ మీకుఁ దెల్ల మగును

తే. అన్యచరణంబు లెల్ల నిరాకరించి
చెలగి గోవిందుచెంతకే చేరగోరు
నిచట నిక నుండనొల్ల న న్నిపుడె మీరు
యమునఁ దరియందుఁ జేర్పుఁడో యతివలార!

శ్రీకృష్ణవిహారపుణ్యస్థలములకు గొనిపొమ్మనగా వినని సఖులతో నామె కృష్ణసంబంధము గలిగిన తులసిని గాని పీతాంబరమును గాని తెచ్చియిచ్చి తన ప్రాణములను కాపాడుమని వేడుచున్నారు.

ఉ. నల్లని కృష్ణదైవతము నామది నిల్వఁగ నేను చింతిలం
జెల్లనె వుంటిలోపలికిఁ జింతరసంబును పోయునట్టు లీ
యొల్లని మాటలాడ చెలి! యుత్తముఁ డాతని వచ్చవట్టునున్
మెల్లఁగ దెచ్చి వీవఁగదె మించిన నా వలవంత తీరఁగాన్.

శ్లో. "స్వోచ్ఛిష్టమాలికాసక్త గంధబంధురజిష్ణవే,
విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళమ్!"

* * *

# IX పరకాలయోగి [తిరుమంగయాళ్వార్]

"కార్తికే కృత్తికాజాతం చతుష్కవిశిఖామణిమ్,
షట్ప్రబంధకృతం శార్ఙ్గమూర్తిం కలిహ మాశ్రయే.
కలయామి కలిధ్వంసం కవిలోకదివాకరమ్,
యస్య గోభిః ప్రకాశాభి రావిద్యం నిహతం తమః."

చోళమండలమున తిరువాలి తిరునగరి యను పట్టణమునకు సమీపమున నున్న కురయలూ రను గ్రామమున నీలు డను చతుర్థ వంశజునకు కార్తిక మాసమున కృత్తికానక్షత్రమున క్రీ.శ. 776 సంవత్సరమున నొక కుమారు డుదయించెను. కుమారునకు గూడ తండ్రితన పేరే పెట్టెను. అయనకు పరకాలు డని, తిరుమంగయాళ్వార్లు అని తర్వాతి పేర్లు.

ఆ బాలుడు బాల్యమునుండియే కులక్రమాగతములగు మల్లవిద్యలోను విలువిద్యలోను నిపుణు డగుటయే గాక యశ్వారోహణ గజారోహణములందును సుశిక్షితు డాయెను. ఈయన యుద్ధ విద్యానైపుణ్యమును చూచి యా కాలపు చోళరాజు నీలుని తన సేనాపతిగా నియుక్తుని చేసెను.

## చోళరాజు

నీలునకు బాల్యముననే విష్ణుభక్తి యయత్నలభ్యమయ్యెను. కాన నాత డింట నుండునపు డెక్కువ కాలము భగవాద్భాగవతసేవకే వినియోగించువాడు. ఇది సహింపలేని యసూయాళువులు కొందరు చోళరాజుతో "నీలుడు మీకు కట్టవలసిన కప్పములు కట్టకుండ నా సొమ్ము దుర్వినియోగము చేయుచున్నా" డని కొండెములు చెప్పిరి. రాజు తన సొమ్మును చెల్లింపుమని నయముతో భయముతో చెప్పి చూచెను. నీలు డిదిగో యదిగో; 'రేపు మాపు' అని కాలము గడుప జొచ్చెను. ఇది కాని పనియని, చోళభూపతి యాతనిని ససైన్యుడై చుట్టుముట్టెను. జగదేకవీరుడును ననహాయ శూరుడును నగు నీలుడు ఖడ్గమాత్రసహాయుడై యా సేననంతయు నుగ్గునూచము చేసెను. భూపతి యతనిని మోసము చేసి పట్టుకొని యొక విష్ణ్వాలయమున బంధించెను.

నీలుడును నందట్లే మూడు దినము లుపవాసముతో కాలము గడపెను. "అయ్యో, భగవద్భాగవత కైంకర్యమున కవకాశము కోలుపో తినే"యని యా భక్తవరుని చింతగాని తననుగూర్చి యెంత మాత్రమును గాదు. మూడవనాడాయన కెట్లో నిదుల వచ్చెను. అపుడు కంచి వరదరాజ స్వామి అతనికి స్వప్నమున గానుపించి 'నా సన్నిధికి వచ్చిన నీ దిగులు తీరు' నని యనతిచ్చి వేగవతీ నదీతీరమున నున్న నిధినొక దానిని గురుతులతో చేపెను.

ఉదయమున నీలుడు మేల్కాంచెను. స్వప్నమున తనకు నిధి దొరకు సూచన లభించినందున కంచికి నాతో వచ్చినచో మీ బాకీ తీర్చగల నని రాజుకు కబురు పంపెను. రాజభటు లాతనిని కంచికి వెంటబెట్టుకొని యేగిరి. నదీతీరమున నొక స్థలమును నీలుడు చూపిన దానిని రాజసేవకులు త్రవ్వగా లంకెబిందెలు లభించెను. వెంటనే రాజు ఋణమును నీలుడు తీర్చివేసి యాతని కొలువు వదలి మిగి లిన యపార ధనరాశితో భాగవతకైంకర్యము చేయుచు తన పురమున సుఖముగా కాలము పుచ్చసాగెను.

నీలుడు పరులకు కాలునివలె భయంకరుడుగాననే యాయనకు పరకాలుడని గూడ పేరు సార్థకమయ్యెను. ఈయన బాల్యమునుం డియు శస్త్రవిద్యలందు మాత్రమేగాక శాస్త్రవిద్యలలో గూడ ప్రవీణు డాయెను. అంతేకాదు. కమ్మని కవితచెప్ప సామర్థ్యముగూడ జన్మజాత ముగా నాతని కబ్బినందున చతుష్కవిశిఖామణి యని గూడ బిరుదు నందెను. అయిన తన కవితాసంపద నాయన నరాంకితము చేయక భగవదంకితముగనే వ్రాసెడివాడు.

## కుముదవల్లి

నీలుని పురమునకు సమీపమున శ్వేతహ్రదమను సరోవరము కలదు. బాలభాను డుదయమున తన సహస్రకరస్పర్శచే నా సరస్సునందలి పద్మినీ కాంతలను మేలుకొలుపుచుండును. అది నిర్మలజలముచేతను హంసకారండవాది పక్షిజాలముచేతను మానససరమునే తలపించుచుం డెను. స్వర్గమునుండి యప్సరఃకాంత లేతెంచి యందు జలక్రీడ లాడి యాడి వినోదముతో ప్రొద్దులు పుచ్చుచుందురు.

ఒకనా డుదయముననే కొందరు దేవతాంగన లాసరోవరమున స్నాన మాడ నరుదెంచిరి. చిరకాలము గూడియాడి ప్రొద్దుగ్రుంకు సమయము కాగా స్వస్థలమునకు వారు మగిడి పోయిరి. ఆ సంభ్రమమున వారు తమ వెంట గొనివచ్చిన యొక యప్సరస్సుందరి నొంటిగా దిగవిడచి పోయిరి. ఆ బాల యొక కలువపువ్వునుకోసి చేత బట్టుకొని త్రిప్పుచు 'తనతో వచ్చిన వారందరు వెడలిపోయిరే ఇక తన గతి యేమా'యని విచారముతో తత్సరస్తీరమున నిలబడియుండెను.

ఆ దారిన పోవు భిషగ్వరు డొకడామెను చూచుట తటస్థించెను. జంగమహేమవల్లివలె మిలమిల లాడుచున్న యా యందాల బాలను చూడగనే బిడ్డలు లేని యా వైద్యున కపత్యప్రీతి యుదయించెను. వాత్స ల్యాతిశయముచే నా పట్టి నాతడు చేరనరగి "బిడ్డా---నీ వెవ్వరిదానవు? ఒంటరిగ నెందు కిచట నిలబడితివి?" అని యడిగెను. ఆ బాల హరిణాక్షియు "నయ్యా, నేను దివినుండి యిట కచ్చరల పిండుతో విహారార్థమై యరుదెంచినాను. న న్నొంటిజేసి నావారలు వెడలిపోయి నారు. అసహాయురాలనగు నాకు తల్లియు తండ్రియు నీవే" అని జాలి గదుర వాక్రుచ్చెను.

'అమ్మా! మాకును బిడ్డలు లేరు. కాన ననపత్యుడనగు నాకు నిన్ను చూడగనే పితృవాత్సల్యము పెల్లుబికినది. నీవు నాతో నరుగుదెం చుటకంటె మా దంపతుల కానందప్రదమగు విషయము మరొకటియే ముండును! కన్నబిడ్డకన్న నెక్కువ ప్రేముడితో చూచుకొందుము. తప్పక నాతో మా ఇంటికిర" మ్మని పలికి యా వైద్యు డామెను వెంటబెట్టు కొని తన యింటి కేగెను. ఆ వెజ్జునిల్లాలును నా బాలికను చూడగనే యబ్బురముతో చేరదీసెను. కుముదమును---కలువ పువ్వును---చేతుల నిడుకొని కానుపించినది కాన నామె కా దంపతులు "కుముదవల్లి" యను పేరు పెట్టిరి.

పితరుల కానందము కలిగించుచు నా బాలిక నానాటికి రూప లావణ్యసంపద నద్వితీయురాలై క్రమముగా నెదుగసాగెను. ఆమెకు షోడశవసంతములు నిండెను. ఊర్వశిని మించి యపూర్వలావణ్యమున మెరయుచున్న యా వరారోహకు తగిన వరు డెట్లు లభించునా యని తండ్రి దిగు లందసాగెను.

నీలుని చారులు కుముదవల్లి రూపసంపద నాయనకు నివేదించిరి. చతుష్కవి యగు నా నీలుడును నా వైద్యునింటికేగి యాతనితో సంభాషించుచు సురకాంతలను మించిన యందముతో మీనువలె మిట్టిపడుచున్న కుముదవల్లిని చూచెను. చూడగనే యాతడు మదనబాణపరంపర కగ్గమై యళిపాత వికంపితపంకజమువలెనే చంచలమనస్కుడాయెను. ఆ భిషక్కును నా వీరుని తగురీతిని గౌరవించెను. "వీరోత్తమా! మీరోటివా రూరక మాయింటికి రారు గదా! నాకు తగిన పనిచెప్పిన తప్పక చేసెద"నని విన్నవించెను. "ఓ యయ్యా, నిక్కము దాపనేల? నీ కన్యకామణి సౌందర్యలావణ్యాది గుణములను విని ఆమెను చూడవలయునని, యామెను పరిణయమాడవలెనని నాకు కల్గిన కోరికను మీతో విన్నవింప వచ్చితి"నని నీలుడు పలికెను.

"అయ్యా, ఇంతకంటె నాకు కావలసినదిమాత్ర మింకేమి కలదు? నా పుత్రికకును, మీకును, పరస్పర మంగీకారము కుదిరినచో వెంటనే వివాహముహూర్తము పెట్టింతు"నని యాతడు హర్షాతిరేకముతో బలికెను.

## శ్రీవైష్ణవతదీయారాధన

కుముదవల్లి తండ్రులు పరకాలునకు తననీయనున్నారని తెలిసికొని కుముదవల్లి యాతనితో నిట్లనెను —"పంచ సంస్కారవంతుడైన వైష్ణవుని తప్ప పెండ్లియాడ"నని నేను నియమ మేర్పరచుకొన్నాను. అంతే గాదు, మీరు పంచ సంస్కారములు లభించిన తర్వాత వెయ్యి నెనిమిది మంది శ్రీ వైష్ణవులకు ప్రతి దినమును తదీయారాధన (శ్రీ వైష్ణవ సంతర్పణ) ఒక సంవత్సరము పాటు చేసిననే నేను మీతో కాపురము చేయగలను" అని గూడ పలికెను. "సరే, ఈ రెండును నా కిష్టము లయిన 'నిబంధనలే'" అని పలికి నీలుడు ముందు పంచ సంస్కారములు పొందెను. వెంటనే వా రిద్దరకు వైభవముగా పెండ్లి జరిగెను.

రెండవదానిని నెరవేర్చుటకు పరకాలుడు చాల ప్రయత్నము చేయవలసివచ్చెను. వేయిమందికి ప్రతిదినము సమారాధన చేయుట మాటలు గాదు గదా! ఒకనాడు గాదు, రెండునాళ్లుగాదు. మున్నూట యరువది దినము లిట్లేకధాటిగా చేయుట యెంతటి మహారాజునకు సాధ్యపడగలదు? సామాన్యులు ప్రతి దినము నంత ధనము నెట్లు తేగలరు?

"మన్నిమిత్తకృతం పాప మపి పుణ్యాయ కల్పతే,
మా మనాదృత్య యత్పుణ్య మపి పాపాయ కల్పతే.'

"నన్ను గూర్చి చేయు ఏ పాప మైనను పుణ్యమునే కలిగించును. న న్నగౌరవించి చేయు పుణ్యకార్యములు గూడ పాపముకొరకే" అని శాస్త్రమందు చెప్పినట్లు పరకాలుడు దొంగతనము చేసియైనను భాగ వత తదీయారాధన యవిచ్ఛిన్నముగా జరిపితీరవలెనని నిశ్చయించెను.

అయినను అన్నిటిలో పెద్దదొంగతనము భగవంతుని సొత్తయిన యాత్మను తన స్వంతముగా భావించుట---

యోఽన్యథా సంతమాత్మాన మన్యథా ప్రతిపద్యతే,
కిం తేన న కృతం పాపం చోరే ణాత్మాపహారిణా."

అంతటి మహాపాపమే నేడు పాపము గాలేదు గదా! అట్టిచో భాగవత తదీయారాధనకై చేయు పరధనాపహరణము పాపమెట్లగును!

తన నిర్ణయప్రకార మాయన భాగవత కైంకర్యమునకై తనతో సమానమయిన బలవంతులను కొందఱను వెంటబెట్టుకొని రాత్రులందు వైష్ణవేతరుల ధనమును దొంగిలించి తెచ్చి శ్రీవైష్ణవులకు షడ్రసోపే తముగా భోజనములు పెట్టుచుండువాడు.

ఒకనాటి సాయంకాలము పరకాలుడు తన భటవర్గముతో బందిపో టుకై బయలుదేరెను. దుర్గమారణ్యముల వెంట నెవరైన ప్రయాణము చేయుచున్నా రేమో వారిని దోచుకొనవచ్చునని వెదకెను. వెదకి వెదకి వేసారెను. కాని యొక్క పిట్టయైనను వారి కంట బడలేదు. ఇంతలో చిటపట చినుకులు పడసాగెను. పైకి చూడ నాకాశమున నొక మూల చేటంత మబ్బుక్రమ్మెను. చూచుచుండగనే యా మేఘశక లము గగన భాగమంతట నలుముకొనెను. అంతేగాదు. చిరుచినుకులు పెద్దబిందువులుగా మారెను. మరికొంతసేపటికి కుంభద్రోణవృష్టి కురి యసాగెను. ఆ దొంగలగుంపంతయు నొక గేస్తునింట నొదిగియుండి యా యిల్లు దోచుకొను సమయముకొఱకు నిరీక్షింపసాగెను.

ఆ యింటిగృహిణి తన భర్త భోజనపాత్రను శుద్ధిచేయుటకు వర్ష మైనందున దొడ్డిలోనికి పోక వాకిటిలోనికి వచ్చెను. ఆమె గుమ్మము

గడపవద్ద నిలబడి వెండిపళ్ళెరము కడుగుచుండగా పరకాలుడు వెళ్ళి యా కంచమును వెంటనే యొడిసిపట్టుకొనెను. ఆమె "యస్మద్గు రుభ్యో నమః" యని భయపడుచు పలికెను. ఆ పలుకు ములుకువలె చెవిని సోకగా పరకాలు డా పళ్ళెర మచటనే పడవైచి తరువాత నేమి జరుగునో చూతమని యొక మూల దాగుకొనెను.

ఏమి యీ కలకల మని గృహయజమానుడు బైటకు వచ్చెను. భార్య జరిగినది తెలిపెను. ఆ కంచ మచటనే నేలపై యుండెను. ఈ వింత యే మని యిల్లా లడుగ గృహస్వామి యిట్లనెను--- "పరకాలు డను వైష్ణవోత్తముడు భాగవత కైంకర్యమునకై యిట్లు దొంగతనములు చేయుచున్నాడని విందుము. ఆయనయే యిపుడు మన యింటికి వచ్చి యుండవచ్చును" అది నిజమే యయియుండవచ్చుననెను. ఆగంతు కుడు పాత్ర నా చేతినుండి లాగుకొనగనే నే 'నస్మద్గురుభ్యో నమః' యని పలికితిని. అది విని వారు దీని నచటనే పడవైచి వెడలిపోయిరి" అని యీ గృహిణి చెప్పెను.

"నీ వట్లేల చేయవలసి వచ్చినది? నీ వామాట పైకి పలికినం దుననే గదా యిది వైష్ణవద్రవ్య మని దీని నుజ్జగించి వా రట్లు వెడలిపోయిరి. అయ్యో, ఎంతటి వైష్ణవాపచార మొనరించితివి? ఈ పాపము నెట్లు మాపుకొనుట" యని యజమాని విచారింపసాగెను.

ఆ దంపతుల సంభాషణ చాటునుండి వినుచున్న నీలుడు వారి భాగవతనిష్ఠ కలరి యీ దంపతుల యెదుటకు వచ్చి తన యపచారము మన్నింపుమని క్షమాపణ వేడెను. ఇట్టిది సుడీ, పరకాలయోగిభాగవత కైంకర్యనిష్ఠ!

## అపూర్వ వధూవరులు

ఈ విధముగ పరకాలుడు చేయు భాగవతార్చనకు శ్రీ రంగనా థుడు పరమప్రీతుడై యొక నా డాతని నిష్ఠను పరీక్షింప దలచి తన సతియు తానును వధూవరవేషములు పూని ఇంద్రాదిసురులు

"మా గురువులకు నమస్కారము" అని యర్థము నిచ్చు నీ వాక్యము తరచు వైష్ణవులు మాత్రమే యుపయోగింతురు.

సామాన్యులవలె తమవెంట నూరేగుచు రాగా నొక నిర్జనవనమున పల్లకి నెక్కి యరుగసాగెను. హిరణ్యగర్భుడు వారి పురోహితుడై పల్లకిముందు నడువసాగెను. సువర్ణచామరములతో సితచ్ఛత్రములతో పరిజన పరివారములతో మహావైభవముగా సాగుచున్న పెండ్లివారిని వృక్షారూఢులై దశదిశల పరిశీలించుచున్న నీలుని మనుజులు కనిపెట్టిరి. వెంటనే వారు తమ ప్రభునివద్ద కేతెంచి యా సంగతి యెరింగించిరి. పరకాలుడును నా పెండ్లివారిని పరికించి చూచి 'ఇక నేమి, మన మెంత కాలము ఖర్చు పెట్టినను తరుగనంత ధనరాశి మన చేతికి చిక్కనున్నద'ని యొడలు మరచి నర్తనము చేయసాగెను.

ఆ యూరేగింపు తమ్ముం సమీపింపగనే పొంచియున్న పరకాలుని భటులు కత్తులు జళిపించుచు నొక్కపరి యా గుంపుపై బడి చుట్టుముట్టిరి. పెండ్లివారి స్థితి డేగలకు చిక్కిన పావురాల చంద మయ్యెను. పరకాలుడు వారితో ననెను—"ఇక మీరందరును మాచేత నెట్లును చిక్కితిరి గదా! కాననే యరచి పారిపో దలచినను మీ యత్నము లెంత మాత్రమును ఫలింపవు. కాన మీవద్దనున్న ధన కనక వస్తు వాహనాదు లన్నియు కిక్కురు మనకుండ మా కప్పగించి వేయుడు. అట్లు చేసిననే మీ ప్రాణములు మీకు దక్కును. కాదని మమ్ము వ్యతిరేకించిన నేమి జరుగునో మీరే మీ కన్నులార గాంచగలరు. మీరు బుద్ధిమంతులవలె తోచుచున్నారు. కాన నంతవరకు రానీయ రనియే నా నమ్మకము" అని మేఘగర్జననుకరించి గంభీరకంఠధ్వనితో బలికెను.

ఇక కదలినచో ధనముమాట యట్లుండగా ప్రాణములు గూడ తమకు దక్కవని తలచి యా గుంపులో నొక్కరైన నోరు విప్పరైరి. పరకాలుని భటులు పూచిక పుల్లయేని మిగుల నీయక పెండ్లివారి సర్వస్వమును దోచుకొనిరి. కాని వరునిచేతి పవిత్రమను నుంగరమును, వధువుకాళ్ళకు గల మట్టియలును తీయుట మాత్ర మా భటులకు చేతకాలేదు. పరకాలుడు వానినిగూడ వదలక తన నోటితో కరచి యూడ లాగుకొనెను.

పరకాలు డా ధనము నంతయు నొక పెద్ద పెట్టెలో పెట్టించెను. అది తన సేవకుల తలల కెత్తబోయెను. ఎంత ప్రయత్నించినను నా పెట్టె కదలలేదు. అపుడు పురోహితునిపై పటపట పండ్లు కొరుకుచు

"నీ నేదియో మంత్రము పెట్టియుందువు, అట్లు కానిచో నిది కదల కుండు నటరా?" యని పలికి యాతని కంఠమును తన నిశితాసిచే నొక్కిపట్టి గద్దించెను. పురోహితుడు గడగడ వణకుచు "నయ్యా, నన్ను చంపి బ్రహ్మహత్యాపాతకము నేల మూట గట్టుకొందువు. నే నే మంత్రమును నెరుగను. ఏ పాపమును నెరుగను. అదుగో, శిబికా ధిరూఢుడయిన యా పెండ్లికొడుకే ఒక పెద్ద మంత్రగాడు. వానినే యడుగుము" అని సమాధానమిచ్చెను.

పరకాలు డట్లే చేయగా వరరూపమునను న్న శ్రీరంగనాథుడు చిఱునవ్వుతో "నోయీ, నీవు శ్రద్ధగా విన్నచో నీకు సర్వజనవశీ కరణ సమర్థమగు మంత్ర ముపదేశింత మనియే నేను వచ్చినాను" అని పలికి యాతని కుడిచెవిలో సంసారవార్ధిలో దరికానక కొట్టుకొను చుండు జీవులను దరి జేర్చు నావ యగు నారాయణాష్టాక్షరీమంత్రము నుపదేశించెను.

## స్వామి సేవ

భక్తిజ్ఞాన వైరాగ్యము లినుమడించిన యా యోగివరునకు శ్రీరంగ నాథుడు శ్రీ మహావిష్ణువు రూపముతో వైనతేయునారోహించి భూనీళ లిరువంకల గొలుచుచుండ బ్రహ్మరుద్రేంద్రాది సేవ్యమానుడై ప్రత్యక్ష మాయెను. పరకాలుని యజ్ఞానాంధకారము క్షణమున మాయమయ్యెను.

నిర్హేతుకకరుణతో ప్రసన్నుడైన శ్రియఃపతిని దర్శింపగనే నీలునకు నవనిధులును కానుపించి నట్లాయెను. నతులతో నుతులతో వా రాదే వుని బహువిధములుగా బొగడిరి. అపుడు వారి వాణినుండి కవితాలత యంకురించి యపూర్వ లావణ్యసౌరభములు పుష్పించి ఫలింపగా వానిని దశదిశ లందును వ్యాపింప జేయసాగెను. నమ్మాళ్వారుల కవితకం టెను వీరి కవిత మిగుల ప్రౌఢమయినది. వారి వలెనే వీరు గూడ నీశ్వరుని నాయికాభావమున భజించి ధన్యులైరి. వీరు తమకు ప్రత్యక్ష మయిన భగవంతుని కొనియాడిన మొదటిగాథ యిది.

వాడినేఁ వాడి వరుందినేన్ మనత్తాల్
  పెరుందుయు రిడుంబై యిల్ ఎరందు
కూడినేఁ కూడి యిడైయవర్ తమ్మో
  డవర్ దరుం కలైర్ యే కరుది

ఒడినే నోడి యుయువర్ దోర్ పొరుళాల్
ఉణర్ పెనుంపెరుమ్ పదమ్ తెరిందు
నాడినేఁ నాడి నాఁ కండు కొండేన్
నారాయణా వెన్నుం నామమ్

దాసుని స్వరూపస్వభావములు చెడి మిగుల దుఃఖప్రదమగు జన్మ మెత్తి యువతులతో భోగించి మనోదుఃఖము లనుభవించుచు వచ్చి యుజ్జీవనప్రదమగు గొప్ప స్థానమును కని ఆ జ్ఞానముచే సంసార మసారము, భగవద్విషయము మాత్రమే సారమని నిశ్చయించి నేను శ్రీమన్నారాయణ నామమును కనుగొంటిని.

అంబుజాక్షుడు సర్వస్వము నర్పించి తనకై శ్రమపడుచున్న యీ భక్తవరుని గ్రుచ్చి కౌగిలించుకొని యిట్లు పలికెను---"వత్సా, నీవు చేయు చున్న భాగవతతదీయారాధనకే గాదు, నీ కవితానిర్మాణమునకు గూడ నేను బ్రహ్మానందభరితుడ నయినాను. నీవలన కలిగినంత ఘనగౌరవము నా కెవరివలనను లభించి యుండలేదు. నన్ను బ్రహ్మ రుద్రేంద్రాదులు పొగడునట్లే నిన్నుగూడ నికమీద నీ భువిపై జన్మించు వైష్ణవులంద రును ప్రస్తుతింతురు. ఇక మీద నీవు తిరుమంగయాళ్వారను పేర బరగుదువు గాక" యని పలికి యంతర్హితుడయ్యెను.

ఎంతోకాలము నుండి తాను చేసిన పూజకు ఫలితముగా ప్రత్య క్షమయిన తన తండ్రి యప్పుడే మాయ మయ్యెనే అని ఆళ్వారు మిగుల విచారించిరి. వారి స్వరూపమును ధారుణిలోని యర్చావతార ములందు గాంచు నుద్దేశ్యముతో తిరుపతి కేగి శ్రీనివాసుని దర్శించి యచటనే కొంతకాలము గడపిరి. కంచివరదరాజస్వామిసేవలో మరి కొంత కాలము గడపిరి. అటనుండి శ్రీరంగము చేరి భువనమోహ నవిగ్రహుడగు నా స్వామి కైంకర్యములలో సర్వమును మరచిరి.

## తిరుమంగయాళ్వారు కైంకర్యము

శ్రీరంగమున నాలయమున ననేకనూతన భవనములును, వంట శాలలును, యజ్ఞశాలలును, సప్తప్రాకారములును నిర్మింపుమని శ్రీరంగ నాథుడు వారి కాజ్ఞ నిచ్చెను. వా రప్పటి కప్పుడే అనేక రీతులుగా ధనమును సంగ్రహించి యా యా మహానిర్మాణము లన్నియు పూర్తి

గావించిరి. బందిపోటు దొంగతనము మొదలగు వానితో వారు ధనమును ప్రోగుచేయువారు. అనేక జైనబౌద్ధ దేవాలయములందలి సువర్ణ రజత విగ్రహములను గూడ వారు కొల్లగొట్టిరి. వేల కొలది మహా శిల్పులు వారి క్రింద పనిచేసిరి. ఆ నిర్మాణములు నేటికిని చూపరులకు వింత గొలుపుచుండును. వానిని చూచినవారవి యన్నియు నొక్క మానవుడు నిర్మించెనన్న నెన్నడును నమ్మదగినవిగా నుండవు. తన్నిర్మాణ శిల్పసౌందర్యము చూచి యానందింపవలసినదేగాని వ్రాయ నలవిగాదు. దొంగతనమునకు నామాంతరము 'తిరుమంగ యాళ్వారు కైంకర్యము' అని నాటినుండి రూఢ మాయెను.

ఒకసారి శిల్పకారులకును కూలీలకును చాల డబ్బు తిరుమంగ యాళ్వారీయ వలసివచ్చెను. కాన తమ కీయ వలసిన దానికై వారినా కూలీలు నిర్బంధింపసాగిరి. అపుడా భక్తశిరోమణి "యింత కాల మునుండియు మీరు నన్ను కూలికై నిర్బంధింపకయే యీ కట్టడము లన్నిటిపై మీ యపూర్వశిల్పచాతురీలావణ్యములు చూపి అజరామరమగు కీర్తి దోచుకున్నారు గదా! మీరు పడిన పాటుకు తగిన ఫలము శ్రీ రంగనాథుడు మీకు తప్పక చూపగలడు. మీ బాకీ నేను త్వరలో తీర్చుకొందును. కాన మిగిలిన కట్టడములు గూడ పూర్తి చేయు"డని వారిని ప్రార్థించిరి. కాని తమ యాలు బిడ్డలు పస్తులతో పడి మాడు చుండగ తా మింక వెట్టి చాకిరి చేయజాలమని వారి మొండి చరచిరి.

పరకాలుడు తనవద్ద ధనము లేనందున, ఇంత గొప్ప కైంకర్యము చేసిన వీరి సేవకు సరియైన పరమార్థము కలిగించుటయే న్యాయమని తలచి యొక యుపాయ మాలోచించిరి. ఒక సావికునికి మిక్కిలి రొక్కమిచ్చి రహస్యమున నా శిల్పు లందరును నెక్కిన పుట్టిని (నావను) నదీ మధ్యమునకు తీసుకొని వెళ్ళి ముంచివేయమని బోధించిరి. తర్వాత శిల్పులతో "కావేరీ ద్వీపమున నే నొకచో ధనము గుప్తము చేసినాను. మీారందరు నాతో వచ్చిన మీ బాకీ తీర్తు"నని బలికిరి. ఆ శిల్పు లందరును| మహాసంభ్రమముతో పడవనెక్కి ఆళ్వారువెంట చనిరి.

పుట్టి కావేరి నడుమకు చేరగనే పరకాలుడు వారితో ననెను—'ఓ శిల్పులారా, మీరు రంగనాథుని కాలయనిర్మాణాదులచే నెనలేని సేవ చేసినారు. మీరు ప్రతిఫలము కోరుట న్యాయమా! ఒకవేళ కోరినను

దానికి తగిన ప్రతిఫలముగా ధనమును మాత్రము మీరు కోరినచో నిజముగా మీరజ్ఞానులే యనవలసివచ్చును. ఏలయన ధనము శాశ్వత ముగాదను విషయము మీకు గూడ తెలియనిది కాదు గదా! శాశ్వత మయిన కైంకర్యము చేసి దానికి బదులుగా నశాశ్వతమయిన ధనమును గొనుట రూక లిచ్చి నూకలు గొనుటవంటిదే సుడీ! ఈ ధనముతో దారపుత్రుల నెన్ని విధములుగ సంతోషింపచేయ చూచినను వారు సంతో షింపక పోవుచుండుట మనము చూచుచునే యున్నాము గదా! కాన ధనమును గూడ మించిన దానిని---మోక్షమును--- మీకిప్పింతును.

నేను ధనము చేతపట్టుకొని యీ పనులకు పూనుకొనలేదని మీకును తెలియును గదా! కాన మీకు వెండి బంగారము లెక్కడనుండి తెచ్చి ఈయగలను? డబ్బు లేకుండ మీరింటికి వెళ్ళిన మీయాలుబిడ్డ లెట్లును బ్రతుకనీయరు గదా! కాన మీ రీ కావేరీ నదిలో నసువులు వాసి పరమపదము చేరుకొనుటయే యుభయతారక మైన మార్గము!

ఎటుచూచినను ప్రాణములు కోల్పోకతప్పనపుడు మోక్షార్థులయి చనిపోవుటయే మేలని వా రందరును నిర్ణయించుకొనిరి. కాన మోక్ష ధనమునే యిండని వారు తిరుమంగయాళ్వారును హృదయ పూర్వక ముగా ప్రార్థించిరి. పరకాలుడు వారి నందరను నా యేట ముంచి తానును నావికులును మాత్ర మెట్లో యీది బయటపడిరి.

ఈ విధముగ శ్రీరంగనాథుని యాలయనిర్మాణ కైంకర్యమును తదీయారాధన కైంకర్యమును ఘనముగా చేయుచు తిరుమంగయాళ్వారు తమ సహధర్మచారిణి కుముదవల్లితో దివ్యదేశయాత్రలు పూర్ణముగా చేసి యంతమున శ్రీమహావిష్ణువు సాయుజ్యమందిరి.

## కావ్యసౌందర్యము

ద్వాదశసూరులకు నమ్మాళ్వారు ప్రాణభూతులు. వారి తర్వాత తిరుమంగయాళ్వారులే లెక్కకు రాదగినవారు. వీరి కవిత గూడ నమ్మాళ్వారు కవితవలెనే రాశిలో మాత్రమే గాక వాసిలో గూడ శ్రేష్ఠ మైనదే. కొన్నియెడల నమ్మాళ్వారుకంటె గూడ వీరి యర్థగాంభీర్యము,

భావసంపద మిన్నయై వన్నెకెక్కి యుండును. లెక్కలో గూడ వీరి పాశురముల సంఖ్య సర్వాధికము. కాననే వీరు చతుష్కవిశిఖామణి ఆశుచిత్రమధురవిస్తరకవితానిర్మాణదక్షులు—అని పేరు గాంచిరి.

నాలాయిర దివ్యప్రబంధమునందు పరాంకుశనాయికి పరకాలనాయికి మిగుల ప్రసిద్ధురాండ్రు. నమ్మాళ్వారు తిరువాయ్మొళిలో నాయికాభావము ననుభవించి సర్వేశ్వరునిపై భగవద్విరహమును ప్రవహింపజేసినట్లే తిరుమంగయాళ్వారు కూడ పెరియతిరుమొళిలో తమ నాయికా భావమును రాళ్లరగునట్లు చెట్లు చిగుర్చునట్లు వర్ణించినారు. తిరుమంగయాళ్వారు పెరియతిరుమడల్ శిరియతిరుమడల్ తిరుక్కురుందాండకం తిరినెడుందాండకం, తిరువళుక్కూత్తిరుక్కై అను గ్రంథములు గూడ రచించి వన్నెకెక్కిరి.

శ్రీమాన్ మాడభూషిగోపాలాచార్యులుగారి ప్రియాన్వేషణమును శ్రీగోదాగ్రంథమాలవారు ప్రచురించినారు. దానినుండి రెండుదాహరణము లిందీయబడుచున్నవి.

సీ."వేయి నామంబుల వెల్గుచుండెడివాడు
నల్ల మబ్బులమేని నలుపువాడు
చెలువు లొల్కుచు నొప్పు వలమురితాలుపు
తోరంపు నెత్తావి తొళసిమాళ
పేరురంబునఁ జాలవెలుగుచుండెడివాఁడు
వాఁడెవాఁడె యనుచు బలుకుచుండె
కొంత సేపటులుండి యింతు లందరి జూచి
బంకుగొంకులు లేక పొంక మిడక
దిటము గాగ నిట్లు తెలియంగఁబల్కిన
భయపడంగవలదు బాల కిట్టి
వెతలు గలుగఁజేసి వెలయుచుండెడివానిఁ
దెలిసికొంటి నమ్మ తేట వరతు"

సీ."కమ్మని తులసితో గ్రాలు వక్షము వాడు
మిరహాలవర్ధయందు విక్రముఁడగు
చంద్రు గాపాడిన జలదాభవర్ణుండు
వలపుపుప్పొడిరేకు పొలుపులొలుకు
నతసీసుమశ్రీలనలరు వన్నియనాడు
సమవర్ణమున నొప్పు సంద్రమందు
పర్వతంబులఁ ద్రోసి వంతెన బంధించి
రణమందు రాజైన రావణు పది

తే. యందమైనట్టి తలల నీ యవనిపైన
వ్రాలునటులుగ శరముల వరలఁజేసి
యముని వీటికిఁ బంపిన యతఁడె నేడు
నన్ను నీ రీతి హింసించుచున్నవాఁడు."

శ్లో. హే. లోకాః శృణుత! ప్రసూతిమరణవ్యాధేశ్చికిత్సా మిమాం
యోగజ్ఞాః సముదాహరంతి మునయో యాం యాజ్ఞ్యవల్క్యాదయః,
అంతర్జ్యోతి రమేయ మేక మమృతం కృష్ణాఖ్య మాపీయతాం
తత్పీతం పరమౌషధం వితనుతే నిర్వాణమాత్యంతికమ్.

* * *

# X విప్రనారాయణులు

## [తొండరడిప్పొడియాళ్వార్]

"కోదండే జ్యేష్ఠనక్షత్రే మండంగుండిపురోద్భవమ్,
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపద్రేణు మాశ్రయే."
తమేవ మత్వా పరవాసుదేవం
రంగేశయం రాజవదర్హణీయమ్,
ప్రాబోధకీం యోఽకృత సూక్తిమాలాం
భక్తాంఘ్రిరేణుం భగవంత మీడే."

ఉత్తర భారతదేశమునకు కాశ్మీరము వంటిది దక్షిణమునకు చోళ దేశము. దానికి దక్షిణోత్తర భాగములందు నిత్యప్రవాహయగు కావేరీనది యొడలు తెలియని కన్నెపిల్లవలె నానందముతో నురకలు వెట్టుచు ప్రవహించుచుండును. సర్వసంపత్సమృద్ధితో నా సీమ దక్షిణభారతమునకు సుందరోద్యానమువలెను ధాన్యాగారమువలెను విలసిల్లుచుండెను.

తద్దేశసీమంతినికి సీమంతమువలె కుంభఘోణము విరాజిల్లును. అందలి శార్ఙ్గపాణి విష్ణుభక్తులగు నాళ్వారు లందరిచే వినతినంది యత్ప్రాపృత మని వాసిగాంచిన దేవుడు. అచటకు పశ్చిమమున నాతి దూరమున కావేరియుత్తరతీరమున మండంగుడియను పురవరము గలదు. అచట వేదత్రయీపూత హృదబ్జాతులగు ద్విజవరేణ్యులు కాపురముందురు. అందు వేదవిశారదు డను బ్రాహ్మణోత్తమునకు ధనుర్మాసమున జ్యేష్ఠా నక్షత్రమున క్రీ.శ. 787 వ సంవత్సరమున శ్రీహరియొక్క వైజయంతి యను వనమాల యంశమున నొక బాలుడు జన్మించెను.

నారాయణకటాక్షమున నవతరించిన యా పట్టికి తండ్రి విప్రనారాయణు డని పేరు పెట్టెను. వారికి 'భక్తాంఘ్రిరేణు' వని దానికి సరిగా నరవమున 'తొండరడిప్పొడియాళ్వా'ర ని నామాంతరములు గూడ గలవు. జాత కర్మాది ద్విజోచిత సంస్కారము లందిన యా బాలునకు గర్భాష్టకముననే యుపనయనము గూడ జరిగెను. సర్వ వేదశాస్త్రములును నాతని కప్రయత్నముగనే కరతలామలక మయ్యెను.

జ్ఞానవైరాగ్యబీజములు వంశపారంపర్యసత్సంప్రదాయ సిద్ధముగా సంక్రమించి యా బాలుడు తన కృషిచే వానియందు ప్రవీణుడు గూడ నయ్యెను. ఆతనికి వివాహమంగళము గూడ నిర్వర్తింప దల చిరి. కాని సంసార మను మురికికూపమున దిగబడుట కిష్టము లేక దాని నాయన నిరాకరించెను. పరమ విష్ణుభక్తు డయిన యా కుమా రుడు శ్రీరంగనాథుని దర్శించు కాంక్షతో శ్రీరంగమునకు ప్రయాణ మాయెను.

శ్రీరంగనాథుని దర్శింపగనే యా యోగివరుని హృదయ మానంద రసమున చిందులు త్రొక్కసాగెను. రంగనాథుని సురూపసంపదను కన్ను లార సందర్శించినవాడై యాయన తన్ను మిగుల ధన్యాత్ముగా దలచెను. ఆ దేవాధిదేవుని సౌందర్య లావణ్యముల నినుమడింప జేయు నుద్దేశముతో నా యోగిపుంగవుడు గూడ శ్రీభట్టనాథుల వలెనే మాలాకైంకర్యముతో కాలము గడుప నిశ్చయించుకొనెను.

రంగనాథుని యాలయమునకు పశ్చిమమున నందనవాటికను బోలు నొక యుద్యానవాటిక నా భక్తవరుడు నిర్మించెను. రాత్రింబవళ్ళా యారామమున తులసీ పుష్పజాతులను ఆయన పెంచసాగెను. విచ్చిన పూలను కోసి నడుమ తులసీదళములు కూర్చి ఆ భక్తుడు కళాత్మకముగా సుమదామములు కట్టి ప్రతిదినము రంగనాయకితో గూడిన శ్రీరం గనాథునకు సమర్పించుచు భగవద్గుణానుభవానుసంధానముచే దినమొక క్షణముగా గడపుచుండెను. మధ్యాహ్నము శ్రీవైష్ణవుల గృహముల కేగి భిక్షాటనచే నెట్లో యుదరపోషణ చేసుకొనువాడు. ఆ ముని సౌశీల్య సంపద, భగవద్భక్తి పారమ్యము చూచిన ప్రజ లా కైంకర్యనిష్ఠ కెంతో యబ్బురపడుచుండువారు.

## దేవదేవి

కావేరీనది యుత్తరతీరమున కదంబనగరము సకలకళా నిలయమై యొప్పారుచుండును. అందొక నర్తకీవంశమున దేవదేవి యను వేశ్య యొకర్తు జన్మించెను. ఆమె సౌందర్యమున నచ్చరలేమలనే మించుచు విటసంచయ విత్తచిత్తముల నపహరించు నేర్పు గలిగియుండెను. ఒకనా డామె తన లాస్యగీతాదివిలాసములచేతను, హావభావాది శృంగారచేష్టల

చేతను చోళరాజును సమ్మోహింపజేసి మోయలేని ధనమును రత్న భూషాంబరాదులను బహుమతిగా స్వీకరించి యింటికి మరలెను.

మార్గమధ్యమున శ్రమాపనోదనార్థమై యా నర్తకీచూడామణి విప్ర నారాయణుడు నిర్మించిన యుద్యానవనమున కొంతసేపు విశ్రమించ దలచెను. చైత్రరథమును గూడ నందమున మించునట్టి యా వనము నామె తన యక్క యలివేణితో గలసి ప్రవేశించెను. ఆ యుపవనవృక్ష రామణీయక మామె కన్నుల కింపుగా కన్పించెను. ఒక వృక్షమూలము చేరి మార్గశ్రమ మాయమయిన దని యామె యెంతో సంతోషించెను. ఆమె సంతృప్తి హద్దులు మీరెను.

సోదరి యలివేణితో దేవదేవి యనెను—"అక్కా, చూడు మీ వనశోభ! ఫలభారముచే వంగిన వృక్షముల కొమ్మలు గర్భిణులగు కొమ్మ లను తలపునకు తెచ్చుచుండుట లేదా? సహకారనారికేళకదళీ పనసాది ఫలజాతులను, పున్నాగ వకుళాశోక జంబీర మల్లికాది పుష్పజాతులను చూచిన ప్రాణములు లేచి వచ్చుచున్నవి గదా! కుసుమ మకరంద మధుర మధుపానమత్తములగు భ్రమరములు నృత్యము లెంత నయనా హ్లాదకరముగ నున్నవో చూడుము. ఇందలి వాపీకూపసరోవరాదులు స్వచ్ఛనీరపూరములై సితారవిందములై చాల హాయిని కల్గించుచున్నవి. శుకపికశారికాది కోమల కలకూజితములతో నీ వనరామణీయకము సర్వ ప్రాణులకును మదనవేదనావివర్ధకముగా నున్నది సుమా!"

"అవు నిది యంతయు నీవు వర్ణించినట్లే యున్నది. ఇరు పార్శ్వ ములందును కవేరజప్రవహించుచుండుటచే నీ యుపవనశోభ శైత్యసౌర భ్యపావనత్వాదులచే మిక్కిలియు నినుమడించినది. బహుశః శ్రీరంగ నాథుడు తన యర్ధాంగిని కలసి యెండవేళల విహరించుటకు నిర్మిం చుకొనిన విలాసోద్యానవన మేమో యిది? కాకున్న నుష్ణకరుడు తన వేడిమి వదలి చంద్రునివలె చల్లని కిరణములతో మనస్సుల కుల్లాసము నెచ్చుట నైన కల్గింపగల్గునా?" యని యగ్రజ దేవదేవికి సమాధాన మిచ్చెను.

వా రిద్దరు నిట్లు సరససల్లాపములు సేయుచు చేతులు పట్టు కొని యా తోటలో సవిలాసముగా సంచరించుచు నడయాడుచు నా

11

యారామమున సంచరించుచున్నట్టి తద్వనపాలకుని విప్రనారాయణుని సందర్శించిరి.

ఆ వైష్ణవాలంకారుడు శ్వేతవస్త్రోపవీతములు ధరించెను. ద్వాదశోర్ధ్వపుండ్రములతో వింతకళల నీనుచు నా యోగివదనారవిందము సాక్షాచ్ఛ్రీమన్నారాయణునే తలపించుచుండెను. కరమున తులసీపద్మాక్ష మాలికలు విరాజిల్లు చుండెను. సంస్కార విహీనకేశములు, గడ్డము, మీసములు గుబురుగా పెరిగిన యా మునిని చూచినవారు స్వప్నమున నైన స్త్రీసంపర్క మెరుగని బాలయోగియా యాత డని తలంపక పోరు.

## సుందరుల పందెము

ఆ యుపవనమున తరుగుల్మలతాదుల కాలవాలములు నిర్మించుచు వానిని నీటితో పుష్కలముగ నింపుచున్న యా మహర్షిపుంగవుని వన మున సంచరించుచున్న యా యువిదలిరువురును దర్శించిరి. వెంటనే దేవదేవి సంభ్రమముతో నాయనవద్ద కేగి నమస్కరించి ప్రాంజలియై నిలబడెను. తన యెదుట నున్న భామినీమణిని చూచి గూడ తల యెత్తక విప్రనారాయణుడు తనపని తాను చూచుకొనసాగెను.

భువనమోహినిని తన్ను బొడగాంచిగూడ పెడమొగము పెట్టిన మునినుండి దూరముగ తొలగి దేవదేవి తన యక్కతో ననెను— "చూడక్కా, ఈయన షండుడు గాని యున్మత్తుడు గాని కావలెను. కానిచో నెదుట నిలబడిన యనుపమలావణ్యవతినగు నన్ను గని కూడ నీ బడుగు బాపడు మరువిరాళి కగ్గము కాకుండునా?"

చెల్లెలి మాటలకు చిరునవ్వుతో నరివేణి యిట్లు బదులు పలుకుచున్నది—"ఈయన షండుడు కాడు. ఉన్మత్తు డంతకంటెను గాడు. ఈ మునిని మనబోటి మానవునిగా తలపకుము. ఈయన దొడ్డ భక్తుడు. రంగేశకైంకర్యైక ప్రవణుడు. లక్ష్మిరూప్యము లిచ్చినను నీ మొగము వంక కైనను చూపు మరల్పబోడు. నీ విలాసవిలోకనములకు చిక్కుట కీయన చోళభూపాలు డనుకొంటి వేమో? ఇప్పటికైనను నీ మహాపురుషు నతిలోకమానవునిగా గమనించుట యుభయతారకము."

సురూపసంపదచే తా నసమాన నని విఱ్ఱవీగు దేవదేవి కలివేణి పలుకులు చెవి కెక్కలేదు. కినుకతో నామె యక్కతో నిట్లు పలుక సాగెను—"నా శక్తిసామర్థ్యము లెరిగియే నీ విట్లాడుచున్నావా? వాతాం బుపర్ణాశనులగు మహామును లెందరో మన్మఖావలోకన మాత్రము చేతనే తమ బింకములు సడల నన్ను గలియుట నీ వెరుగవే? ఎందరు కుబేరులు నా గుమ్మమువద్ద నా రూపతృష్ణాకృష్టచిత్తులై పడిగాపులు గాయలేదు! నవయౌవనాభిరాముడు రూపజితమారుడునగు నీ యోగి పుంగవు డీ విజనవనమున నున్నాడు గదా! ఇట్టి వానిని నేను వశము చేసికొనగలుగుటలో నాటంక మే ముండును? విశేషించి యిట్టి సాధు స్వభావుని నాబోటి సుందరి బుట్టలో పెట్టుట యొక లెక్కయా?

రూపమదమత్త యయి చెల్లెలు పలికిన బీరంపుపలుకులు అలివేణికి కోపము తెప్పించెను. ఆమె క్రోధముతో నేత్రాంతములు గెంపు గదుర "ఓసీ, నీ ప్రలాపము లిక కట్టిపెట్టుము. జితేంద్రియుడగు నీ భక్తాగ్రగణ్యుడు .నీ వెంత భగీరథప్రయత్నము చేసినను నిన్ను కన్నెత్తి గూడ గాంచడు. ఇట్టివానిని నీవు నీ వలలో చిక్కించుకొనగల్గినచో నే నారు మాసములు నీకు దాస్యము నెరపెదను" అని శపథము చేసెను. అతిమానుషసుందరియగు దేవదేవియు "నా పూనికలో కృతార్థురాలను కాలేకపోయిన యెడల నేను గూడ నీ కారు నెల లూడిగము చేసెదను" అని మారుపందె మొడ్డెను.

## యోగి పరిచర్య

దేవదేవి తన సోదరిని పరిజనమును నింటికి పంపివైచి చికీర్షి తార్థసాధనకై యా తపోవనమున నాగిపోయెను. తన సువర్ణరత్న భూషణరాజినంతయు నొక చెట్టు బోదెలో దాచి వైచి కావిగుడ్డలు కట్టెను. ఊర్ధ్వపుండ్రధారిణియై సాత్త్వికవేషముతో పరమభాగవతురాలి వలె నా ముని సన్నిధి కేగి దీనాననయై నిలబడెను.

విప్రనారాయణులును సాధ్వీవేషముతో వచ్చి తన ముందు నిలబడి యున్న యామెను గాంచి జాలిగదుర "నమ్మా, నీ వెవ్వరవు! ఏమి పనికై యిట కేతెంచినావు"అని ప్రశ్నించెను. ఆమెయు నవనతయై

ఆ మునికి నమస్కరించి—"స్వామీ, నా విన్నపము సాంతముగ నాల కించిన తర్వాత మీకుబోలిన నిర్ణయము గైకొండు. మా దీ ప్రక్క యూరు. పూర్వజన్మపాతకబాహుళ్యముచే నేను వేశ్యయింట జన్మించి నాను. కాని నాకు బాల్యమునుండియు ఎందుకో యీ వృత్తి యనిన నేవగింపు. కాననే యీ పుట్టువున నైనను నీ నరకకూపమునుండి యెట్లు బైటపడుదునా యని నాకు వయస్సు వచ్చినకొలది తాపత్రయ పడుచుండుదానను.

పరమభాగవతులగు శ్రీవైష్ణవోత్తముల పరిచర్య చేసినచో నీ జన్మ మెట్లో కడచిన తర్వాత భవిష్యజ్జన్మమున నైన నున్నతవంశమున జన్మించి భగవత్పాదారవిందసేవకురాలను కాగలనని నా విశ్వాసము. న న్నా నరకకూపమున బడవేసి నాచే విటాళి నాకర్షింపజేసి ధనమును కూడ బెట్టుటయే నా తల్లి యభిమతము. ఇక నామె న న్నెట్లును బ్రదుకనీయ దని తలచి నే నా యింటినుండి బయటపడగోరి దేవర పాదమూలమున కిట్లు పారివచ్చినాను. కాన మీరు నాపై దయచూపి మోక్షమార్గము నను గ్రహింపుడు. ఇచటనే నేను మీ సేవలో కాలము గడుపుకొందును. అందుకు మీరవకాశ మనుగ్రహింపనిచో నీ జన్మకు నా కింతయే వ్రాసిపెట్టి యున్నదని నిరాశతో నే నూయియో, యే గోయియో చూచుకొనుట తప్ప మార్గాంతరము లేదు" అని కృత్రిమ వినయ ముట్టిపడ తన కృతక జీవితచరిత్ర విన్నవించెను.

ఈ వృత్తాంతమును పాప మా యమాయక బ్రాహ్మణుడు నిజమే యని నమ్మి యామె మాటల యెడ కొంత యాసక్తి చూపెను. దేవదేవియు—"స్వామీ, మీరీ పాతకురాలియెడ దయాలేశము చూప దలచుట నా జన్మమును ధన్యము చేయుటకే. ఇక రక్కసియగు నా తల్లిని నేను చేరబోను. ధర్మావతారులగు మీపాదసేవ నేమ రక చేయుచు త్వదాదిష్టమార్గమున నీ యుద్యానమును పోషింతును. మీరు దయదలచి పట్టెడు భగవత్ప్రసాదము పెట్టిన నదియే పదివేలని స్వీకరించి పని లేని యప్పు డే మూలనో పడియుందును. మీరు భిక్షాటనమున కేగినపు డీ పూదోటను వేయి కన్నులతో కాపాడుదును. అన్యశరణమును వదలి మిమ్మే శరణు జొచ్చిన యీ దీనురాలికి మీరే శరణ"మని యా మునిగుండె కరగునట్లు పలికెను.

ఎంతటి నిగ్రహవంతు లయిన నేమి? ఎట్టి చతురమతులయిన నేమి? కాలము వక్రించినపు డెట్టివారి మాయావాగురలో చిక్కి తీరు దురు. "వినాశ కాలే విపరీతబుద్ధిః"యను సూక్తి సత్యమే కానిచో శ్రీరాము డాడుదానిమాట నమ్మి మాయలేడివెంట బడునా? స్వర్ణ మృగము మృగజలసమమని యాతనికి తెలియదా? తెలిసితెలిసి రావణు నకు సీత నప్పగించిన యా రామునికంటె నితరు లేమి గొప్పవారా? ఇంతకును కాలము త్రోసుకొని వచ్చినపు డెవరును దాని కెదురు నడువ లేరు గదా! అస్తు. సహజసాధువగు నా యోగిపుంగవునంతవాడు గూడ నా వేశ్య మాయమాటలకు లోబడి యామె కాశ్రయ మిచ్చెను. ఇక నేమి? ఆమె తన మనోరథము ఫలించు నుపాయ మన్వేషింపసాగెను. తన ప్రతిజ్ఞ నెరవేరినట్లే యామె లోలోన పరవశింపసాగెను.

తదాది ఆమె కావేరిలో నిత్యము త్రికాలములందును నియతితో తాన మాచరించును. ఊర్ధ్వపుండ్రధారిణియై తులసీపద్మాక్షమాలికల దాల్చి విప్రనారాయణునకు నమస్కరించి తన్నిర్ణీతకైంకర్యము భక్తితో చేయుచుండెడిది. తదుచ్ఛిష్టావశేషమును స్వీకరించి దేవదేవి నిజముగా సర్వపాప విముక్తురాలై శరచ్చంద్రికవలె లావణ్యముతో మిసమిసలాడ సాగెను. సంతోషము సగము బల మనిరి గదా! ఆమె పుష్ప తులసీ వృక్షమూలములను ఖనిత్రముతో త్రవ్వి కుదురులు గట్టుచు నా మునిశ్రమలో తాను గూడ పాలు పంచుకొనుచుండెడిది.

ఈ విధముగా గడువుసమయ మారుమాసములును నారు నెల సములుగా గడచి పోవనుండెను. శీతవాతాతపముల నామె పైకి లెక్క చేయకుండ ప్రవర్తించుచుండినను తన యక్కతో తాను చరచిన పందె మెట్లు సాధింపగలనా యనియే యామె యహర్నిశము పరితపించ సాగెను. పగలంతయు నుద్యానకృషితో నెట్లో గడచిపోవుచుండెను. కాని రాత్రులం దేకాంతముగా కరకునేలపై శయనించిన యా కోమలాంగి మనము నావరించిన చింత చితివలెనే దహింపజొచ్చెను. ప్రతిరాత్రియు నామె పాలిటికి కాళరాత్రియే యాయెను. నానాటి కామె కృష్ణపక్ష క్షపాకరునివలె కృశీభూతాంగయష్టి యయ్యెను. ఆమె ఒకనాడు—"హే భగవన్! పందెమే నెరవేరనిచోనిక నాకు కావేరీతోయమే గతి! కాన పాల ముంచినను నీట ముంచినను నీదే భారము. అశరణ్యశరణ్యా,

శరణుశరణు" అని చివర కగతికయై తన ప్రతిజ్ఞ నెరవేర్పక తప్ప దని శ్రీరంగనాథునే శరణు వేడెను.

## వైష్ణవమాయ

తన ప్రతిజ్ఞ నెరవేరువరకును విప్రనారాయణయోగి నామె పట్టు వదలక సేవించుచునే యుండెను. ఈ విధముగ ప్రతిజ్ఞాతకాల మూరు మాసములును గడచిపోవు సమయమేతెంచెను.

దేవదేవి దుఃఖమున కింక నంతు లేకపోయెను. "అయ్యో, ఎంత ప్రార్థించినను తండ్రి రంగనాథుని మనము కరుగక పోయెనే! తల్లీ, మహాలక్ష్మీ, రంగనాయకీ, నీవైన నీ భర్తతో నా మొర వినిపించి నన్ను తీర్ణప్రతిజ్ఞను చేయుమని యామె రెండు చేతులును నెత్తి దుర్యోధనుని సభలో మానాపహరణ మను నీచపరాభవమునకు పాల్పడిన ద్రౌపది విల పించినట్లే---

"హేకృష్ణ, ద్వారకావాసిన్ క్వాసి యాదవనందన!
ఇమా మవస్థాం సంప్రాప్తా మనాథాం కిముపేక్షసే?"

---యని గండయుగళమున నశ్రుజలము ప్రవహింపగా మహార్తయై విలపించెను. ఆ యార్తారావము తన చెవిని బడగనే సర్వలోకైకమాత శ్రీరంగేశ్వరిహృదయము వెన్నవలె కరగిపోయెను. వెంటనే యా తల్లి త్రిలోకనాథుడు రంగనాథునితో "స్వామీ, మీ కిప్పటికైనను త్వదేకా శ్రితురాలును భాగవతప్రపన్నురాలునునగు దేవదేవిపై దయ రాలేదా? పూర్వ మెందరినో పాపాత్ములను రక్షించిన మీ కీ వారాంగన పాపము లొక లెక్కయా? మీ రింకను నిట్లే యుపేక్షవహించుచు నా కేమి పట్టినదని యూరకున్నచో పాప మామె తన ప్రాణములనే తన ప్రతి జ్ఞకై యర్పించి తీరును. కాన నికనైనను నా పరమభక్తురాలిని కాపాడ సిద్ధము కం"డని విన్నవించెను.

శ్రీరంగనాథుడును నింతవరకును దేవదేవిని కఠిన పరీక్షలకు గురి చేసెను. ఇంకను బాధించిన నా బాల తాళలేదను నిర్ణయమున కా స్వామి యింతకు ముందే వచ్చి యుండెను. ఇపుడు శ్రీరంగ

నాయకి ప్రార్థన గూడ నాయనపై పని చేసెను. వెంటనే విష్ణువు తన మాయను విప్రనారాయణునిపై ప్రయోగించెను.

యాదృచ్ఛికముగ నది వర్షాకాల మయ్యెను. దేవదేవి మనోభీష్టము సమకూర్చు ప్రాకృతిక సంఘటన మది. ఘుమఘుమారావసంకుల ఘోర జీమూతపటలముచే నభ్రభాగము సంఛన్నమై యొకనాటి నిశీథమున జడివాన గురియ నారంభించెను. సూచీభేద్యమగు నా యంధకారమున భీతితో దేవదేవి యా యోగివరుని వాకిట నొక మూల నొదిగి కూర్చొని చలితో వడవడ వడకజొచ్చెను.

ఉరుములతో మెరుపులతో తాటియాకుల చప్పుళ్ళనొకప్పుడును, మరి యొకప్పుడు గజఘీంకారములను ననుకరించుచు గురియుచున్న యా వర్షము విప్రనారాయణయోగివరుని కలతనిద్రనుండి తటాలున మేల్కొల్పెను. వెంటనే రంగనాథుడు తన యనుగ్రహలేశ మా మునిహృదయద్వారమున దేవదేవిపైకి ప్రసరింప జేయదలచెను. "పాప మీ నిశీథమున నీ గాలివానలో దేవదేవి యెట్లున్నదో గదా"యని యా యోగియెదలో నొక భావము మెరపువలె మెరసెను. వెంటనే యాయన తలుపుతీసుకొని బైటకు వచ్చి "అమ్మా, ఈ గాలివాన నన్ను లోపలనే నిలువనిచ్చుట లేదు. పాపము నీ వెట్లీ యారుబయలున నీ బాధ నింతవర కోర్చుకొన్నావో గదా! ఇంత యవస్థ యేల? లోనికివచ్చి యే మూలనైన నొదిగి పరుండుము' అని పిలిచెను. 'నేటికి గదా ధన్యాత్మనైతి' నని యామె లోలోన సంతసించుచు లోనికి ప్రవేశించెను.

రూపలావణ్యములలో రతిదేవిని బోలిన యా దేవదేవి కోకిలస్వరమును తిరస్కరించు మధురకంఠముతో నా యోగితో నుబుసుపోకకై మాటపలుకుల నారంభించెను. మోహినీమాయాతిరోహితుడైన యా మునియు క్రమక్రమముగా నామె యందమును తన నేత్రములతో పానము చేయుచు చెవులతో నామె వాఙ్మాధురిని గ్రోలసాగెను. ఆమె యా మునిపాదము లొత్తెను. ఆయనయు కాదనలేదు.

"ఘృతకుంభసమా నారీ తప్తాంగారసమః పుమాన్,
తస్మాత్ ఘృతం చ వహ్నిం చ నైకత్ర స్థాపయేత్ బుధః."

—అను శ్లోకము ననుసరించి

మ. ఆ విప్రోత్తము వజ్రపంజరనిభంబై నిశ్చలం బైన స
ద్భావం బంగనసాహచర్యగుణసంపర్కంబునన్ లోహమై,
గ్రావంబై, దృఢదారువై, తరుణవృక్షంబై, ఫలప్రాయమై,
పూవై, తన్మకరందమై కరగెఁ బోఁ బో నీళ్లకుం బల్చనై.
—వైజయంతీ విలాసము.

అంతటి యోగివరుడును నా కాంతకు అంతలోనే దాసానుదాసు డయ్యెను. ఈ విధముగా దేవదేవి రంగనాయకీ శ్రీరంగనాథుల కటాక్ష మాధారముగా చేసుకొని తన పూర్వపుణ్య పరీపాకాతిశయముచే నా యోగిని తన యనురాగపాశమున దృఢముగా బంధించెను. క్రమముగా నాయన స్నానసంధ్యాదికముల మాట యటుంచి మాలాకైంకర్యము గూడ మరచి దివానిశము లా దేవదేవితోనే రతికేళి నోలలాడసాగిరి. ఆ వర్ణాశ్రమాచారధర్మము లేడ బోయెనో! ఆ భగవద్భాగవతార్చన లే దిక్కున కేగెనో! ఆ మహర్షి యా యుపవనమును వదలి భోగార్థియై దేవదేవి వెంట నామె యింటి కేగెను. ఈ విధముగా యోగి మూర్ధ న్యుడు విప్రనారాయణుడు క్రమముగా దైవాదేశముచే భోగిమూర్ధన్యు డాయెను. ఆహా! వైష్ణవమాయ యన నిదియే కాబోలు!

## పాత్రచౌర్యము

ఆ విధముగ విప్రనారాయణుడు దేవదేవితో విషయభోగములు చిరకాల మనుభవించెను. దేవదేవియు నాయనను సాక్షాచ్ఛ్రీరంగనాథుని గానే భావించి పాదసంవాహనాదులతో ఆ ముని నెంతో తృప్తిపరచెను. ఆ వేశ్యతల్లి విటకంటకి యను సార్థకనామురా లాయనవద్దనున్న ధన మంతయు సమూలముగ పిండివేయజొచ్చెను. డబ్బంతయు నూడ్చి వేసి యామె యాతని తన యింటినుండి వెడలనడచెను. ప్రియా మోహపాశబద్ధుడగు నా యోగి యామెను వీడ నిష్టములేక యా యింటియరుగులపై నా రాత్రి శయనించెను.

అపుడు శ్రీరంగనాథుడు తన దేవితో విలాసయాత్రకై బయలు వెడలి యట్లు వీథియరుగుపై పరుండియున్న విప్రనారాయణు గాంచెను. రంగనాయకి తన భర్త నీయన యెవరని ప్రశ్నించెను. "మనకు మాలా కైంకర్యము చేయుచున్న భక్తసత్తముడు విప్రనారాయణుడే గాని

యీాయన మరియెవరో కాదు. మోహపాశబద్ధుడై దేవదేవికి తన జీవితసర్వస్వము నర్పించి యిపుడు నిర్ధనుడైనందున వెడలగొట్టబడి యిట్లీ యరుగుమీాద పడియున్నా"డని రంగనాథుడు బదులు చెప్పెను. అది విని యాతని దుఃస్థితికి వ్యాకులాంతఃకరణయై యా జగదేక మాత—"స్వామీా, ఇంతవరకు నీ భక్తు నిట్లు పలువెతల పాల్జేసినది చాలదా? ఇట్టి పరమభక్తుడా నీ మాయకు గురి కాదగినవాడు? గతం గతం. దేవదేవి సంసర్గముచే నీ భక్తవరున కంటిన పాపపంకము తొల గించి యీాతని నీ కృపాపాత్రుని గావించుకొని కాపాడుడు."

ఆమెమాట విని రంగనాథు డాలయము చేరి తన యర్చనకై యుప యోగించు పంచపాత్రములలో నొక సువర్ణపాత్రముచేతగొని యొంట రిగా దేవదేవియింటికి మారువేషమున వచ్చి తలుపుకొట్టెను. ఎవరు వారని పలుకుచు తలుపు తీసి ఆమె బైటకు వచ్చెను. "నేను రంగనాథ దాసుడను, విప్రనారాయణు శీ పాత్రము నీ కిచ్చి రమ్మని నన్ను పంపి నారు"అని పలికి యాయన దాని నామె కిచ్చెను. విప్రనారాయణుని వెంటనే తోడ్కొని తెమ్మని యాామె పలుక నాయన విప్రనారాయణుని వద్దకేగి దేవదేవి పిలుచుచున్న దని చెప్పి యాామెవద్ద కంపెను. మరల నీ విధముగా నా భక్తవరు డామెతో నా రాత్రి సుఖముగా గడపెను.

మరునా డుదయము స్వామివారికి పూజచేయుచున్న యర్చకు లకు స్వర్ణపాత్ర కనుపింపలేదు. వెంటనే దేవాలయాధికారు లా సంగతి చోళరాజుకు తెలిపిరి. అది విని చౌర్య మెట్లు జరిగినదో ప్రశ్నిం చియు తెలిసికొనజాలక యా రా జర్చకుల నందరను ఖైదులో పెట్టెను. నిదానముగా రాజు కా పాత్ర దేవదేవియింట నున్నట్లు తెలిసెను. రాజ భటులు పాత్రతో బాటు విప్రనారాయణుని దేవదేవిని గూడ నృపసన్నిధికి గొనివచ్చిరి. అది రంగనాథునిదే. ఈ పాత్ర నీ యింటి కెట్లు వచ్చినదని యధికారులు దేవదేవిని దండింపగా నామె భీతితో "ప్రభూ, రంగనాథదాసను తన సేవకునితో దీనిని విప్రనారాయణుడే నాకు పంపినాడు. ఇంతకు మించి నా కేమియు తెలియ"దని విన్న వించెను. "ఆ పాత్రను నే నామెకు పంపలేదు. నా కసలు సేవకులే లేరు" అని విప్రనారాయణుడు చెప్పెను.

చోళరాజు దేవదేవి నిర్దోషి యని తలచి వదలి వైచెను. పాత్రను రంగనాథాలయమున కంపెను. స్వర్ణాపహరణాపరాధమునకై విప్రనారాయణునకు శిక్ష విధింపదలచి యాయనను చెఱలో పెట్టించెను.

## భగవత్కటాక్షము

నాటిరాత్రి రంగనాయకి జగత్పితతో "స్వామీ, ఇంతవరకు చేసినది చాలును. మన భక్తున కిక జ్ఞానోదయము కలిగించి యుద్ధరింపుడు" అని ప్రార్థించెను. వెంటనే రంగేశుడు చోళరాజుకు స్వప్నమున దర్శనమిచ్చి "రాజా, నేనే యీ పాత్రను విప్రనారాయణుడు పంపెనని దేవదేవి కిచ్చినవాడను. వేశ్య కిచ్చిన ధనము స్వీకరింపను. అది యామెకే పంపివేయుము. పాత్రసంగతి యెరుగని విప్రనారాయణుని ఖైదునుండి విడిపింపు" మని యాదేశించెను.

తెల్లవారకముందే చోళనరపతి మేల్కొని యహర్ముఖోచితకృత్యము లాచరించి వెంటనే మంత్రులకు స్వప్నవృత్తాంత మెరిగించెను. విప్రనారాయణులను పిల్చి నిష్కారణముగా శిక్షించినందుకు పశ్చాత్తాపము వెలిపుచ్చి తగు రీతిని పూజించి గౌరవమర్యాదలతో వారి యింటి కనిపెను. ఆ యోగివరులును తా మింతవరకు చేసిన హీన కృత్యమునకై యెంతో విచారపడిరి. తద్దోషపరిహారార్థమై యథావిధిగా శాస్త్రోక్తప్రాయశ్చిత్తము నాచరించిరి. సర్వపాపములను నిర్మూలించుటలో భక్తపాదోదకసేవను మించినది మరొకటి లేదు గదా! తమ్మంటిన మాలిన్యములు తొలగించుకొనుటకై నదు లన్నియు భక్తపాదజలమునకే యెదురు చూచుననుట సుప్రసిద్ధము, సామాన్యులు స్నానమాడునపుడు నదులు మాలిన్యమును, భక్తులు స్నాన మాడునపుడు పావిత్ర్యమును పొందునను మాట శాస్త్రసిద్ధము గూడ. ఇట్టిది గదా భాగవతపాదతీర్థసేవనమహిమ!

## పరమజ్ఞానలాభము

వైష్ణవాంఘ్రిజలపానముచే పూతాత్ము డయిన యా భక్తు డిట్లు చింతించెను—"అయ్యో, నేను నా దుశ్చర్యచే విప్రనారాయణు డను నాకు పెద్దలు పెట్టిన పేరును గూడ నపవిత్రము చేసినాను గదా! కాన ఆ పవిత్రార్థస్ఫోరక మగు నా నామము వదలి భక్తాంఘ్రిరేణు

వను పే రీ నాటి నుండి తాల్తును." భక్తపాదతీర్థపానముచేతను భక్తపాదరేణువులను శిరమున దాల్చుటచేతను మాత్రమే వారు యథా పూర్వగౌరవము నందగలిగి రనుటలో నబ్బురము లేదు గదా!

కరుణామయు డగు రంగనాథుడు వారిని సమ్ముఖమునకు పిలి పించుకొని యర్చకముఖమున ప్రీతితో నిట్లానతిచ్చెను—"వత్సా, నీకు దేవదేవి సంసర్గమున పాప మంటిన దనుకొనుచున్నావేమో! అది సరి కాదు. ఆమె గూడ పూర్వజన్మమున నొక యప్సరోవనితయే. శాపవశమున నీ జన్మ మెత్తినది. నీ సంపర్కముచే నామె గూడ పావనచరితయైనది. ఆమెకు మోక్షము గూడ నీ తోడిపొత్తుచేతనే లభింపగలదు. కాన గతమున కెంత మాత్రమును వగవక పూర్వము వలెనే నా కైంకర్యము చేయుచుండుము. నీవు కోరిన రీతిగా నీకు భక్తాంఘ్రిరేణువు, తొండరడిప్పొడి యాళ్వారు అను నామములు లోక మున రూఢము కాగలవు" అని యానతిచ్చెను.

శ్రీరంగనాథుని యపారకృపచే తొండరడిప్పొడి యాళ్వారునకు పర భక్తి-పరజ్ఞాన-పరమభక్తులు పూర్వము కంటె నెక్కుడుగా దినదినాభివృద్ధి నందెను. ఆ మహాయోగి భక్తిజ్ఞానవైరాగ్యముల కలరి దేవదేవియు తచ్ఛి ష్యురాలై సాధుహృదయముతో సాత్త్వికభక్తిప్రవణయై యాయన కైంక ర్యమందే కాలము గడపి యంతమున విష్ణుసాయుజ్యమందెను.

ఈ విధముగ తొండరడిప్పొడియాళ్వారు సర్వప్రకృతి సంసర్గములను వీడి రాహుముక్తచంద్రునివలె ప్రకాశించుచు భగవత్సేవలోనే కాలము గడపిరి. భట్టనాథులవలెనే వారు గూడ మాలాకైంకర్యముతో పాటు స్వరచితవాఙ్మాలలతో గూడ రంగనాథు నలంకరించి యంతమున భగ వత్పాదారవిందముల నందిరి.

## రంగనాథస్తుతి

ఈ యాళ్వారు రచించిన కృతులు రెండు. మొదటిది పది పాశు రములు గల తిరుప్పళ్ళియెళుచ్చి. ఇది రంగనాథుని సుప్రభాతస్తుతిరూప మయినది. వైష్ణవదివ్యదేశములలో నుదయమున దేవసన్నిధిని దానిని పాడుచు స్వామిని మేల్కొలుపుదురు. దీనికి ప్రాబోధకి యని గూడ నామాంతరము. రెండవది తిరుమాల. ఇందు 45 పాశురములు

గలవు. ఈ కృతిలో శ్రీరంగనాథుని మహిమ, భక్తపరాధీనత మొదలగు సద్గుణసంపద విశదముగా వర్ణింపబడినవి.

శ్రీమాన్ మాడభూషి గోపాలాచార్యులవారి యనువాదము నీ రెంటికిని శ్రీగోదాగ్రంథమాలవారు తిరుమాల యను పేరుతో ప్రచురించియున్నారు. అందలివే ఈ యుదాహరణలు. ఈ యాళ్వారుల సుప్రసిద్ధపాశుర మొకటి తిరుమాలనుండి, దాని యనువాదముతోపాటు ముందిచ్చుచున్నాము.

"పచ్చై మామలై పోల్ మేని పవళవాయ్ కమలచ్చెంగణ్
అచ్చుతా అమరరేరే ఆయర్‌తం కొళుందే నెన్నుం
ఇచ్చువై తవిరైయార్‌ఫోల్ ఇందిరై లోక మాళుం
ఇచ్చువై పిరనుం వేండే నరంగమానకరుళానే."

సీ.కనులకు విందుగా మనసుకుఁ జల్లగా
శ్రీకరాకారమై చెలువు లొలుకు
మరకతముల లీల వరలెడు తిరుమేను
తిరుమేను కడలిలోఁదేజరిల్లుఁ
బగడాలనుడివలె వగలొల్కు కెమ్మోవి
వాత్సల్యపరిపూర్ణ భావ మొలుకు
అరవిందనయనంబు లమరి సుస్థిరమైన
అందాలమనికియౌ అచ్యుతుండ
కనుమూత లేకుండ కలకాలమును నిన్నుఁ
జూచు భాగ్యము గన్న సురల కధిప
తెలివి తక్కువతోడ తిరుగాడు గొల్లల
మురిపెంపు మొలకమై వరలు రాజ
గీ.అనెడి సౌభాగ్యమధురరసాప్లుతమ్ము
నీదు తిరునామ మిచ్చోట నెగడుచుండ
పోయి పరమపదంబును బొంద నేల
వలదు శ్రీరంగపురవాస పరమపదము.

తిరుప్పళ్ళియెళుచ్చి మొదటి పాశురమునకు అనువాదమిది---

ప.ఉదయగిరిశిఖరమున--నుదయరవి కొలు వమరెఁ
చెదరినవి చీకటులు--నిదుర విడు రంగా
అద నిదియె కనుగొనుము—ముద మొసగ గుసుమములు
ఎద విరిసి మధు వొలుకు--నది గనుము, రంగా
మదకరుల, మురజముల--రొద జలధివలెఁ జెలగఁ
త్రిదశులును బ్రభువులును—నిదొ గనుము, రంగా

మొదట నిను గనుగొనెడు--మది చెలఁగి వచ్చిరిదె
  సదయుడయి కను దెఱువు--ముద మొలుక రంగా!
మొదటి తిరుపతి యయిన–సదనమున నురగపతి
  మృదుశయనముగ నెపుడు--నిదురగొను రంగా!

మ. నరసింహస్తుతిసేయు కావ్యము సువర్ణశ్లాఘ్యపద్మంబులన్
సరసంబౌ కలకూజితంబు గల హంసశ్రేణులం గల్గి యా
యరదౌ మానసశోభ నింపెసఁగు; నా యబ్జాక్షు సంకీర్తనం
బెర గానోపని కావ్య మీ యిలను దానేరీతి శ్లాఘ్యం బగున్?

—శ్రీనరసింహస్తుతి

* * *

# XI శ్రీప్రాణయోగి [తిరుప్పాణాళ్వార్]

"వృశ్చికే రోహిణీజాతం శ్రీప్రాణం నిచుళాపురే,
శ్రీవత్సాంకం గాయకేంద్రం మునివాహన మాశ్రయే."

ఆపాదచూడ మనుభూయ హరిం శయానం
మధ్యే కవేరదుహితు ర్ముదితాంతరాత్మా,
అద్రష్టృతాం నయనయో ర్విషయాంతరాణాం
యో నిశ్చికాయ మనవై మునివాహనం తమ్.

శ్రీరంగమునకు సమీపమున నిచుళాపుర మను నామాంతరము గల ఉరయూ రను దివ్యక్షేత్రమున శ్రీహరియాజ్ఞచే శ్రీవత్సాంశ మున శ్రీప్రాణయోగి క్రీ.శ. 841 సంవత్సరమున వృశ్చికమాసమున రోహిణీ నక్షత్రమున నవతరించెను. వీరినే తిరుప్పాణాళ్వారు అనికూడ నందురు. వీరు వ్రీహిగుచ్ఛమున జన్మించిన యయోనిసంభవు లని ప్రతీతి. కాని బాల్యమునుండియు నంత్యజవంశమున పెరిగిరి.

"జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః,
సాత్త్విక స్సహి విజ్ఞేయ స్స వై మోక్షార్థచింతకః."

భగవంతుడు శ్రీహరి యే జీవిని జన్మకాలమున కటాక్షించునో యాతడు సత్త్వగుణప్రధానుడై మోక్షచింతగలవా డగును---అనున ట్లా యోగివరుడు బాల్యమునుండి హరిభక్తిపరాయణుడై ప్రహ్లాదనారదాదుల తలపించుచుండెను. ఆయన సంసారగంధ మెరుగరు. శ్రీరంగక్షేత్ర మునకు దూరముగ కావేరీతీరమున వీణాపాణియై సదా రంగనాథున కభిముఖుడై యా దేవుని గుణగానముననే కాలము పుచ్చువారు.

పూర్వము కురంగనగరమున చండాలు డొకడు దూరమునుండియే కురంగనగరాధిపతి విష్ణుదేవుని కైశికి గీతములతో పాడుచుండువాడు. ఒకప్పు డొక బ్రహ్మరాక్షసు డాతనిని నీవు పాడిన గీతఫలము నా కిమ్మని, దానితో నా యీ రాక్షసజన్మ యంతరించు నని ప్రార్థిం చెను. అట్లేయని యొకనాటి గీతఫల మిచ్చి యాత డా బ్రహ్మరాక్షసుని రక్షించెను. ఈ కథ ఆముక్తమాల్యదలో మాలదాసరి కథగా వర్ణితము.

సరిగా నా మాలదాసరి వలెనే యీ తిరుప్పాణయోగి కూడ భగవద్జ్ఞానతత్పరులై తన దేవగానముచే రంగనాథుని సాక్షాత్కరించుచు నాహారపానీయములు విసర్జించి కాలము గడపుచుండువారు. భగవద్ధ్యాన విద్యలకు సార్వభౌము లైన యీ యోగిసత్తములు సామగానరతాత్ము లగు నిత్యసూరులనే తలపించుచుండెను. ఆనందబాష్పములు చెక్కిళ్ళనుండి సంతతధారగా కారగా పులకితశరీరులై శ్రీరంగనాథనామగాన రసమే యాహారము కాగా వారు కాలము గడపుచుండువారు.

ఉభయకావేరీమధ్యస్థ మయిన శ్రీరంగము పరమపావనము. కాన దాని నంత్యజు డైన తాను తన పాదములచే నంటరా దని తలచి యీ యోగి శ్రీరంగక్షేత్రమున కాలుమోపుటకే సాహసింపలేదు. అయినను సప్తప్రాకారవేష్టితమగు శ్రీరంగదేవాలయమున విరాజిల్లి యున్న శ్రీరంగనాథుని తన జ్ఞానదృష్టితో వీక్షించి యీ మూర్తి నిసుకతో యథాతథముగా నిర్మించి శేషతల్పశాయి యగు శ్రీరంగనాథుని తన్మయచిత్తముతో ధ్యానించుచు వా రానందించువారు.

ఆ కాలమున లోకసారంగు డను భక్తుడొకడు శ్రీరంగనాథుని సేవించుచుండువాడు. ఆయన ప్రతిదినమున కావేరినుండి సువర్ణ కలశముతో పుణ్యజలము తెచ్చి శ్రీరంగనాథుని యర్ఘ్యపాద్యాదులకై యర్పించువాడు. ఒకనా డాయన కావేరీతటమునకు నీరుతెచ్చుట కేగగా తిరుప్పాణాళ్వారు తమ గానామృతముచే రంగనాథుని సాక్షాత్కరించుచు భక్తిపరవశులై కనుపించిరి. పంచమవేషముతో నున్న వారిని దూరముగా తొలగు మని యాయన గద్దించెను. భగవద్గుణానుభవామృతమునే యాస్వాదించు నా యోగి బాహ్యస్మృతి రహితుడైనందున దారి తొలగకపోగా మారుగూడ పలుకజాలక పోయెను. "నా యదలింపు విని గూడ నీ మాలడు తప్పుకొనుట లే"దని కోపముతో లోకసారంగు డాయనపై నొక రాయి విసరెను. అయినను పాణయోగి చలింపలేదు. మునితో వచ్చిన ఇతర బ్రాహ్మణులు ద్విగుణీకృతక్రోధులై యాయనపై శిలావృష్టినే కురియించిరి.

కాలుసేతులు గాయములతో నెత్తురు చిమ్ముచున్నను నా యాళ్వారుకు బాహ్యస్మృతి రాలేదు. భగవత్పారవశ్యముచే నీయన యిట్లు కదలకయున్నా డని తెలిసికొనలేక ద్విజన్ము లయినను మూర్ఖు లయిన యీ శ్రీరంగార్చకు లిది యేమి మాయయో యని తలచుచు రంగనాథాలయమునకు మగిడి చనిరి.

తన గానము పూర్తి యయిన పిదప తిరుప్పాణాళ్వారున కొడలు తెలిసెను. శరీర మంతయు గాయపడి రక్తము ధారలు కట్టుచున్నను దానికి కారణము శ్రీరంగనాథార్చకు లని యితరులచే తెలిసికొని గూడ నా యోగివరుని మన మించు కంతయు కలత చెందలేదు. పై పెచ్చు వారికి బాధయే తెలియలేదు. భక్తపరాధీనుడగు రంగనాథు డా బాధను తానే తీసుకొని యనుభవింపదలచెను. కాననే యా స్వామి శరీరమంతయు కందగడ్డవలె కంది పోయెను. ఒడలిపై గాయములు తగిలి రక్తము చిందసాగెను. మొగమున దెబ్బలు తగిలి నెత్తురు స్రవింప దొడగెను.

అర్చకు లీ విషయము గమనించి భీతచిత్తులై యా దేశాధిపతికి నివేదించిరి. ఆ భూపాలుడును వెంటనే పరుగున నేతెంచి దేవాధి దేవునకు తగిలిన గాయములు పరికించి మిగుల వెత చెందెను.

అపుడు శ్రీరంగనాయకి రంగేశునితో "నాథా, నీ భక్తుడగు తిరుప్పాణాళ్వారును రక్షింప నిదే యద నని నివేదించెను. భక్తావన దీక్షితుడగు రంగశాయి లోకసారంగమునికి కలలో కనుపించి యాతని కిట్లాదేశించెను. "శ్రీపాణయోగి నా కత్యంతాత్మీయుడు. పరమభాగవతోత్తముడగు నాతని సామాన్య మానవునిగా తలపకుము. ఆతనిని మీరు కొట్టిన ఱాలదెబ్బలే నా శరీరమునకు తగిలినవి. నా కాయమున తగిలిన గాయములు మీరును చూచితిరి గదా! కాన నికనైన నాలసింపక నీ వేగి యాత డొకవేళ రాకపోయినను బలాత్కారముగ నైన నా యోగిని నీ భుజస్కంధములపై నెక్కించుకొని సగౌరవముగా నా సన్నిధికి తోడ్కొనిరమ్ము. అపుడే మీరు చేసిన దుష్కృత్యము క్షమార్హము కాగలదు."

లోకసారంగముని హరియానతి వినగనే తటాలున నిదుర లేచెను. ఆయన ఉషఃకాలమునకు ముందే స్నాన మాడి శుచియై ధృతోర్ధ్వ పుండ్రుడై శ్రీపాణయోగి సమీపమునకు చేరి సాష్టాంగదండప్రణామ మాచరించి "భక్తోత్తమా, మా తప్పిదము సైరింపుము. శ్రీరంగనాథుడు నీ యత్యంతభక్తికి ప్రీతుడై నిన్ను తోడ్కొని తెమ్మని నన్ను పంపినాడు. కాన వెంటనే విచ్చేసి నన్ను ధన్యుని జేయుము. మేము తెలియక మీపై శిలా వర్షము కురిపించినాము. ఆ యపరాధము

క్షమింపుడని కోరుటకు కూడ నర్హత కోలుపోయినాము" అని మనవి చేసెను.

పాణయోగి కృతాంజలియై యా మునికిట్లు సమాధానమిచ్చెను— "ఏమి స్వామీ, ఈ విధముగ నంత్యజుడ నయిన నాకు మీరు నమస్కరించుటయా! మీ యీ చర్యచే నేను చాల నపచారపడితిని గదా! శ్రీరంగడు నన్ను రమ్మని పిలువ నంపెనా? ఆ స్వామికి నాపై నెంతటి దయయో గదా! అయిన నంత్యజాతిసహజ మగు నశుచిత్వము మొదలగు దుశ్చర్యలకు నిలయమైన నే నేడ? రంగనాథుని సన్నిధికి వచ్చుట యేడ? ముఖ్యముగ నా యీ యపవిత్రములగు పాదములతో నా స్వామి మందిరమును నేను చూచిచూచి మలినము చేయగలనా! కాన నేను రాజాలను. ఇచటనుండి మనమున నే యా స్వామిరూప కల్పనచేసుకొని తదీయ ముఖపుండరీకామృతపానము చేసికొనుచుందును."

అది విని యా ముని పాణయోగితో పల్కెను---"మీరు నడచి వచ్చుట కిచ్చగింపనిచో నా భుజములపై నెక్కిరండు, రాక తప్పదు. ఇది రంగేశుని యాన."

పాణయోగి యిక తన స్వామియాజ్ఞ జవదాటుట యనుచితమని తలచి ముకుళితనేత్రులై సాంజలిబద్ధులై రంగేశుని స్మరించుకొనుచు నిలబడిరి.

రంగనాథుని ఖగరాజు భుజస్కంధములపై వహించు నట్లే యా మునిలోకనాథు డగు లోకసారంగుడు తిరుప్పాణాళ్వారును తమ భుజములపై నెక్కించుకొని రంగనాథుని యాలయమునకు బైలుదేరెను. ముందు వేదపఠనము వెనుక ద్రావిడ వేదపాఠము చేయుచు ద్విజోత్తములు నడువసాగిరి. నెమ్మదిగా వారు శ్రీరంగనాథుని యాలయమందలి శంతనుమండపము చేరిన తర్వాత మునివాహను డగు లోకసారంగముని యాలయవిమానమునకు కృతాంజలియై ప్రదక్షిణ మాచరించి రంగనాథుని సమీపించెను.

దరిద్రుడు మహానిధిని గని యానంద మందునట్లు రంగేశుని సేవించి తిరుప్పాణాళ్వారు "ఆహా, నేటికి గదా నా జన్మము తరించినది" అని ఆనంద మందెను. రంగనాథుడు కిరీట కేయూర సువర్ణ కుండలా

12

ద్యలంకారసంశోభిత మగు తన దివ్యమంగళవిగ్రహముతో నా భాగవతో త్తమునకు సేవ యనుగ్రహించెను. పాదాదికేశపర్యంతము నా స్వామి రూపసౌందర్యము నమృతమువలె నాస్వాదించుచు నా యోగివరుడు పది పాశురములతో స్వామిని అవిచ్ఛిన్నమగు భక్తిమందాకిని కాలువలు గట్టగా ప్రస్తుతించెను. అదియే ద్రావిడమున అమలనాదిపిరాన్ అను నుత్తమ దివ్యప్రబంధ మాయెను. వారు భగవంతుని నుతించిన ప్రథమ గాథ యిది—

"అల మామరత్తినిలై మేలొరు పాలకనాయ్
ఞాలమేళుముండాన్ అరంగత్తరవినణైయాన్
కోలమామణియారముం ముత్తుత్తామముంపుడివిల్లై దోరెళిల్
నీలమేని యైయో నిరైకొండ దెన్నెంజమే."

"ఒక చిన్న మఱ్ఱియాకుపై పసిబిడ్డడై పరుండి ప్రళయకాల మందు జగత్తంతయు తన యుదరమం దుంచుకొన్న శ్రీమహావిష్ణువే శ్రీరంగమందు అనంతునిమీద శయనించియున్నాడు. ఆ స్వామి యొక్క రమ్యమైన రత్నఖచితహారమును, ముక్తాదామమును, అంతమును సామ్యమును లేని సౌందర్యము గల నీలవర్ణమగు దేహమును నా హృదయ గాంభీర్యమును నశింపచేసినవి."

తల్లి యవయవము లన్నియు వదలి శిశువు దృష్టి స్తన్య పాన మునకై యామె రొమ్ముపైకి ప్రసరించినట్లే యా భక్తవరుని చిత్తము గూడ స్వామి యితరావయవ సౌందర్యదర్శనము నుజ్జగించి జగత్పాలన దక్షమగు, నా శ్రియఃపతి పాదారవిందములయందే సంలగ్న మాయెను. తర్వాత క్రమముగా ఇతరావయవముల మీద కూర్ధ్వముఖముగా వారి దృష్టి ప్రసరించెను. భగవదనుభవసంజాతమగు ప్రేమ యతిశయింపగా నా యోగిమూర్ధన్యుడు పాదాదికేశపర్యంతమును మృదుమధుర సుంద రముగా నవరసరసితముగా రంగేశుని వర్ణించెను. వారి కావ్యమున రంగనాథుడును వేంకటేశ్వరుడును లెస్సగా నుతింపబడిరి.

లోకసారంగముని మొదలగు భక్తు లీ వింత దృశ్యమును చూచి యానందాశ్చర్యముల నంది కృతార్థులైరి. స్వపాదపద్మప్రవణుడగు తిరు ప్పాణాళ్వారును రంగరాజు సాదరముగ వీక్షించి నిర్హేతుకదయావశుడై యందరును చూచుచుండగా తన వానినిగా స్వీకరించెను. తిరుప్పాణా ళ్వారు లీ విధముగ తన పరభక్తి పరజ్ఞాన పరమభక్తులతో రంగనాథుని వశము గావించుకొని వారి పాదమూలము చేరగల్గిరి.

* * *

# శ్రీరామానుజ చరిత్ర

## ఆచార్య పీఠిక

మేషాఽర్ద్రాసంభవం విష్ణో ర్దర్శనస్థాపనోత్సుకమ్,
తుండీరమండలే శేషమూర్తిం రామానుజం భజే.

యో నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మ-
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే,
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధో
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే.

ఉ. ముద్దుమొగంబు కెంజిగురుమోవి దయారసమొల్కు గన్నులున్
నిద్దపుఁజెక్కులున్ పసిడినిగ్గులుదేరెడుమేను బాగుగా
దిద్దినయూర్ధ్వపుండ్రములు తెల్లనిజన్నిదమున్ త్రిదండమున్
దర్దయు నొప్పు చిన్నిశిఖదాల్చిన మా యతిరాజుఁ గొల్చెదన్.

ఇంతమంది యాళ్వారులు ద్రావిడదేశమున నవతరించి భక్తిప్రబోధము చేసినను కొంతకాలమునకు ప్రపంచ పరిస్థితి యథాప్రకారమే యయ్యెను. కలికాలము గదా మరి! కాననే గదా గీతాచార్యుడు---

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్.

అని పలికియుండుట!

శ్రీమన్నారాయణుడు తాను సృష్టించిన జీవకోటి తన యాజ్ఞను మీరి విషయోపభోగైకప్రవణమై కాలము గడుపుచుండుటకు చాల విచారింపసాగెను. అప్పుడు---

"నివాసశయ్యాసనపాదుకాంశుకో
పధానవర్షాతపవారణాదిభిః
శరీరభేదై స్తవ శేషతాం గతై
ర్యథోచితం శేష ఇతీర్యతే జనైః."

---స్తోత్రరత్నము

శ్రీమహావిష్ణువునకు శయ్యా, ఆసనము, వస్త్రములు, గొడుగు మొదలగు నుపకరణములచే చేయదగిన సేవలను తన శరీరముతోనే జరుపునట్టి యాదిశేషుడు స్వామితో నిట్లు విన్నవించి "ప్రభూ, మీపాదసేవకై నేను కాచుకొనియుండ మీ కేల యీ యాలోచన? నేను ప్రయత్నించి మీరెంత మాత్రము శ్రమ పడకుండ నీ జీవరాసులను మీ సేవా ప్రవృత్తులను చేసెదను" అని తానే యీ యిలపై నవతరించెను. వారే భగవద్రామానుజులు!

సీ. "సర్వజ్ఞుఁడై సర్వశక్తిసంపన్నుఁడై
సత్యసంకల్పుఁడై సర్వశేషి
యైన సర్వేశ్వరుం డమితజన్మము లెత్తి
మొక్కాత్మనైనను దక్కఁబఱుప
శక్తుండు గాక విచారింప, శేషుఁడా
హరితోడఁ బంతము లాడి వచ్చి
రామానుజాచార్యభూమిక ధరియించి
జ్ఞానాంజనంబున మానవులకుఁ

తే. జూపె నచ్యుతపదదాస్య సులభధనము
నిట్టి కలిమిచ్చు సద్గురుం డెందు గలఁడు
వీనియంఘ్రు లుపాయ ముపేయ మనుచు
వాదిభీకరగురుఁ డనె మోద మలర."

—ఆచార్యసూక్తిముక్తావళి

శ్రీరామావతారమున లక్ష్మణుని రూపము దాల్చిన యీ యనంతుడే రామానుజావతారమును ధరించి విష్ణుపాదము లను పెన్నిధిని బద్ధజీవులకు చూపినారు. కాన రామానుజుల పాదపద్మములే మనము విష్ణుని చేరగలమార్గము. అవియే ముక్తికాంక్షులగు మన కందరకును లక్ష్యము.

## శ్రీ పెరుంబూదూరు

చెన్నపట్టణమునకు సమీపమున శ్రీపెరుంబూదూరను పురవరము గలదు. దానికే శ్రీ భూతపురి యని గూడ పూర్వ నామము. ఈ నగరి త్రిలోక విశ్రుతము; విష్ణుప్రీతికరము; ధనధాన్యాది సర్వసంపత్సమృద్ధము. అది దానశీలుర కిక్క; సకలఫలజాతి నిలయము;

ప్రకృతిశోభాలయము. శుకపికశారికామయూరాది మధురపక్షికూజితము లట వీనులకు విందు గూర్చుచుండును. మదద్విరేఫఝుంకారము లా వీటిని సదా ముఖరితము చేయుచుండును. అరవిందలక్ష్మితో నందలి వాపీకూపతటాకసరోవరములు ప్రేక్షకులకు నేత్రపర్వముగా నుండును.

ఆ నగరమునందలి యుపవనములలో సదా స్త్రీ పురుషులు సంచారము చేయుచుందురు. వేదాధ్యయనశీలురును, విద్వద్వరిష్ఠులునునగు బ్రాహ్మణోత్తములు తమరి నాశ్రయించిన విద్యార్థులకు కావ్యనాటకాదులును, తర్కవ్యాకరణాదులును పాఠము చెప్పటలో మిగుల నుత్సాహము చూపుచుందురు. వేదవేదాంత ఘోషతో నా నగరము సాగరమును బోలినదై ఘూర్ణమాన మగుచుండును.

ఆ నగరిలో విష్ణ్వాలయము లసంఖ్యాకములు. వాని గోపురము లత్యున్నతములై వివిధశిల్పముల కాలవాలమై చెన్నుమీరుచుండును. అచటి రాజవీథులు సువిశాలములు. బాటల కిరుప్రక్కల విలసిల్లు సౌధరాజములు విహాయసవీథిని తాకుచుండును. గజవాజిసమాకీర్ణమై శూరవరపరివృతమైన యా పురి దక్షిణాది నెన్నిక గన్న నగరములలో నొకటిగా వాసిగాంచి మించి యుండెను.

## కేశవసూరి

అచట ననాదిగ నివసించుచున్న ద్విజవంశములలో ఆసూరివారు ప్రముఖులు. వారు యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహములను షట్కర్మలందును నిరతులు. వా రాంధ్రవంశీయులు. ఆ వంశమున కేశవసూరి యుదయించెను. ఆయన సదాచారసంపన్నుడు. పూర్వుల సంప్రదాయమును, పాండిత్యమును పుణికిపుచ్చుకొన్నవాడు. సత్యధర్మపరాయణుడు. జితక్రోధుడు, సత్యవచనుడు, నిర్మత్సరుడునగు నా ద్విజశ్రేష్ఠుడు—యజ్ఞయాగాదులను నిష్ఠతో నాచరించినవాడైనందున కేశవయజ్వ యని వ్యవహరింపబడసాగెను. ఆ మహనీయుడు దేవద్విజగురుప్రాజ్ఞసమర్చనలందు శ్రద్ధాళువు. స్థిరబుద్ధి, స్థిరారంభుడు, తపోధ్యానపరాయణుడునగు నా సూరివరుడు మితాహారి, మితభాషి, మితవిహారియు నయి హరిభక్తిపరుడై సార్థక నామధేయురాలగు కాంతిమతి యను నిల్లాలితో నా భూతపురిని వాసము చేసికొనియుండెను.

కాంతిమతీదేవియు భర్తకు తగిన భార్య యనిపించుకొన్న సహధర్మచారిణి. ఆమె యభ్యాగతులయందు సదాదైవప్రతిపత్తినే చూపెడిది. తనయింట నివసించి భర్తవద్ద చదువుకొను విద్యార్థులపాలిటి కాతల్లి కల్పవల్లి; కాదు—అమృతవల్లి.

సర్వసంపన్నిలయమై యుండిగూడ తమ నిలయము పుత్రసంపద్విహీనమగుటచే నా దంపతులు పడు విచారము వర్ణనాతీతము. కాన బిడ్డలకై వారు శ్రీనివాసుని భక్తితో నారాధింపసాగిరి. ఒకపరి కేశవ యజ్వ సతిసమేతుడై చంద్రగ్రహణసమయమున సముద్రస్నానార్థమై కైరవిణీ తటమునకరిగెను. అదియే నేటి మద్రాసులోని తిరువళ్ళిక్కేణి. ఆ సతీపతులు సాగరమున స్నానమాడి పుత్రార్థులై నియతిమై పార్థసారథి నారాధించిరి. అంతేగా దట వారు శ్రీహరి నుద్దేశించి పుత్రకామేష్టి నాచరించిరి. యథావిధిగా చేయబడిన యా జన్నమునకు ప్రీతుడై పార్థసారథి వారికి "నేనే మీకు పుత్రుడనై జన్మింతు" నని యానతిచ్చెను. "ఇంతకాలమున కెట్టకేలకు తమ కోరిక తీర నున్నది గదా" యని యానందించి యా దంపతులు స్వస్థలమునకు మరలిరి.

## అవతరణము

సీ. కేశవనామలక్ష్మీపతి ప్రీతికై
    భూతపూర్ణందనభూమినడుమ
కేశవప్రభుఁడైన కేశవార్యునివల్ల
    గాంతిమత్యాలవాలకలన మొంది
బాహుశాఖలు పాణిపాదపల్లవములు
    మొలకనవ్వుల పుష్పములు వహించి
రంజిల్లుచున్నది రామానుజార్యుఁ డ
    న్పసిఁ డి వేల్పులచెట్టు పలువిధముల;
గీ. దెసలు పదియును దన చాయుఁ దెలివి దాల్చి
    పెరుగుచున్న దిలాసురప్రీతికొఱఁకు
    జెడక నరులార! దాని భజింపుఁ డనుచుఁ
    వాదిభీకరగురుఁ డనె మోద మలర.

కొన్ని దినములు గడచినంతట కాంతిమతీదేవి గర్భము దాల్చెను. నవమాసములు నిండగా నా యిల్లాలికి చైత్రశుద్ధపంచమీ గురువార

మున నార్ద్రానక్షత్రయుక్త కర్కాటకలగ్నమున క్రీ.శ. 1017 సంవత్స రమున నొక బాలు డుదయించెను. శ్రీకృష్ణునిచే నుత్తరమధురయు శ్రీ రామచంద్రునిచే నయోధ్యయు వలెనే శ్రీ భగవద్రామానుజావత రణముచే భూతపురిపుణ్యము పుష్కలముగా పండెను.

సీ. కాంతిమతీదివ్యగంగానది జనించి
  రామానుజప్రాదరాజ మొకటి
కరపదముఖనాభికల్యాణ సౌరభ
  పద్మ మీక్షణమీన భాసురంబు,
దీర్ఘ బాహుతరంగధీర, మాశ్రితరాజి
  రాజహంసావళి భ్రాజితంబు,
లలితప్రసాద విలక్షణ కమఠంబు
  భూరితేజో జలపూరితంబు
గీ. నగుచుఁ బూదూరఁ గనిపించె నందరికిని
దానిఁ దలచినఁ దీఱు నే తాప మయిన
జెందువారికి సేమ మెం తందు ననుచు
వాదిభీకరగురుఁడనె మోద మలర.

బాలసూర్యునివలె దినదినాభివృద్ధిగాంచుచున్న తమకుమారుని గాంచి యా తల్లితండ్రుల యానందము హద్దులు మీరెను. రూపసౌందర్యము లచే కంతు జయంత వసంతాదులను మించిన యా సుకుమారుని జన్మ దినోత్సవ సందర్భమున కేశవసూరి బ్రాహ్మణోత్తములకు భూరిదక్షిణను ధనధాన్యములను నిచ్చెను. అంతే గాదు, ఆ నగరవాసుల నందరను యథోచితసత్కారాదులచే సంతృప్తిపరచిరి. కాన నా యూరివారందరును తమ యింటనే పుత్రు డుదయించినంత యుత్సాహముతో నా వేడుకను జరుపుకొనిరి.

కాంతిమతియన్నగారు శ్రీశైలపూర్ణులు. తిరుమల నంబి యని గూడ వీరి నామాంతరము. తమ సోదరికి పుత్రుడు జన్మించె నని తెలియగనే వారు హర్షాతిరేకముతో భూతపురి కేతెంచిరి. అపూర్వతేజో రాశియగు నా బిడ్డను చూడగనే వా రీ బాలుడు సామాన్యమానవుడు కాడని, యీతనివలన నెన్నెన్నో ఘనకార్యములు జరుగవలసియున్న వని యూహించిరి.

పంద్రెండవనాడు బంధుమిత్రాదుల సమక్షమున కేశవసూరి శ్రీ శైలపూర్ణులచే నా బాలునకు లీలగా శంఖచక్రములు భుజములపై నంకితము గావించి రామానుజు లని నామమిడెను. సర్వశుభలక్షణ లక్షితుడై పెరుగుచున్న యా బాలుని గని జ్ఞానవృద్ధు లగు పెద్ద లీతడు శేషుడైన గావలయును లేదా విష్వక్సేను డైన గావలయు నని తలచిరి.

రామానుజుల రూపముతో ననంతుడు భువిపై కాలు మోపగనే కలిపురుషుడు భీతుడై యిక లాభములే దని తన యౌద్ధత్య ముపసం హరించుకొనెను. తనకిక కాలూన చోటు లేదని పాపరాక్షసుడు పలా యనము చిత్తగించెను. ధర్మదేవత నాలుగు పాదములతోడను స్వేచ్ఛగా విహరింపగడగెను. అనంతుడే పూర్వము రామానుజుడైన లక్ష్మణు డుగను నిపుడు కేశవసూరికుమారుడుగను గూడ నవతరించుటచే నీ రామానుజులకు గూడ లక్ష్మణార్యులను పేరు రూఢ మాయెను.

అతడే పెద్దవాడైన తర్వాత యతిరాజు, ఎంబెరుమానార్, ఉడ యవర్, భాష్యకారుడు అను పేర్లతో కీర్తింపబడెను.

శ్రీలక్ష్మణార్య రవిప్రకాశముచే పుణ్యాత్ముల హృదయారవిందములు మాలిన్యదూరములై స్ఫుటముగా వికసించెను. ఆ బాలు డాజాను బాహువు, పద్మనేత్రుడు, శుభాంగుడు, చంద్రునిబోలె సర్వజన నయ నానందకరుడు. అట్టి వానిని చూచుకొనుచు కేశవయజ్వ మురుసు కొనుచుండువాడనుటలో వింత యేమి?

తండ్రి యాతనికి చౌలమును నన్నప్రాశనమును యథాకాలమున జరిపెను. అయిదవయేట నక్షరాభ్యాసము జరిపించెను. గర్భాష్టక మున నుపనయనము చేసెను. స్వయముగ వేదవిద్య నుపదేశించెను. కుశాగ్రబుద్ధియగు రామానుజుడు విద్యలన్నిటిలోను పుంభావసరస్వతియై ప్రకాశింప దొడగెను. షోడశకళాపరిపూర్ణు డగు చంద్రునివలె నా బాలుడు పదునాగవశరత్తున పాదము మోపగనే కేశవాచార్యు లాయన కొక బాలికను వివాహము చేసిరి. కాని, కొంతకాలమయినను తన బిడ్డ గృహస్థాశ్రమవర్తనము చూచి యానందించు భాగ్యము లేనందున గాబోలు కేశవసూరి విష్ణుసాయుజ్యమందెను.

పితృవియోగ దుఃఖమును జ్ఞాని యైనందున రామానుజు డెట్లో నిగ్రహించుకొని తల్లితో, భార్యతో నా నగరముననే కొంతకాలముండెను.

వేదాంతశాస్త్రజ్ఞానమును సంపాదింపవలెనని ఆయనకు కోరిక గల్గెను. ఆ కాలమున కాంచీపురమున యాదవప్రకాశుడను మహా పండితు డుండెను. వారివద్ద శాస్త్రాభ్యాసము చేయగోరి స్వగ్రామము వదలి రామానుజుడు సకుటుంబముగా కంచి కేగెను.

## గురుమాత్సర్యము

యాదవప్రకాశు డుద్దండ పండితుడు. కాన విద్య నభ్యసించుటకై తన పినతల్లి ద్యుతిమతికుమారుడు గోవిందునిగూడ వెంట నిడు కొని రామానుజులు యాదవు నాశ్రయించెను. రామానుజునకును, గురువునకును, నభిప్రాయములలో హస్తిమశకాంతరముండెను. యాద వప్రకాశకుడు జన్మముచే బ్రాహ్మణుడయినను విద్య యొక్కటి తక్క దయాశౌచాది సద్గుణము లాయనలో కంచుకాగడాతో వెదకినను కాన రావు. గురు వెంత సంకుచితహృదయుడో, రామానుజు డంత విశాల హృదయుడు. రామానుజు డెంత హరిభక్తుడో యాదవు డంత హరినిం దకుడు. శిష్యునకు భక్తియోగముపై మక్కువ మిక్కుటము. గురువు నకు శుష్కతర్కముపై నభినివేశము మెండు. శరీరములు మాత్రమే యొకచోట నుండెడివి గాని వారి మనస్సులు మాత్ర ముత్తరదక్షిణ ధ్రువములే!

ఒకనాటి మాట—రామానుజుడు గురువుతలకు చమురంటుచుం డెను. అపుడు యాదవు డొక యుపనిషద్వాక్యము చెప్పెను. ఆ వాక్య మిది "కప్యాసం పుండరీకమేవమక్షిణీ."

దానికి యాదవుడు 'నారాయణుని కన్నులు కోతి పిఱ్ఱను బోలిన తామరరేకులవలె నెఱ్ఱగా నుండును"—అని యర్థము చెప్పెను. ఈ నీచోపమానమునకు రామానుజుని మనస్సు లోలోననే కుమిలిపోయెను. ఆయన కంటినుండి వెలువడి యొక వేడి కన్నీటిబొట్టు గురువుతొడపై బడెను. అపు డాయన శిష్యుని "ఓయీ, యేల దుఃఖించుచున్నా" వని యడిగెను. అందులకు రామానుజుడు "గురువర్యా, మన్నింపుడు. జగ

దాదియు ననాదియు నగు శ్రీమన్నారాయణుని నేత్రములకు కోతిపిఱ్ఱ నుపమానముగా చెప్పిన మీ విపరీత వ్యాఖ్యానము వినగనే నాదుఃఖ మాగినది కాదు" అని వినయముతో సమాధానమిచ్చెను. పుండుపై కారము చల్లినట్లున్న యీ సమాధానముతో నుగ్రుడై గురువు "ఓరీ, ఇంతకంటె చక్కని యర్థము నీవు చెప్పుము చూత" మని గద్దించెను. రామానుజు లాశ్రుతివాక్యము నిట్లు మనోహరముగా వ్యాఖ్యానించెను. "శ్రీమన్నారాయణుని నేత్రములు సూర్యకిరణములచే వికసించిన తెల్ల దామర పువ్వులను బోలి మనోహరముగ నుండు నని పైశ్రుతికి భావము."

రామానుజుడు చెప్పిన యీ యుక్తిసహమైన యర్థము సందర్భ శుద్ధిగా నున్నను హరిద్వేషి యగు యాదవున కది కర్ణకఠోర మయ్యెను. అందుచే నాతడు తన్ను ధిక్కరించి విపరీతార్థము చెప్పినాడు కాన రామానుజు నెటులయిన రూపుమాప వలెనని కక్ష పూనెను.

## బ్రహ్మరాక్షసుడు

కాంచీపురరాజకుమారిని బ్రహ్మరాక్షసు డొక డావేశించెను. ఎందరో మాంత్రికు లాబాలిక యనారోగ్యమును బాగుచేయ యత్నించికూడ విఫల మనోరథు లైరి. యాదవప్రకాశుడు గొప్పమహిమ కలవాడని కాంచీరాజు తెలిసికొని చారులను బంపి యాయనను తన యంతిపురికి పిలిపించెను. ఆయనయు నసంఖ్యాకశిష్యగణముతో రాజసన్నిధి కేగెను. రాజాయనను ప్రత్యుత్థానాదులతో గౌరవించి యుచితాసనాసీనుని జేసెను. తర్వాత తన పుత్రికను పిలిపించి యా ద్విజునకు చూపెను.

యాదవప్రకాశుడు మంత్రజపము చేయుచు నామెను సమీపించెను. ఆయనపేరు విన్నంతనే భూతప్రేతబేతాళాది నిఖిలగ్రహములును ప్రాణములరచేత బెట్టుకొని పారిపోయెడివట! మంత్ర జపము చేయుచున్న యీ బ్రాహ్మణుని జూచి రాజకన్య నావేశించిన బ్రహ్మరాక్షసుడు పండ్లు పటపట నూరుచు భుగ్న భ్రూకుటి భీకరుడై యాస్ఫోటించి ప్రళయ సమయపర్జన్యుని బోలె భీషణహుంకార మొనరించెను. దానితో యాదవు డుక్కిరిబిక్కిరి యయ్యెను. కంఠగతప్రాణు డైన యాతని జూచి నిర్భయముగా నాయన వైపు పాదములు జాపి కూర్చొని బ్రహ్మరాక్షసు డుపహాసపూర్వకముగ నిట్లనుచున్నాడు—"ఓ పాఱుడా! నన్ను

వెడలగొట్టి యీ రాజకన్య శరీరస్థితిని బాగుచేయుటకే వచ్చితివి గదూ? పాపము నిన్ను జూచిన నాకు జాలి కలుగుచున్నది సుమా! నీ మణి మంత్రౌషధాదులు నాపై పనిజేయజాల వనితెలిసికొనుము. న న్నుచ్చా టన చేయు సామర్థ్యమును మహిమయు నీ కెక్కడివి? సౌశీల్యసంపద గూడ నీలో పూజ్యము గదా! పూర్వజ్ఞానము గలవాడను గాన మన యిద్దరి పూర్వజన్మ వృత్తాంతములను నేను నీకు తెలుపగలను. నీ కా జ్ఞానము లే దని గూడ నే నెరుగుదును. నీకు బ్రాహ్మణజన్మమును, నాకు బ్రహ్మరాక్షసజన్మమును నేల కలిగెనో వినవలతువేని చెప్పెద నాలకింపుము.''

లజ్జతో నాతని మాటలకు యాదవు డేమియు సమాధాన మీయలే కపోయెను. అపు డా రాక్షసు డిట్లు చెప్పదొడగెను—''పూర్వము ద్రావిడ దేశమున మధురాంతకమను నగ్రహారము కలదు. దాని పశ్చిమ దిశను ఫద్మాకర మగు పద్మాకర మొకటి విరాజిల్లుచుండును. ఆ సరోవరము గట్టున నొక పుట్టలో నీ వొక బల్లివై కాలము గడపుచుండువాడవు. ఒకప్పుడు వేదవేదాంతపారంగతు డగు శ్రీ వైష్ణవు డొక్కరు డా సరసిచెంత కేతెంచి స్నాతుడై స్వయంపాకము చేసుకొనెను. దానిని పరమాత్మకు నివేదన మిడి భగవదేకార్పిత బుద్ధియై యా యాహార మారగించెను. భుక్తశేషము గల యుచ్ఛిష్ట పత్రమును తన యెదుట నున్న పుట్టపైకి విసరివైచి యాతడెటకో యేగెను. ఆ పుట్టలోనే బల్లిరూపమున నున్న నీ వాకలిబాధకు తాళలేక ఆ యుచ్ఛిష్టము భుజించినావు. గత జన్మమున నీ వా సుకృతవిశేషమునకు నోచుకొన్నం దుననే యీ జన్మమున వేదవేదాంతవేత్తవగు ద్విజుడవు కాగలిగినావు. కాన నీ జన్మలో గూడ నీవు మంచి చేసుకొని పుణ్యగతుల నొంద గోరినచో నీ శిష్యుడు రామానుజునే యాశ్రయించి తరణోపాయమును వెదకికొనుము.

ఇక నేను పూర్వజన్మమున నే పాప మాచరించి యీ బ్రహ్మరాక్షసు డుగా జన్మించితినో యాలింపుము—నే పాప శ్రోత్రియ బ్రాహ్మణుడను. పత్నితో గలసి యొక జన్న మారంభించితిని. కాని మంత్రక్రియాదులలో లోపము సంభవించినందున నా కీ రూపము ప్రాప్తించినది. నాటినుండి నేను సర్వప్రాణి భయంకరుడనై కొండలను కోనలను దాటుచు జనపద ములను, నగరములను నతిక్రమించుచు నిప్పటి కీ నగరము చేరినాను.

కన్నుల కింపయిన యీ రాజకుమారి నిచట చూచి మోహించి యీమెను పట్టుకొంటిని. నన్ను వదలించి ఈమెకు పూర్వస్థితి కలిగించుట కీ రాజెందరినో మాంత్రికులను, భూతవైద్యులను పిలిపించినాడు. కాని నన్ను చూడగనే గుండెలు జారిపోయి వారు పారిపోయినారు. నీ మంత్రాదులు నాపై పారవు. తాటియాకు చప్పుడులకు కుందేళులు జడియుటయా? ఊషరక్షేత్రమందు నాటిన విత్తనములవలెనే నీ ప్రయత్నములు వ్యర్థములు. ఇప్పటికైనను నీ రాజకన్య కారోగ్యలాభము కలిగింపదలిచినచో వెంటనే నీ శిష్యుని రామానుజు నిచటకు రప్పింపుము. నే నా మహాత్ముని పాదతీర్థము గ్రోలి శాపవిముక్తుడనై తదాజ్ఞచే నీమెను వదలి వెడలిపోగలను.''

బ్రహ్మరాక్షసుని యీ పలుకులు విని రాజు వెంటనే బ్రహ్మవర్చస్సుతో మిలమిల మెరయుచున్న రామానుజుని పిలిపించి తన పుత్రికకు బ్రహ్మరక్షస్సుబాధను తప్పింపు డని ప్రార్థించెను. లక్ష్మణార్యుడు తన పాదము లా కన్యశిరస్సుపై నుంచి పాదతీర్థము నొసగి యిక నీవు వెడలిపొమ్మని బ్రహ్మరాక్షసునితో పలికెను. వెంటనే రాక్షసు డామెను వదలి శాపనిర్ముక్తుడై యథేచ్ఛం జనెను. దుష్టగ్రహవిముక్త యగు నా రాకుమారి యథాపూర్వముగ నారోగ్యలాభ మంది యపూర్వరూపలావణ్యములతో నొప్పారెను.

అపుడు తే డమందానందమున మనసు నర్తనమాడగా రామానుజుని ధనకనక వస్తువాహనాదులతో సంభావించి యట్టి మహాత్ముని శిష్యునిగా బడసిన యాదవప్రకాశునిగూడ నుచితరీతిని సత్కరించెను. రామానుజుడు తన కిచ్చిన వస్తువులు గూడ గురువునకే యర్పించెను. ''నిందు కొలువున తన శిష్యుడు గౌరవింపబడుటయు, తా నగౌరవింపబడుటయునా?'' యని మాత్సర్యముతో గురువు లోలోన క్రుంగిపోసాగెను. అతని మాననమును మయసభలో నవమానితు డైన దుర్యోధనుని మనఃస్థితితో నిట్లు పోల్చవచ్చును!—

క. ''కందుగల పసిడి గాచినఁ
గంది వివర్ణ మయినట్లు కౌరవు కాయం
బొందఁగ వివర్ణ మయి కడు
నంది మనస్తాపహవ్యవహదాహమునన్.''

—ఆంధ్రమహాభారతము.

కాన మహామహిముడగు రామానుజుడు మరణించిన గాని తన మనస్సునకు స్తిమితము కల్గుట కల్ల యని యాతడు నిర్ణయించినాడు.

"మర్కటస్య సురాపానం తతో వృశ్చికదంశనమ్
తన్మధ్యే భూతసంచారో యద్వా తద్వా భవిష్యతి."

అసలే యిది కోతి, అందును కల్లు త్రాగినది, అటుపై తేలు కుట్టుటతోబాటు దయ్యము గూడ బట్టినది. ఇక చెప్పవలసిన దేమి? అను శ్లోకభావ మిప్పట్టున యాదవప్రకాశుని యెడగూడ నన్వయించును.

## కాశీ యాత్ర

పై సంఘటనలతో రామానుజుల దైవీసంపద కొంత యవగత మైనది గదా! కాన నిక వారికి బహువచన ముపయోగింతము. గురువు కొంతకాలము సెలవిచ్చి రామానుజుల నింటికి పంపెను. తర్వాత తన కాత్మీయులయిన శిష్యులతో రామానుజుని మట్టుపెట్టుట యెట్లా యని మంత్రాలోచన చేసెను. ఆ శిష్యు లాయనతో "గురువరా! రామానుజుని గూర్చిన వ్యథ మీకేల? మీరాజ్ఞాపించినచో మీకనిష్టకారి యగు నాతని క్షణములో రూపుమాప గలము" అని పలికిరి. దానికి యాదవప్రకాశుడు "జనులు మన దుశ్చేష్టితము ననుమానింపకుం డునట్లు చూచుకొనవలెను గదా! నా కొక యుపాయము తోచినది. కాశీయాత్రకుపోద మను మిషతో రమ్మని పిలచి రామానుజుని మన వెంటబెట్టుకొని పోదము. గంగానదిలో నాతని పడద్రోసి యాతడు కాలుజారి పడిపోయె నని ప్రవాదము పుట్టింతము. ఇట్లు చేసినచో మన మాతని వధించినట్లు ఇతరు లే మాత్రము పసికట్టజాలరు. దీనితో నాతనిపై నాకు గల కక్ష గూడ తీరగలదు" అని పలికెను.

గురువు పిలిపింపగనే రామానుజు లేతెంచి భక్తితో నమస్కరించి వినీతులై "గురువర్యా! నన్ను పిలువనంపిన పని యేమి?" యని యడిగిరి. అపు డా గోముఖవ్యాఘ్రము మిట్లనుచున్నది--- "రామానుజా, ఈ నడుమ నీకు సెలవిచ్చి యింటికి పంపినందున నా కేమియు తోచుట లేదు. కాన మరల నావద్ద శాస్త్రాధ్యయనము సాగించి యందలి ధర్మసూక్ష్మములను చక్కగా నవగాహన చేసుకొని పండితోత్త ముండవై యుభయతారకమగు నట్లు కృషి చేయుము" అని పలికెను.

ఆ పల్కులు సత్యము అని రామానుజులు నమ్మినారే గాని తన గురువు తేనెపూసిన కత్తి యని వారూహింపనైన లేకపోయిరి.

అస్తు, యథాప్రకారముగా రామానుజులు గురువువద్ద శాస్త్రపాఠము సాగించిరి. ఒకనాడు నయవంచకు డగు యాదవుడు వారితో "గంగలో నాచరించిన మాఘస్నానము స్వర్గాదిఫలప్రద మగుననుట సుప్రసిద్ధము గదా! కాన నేను శిష్యు లందరితో యాత్రార్థమై బయలుదేరుచున్నాను. నీవు కూడ రాగలిగిన మంచిది" అని పలికెను. తల్లి యాజ్ఞగైకొని రామానుజు లాతనితో యాత్రకై వెడలిరి. వారి వెంట వారి పినతల్లి కుమారుడు గోవిందుడు గూడ వెడలెను.

యాదవప్రకాశుని కుటిలబుద్ధిని గోవిందు డెట్లో పసికట్టెను. రామానుజుల కీ సంగతి చెప్పి హెచ్చరించుట కాత డవకాశము చూడసాగెను. వింధ్యపర్వతారణ్యప్రాంతముల గుండ యాదవప్రకాశుడు శిష్యబృందసహితుడై ప్రయాణము చేయుచుండెను. అప్పుడు రామానుజు లందరికంటె కొంచెము వెనుకబడిరి. ముందు శిష్యునితో గలసి నడచుచున్న గోవిందు డితరుల కన్నుగప్పి వెనుక కేగి రామానుజులను కలసికొని "నిన్ను గురువుగారు గంగలో ముంచి వేయదలచినాడు—గాన జాగ్రత్త" అని పలికి ముందు కేగి మరల గురువును కలసికొనెను. వెనుకనున్న రామానుజు లొక చెట్టుచాటున నాగిపోయిరి.

గోవిందుని జూచి గురువు "ఏమోయి, రామానుజు డెక్కడున్నా" డని యడిగెను. "ముందో, వెనుకో వచ్చుచుండును. పరవా లేదు. మనము పయనము సాగింతుము పదండు" అని గోవిందుడు పలికెను. అపుడు యాదవప్రకాశుడు రామానుజులను ఆ యరణ్యమున నిటునటు కొంతవరకు వెదకించెను. కాని చాల దూరమున నున్నందున వారి జాడ యతనికి గన రాలేదు. రామానుజు డే పులినోటనో బడియుండు నని శిష్యులు పలికిరి. యాదవు డది విని కాగలకార్యము గంధర్వులే తీర్చినట్లయినది నా పని. ఇక గంగలో నాతని త్రోసి పాపము కట్టుకొనుట తప్పిపోయిన దని లోలోననే యుబ్బిపోయెను. కాని పైకి మాత్రము తెచ్చికోలు దుఃఖముతో "అయ్యో, రామానుజుడు లేకుండ మన మెట్లు ముందుకు సాగుట" యని వాపోయెను. కాశి చేర

కుండగనే కాశీయాత్ర ఫలించినదను సంతోషముతో నాత డా రాత్రి గుండెపై చేయి వేసికొని నిదురించెను.

## కిరాతదంపతులు

కాకులు దూరని యా కారడవిలో నొంటరిగా నా చెట్టుక్రింద నిలబడి రామానుజులు కాంచీపురనాథుడు వరదరాజులను మనసార స్మరించుకొని యాతనినే శరణు జొచ్చెను. భక్తపరాధీను డగు కరివరదుడు తన భక్తుని రక్షింప దలచి వనచరరూపము దాల్చి యా యడవికి బయలుదేరెను. భార్య పెరుందేవి భిల్లస్త్రీరూపమున నా దేవుని వెంట నంటెను. విల్లునమ్ములు చేతబూని యా కిరాతుడు రామానుజులను సమీపించెను.

రామానుజులు మీరెవ రని వారినడిగిరి. "మేము బోయలము. కంచికి పోవుచున్నాము. మరి నీవు సింహవ్యాఘ్రాది క్రూరసత్త్వభీకరమైన యీ యరణ్యమున నొంటరిగ నేల సంచరించుచున్నావు?" అని బోయదు పల్కెను. తనకు తోడు దొరికినది గదా యని సంతోషించి లక్ష్మణార్యులా వ్యాధుని "మాది గూడ కాంచీపురమే. మేము కొంతమందిమి కాశీయాత్రకు బయలుదేరినాము. మావారు ముందుకు సాగిపోగా నే నేకాకినై దిగ బడిపోయినాను. నన్ను దయతో మీతో కంచికి చేర్చెదరా" యని ప్రార్థించిరి. "దాని కేమి? తప్పక మావెంట ర" మ్మనిపలికి యాదంపతులు రామానుజులను వెంట నిడుకొని హస్తిగిరిపురాభిముఖులయి నడువసాగిరి.

కొంత దవ్వు ముప్వురు నరుగగనే సూర్యు డస్తగిరి మాటునకు చేరెను. వెంటనే యా బాటసారు లొక వృక్ష మూలము నాశ్రయించిరి. బోయెత "పగలంతయు నడకచేత నలసిపోయినాను. ఆకలిదప్పులతో ప్రాణములు పోవుచున్నవి. ఎచట నయిన గొంతు తడుపుకొనుట కైనను కొంచెము జలము దొరికినచో బాగుండును" అని పలికెను. వ్యాధుడు "సమీపముననే మంచినీటిదీర్ఘిక కలదు గాని యీ గాఢాంధకారమున తెచ్చుట యసాధ్య" మని సమాధానమిచ్చెను. "ఈ మహోపకారము చేసిన మీ రాదిదంపతులే కానోపుదురు. అట్టి మాకు కనీసము పానీయము నైన తెచ్చి సమర్పింపజాలనైతినే?" యని రామానుజులు వికలులైరి.

తెల్ల వారెను, వ్యాధదంపతులు "బిడ్డా, సమీపమున నున్న బావి కేగి నీరు తెచ్చి యి" మ్మని కోరిరి. వెంటనే వా రేగి బావిలోనికి దిగి మూడుసార్లు దోసిలితో నీరు తెచ్చి యా యుభయులకు త్రావ నిచ్చిరి. వారును నా జలము త్రాగి తృప్తి చెందిరి. ప్రక్కకు తిరిగి చూడగనే తా మున్న యరణ్యము రామానుజులకు కానుపింపలేదు. ఇ దేమాశ్చర్య మని మరలి చూడ నెదుట నున్న దంపతులు మాయమై పోయిరి! తా మున్న ప్రదేశము తెల్లని యిసుకతో నగరప్రాంత మయి యొప్పారెను. కరివరదుని యాలయశృంగములు బాలభానుని స్వర్ణకిరణ ప్రసరణముచే వింతకాంతుల నీనుచు దూరమున దృగ్గోచర మయ్యెను. అది తప్పక కాంచీపురప్రాంతమే యని వారికి తట్టెను. తానున్న వింధ్యాటవి యేడ? ఈ కాంచీపురప్రాంత మేడ? ఇది కలయా నిజమా యని రామానుజులకు సందేహము కలిగెను. బాట వెంట బోవు జనుల నడుగగా "నిది సత్యవ్రతక్షేత్రమే" యని వారు గూడ సమాధాన మిచ్చిరి. కాంచీపురమునకే యది మరొక పేరు.

ఇది యఘటనఘటనాసమర్థు డగు హస్తిగిరీశుని కరుణాలేశమేగాని మరొండు గాదని తలచి రామానుజు లా దేవుని భక్తరక్షాపరతంత్రతకు హర్షోత్ఫుల్ల హృదయారవిందులైరి. ఇంటికేగి వారు తమ తల్లి కాంతిమ తికి యాదవుడు తనకు చేయదలపెట్టిన దారుణమును, కిరాతదంపతులు తన్ను ఘోరారణ్యమున కాపాడి యింటికి చేర్చిన విధమును వివరించి చెప్పిరి. ఆ తల్లియేగాక యిరుగు పొరుగువారు గూడ రామానుజు లట్టి ప్రమాదమునుండి బయటపడినందుకు మిగుల నానందించిరి.

## నీర కైంకర్యము

రామానుజులు స్వగ్రామమున నుండి మాతృసేవలో సుఖముగా కాలము పుచ్చసాగిరి. ఒకనా డామె కుమారునితో ననెను— "నాయనా, ఈ నగరమున కాంచీపూర్ణుడను మహాభక్తు డున్నాడు. ఆయన జన్మముచే శూద్రుడయినను సదాచార సంపదచే బ్రాహ్మణుడు. అగ్రజాతులవారు గూడ భక్తిజ్ఞానవైరాగ్యాది సద్గుణసంపన్నుడగు నా వైష్ణవు నెంతో ప్రేమింతురు. వరదరాజస్వామి కైంకర్యముతోనే యా మహనీయుడు సదా కాలము గడపుచుండును. తన యాత్మీయుడగు నా భక్తవరునితో స్వామి సదా సంభాషించుచుండు నని ప్రతీతి. కాన నా మహాత్మునకు

కాశీయాత్రలో జరిగిన సంఘటన లన్నియు పూస గ్రుచ్చినట్లు నివేదిం పుము. నీకు వారు కర్తవ్య ముపదేశింపగలరు. మన కుటుంబమన్న వారి కపారకరుణ."

రామానుజులు తల్లి యానతి నౌదల దాల్చి కాంచీపూర్ణుల యింటి కేగి వినయముతో నమస్కరించి తమ పరిచయము కావించుకొనిరి. యాదవప్రకాశునితో తాను కాశీయాత్ర కరుగుట, కిరాతదంపతులు, వింధ్యారణ్యమున జిక్కిన తన్ను కాపాడుట, వారు జలము తెమ్మని యాదేశించుట. వారిచేతనే తాము రక్షింపబడుట మొదలగు విషయము లన్నియు వివరించిరి.

అది యంతయు శ్రద్ధగా విని కాంచీపూర్ణు లిట్లు పలికిరి. "మహా ప్రాజ్ఞుడును, భగవత్కైంకర్యాభిలాషియును నగు నీయందు వరదునకు నిర్హేతుక దయ ప్రసరించిన దని యీ సంఘటనచే తెలియుచున్నది. కాననే స్వామి దేవీసమేతుడై నిన్ను కాపాడుటకు వ్యాధరూపముతో నా యరణ్యమధ్యమున కేతెంచియుండును. మహారణ్యమధ్యమున నిన్ను బ్రోవనేతెంచిన కరివరదుడు నీకు ప్రీతుడై నీచే నీరకైంకర్యము చేయించు కొనదలచినట్లు తోచుచున్నది. కాన నేటినుండి యీ దేవాధిదేవున కదే బావినుండి జలము తెచ్చి సమర్పించుట నీ కిహపర సాధకము."

లక్ష్మణార్యులు కాంచీపూర్ణుని హితోపదేశానుసార మా శాలికూ పము నుండి స్వర్ణకలశముతో జలము తెచ్చి నిత్యమును వరదరాజస్వామికి భక్తితో సమర్పింపసాగిరి.

## యామునాచార్యులు

ఆ కాలమున శ్రీ రంగక్షేత్రమున యామునాచార్యులను ద్విజ వరులు శ్రీ వైష్ణవకులపతియై సంన్యాసాశ్రమమున విరాజిల్లుచుండిరి. ఆనాడు వారు విశిష్టాద్వైతసిద్ధాంతమును విరివిగా ప్రచారము చేయు టయే గాక శ్రీ భాష్యభగవద్విషయాది మతగ్రంథములను గూడ శిష్యులకు సమర్థతతో బోధించుచుండువారు. వారు పూర్వాశ్రమ మున పాండ్యరాజ్యము నతి బాల్యకాలముననే పాలించి వన్నె కెక్కి యుండిరి. వారు పరవాది భీకరులై పాండ్యరాణిచే ఆళవందారు (నన్ను కాపాడవచ్చినవారు) అని నామాంతరము నందియుండిరి. వీరి

చరిత్ర మాముక్తమాల్యద ద్వారా వివరముగా తెలిసికొననగును. వారు గొప్పకవి గూడ. స్తోత్రరత్నము, సిద్ధిత్రయము, ఆగమప్రామాణ్యము, గీతార్థసంగ్రహము మొదలగు నా మహాకవి గ్రంథములు విశిష్టాద్వైత సిద్ధాంతానుయాయుల కత్యంతోపాదేయములు.

మహాపూర్ణులు (పెరియనంబి) శ్రీశైలపూర్ణులు (తిరుమలనంబి) కాంచీపూర్ణులు (తిరుక్కచ్చినంబి) మొదలగు నా కాలమందలి వైష్ణవాచార్యు లందరును వారివద్ద విశిష్టాద్వైత గ్రంథములను విష్ణుభక్తి తత్త్వమును నభ్యసించినవారే.

శ్రీవైష్ణవసిద్ధాంతపరిపాలకు లయిన యామునాచార్యులవారు ప్రసన్నజనకూటస్థులగు శఠకోపమహర్షి రచించిన "తిరువాయ్ మొళి" యను నుద్గ్రంథము శిష్యులకు బోధించుచుండగా 'పొలిక పొలిక' యను పాశురము వచ్చెను. శ్రీమహావిష్ణువు భక్తులు భూమ్యాకాశములందు తద్గుణగణములు గానము చేయుచు సంచరింపగల కాలము సమీపించుచున్నది; అట్టి భాగవతశ్రీకి జయము జయ మని యీ పాశురమునకర్థము. దీనికి లక్ష్యమయిన మహాపురుషు డీ కాలముననే జనియించె నని యామునార్యులమనస్సుకు తోచెను. వెంటనే యట్టి పరమభాగవతోత్తము డగు శ్రీవైష్ణవుని వెదకు డని వారు తమ శిష్యుల కాన తిచ్చిరి. వారును దేశము లన్నియు తిరిగి తిరిగి మహాప్రాజ్ఞుడును, సర్వసద్గుణ సంశోభితుడును, ననన్యవిష్ణుభక్తుడును నగు శ్రీరామానుజులను కాంచీపురమున కనుగొని యీ సంగతి యామునాచార్యులకు నివేదించిరి.

శ్రీరంగమునుండి యామునాచార్యులు మహాపూర్ణుడను శిష్యోత్తముడు తమవెంట రాగా కాంచీపురమున కేతెంచిరి. అపుడే యాదవప్రకాశునివెంట బాలభాస్కరునివలె నమిత తేజస్కుడై నడచుచున్న రామానుజులను గాంచిరి. వారి విద్యావిజ్ఞానవైభవమును మహాపూర్ణుల ద్వారమున తెలిసికొని తన తర్వాత నీ మహాపురుషుడే విశిష్టాద్వైత సిద్ధాంతము నుద్ధరించి దాని నాసేతుశీతాచలమును వ్యాప్తము చేయగల డని వారికి నమ్మకముకలిగెను. "సత్యం జ్ఞాన మనంతం" "కప్యాసం పుండరీకం" అను శ్రుతులకు రామానుజులు చెప్పిన సరి యగు నర్థమే యట్టి విశ్వాసము యామునాచార్యులకు కలుగుటకు కారణము.

యామునార్యులు మహాపూర్ణులతో ననిరి. "మాతాత నాథముని పన్నిద్దరాళ్వారులు రచించిన నాలాయిరదివ్యప్రబంధమును శిలమైన దాని నెంతో శ్రమపడి సంగ్రహించెను. వేదవ్యాసుడు సంస్కృత వేదమున కెట్టివాడో మా పితామహుడు నాథముని ద్రావిడవేదమున కట్టివాడు. ఆ వేద విశేషములు వివరించు గ్రంథములు నేను కొన్ని వ్రాసినాను. కాని బ్రహ్మసూత్రములకును, నుపనిషత్తులకును, భాష్యములు వ్రాయవలసిన పని యింకను మిగిలియే యున్నది. నా శక్తియా యుడిగిపోయినది. అద్వైతగురువు శుశ్రూషతో కాలము గడుపుచున్న రామానుజుడు నేను పిలిచినను, వచ్చి నా మాటలను విను నను నమ్మక మేది? కాన రామానుజుని కలసి కొనుట కిది యదను గాదు. నా యనంతరము రామానుజు డీ భారము తనపై వైచుకొనుటకు తగిన ప్రయత్నము నీవే చేయవలసియుండును." తర్వాత వారు రామానుజుని శ్రీవైష్ణవ సిద్ధాంత ప్రవణులుగ చేయు మని హస్తిగిరీశుని ప్రార్థించి శ్రీరంగమునకు తమ శిష్యకోటితో మరలి పోయిరి. అప్పుడే వారు స్తోత్రరత్నమను గ్రంథమును రచించి శ్రీరంగనాథునకు సమర్పించిరి.

## శివలింగప్రాప్తి

యాదవప్రకాశునితో గలసి కాశీయాత్ర కేగిన గోవిందుని సంగతి తెలిసికొందము. గోవిందు డట్లు యాదవప్రకాశునితో గలసి కొలది దినములు ప్రయాణము చేసి వారణాసీనగరము చేరెను. అట నాతడు గంగలో స్నానమాడుచు సూర్యున కర్ఘ్య మిచ్చుచుండగా నాతని చేతికి శివలింగ మొకటి తగిలెను. కుడిచేత చిక్కిన యా లింగము నాతడు యాదవునకు చూపెను. "కాశీవిశ్వనాథుడు ప్రసన్నుడై నీ కీ లింగము ననుగ్రహించినాడు కాన దీనిని శ్రద్ధాభక్తులతో నర్చించుకొను" మని యాదవప్రకాశుడు పలుకగా గోవిందుడు దానిని పూజింపసాగెను. అతడు నాటితో తన వైష్ణవాచారములకు తిలాంజలి యొసగెను.

అటనుండి యాదవప్రకాశుడు గోవిందునితో కలసి స్వదేశమునకు మరలెను. కాంచీపురమును వదలి గోవిందుడు స్వగ్రామమగు శ్రీమంగళము చేరి తాను తెచ్చిన శివలింగము నొకచోట ప్రతిష్ఠించెను. కొంత కాలమున కాతడటనుండి బయలుదేరి కాళహస్తి చేరి భస్మత్రిపుండ్ర ధారియై శివభజనతో కాలక్షేపము చేయసాగెను.

# శ్రీరంగయాత్ర

దుష్టుడగు యాదవునితోడి పొత్తు తన కిక పనికిరాదని రామాను జులు నిర్ణయించుకొని యాతని సాంగత్యము విసర్జించి స్వయంకృషితోనే శాస్త్రాభ్యాసము చేయుచు యథారీతిగా వరదరాజస్వామికి తీర్థకైంకర్యము చేయుచుండిరి.

ఈ విషయమును యామునాచార్యులు తెలిసికొని యానందపరవ శులైరి. వారు మహాపూర్ణులను పిలిచి నేను రచించిన స్తోత్రరత్నమును కంచికి పోయి రామానుజులకు వినిపించి రమ్మని యాజ్ఞాపించిరి. మహాప్రసాద మని పలికి మహాపూర్ణులును స్వాచార్యాజ్ఞ శిరసావహించి కంచికి వెడలిరి.

మహాపూర్ణులు వరదరాజసన్నిధిలో స్తోత్రరత్నమును భక్తితో పఠిం పసాగిరి. వారి గానమాధురియు, నర్థావబోధన పద్ధతియు, శ్రోతల నెంతో యాకర్షించెను. రామానుజులు తన యీ స్తోత్రము నెపుడు విందురాయని పూర్ణార్యు లాతురతతో ఎదురు చూడసాగిరి. తీర్థకైం కర్యము చేయుటకు రామానుజులు స్వామిసన్నిధి కేతెంచిరి. అచట నాకర్ణాంత విశాలనేత్రులును, మహాప్రభావవంతులును, మహాప్రాజ్ఞులును, విష్ణుభక్తులును, విగతమత్సరులునునగు నా రామానుజులకు మహాపూర్ణు లుచ్చైఃస్వరముతో నీ శ్లోకము పఠించుచుండుట శ్రవణగోచరమయ్యెను--

"స్వాభావి కానవధికాతిశయేశితృత్వం
నారాయణ త్వయి న మృష్యతి వైదికః కః?
బ్రహ్మా శివః శతమఖః పరమస్స్వరాడి-
త్యేతేఽపి యస్య మహిమార్ణవవిప్రుషస్తే."

—స్తోత్రరత్నము

—శ్రీమన్నారాయణు డొక్కడే సర్వశక్తిమంతుడు. బ్రహ్మ, శివుడు, రుద్రుడు మొదలగువా రందరును నా మహామహుని మహి మార్ణవమున నుదబిందువులు మాత్రమే యను భావము నిచ్చు నా శ్లోకము విని యందలి భావగాంభీర్యమునకు నర్థచమత్కారమునకు తన్మ యులై రామానుజులు "మహాత్మా, ఈ శ్లోకమును రచించిన సుధీమణి యెవ్వ"రని ప్రశ్నించిరి.

"చిరంజీవీ! ఈ శ్లోకము స్తోత్రరత్న మను కృతిలోనిది. దీని రచయిత విశిష్టాద్వైతసిద్ధాంతపాలకులు శ్రీయామునార్య సుకృతి. వారి మహిమాతిశయము నీకు గూడ తెలిసియే యుండును. వారు కొంత కాలము రాజ్యపాలన గూడ చేసి యనంతరము విరక్తులై లోకహితార్థులై సంన్యసించినారు. విశిష్టాద్వైతసిద్ధాంతము మాత్రమే--హరిభక్తియొక్కటియే-- సర్వ జంతుసంతారక మని లోకమున ప్రచారము చేయుటకు మార్గాన్వేషణ చేయుచున్నారు. వారు శతవృద్ధులైనందున తనకు గల జ్ఞానసంపదను సమర్థుడును, శీలసంపన్నుడును, పరదుఃఖకాతరుడును నగు నొక వైష్ణవోత్తమునకు సమర్పించి నిశ్చింతగ కనుమూయ దలచి యున్నా" రని మహాపూర్ణులు బదులు పలికిరి.

శ్రీరామానుజుల వీనుల కా పలుకు లమృతోపమానములే యయ్యెను. "స్వామీ! న న్నామహనీయుని దరిజేర్చి పుణ్యము కట్టుకొనుడు. విశిష్టాద్వైతసిద్ధాంతము తెలిసికొన కుతూహలముండి గూడ సమర్థు లయిన బోధకులు నాకు లభింపలేదే యని విచారముతో నున్నాను. నేటికి నా యభిలాష ఫలించు నవకాశము వరదుడే యీ రూపమున ననుగ్రహింపదలచి యుండవచ్చును. దయయుంచి నన్ను తమతో శ్రీరంగము గొనిపోయి యా మహాత్ముని దర్శనము చేయించి కృతార్థతముని చేయుడు" అని వా రామహాత్ముని వేడుకొనిరి. తమ యాచార్యులు తనను పంపిన యుద్దేశ్యము ఆడబోయిన తీర్థ మెదురైన రీతిగా ఫలింపనున్నది గదా యని మహాపూర్ణులు గూడ బ్రహ్మానంద మంది వెంటనే వారిని వెంటనిడుకొని శ్రీరంగమునకు ప్రయాణమైరి.

కాని విధివిలాసము విచిత్రము గదా! తలచినవి తలచినట్లు జరిగినచో మానవుని మనోరథములకు, నహంకారమునకు హద్దుపద్దు లుండునా? రామానుజులు యామునార్యులను కలసికొని పరమార్థ ప్రచారముకై కృషిచేసినచో నీ కలియుగము నశించి కృతయుగమే యవతరించు నను భయముచే గాబోలు శ్రీరంగనాథుడు వారిద్దరను కలయనీయలేదు. వారు శ్రీరంగము చేరునప్పటికే యామునాచార్యులు శరీరము చాలించిరి.

యామునాచార్యులను దర్శించు తమితో రామానుజులును--వారిని యామునార్యులకు వప్పగించి తమమీద పెట్టిన బాధ్యతను నిర్వర్తింపవలెనను కోరికతో నున్న మహాపూర్ణులును--ద్రుతగతితో ప్రయాణము చేసి శ్రీరంగము చేరిరి. కాని మార్గమధ్యముననే వారి కనేకాపశకు

నములు పొడగట్టెను. ఇది యేమి గ్రహచారమో గదా యని వారు తలచుచు కావేరి నదిని దాటగానే వా రిరువురకును నవనాడులు క్రుంగిపోవు దృశ్యమెదు రాయెను. దానితో వారు స్తంభితులే యయి పోయిరి.

## అంగుళిమోచనము

కావేరీనదీతీరమున ద్విజవర్యులు చాలమంది గుంపులు గట్టి దీన వదనములతో నిలువబడి యుండిరి. మీారంద రేల యిట్లున్నా రని మహాపూర్ణులు వారి నడిగిరి. "మన యాచార్యులు యామునార్యులు మన కిక లేరు" అని వారు కండ్లనీ రొత్తుకొనుచు పలికిరి. వజ్రపాత తుల్య మగు నా పలుకు చెవిని బడగనే వా రిరువురును మొదళ్ళు నరకిన యరటిచెట్లవలె నేల గూలిరి. కొంత వడి కెట్లో మహాపూర్ణులు మూర్ఛ నుండి తేఱుకొని లేచి రామానుజులతో "తండ్రీ, జరిగి పోయిన దానికి విచారించి లాభమేమి? జ్ఞానవంతుడ వయిన నీవును ప్రాకృతులవలె నిట్లు దుఃఖింపదగునా? అత్యంతప్రియకర మైన వరదుని తీర్థకైంకర్యము గూడ వదలి యామునార్యునిదృక్షతో వచ్చినందుకు నీ కిట్టి ఘోరదుఃఖమును, నిరుత్సాహమును సంభవించినవి. శరీరమునకే గాని, శరీరికినాశనము లేదనుట నీ వెరుగనిది కాదు గదా! యాము నార్యులు పరమపదమున కరుగుట దైవనిర్ణయము. మన దేమున్నది? సుఖదుఃఖములు, సంయోగవియోగములు, జననమరణములు సర్వమును దైవాధీనమే గదా! యామునాచార్యుల చరమ శరీరమునకు ఖననక్రియ జరుగక మునుపే మన మేగి వారిని దర్శించి ధన్యుల మగుదము రమ్ము" అని రామానుజులతో పలికిరి. కాని లక్ష్మణార్యులకు కలిగిన దుఃఖము సామాన్యముగాదు. కాన వారు చేష్టలు దక్కి పంకమున జిక్కిన గజేంద్రునివలె. కదలక మెదలక కొంతసేపటివరకు నేలపైనట్లే పడియుండిరి. కొంతవడికెట్లో వారికి పూర్వస్మృతి కలిగినది. ఐనను దుఃఖభార ముపశమింపలేదు. ఆ విధముగా యామునార్యుల నింతవరకు చూడనైన లేకపోతినేయని మహాదుఃఖమున మునిగి యున్న రామానుజులను, మహాపూర్ణులు రెండు చేతుల లేవనెత్తి చెక్కులనుండి జారు కన్నీరు కరమున దుడిచివారి తాప ముడిపిరి.

కొంతసేపయిన తర్వాత మహాపూర్ణులు రామానుజులను తమ వెంట నిడుకొని యామునార్యులున్న స్థలము చేరిరి. వారిని దర్శిం

పగనే లక్ష్మణార్యులకు మరల దుఃఖము పెల్లుబికెను. "అయ్యో, దప్పిక గొన్నవాడు జలాశయము చేరితినని సంతోషపడి గూడ నది మరుమరీచికయే యని తెలిసికొని దుఃఖాబ్ధిలో మునిగినట్లు యామునా ర్యరవిప్రబోధముచే జ్ఞానప్రకాశ మంద గల నను కుతూహలముతో నున్న నా యాస అడియాసయేయయినదిగదా! యామునార్యులను కలుసు కొని వారి సంసేవచే నే నెన్ని ఘనకార్యములు చేయగల నని కలలు కన్నానో! అక్కటా! ఆ నా కల లన్నియు కల్లలే యయినవి. వారును నేనును నేక మయినచో నీ భూమినుండి పరమపదమునకు నేరుగ సోపానమార్గము నిర్మించి బద్ధజీవులకు సుకరముగ మోక్షోపాయము తెలియజెప్పగలిగి యుందుము గదా! నా యభాగ్య మిట్టిదై యుండ నిపు డెవరిని దూఱి యేమి లాభము!" అని వారు కుమిలి కుమిలి వాపోవదొడగిరి.

"నాయనా, గతజలసేతుబంధన మేల? నీబోటి ధీరుడు గూడ నిట్టి సహజవిషయమునకు వగవదగునే? మరణము జీవికి సహజము. నీటి బుడగవంటి జీవితము చిరకాలము నిలచి యుండుట దుష్కరము" అని పలికి మహాపూర్ణులు నెమ్మదిగ రామానుజులను నడపించుకొనుచు యామునాచార్యులవద్దకు తీసుకొనిపోయిరి.

ఆచార్యముఖారవిందమున నిర్మలకాంతి తాండవ మాడుచుండెను. వారు ధరించిన యూర్ధ్వపుండ్రములు చెక్కుచెదరక శరీర మంత టను మెరయుచుండెను. సహజముగా నిదుర పోవుచున్నట్లే వారు శయనించి యుండిరి. వారి తక్కిన వ్రేళ్ళన్నియు జాపబడి యుండగా కుడిచేతి మూడువ్రేళ్ళు మాత్రము ముడుచుకొనియుండెను. అచట నున్న వారందరును దానికి గల కారణమును తమకు తోచినరీతిని వ్యాఖ్యానింపజొచ్చిరి.

అపుడు రామానుజులు అచట చేరిన వారిని "యామునుల యంగుళులు మొదటి నుండియు నిట్లే యున్నవా లేక యిప్ప డిట్లు ముడుచుకొనినవా" యని యడగిరి. "ఇదివరలో మామూలుగనే యుండెడివి. ఇంతకు పూర్వమే యిట్లయిన" వని యా వైష్ణవులు పలికిరి.

పరేంగితావగాహి యగు లక్ష్మణార్యులు గురువు చరమాశయము లను క్షణములో నూహించి గ్రహించి యందరును వినుచుండగా నిట్లు ద్ఘోషించిరి-- "నేను విశిష్టాద్వైతమును వృద్ధి చేసి శ్రీవైష్ణవభక్తి నాసేతుహిమాచల మాబాలగోపాలము వ్యాపింపజేయ పాటుపడెదను. జనులనందరను పంచ సంస్కారపరాయణుల నొనర్చి వారిని ద్రావిడ వేదప్రవణులుగను, ప్రపత్తిధర్మనిరతులుగను చేసెదను." వా రీమాట పలుకగనే యామునాచార్యుల యొక వ్రేలు యథాప్రకారమయ్యెను.

మరల రామానుజు లిట్లు వచించిరి-- "పారాశర్యుని బ్రహ్మసూత్ర ములకు నిఖిలధర్మప్రతిపాదకమును చిదచిదీశ్వర తత్త్వజ్ఞాన నిర్ణాయకమును నగు "శ్రీభాష్య"మను వ్యాఖ్యానము రచించి దానిని విరివిగా వ్యాప్తి చేసెదను." ఈ వచనముతో రెండవ యంగుళికూడ మామూలు స్థితికి వచ్చెను.

"జీవేశ్వరభేదమును తల్లక్షణములను వివరించుచు పరాశరమహర్షి విష్ణుపురాణరత్నమును నిర్మించినారు గదా! వారి ఋణము తీర్చుకొను టకు సర్వసద్గుణసంపన్నుడును సమర్థుడును నగు నొక శ్రీవైష్ణవునకు వారి పేరు పెట్టగలను." ఈ మూడవ పలుకుతో మూడవవ్రేలు గూడ జాచుకొనెను.

అచ్చటనున్న జనులందరును నీ వింతకు మిగుల వింత పడిరి. రామానుజులు యామునార్యులను మించినవారే గాని సామాన్య మాన వులు కారని వారందరకు లక్ష్మణార్యులపై ప్రగాఢభక్తి విశ్వాసములు కుదురుకొనెను. ఆ వైష్ణవులు రామానుజుల నెంతో గౌరవించిరి.

కాని యామునార్యులు లేని శ్రీరంగమును ప్రవేశించుటకు రామా నుజులకు మరి బుద్ధిపుట్టలేదు. "ఎన్నో కలలు గని యామునార్యులవద్దకు రాగా నీ దేవుడు వారిని సేవించు భాగ్యమునుండి నన్ను వంచి తుని చేసినాడు గదా! ఇట్టి రంగనాథునితో నాకేమి పని" యని వారి కా దేవునిపై విరక్తి కలిగెను. కాననే శ్రీరంగమున నివసించి తమ కధ్యాత్మ విషయములు బోధింపు డని యా శ్రీవైష్ణవు లెంత ప్రార్థిం చినను వినక యా నగరిలో పాదమయినను మోపక వారు కావేరి దాటి కంచికి వెను దిరిగి పోయిరి. అచట వరదరాజస్వామిని దర్శింపగనే యామునాదర్శనదుఃఖము చాల వరకు తగ్గిపోయెను. అప్పుడే వారి

మాతృదేవి కాంతిమతి గూడ పరమపదము చేరెను. దుఃఖముతోనే ఆమెకు పరలోకక్రియలు నిర్వర్తించి రామానుజులు ఎట్లో కంచిలోనే కాలము గడుపసాగిరి.

## మొదటి తప్పు

మఱునాడు రామానుజులు కాంచీపూర్ణులవద్ద కేగి యామునార్య నిర్యాణవార్త వారికి వినిపించిరి. యామునార్యులు పరమపదించి రన్న మాట వారికి చాల బాధకలిగించినది. కాని ధీరు లయినందున దానినెట్లో నిగ్రహించుకొని తమ గురువుకు శాస్త్రోక్తముగా తర్పణాది క్రియలు నిర్వర్తించిరి.

రామానుజులు తమ గురువుగా కాంచీపూర్ణులనే వరింపదలచిరి. కాన తమయింటికి భోజనమునకు రమ్మని భక్తితో నాహ్వానించిరి. కాదన లేక కాంచీపూర్ణు లంగీకరించిరి. రామానుజులును సంతోషముతో తమ యింటి కేగి తమ గురువుగారికి ఘనమైన విందుకు ప్రయత్నము చేయుమని భార్య రక్షకాంబతో పలికి వారిని తమ వెంటబెట్టుకొని వచ్చుట కేగిరి.

కాంచీపూర్ణులు మరొక మార్గమున రామానుజుల యింటికేగి తలుపు తట్టిరి. వంటయింట వంటకములు తయారు చేయుచున్న గృహిణి వచ్చి తలుపు తీసెను. కాంచీపూర్ణులును లోన ప్రవేశించి "అమ్మా, నీ భర్త నన్ను భోజనమునకు పిలువగా వచ్చినాను. కాన త్వరగా వడ్డింపు" మని పల్కెను. "మిమ్ములను పిలుచుకొని వచ్చుటకే మీయింటి కరిగినారు; వారిని రానిం"డని యామె సమాధాన మిచ్చెను.

"అట్లు గాదు. నేను భుజించి వెంటనే యేగవలసిన పని యున్న" దని వారు కోరిరి. సరే యని రక్షకాంబ వారికి చావడిలో భోజనము పెట్టెను. వారు భుజించి తమ విస్తరి గూడ తీసి పారవైచి యా స్థలము శుద్ధి యొనర్చి వడివడిగా మరొక మార్గమున రామానుజులకు కానుపించకుండ వెడలిపోయిరి.

గురువును పిలుచుకొని వచ్చుటకేగిన రామానుజులు వారింట లేనం దున వారి నటనట వెదకి కొనుచు నిల్లు చేరిరి. కాంచీపూర్ణుల భుక్తశేష

మంతయు పారవైచి రక్షకాంబ స్నాన మాడి మరల వేరుగా వంట చేయసాగెను. "ఇంకను వంట కానే లేదా! కాంచీపూర్ణు లిచటకు రాలేదా?" యని రామానుజు లడుగ నామె "మీ రటు వెడలగనే మీ గురువుగారు వచ్చి భోజన మిడు మని తొందర చేసినారు. మీరు వచ్చువరకు నాగు మని నేను పలికినను, వారు వినలేదు. కాన విధిలేక వారికి భోజనము పెట్టినా"నని యామె సమాధాన మొసగెను.

"మరల వంట యేల చేయుచున్నా"వని యడుగ నామె భర్తతో "నిది యేమి చోద్య మండీ, శూద్రులు భుజింపగా మిగిలిన యన్నము మీరెట్లు భుజింపగలరు? అందుకే ఆ యాహారపదార్థములు పారవైచి మరల స్నానమాడి శుచినై వంట చేయుచున్నా"నని యామె పలికెను.

"ఓసీ, ఎంత తప్పుడు పని చేసినావు? మహాజ్ఞానియగు వారి యుచ్ఛిష్టము భుజించి తరింపవలె నని గంపెడాశతో నేను వారిని భోజనమునకై పిలువగా నీవు నేను రాక ముందే వారికి ప్రత్యేకముగా భోజనము పెట్టుట యటులుంచి మిగిలిన దంతయు పారవైచినావా! ఛీ, ఛీ ఇక నీ మొగము నాకు చూపకుము" అని యామెను చీద రించుకొనిరి. ఆమెయు మారు పలుకక మొగము చిన్నబుచ్చుకొనెను.

రామానుజులు వెంటనే వరదరాజుల యాలయమున కేగి కాంచీ పూర్ణులను సందర్శించి "స్వామీ, మీరు తప్ప నాకు పంచసంస్కా రము చేయు గురువెవరును లభించు సూచన కానవచ్చుట లేదు. ఆ యదృష్టమే నాకుండిన యామునార్యులనే నేను వారి జీవితకాలమున సందర్శింప గలిగి యుండెడివాడను. కాన మీరు నాకు నారాయణా ష్టాక్షరీమంత్రము నుపదేశింపక తప్ప"దని వినతులై ప్రార్థించిరి.

అందుకు కాంచీపూర్ణు లిట్లనిరి. "రామానుజా! అది వర్ణాశ్రమ ధర్మవిరుద్ధము. శూద్రుడు బ్రాహ్మణున కగ్ని సంధానించి చక్రాంక నము చేయుట శాస్త్రనిషిద్ధము. కాన నా పాపము నేను మూట కట్టుకొనజాలను" "అయిన, నేను మనసున తలచుకొనిన విషయములకు సమాధానములను హస్తిగిరివరదు నడిగి తెలుసుకొని నాకు తెలుపుడ"ని రామానుజులు కోరిరి. వారును నంగీకరించిరి.

# అర్థషట్కప్రాప్తి

వైష్ణవోత్తములగు కాంచీపూర్ణు లా రాత్రి వరదుని చేరి తాళవృం. తముతో నాయనను సేవించుచు మనమున నేదియో చింతింపసాగిరి. వారి ముఖకవళికలు గుర్తించిన యా దేవదేవుడును "ఏమి తపోధనా! ఏమో యాలోచించుచున్నట్లున్నావే? అది నాకు చెప్పదగినదేనా"? యని యడిగెను. అందుకు వారు "స్వామీ, రామానుజులు మిమ్ము నడిగి కొన్ని ప్రశ్నలకు సమాధానము తెలిసికొని రమ్మనగా వానిని గూర్చియే యాలోచించుచున్నాను. అంతకంటె నేమియు లేదు" అని సమాధానమిచ్చిరి.

"ఓహో అదియా! అయిన రామానుజు లారు విషయములు మనస్సున నాలోచించిరి. వానికి సమాధానము లివి యని వారితో చెప్పుము---

"అహ మేవ పరబ్రహ్మ జగత్కారణకారణమ్,
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్భేద స్సిద్ధ ఏవ మహామతే.
మోక్షోపాయో న్యాస ఏవ జనానాం ముక్తి మిచ్ఛతామ్,
మద్భక్తానాం జనానాం చ నాంతిమస్మృతి రిష్యతే,
దేహావసానే భక్తానాం దదామి పరమం పదమ్.
పూర్ణాచార్యం మహాత్మానం సమాశ్రయ గుణాశ్రయమ్."

1. జగత్కారణ మగు పరబ్రహ్మను నేనే గాని యితరు లెవ్వరును కారు.
2. శరీరమునకును, శరీరికిని తప్పక భేదము కలదు.
3. ముముక్షువులకు ప్రపత్తిని మించిన మోక్షోపాయము మరొకటి లేదు.
4. నా భక్తుల కంతిమస్మృతితో నిమిత్తము లేదు.
5. నా భక్తులకు దేహావసానమున మాత్రమే నేను పరమపదము నిచ్చెదను.
6. మహాత్ములగు మహాపూర్ణులను గురువుగా నాశ్రయింపుము.

కాంచీపూర్ణులును మహాప్రసాద మని పలికి హరిని సెలవడిగి రామానుజులవద్ద కేగి వరదరాజస్వామి పలికినమాటలు వారికి తెలియజేసిరి.

లక్ష్మణార్యులును స్వామిసమాధానము విని సరిగా నే నాలోచించిన ట్లుగనే స్వామిగూడ సమాధాన మిచ్చెను గదా యని వింతపడుటయే గాక యెంతో సంతోషించిరి. ఇక మహాపూర్ణుల నాశ్రయించుటలో నెంతమాత్రము నాలసింపరా దని తలచి వారు శ్రీరంగము బయలుదేరిరి.

## పంచసంస్కారలాభము

యామునాచార్యుల శిష్యబృందము శ్రీరంగమున పెద్ద సంఖ్యలో నుండెను గదా. తమ యాచార్యులు పరమపదము చేరినప్పటినుండి యా శిష్యు లందరు ఘోరదుఃఖాంబుధిలో మునిగి కన్నుగానని వారైరి.

అపుడు శ్రీరామానుజుల శీలసంపదను, విష్ణుభక్తి పారమ్యమును వినియున్న కొందరు ద్విజసత్తములు మహాపూర్ణులతో నిట్లనిరి– "మహాత్మా! పరలోకగతు లగు గురువును గూర్చి మన మెంత కాలము దుఃఖించుచు గూర్చున్నను వారు మనల నుద్ధరించుటకు తిరిగిరారు గదా! కాన మనము మన కందరకు తగిన నాయకు నొకని నెన్నుకొనవలయును. మన యాచార్యులు యామునార్యులు ప్రారంభించిన శ్రీవైష్ణవ సిద్ధాంతప్రచారము కొనసాగించుటకు మనము మార్గము వెదుకవలసి యున్నది. సత్యవ్రత క్షేత్రమున రామానుజులను శ్రీవైష్ణవమనీషి యొక రున్నారని, వారు సర్వసమర్థులని మనము విని యున్నాము గదా! యామునార్యుల గురుపీఠమును వారొక్కరు మాత్రమే యధిష్ఠింప నర్హు లని తోచుచున్నది. రామానుజులు శ్రోత్రియులు. ధర్మనిష్ఠులు; పరదుఃఖ కాతరులు, పరేంగితజ్ఞులు. వారట్టివారు కాననే మన యాచార్యు లంతిమసమయమున ముడిచిన వ్రేళ్ళను యథాస్థితికి తేగలిగినారు. మన యా వైష్ణవమహాసంఘమును చాకచక్యముగ సామర్థ్యముతో ముందుకు నడుపగలవారు వారి కంటె మరి యొక్కరు కానవచ్చుట లేదు.

రామానుజులు బుద్ధికి బృహస్పతి. తేజస్సుకు సూర్యుడు, భక్తికి ప్రహ్లాదుడు. క్షమకు పృథివి. మహాజ్ఞాని యగు రామానుజాచార్యులు మాత్రమే మన మతమును రక్షింపగలరు. కాన మీరు వెంటనే కాంచీపురము వెడలి మన యందరి పక్షమున ప్రార్థించి వారిని యామునార్యులు స్థాపించిన యీ మఠమున కధిపతిగా నుండుట కొప్పింపుడు. అంతేగాదు,

మీరే వారికి పంచసంస్కారములు చేసి, పూర్వాచార్యరచితములగు శ్రీవైష్ణవసిద్ధాంతగ్రంథములను, విష్ణుచిత్తాదుల ద్రావిడదివ్యప్రబంధములను వారికి బోధించి వారి నిటకు గొని రండు.''

ఈ విధముగ తమ సహచరులగు శ్రీవైష్ణవుల ప్రార్థన ననుసరించి మహాపూర్ణులు సకుటుంబముగ సత్యవ్రతక్షేత్రమునకు బయలుదేరిరి. కొన్ని దినములకు వారు మధురాంతక మను గ్రామము చేరిరి. వరదరాజస్వామిచే నాజ్ఞాపింపబడిన రామానుజులు గూడ మహాపూర్ణుల నాశ్రయించుటకై శ్రీరంగ మేగుచు దారిలో మధురాంతకము వద్దనే వారిని దర్శించిరి. ఇక వారి యానంద మవర్ణనీయము. మహాపూర్ణులు గూడ వెదుక బోయిన తీగె కాలికి తగిలినంత సంతోష మందిరి.

తన పుణ్య మినుమడించి ఫలించినట్లుగా సతీసమేతులై తమ కెదురయిన గురువర్యులను కాంచగనే రామానుజులు వెంటనే నేలపైకి వ్రాలి వారికి సాష్టాంగదండప్రణామ మాచరించిరి. వారి పాదపద్మ ద్వయమును గ్రహించి వదలుమాటయే మరచిరి. అపుడు మహాపూర్ణులు వాత్సల్యరసము తమలో నిముడక పైకిపొంగగా రెండు చేతులతో వారిని లేవనెత్తి గద్గదకంఠముతో "నాయనా, లెమ్ము. నేనును నీకొఱకే బయలుదేరినాను'' అని పలికి యామునార్యుని శిష్యులందరును రామానుజులను శ్రీరంగమునకు తోడితెమ్మని తమరిని పంపిన వృత్తాంత మంతయు వారికి తెలియజేసిరి.

తాము మహాపూర్ణుల నాశ్రయించుట శ్రీరంగమందలి వైష్ణవుల యభిమత మగుటయేగాక యది దైవనిర్ణీత మని గూడ నమ్మిన రామానుజులెంతో యానందించిరి. వారు మహాపూర్ణులను "వెంటనే పరమార్థోపదేశము చేసి సంసారకూపపతితు డగు తన నుద్ధరింపు''మని ప్రార్థించిరి.

అందులకు మహాపూర్ణు లిట్లనిరి— "నాయనా, ఇది సరికాదు. ఇది యొక కుగ్రామము. దేవాలయ మైన లేదు. ఇది నీ కుపదేశింప దగిన తావెంత మాత్రమును గాదు. కాన నేను గూడ నీతో కాంచీపురికి వచ్చి దేవరాజస్వామి సమ్ముఖమున నిన్ను పంచసంస్కారవంతుని చేసెదను.''

అపుడు లక్ష్మణార్యు లిట్లనిరి-- "స్వామీ, మహాప్రాజ్ఞులగు మీరి ట్లానతీయ నగునా? క్షణభంగుర మగు నీ శరీరము నమ్మదగునా? ఇది మనము కంచికి చేరువరకు నిలుచునో నిలువదో గూడ నెవ్వ రెరుగు దురు? శ్రేయస్కాము డగు వాడు సత్కార్యములు తర్వాత చేయవచ్చు నని వాయిదా వేయక తలచుకొనిన తత్క్షణమే యాచరించుట లగ్గు గదా! శ్రీయామునార్యసందర్శనముకై నేను మీతో శ్రీరంగమున కేగినపుడు యామునార్యుల శరీరము మనలను మోసపుచ్చ లేదా! కాన నాకిప్పుడిచటనే తప్తచక్రాంకనము చేసి న న్నష్టాక్షరీమంత్రపూతుని కావింపుడు."

యుక్తియుక్త మయిన రామానుజుల యా ప్రార్థనను మహా పూర్ణులంగీకరించిరి. సమీపసరోవరమున నిరువురును స్నాన మాడి సంధ్యాది కృత్యము లాచరించిరి. ఆ సరస్తీరముననే యగ్నిని ప్రతిష్ఠించి పురుషసూక్తాదిమంత్రములతోను, నారాయణాష్టాక్షరితోను యథావిధిగా హోమము గావించిరి. తదుపరి సుదర్శనపాంచజన్యములను గంధపుష్పా దులతో నర్చించి వినయముతో తమయెదుట కూర్చొనిన లక్ష్మణార్యుల భుజములమీద నగ్ని తప్తమైన యా శంఖచక్రములను ముద్రించిరి.

"తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగశ్చ పంచమః"

అను రీతిగా చక్రాంకన మాచరించిన తర్వాత నూర్ధ్వపుండ్రముల ధరింపజేసి వైష్ణవదాస నామ మిడి నారాయణాష్టాక్షరి నుపదేశించిరి. అనంతరము వరదరాజస్వామి యర్చావిగ్రహము నిత్యదేవతార్చనకై యనుగ్రహించిరి.

ఈ విధముగా యథావిధిగా సదాచార్యసమాశ్రితు లగు రామానుజులు రాహునిర్ముక్తుడగు శరచ్చంద్రునివలె ప్రకాశించిరి. శ్రీవైష్ణవ శ్రీసంపన్ను లైన శ్రీరామానుజులను మహాపూర్ణులు శ్రీమహావిష్ణుదాస్య సామ్రాజ్యమున పట్టాభిషిక్తుని గావించి సంప్రీతులై యిట్లనిరి-- "వత్సా! ఇప్పటికి నీవు యామునార్యులతో సమానుడవు-- కాదు, కాదు, వారిని మించినవాడవు-- అయినావు. ప్రచ్ఛన్నబౌద్ధాది దుర్మతములను నిర్జించు నేర్పు నీ కొక్కనికే కలదు. అట్టి సత్కార్యములను త్వరలోనే నీవు చేసి శ్రీవైష్ణవసంప్రదాయమును దశదిశలందు వ్యాపింప జేయగలవు. సర్వ దేశ దశా కాలములందును నీ యాజ్ఞ యవ్యాహతపరాక్రమముతో

వర్ధిల్లగలదు. నీ దివ్యాజ్ఞ ప్రతిదినము నుత్తరోత్తరాభివృద్ధిగా నుజ్జ్వలమై దిగంతవ్యాప్తము కాగలదు. అది యొక్కటియే జగత్కల్యాణ కరము. వేయేల, శ్రీవైష్ణవసంప్రదాయమే రామానుజదర్శన మని నీపేర ప్రసిద్ధము కాగల"దని త్రికరణశుద్ధిగా దీవించిరి.

తర్వాత తమ గురువు కుటుంబమును వెంట నిడుకొని లక్ష్మణాచార్యులు కాంచిని ప్రవేశించి జరిగిన వృత్తాంతము కాంచీపూర్ణులకు నివేదించిరి. వా రది యంతయు విని పరమానందము పొందిరి. రామానుజులు మహాపూర్ణులను తమ యింటియందే యుంచుకొని రామాయణమును, దివ్యప్రబంధాదులను వారివద్ద నధ్యయనము చేయుచు నారు మాసములు సుఖముగా పుచ్చిరి.

తమ గురువు యామునార్యులు తమయందు న్యాసముగా నుంచిన పరమార్థజాతము నీ విధముగా రామానుజుల కర్పించి మహాపూర్ణు 'లాచార్యఋణమును, ఋషిఋణమును నిప్పటికి గదా తీర్చుకొనగలిగితి' నని స్వస్థచిత్తులైరి.

## పత్నీపరిత్యాగము

శ్రీరామానుజు లభ్యంగనస్నానము చేయవలసిన దిన మది. వా రుదయముననే యా నా డొక బ్రాహ్మణ బాలునిచేత శరీరమునకు శిరమునకు తైలము మర్దనము చేయించుకొనిరి. తర్వాత నా బాలునకు భోజనము పెట్టు మని భార్యతో పలికిరి. ఇంట నన్నము లేదని యామె తడవుకొనకుండ సమాధాన మిచ్చెను. రామానుజుల కనుమానము కలిగి భార్య కనుగప్పి యింట నన్న మున్నదో లేదో యని వెదకిరి. చలిదియన్న మొక గిన్నెలో భద్రపరుపబడి యుండుట వారి కంటబడెను. వెంటనే వారు తమ యిల్లాలిని పిలిచి "ఇదా నీవు చేయు పని? అన్న మింటనుండగా లేదని పల్కుటకు నీ కెన్ని గుండెలు!" అని యామెను చీవాట్లు పెట్టిరి.

మరొకనాడు రక్షకాంబ నీరుతెచ్చుటకు బిందె తీసుకొని యూరి బయటనున్న మంచినీటి బావి యొద్ద కేగెను. ఆమె తన పుట్టినింటి వారిపై నీగ వాలనీయదు. సహజముగా తన యాభిజాత్యము మీదకూడ అభిమానము మెండు. మహాపూర్ణుల భార్య కూడ నామెవెంట నీటికై

యదే నూతి కేగెను. బిందె నుచ్చుతో బిగించి యిరువురును నీరు తోడుకొనసాగిరి. అపుడు మహాపూర్ణులభార్య బిందెలోని నీరు రక్షకాంబ బిందెలో చింది పడెను. వెంటనే యామె తన బిందెడు నీరును నేలపై క్రుమ్మరించి మరల స్నానము చేసెను. అంతే గాదు, మొగము కంద గడ్డవలె జేవురింపగా "ఏమమ్మా, ఏమి యీ యనాచారము! నీ నీరు నా బిందెపై చిమ్మి నన్ను మైలపరచినావు గదా! ఛీ, నీతో వచ్చుట నాదే తప్పు" అని రుసరుస లాడెను.

రక్షకాంబకు-- ఈమె నా భర్తకు గురుపత్ని గాన నాకు కూడ గౌరవింపదగిన-- దను జ్ఞానము లేదు. మీదు మిక్కిలి దీనితో లోగడ నే కొద్దిగనో యున్న వివేకము గూడ పూర్తిగ నశించెను. మహాపూర్ణుల భార్యకుగూడ నామె దూషణచే నరికాలిమంట నెత్తి కెక్కెను. ఆమెయు "నేమమ్మా, చూచుచు నూరుకొన్నకొలది పాకము ముదురు చున్నదే, మీరే గాదు, మేము కూడ గొప్ప వంశస్థులమే. జాగ్రత్త; మాటలు మిగులకుము. మీకెంత యాచారమో మాకంతకంటె నెక్కుడాచారము గలదు. మీ యింట నుండుట మాదే తప్పు" అని యామెను హెచ్చరించుటయే గాక యింటి కేగి యీ సంగతి తన భర్తకు నివేదించెను.

ఈ కలహము సంగతి రామానుజుల చెవిని బడిన తన భార్య నెక్కడ దండించునో యని భయముతో మహాపూర్ణులు వెంటనే శ్రీరంగము వెడలిపోయిరి. ఎచటికో వెళ్ళి తిరిగివచ్చిన రామానుజులు "గురువుగారు కాన్పించుట లేదేమి?" యని భార్య నడుగగా నామె నూతివద్ద తనకును, గురుపత్నికిని జరిగిన కయ్యము సంగతి వివరించి తనను సమర్థించుకొనజూచెను.

రామానుజు లిది వినగనే తోక త్రొక్కిన త్రాచువలె బుసకొట్టుచు ఒంటికాలిపై లేచి "ఓసి భ్రష్టురాలా నీ వెంతకు తెగించినావే? గురుపత్ని జలము నీ బిందెమీద చిందిపడిన తప్పా? నీ కింత యహంకారమా, యింతకంటె యవివేక మెచటనైన నుండునా? ఇందుకే గాబోలు పుట్టెను పుట్టిన బుద్ధి పుడకలతోనె గాని పోదనుట! దీనికి తగిన ప్రతిఫలము త్వరలోనే అనుభవింతువు లెమ్ము!" అని చాల నిందించిరి. ఆమె యేమియు బదులాడక గ్రుడ్లనీరు క్రుక్కుకొనెను.

తరువాత వారు మనమున నిట్లనుకొనిరి– "ఈమె యిప్పటికి మూడు తప్పులు చేసినది. నా గురువు కాంచీపూర్ణులకు భోజనమిడి వారికై వండిన పదార్థములన్నియు పారవైచి మరల స్నానమాడి మడి వంట చేయుట మొదటి తప్పు. నాకు తలంటిన బ్రాహ్మణ బాలున కింత నన్ను ముంచుకొని లేదనుట రెండవ తప్పు. ఇక నీమెపీడ నేదో విధముగ వదలించుకొనిక తప్పదు." నాటినుండి వా రామెను పరిత్య జించు నుపాయమన్వేషింపసాగిరి. కొంత కాలము జరిగెను. ఒకనాడు వారు వరదరాజస్వామి యాలయమున నుండగా నొక వైష్ణవుడు క్షుధా ర్తుడై వచ్చి వారిని భోజనము పెట్టింపుడని యర్థించెను. భాగవత ప్రతిపత్తి గల రామానుజులు వారిని తమ యింటి కేగి తాను చెప్పిన ట్లుగా తన భార్యతో చెప్పి భుజించి రండని పలికెను. ఆ వైష్ణవుడు రామానుజుల యింటి కేగి రక్షకాంబను పిలిచెను. ఆమె బైటకు రాక తలుపు ఛాటుననే యుండి "వచ్చిన పని యేమి?" యని యడుగగా "రామానుజులు మీ యింట భోజనము చేసి రమ్మని నన్ను మీ వద్దకు పంపినా"రని వారు చెప్పిన గుర్తులు కొన్ని పలికెను. "మా యింట నిపుడు గుప్పెడన్న మైనను లే"దని యామె యాయనను కసిరికొట్టి తలుపు దభీమని మూసివైచి రుసరుస లాడుచు విసవిస లోని కేగెను.

ఆ వైష్ణవుడు మరల పోయి దీనవదనముతో నా వృత్తాంతము రామానుజులకు విన్నవించెను. "అయ్యో! ఎంత పని జరిగినది" అని రామానుజులు నొచ్చుకొని యిక భార్యను వదలివేయవలసిన సమయ మాసన్న మైనదని నిర్ణయించుకొనిరి. ఆమెను పుట్టినింటికి పంపు నుపాయమప్పటి కప్పుడే ఆయన మనమున తళుక్కున మెరసెను. వా రాయనతో "అయ్యా, జరిగిన యపచారమునకు నన్ను క్షమింపుడు. మీకు భోజనము పుష్కలముగ లభించు నుపాయము చెప్పుచున్నాను. వినుడు. నేను మీకు కొన్ని వస్తువులను, జాబును ఇచ్చుచున్నాను. మీరు మరల శ్రమ యనకుండ మా యింటి కేగి నా భార్యతో 'మీతమ్ముని పెండ్లికై మీ పుట్టింటి వారు ముహూర్తము పెట్టుకొ న్నారు. కాన మిమ్ములను వెంట నిడుకొని రమ్మని నన్ను పంపినారు. ఇదిగో వారు పంపిన పసుపు, కుంకుమ, చీరె, జాబు' అని ఆమె కిండు. ఆమె యీ సంగతి వినగనే సంతోషముతో నుబ్బిపోయి మీకు

మంచి భోజనము పెట్టును. మిగిలిన పని నేను చూచుకొందును" అని పలికిరి.

ఆ వైష్ణవుడును సరే యని యా వస్తువులను తీసుకొని రామానుజుల యింటి కేగి తలుపు తట్టగా రక్షకాంబ బయటకు వచ్చెను. ఆయనవలన తమ్ముని పెండ్లి యని తండ్రి పంపినారని తెలియగనే ఆమె యెగిరి గంతు వైచెను. చీరె, పసుపు, కుంకుమ లందుకొని, జాబు చదువుకొని పాప మా ముద్దరా లా సంగతి నిజమే యని నమ్మెను. మహాసంతోషముతో నప్పటి కప్పుడు వంటకములు తయారు చేసి యాయన కామె షడ్రసోపేతముగా విందు చేసెను. మూటయు, ముల్లెయు కట్టుకొని పుట్టింటి కాయనతో ప్రయాణ మగుటకు సిద్ధమై కూర్చొనెను. ఆమె సంబరము వర్ణింప నలవిగానిది. తమ్ముని పెండ్లి గదా! సామాన్యమా మరి?

కొంత సేపటికి రామానుజు లిల్లు చేరిరి. మొగమున నానంద రేఖ తాండవించుచుండగా రక్షకాంబ "మా తమ్ముని పెండ్లి యని వీరు కబురు తెచ్చినారు. వెంటనే పోవలసియున్నది. ప్రయాణముకం డని త్వరపెట్టసాగెను. రామానుజులు "సంతోషము, నీవు ముందు వీరి తోనే వెళ్ళుము. నేను రెండు మూడు రోజుల తర్వాత నిచటి పనులు చూచుకొని రాగలను" అని పలికిరి. ఆ బేలయు నది నిజమే యని నమ్మి యా వైష్ణవునితో వెంటనే పుట్టినింటికి పయనమయ్యెను.

తన సంసారభార మింత కాలమునకు తీరినది గదా యని రామానుజులు స్వేచ్ఛగా సంతోషముగా నూపిరి పీల్చిరి. ఇక వరదరాజ స్వామినే వారు తమ సర్వస్వముగా భావించి యాత్మ మోక్షమునకును జగద్ధిత మునకును తమ జీవితము నాహుతి జేయుటకు బద్ధకంకణులైరి.

## సంన్యాస స్వీకారము

శ్రీ రామానుజు లీ విధముగ భార్యను తన యుపాయముతో పుట్టినింటికంపి నిశ్చింతులై సంన్యాసాశ్రమ స్వీకారమునకై త్రిదండమును, కమండలమును, సంపాదించిరి. ఇతరోపకరణములు గూడ సంపాదించి యొక సుముహూర్తమున ననంత సరోవరతీరమున యామునార్య చరణరాజీవములను హృదయపద్మమున ధ్యానించుచు కాషాయము

గట్టి సంన్యసించిరి. యతిసామ్రాజ్యపట్టాభిషిక్తు డగు సందర్భమున నీ యతిమూర్ధన్యుడు సమస్తలోకకల్యాణమునకు బద్ధకంకణు డైనా డని యానందముతో గాబోలు నాకసమునుండి పుష్పవృష్టి వంటి వృష్టిపడెను. కాషాయవస్త్రశోభితుడై దండ కమండలువులు ధరించిన యా యతిరాజు ద్వాదశోర్ధ్వపుండ్రములు దాల్చిన నరనారాయణు లను మునియుగములోని నారాయణమునివలెనే యలౌకికతేజముతో ప్రకాశింపజొచ్చెను.

వరదరాజస్వామి కాంచీపూర్ణులను పిలిచి "నా యర్చక పరిచార కులను ఛత్రచామరాదులను వెంటనిడుకొనిపోయి రామానుజులను నా వద్దకు సగౌరవముగా పిలుచుకొని ర"మ్మని యాదేశించిరి. "మహా ప్రసాద" మని కాంచీపూర్ణులును ఊరేగింపుతో, మేళతాళములతో ఛత్ర చామరాదులతో, నట్లే యతిరాజును మహావైభవముతో స్వామి సన్నిధికి గొంపోయిరి. తర్వాత నర్చకులు వరదుని తీర్థప్రసాదములు, శఠకోప మును రామానుజుల కనుగ్రహించిరి. వరదరాజులును వారికి "యతిరా" జని యర్చకముఖమున బిరుదము ననుగ్రహించి వారికై ప్రత్యేకముగ తమ యావరణమున నొక కట్టడమును మఠముగా నుపయోగింపు మని కాంచీపూర్ణుల ద్వారమున నప్పగించిరి.

మఠమున ప్రవేశించిన యతిరాజును జగద్గురువుగనే తలంచి యా నగరవాసు లందరు యథోచితముగ పూజించి తమ జన్మములు సార్థ కము గావించుకొనిరి. రామానుజులు గూడ నా మఠమున నివసిం చుచు తమయొద్దకు వచ్చిన భక్తజనుల కనేకపారమార్థిక విషయములు బోధించుచు వరదుని కైంకర్యముతోను, తపశ్చర్యతోను వేదవేదాంత గ్రంథావలోకనముతోను కాలము గడుపసాగిరి.

## గురువు శిష్యుడగుట

కేశవయజ్వ తన పుత్రికను పురుషమంగళ మను నగ్రహారమున ననంతదీక్షితు డను వాని కిచ్చెను. ఆ దంపతులకు భరతుని యంశమున దాశరథి యను సుతు డుద్భవించెను. పూవు పుట్టగానే పరిమళించు నన్నట్లు దాశరథిని బాల్యమునుండి సకల సద్గుణములును తామే వలచి వచ్చి వరించెను. ఉపనీతుడై యాతడు వేదవేదాంతములందు గూడ తగిన పాండిత్యము సంపాదించెను. హరిభక్తిపరాయణుడైన దాశరథి

తన మేనమామయగు రామానుజుల కీర్తిప్రఖ్యాతులు దిగ్దిగంతముల నాక్రమించుట విని తాను గూడ వారి శిష్యత్వమంగీకరించుటకు కంచి చేరెను.

కూర మను గ్రామమున ననంతభట్టు సర్వశాస్త్రార్థకోవిదుడు. ఆయనకు కూరేశు డను కుమారుడు శ్రీరాముని యంశమున నుద్భవించెను. వారినే కూరనాథు లని, కూరత్తాళ్వారని గూడ నందురు. ఆయన గూడ యతిరాజు గుణగణములచేతను హరిభక్తి పారమ్యముచేతను నాకర్షితుడై వారి నాశ్రయించెను. కూరేశుడును, దాశరథియును యతిరాజును కుడియెడమ భుజములవలె నెప్పుడు నెడబాయక కాపాడుచుందువారు. రామానుజులు వా రిరువుర కనేక శ్రీవైష్ణవ సంప్రదాయ గూఢార్థము లుపదేశించువారు.

ఒకనాడు లక్ష్మణార్యులు తమ మఠమున హరిభక్తి నుపన్యసించుచుండిరి. అపుడు వారి పూర్వాశ్రమ గురువు యాదవప్రకాశుని తల్లి యా దారిని పోవుచు వారిని చూచుట తటస్థించెను. ఊర్ధ్వపుండ్రధారియై సాక్షాచ్ఛ్రీమన్నారాయణుని వలెనే ధగధగ వింత తేజముతో ప్రకాశించు రామానుజులను దర్శించి యామె యెంతో యబ్బురపడి భక్తితో వారికి నమస్కరించెను. వారివద్ద కూర్చొని వా రుపన్యసించు హరిభక్తి రసామృతమును తమితో పానము చేయసాగెను. "అయ్యో, విష్ణుభక్తులలో నగ్రేసరుడగు నీ మహాత్మునా నా కుమారుడు వివేకశూన్యుడై యీర్ష్యచే చంపదలచినాడు! దీనిచే తానెంత యప్రతిష్ఠ పాలగునో గూడ నాత డాలోచింపలేక పోయెను గదా" యని యామె మిగుల విచారించెను. తన కుమారు డీ యతిరాజు నాశ్రయించి హరిభక్తిపరాయణుడైన గాని యాతని పాపమునకు నిష్కృతి లేదని యా తల్లి తలచెను.

ఆమె యిల్లు చేరి యాదవునితో ననెను. "కుమారా, నీకు శిష్యత్వము చేసిన రామానుజులు సామాన్యులు కారు సుమా! సాక్షాత్తుగా శ్రీమహావిష్ణువే యా రూపమున నీ యిల నవతరించి యుండనోపును. కాకున్న నట్టి యలౌకిక తేజఃప్రభావము నితరుల కెట్లబ్బును? కాన నీ యవివేకము నిప్పటికైన వదలి నీవు వారియెడ లోగడ నొనర్చిన ఘోరాపచారమునకు పశ్చాత్తాపము చెంది వారిని గురువుగా

నాశ్రయించి విష్ణుభక్తుడవై తరింపుము. వరదరాజస్వామితో నిత్యసం భాషణభాగ్యమునకు నోచుకున్న కాంచీపూర్ణులంతటి మహాభక్తులు గూడ రామానుజులను గౌరవించుచున్నారన్న మన మొక లెక్కయా? బ్రహ్మరుద్రాది దేవతలును నారదపరాశర వ్యాసాది ఋషులును విష్ణువునే కొలిచి ముక్తి నంది రనునది గూడ నీ వెరిగిన విషయమే గదా! కాన తల్లి నగు నామాట విని బాగుపడుము."

యాదవప్రకాశునకు మంచి కాలము సమీపించుటచే కాబోలు తల్లి హితబోధ వెపుకు కొంత మనసు మొగ్గెను. కాని తనకు శిష్యుడయిన వానిని తాను గురువుగ నాశ్రయించుటయా యను నభిమాన మడ్డు తగిలెను. కింకర్తవ్యతా విమూఢుడై యాత డా రాత్రి ప్రక్కపై నొరగెను. నిద్రపట్టగనే దేవరాజస్వామి యాతనికి స్వప్నగతుడై "వత్సా, నేటికైనను నీవు మేల్కొని నా చరరూప మగు రామానుజు నాశ్రయింపుము. దాన నీ చేసిన పాపము లన్నియు నగ్నిలో పడిన తూలరాశి వలె దగ్ధ మయి పోవును. సందియము వలదు" అని తన దక్షిణ వరదాభయహస్త ముద్రిక ననుగ్రహించెను. ఉదయముననే మేల్కాంచి యాదవుడు తల్లికి నమస్కరించి స్వప్నవృత్తాంతము నివేదించెను. చివరిసారిగా నాయన తన మనస్సంతృప్తికై కాంచీపూర్ణులవద్ద కేగి వారి నిట్లు ప్రార్థించెను– "భక్తాగ్రేసరా, నే నొక విషయమున స్వయం నిర్ణయమునకు రాలేకున్నాను. నాపై దయ యుంచి వరదునికి నా ప్రార్థన నివేదించి వారి నిర్ణయము నా కెరుక పరపుడు."

కాంచీపూర్ణులును అట్లే, "అదెంత భాగ్య" మని పలికి స్వామి సన్నిధికి, వెడలి యాదవప్రకాశుని విషయము వివరించిరి. స్వామియు ఫక్కున నవ్వి "ఈ మాత్రమునకు యాదవున కింత యాలోచన యేల? ఆతని తల్లి నిర్ణయమే నా నిర్ణయము గూడ. వెంటనే రామానుజుల నాశ్రయింపు మని నామాటగా చెప్పు" మని పల్కెను. అదే సంగతి కాంచీపూర్ణులు యాదవప్రకాశున కెరింగించిరి.

నూటికి నూరుపాళ్ళు తన సందియము లన్నియు పటాపంచలు కాగా యాదవప్రకాశుడు మాతృదేవికి నమస్కరించి యతిరాజుల మఠమున కేగి వారి పాదములపై బడెను. రామానుజులును నాయనను లేవదీసి విషయము వారివలన సావకాశముగా విని యాయన యార్తికి

కరగి సంతుష్టులై పంచసంస్కారాదుల ననుగ్రహించి గోవిందదాసుడని వైష్ణవ నామ మిడిరి. సమస్తవైష్ణవ గ్రంథరహస్యముల నాయన కుప దేశించిరి.

ఈ రీతిగా గోవిందదాసు రామానుజపాదపద్మసమాశ్రయణముచే పూర్వము హరిని నిందించిన తనపాపము దూర మగునట్లు హరిచింత నములోనే కాలక్షేపము చేయసాగెను. పూర్వము తాను వైష్ణవయతు లను దూషించిన పాపము పరిహార మగునట్లుగా యతిధర్మసముచ్చయ మను నొక గ్రంథము రచించెను. అందు సర్వశాస్త్రములు సంగ్ర హించి శ్రీవైష్ణవులగు త్రిదండి సంన్యాసు లనుసరించవలసిన విధానము లన్నియు వర్ణించెను. కొంతకాలము యతిరాజసేవలో గడిపి యాతడు పరమపదము చేరెను.

# శ్రీరంగగమనము

శ్రీరామానుజు లీవిధముగ శ్రీహరిపారమ్యమును వెలువరించుచు కాంచీపురమును మహావైభవాన్వితము చేయుచుండిరి. ఆ కాలమున శ్రీవైష్ణవమతమునకు మూలకేంద్రము శ్రీరంగ మని తెలిపి యుంటిమి గదా! శ్రీయామునార్యాస్తమయముచే చంద్రుడు లేని చుక్కలవలె నా నగర మందలి శ్రీవైష్ణవు లందరు తేజోవిహీనులయిరి. ఆ పరిస్థితి యందరకును దుర్భరమే యయ్యెను. కాన వారందరును కలసి రాజు లేని రాజ్యమువలె నిక యామునార్యుని మతము నాయకుడు లేకుండ నుండరా దని తీర్మానించుకొనిరి. కాన కాంచీపురమున విశిష్టాద్వైత సంప్రదాయమున కేకైక గురువుగా వెలుగొందుచున్న శ్రీరామానుజు లను శ్రీరంగమునకు పిలిపించి తమ మతమున కధిపతిగా చేసి తీరవలె నని నిర్ణయించిరి.

యామునార్యులపుత్రులు వరరంగార్యులు పితృకృపాపాత్రులైరి. కాననే వారు తండ్రిగారియందు గురుత్వప్రతిపత్తి నిలిపి ద్రావిడ వేదాంత రహస్యములు వారివద్దనే సంపూర్ణముగా తెలిసికొనిరి. వారు దేవగాన మందు గూడ ప్రవీణులు. వీరు గాక మరి నలుగురు శిష్యులు వారివద్ద సర్వవేదాంత విషయములు పూర్తిగ నభ్యసించిరి. వారు మహాపూర్ణులు, గోష్ఠీపూర్ణులు, శ్రీశైలపూర్ణులు, మాలాధరనంది అనువారు. వీరికే పంచాచార్యులని ప్రసిద్ధ వ్యవహారముగలదు. ఈ నలుగురును కలసి

యితరవైష్ణవప్రముఖులతో సమాలోచనలు జరిపి వరరంగార్యులను కాంచీ పురికి వెడలి రామానుజుల నెట్లయినను శ్రీ రంగమునకు వెంట నిడుకొని రం డని ప్రార్థించిరి. వరరంగమునియు వారిమాట కాదనలేక కంచికి బయలు దేరిరి.

కంచికి చేరి వరరంగముని యతిరాజులను చేరి నమస్కరించి వారికి శ్రీరంగవాసు లగు వైష్ణవప్రముఖుల ప్రార్థన నిట్లు వినిపించిరి– "స్వామీ, శ్రీరంగక్షేత్రమును మన గురువర్యులు యామునార్యులు నిత్యనివాసముగా చేసికొని విశిష్టాద్వైతసంప్రదాయము నెంత వృద్ధిలో నికి తెచ్చినదియు మీ రెరుగని విషయము కాదు. అట్టి దివ్యక్షేత్రము నేడు యామున దివాకరాస్తమయముచే నెంత నిస్తేజమై యున్నదో యెట్లు వర్ణింపగలము? కాన తాము శ్రీరంగమును నివాసము చేసి కొని శ్రీయామునముని పాలించిన గురుపీఠ మధిష్ఠించి తన్మఠాధిపతులై మమ్ముల నందరను రక్షింపక తప్పదు."

అందుకు వారు "నేను వరదరాజస్వామిదాసుడను. చిరకాలము నుండి యిచటనే వారి రక్షణలో సుఖముగా కాలము పుచ్చుచున్నాను. కాన వారి యనుమతి లేనిదే యిటనుండి కదల జాలను" అని పలికిరి. వర రంగమునియు తనకు గల దేవగానచాతురితో వరదరాజస్వామిని మెప్పించి "శ్రీరామానుజులను తమవెంట శ్రీరంగము పంపి వైష్ణవమత మూల పీఠమగు శ్రీరంగమునందలి యామునార్యమఠమును రక్షింపు" మని ప్రార్థించిరి. వారి యపూర్వగానవాహినిలో తమ డెందము ప్రవహించి పోగా నొడ లెరుగక స్వామియు నట్లేయని యొప్పుకొనెను.

కాని వరదుని వదలి వెళ్ళుట రామానుజులకు కష్టమే యయ్యెను. పుట్టింటినుండి క్రొత్తగా నత్తింటికి వెడలు నవవధువువలెనే వారి మనస్సు కంచిని వీడిపోనిచ్చగింపదయ్యెను. అయినను తప్పని సరి యని సరిపెట్టుకొనియు, శ్రీరంగము యామునార్యశిష్యులనుండి గూఢ మైన యనేకసంప్రదాయ విషయములు తెలుసుకొనవచ్చు ననియు, లేని యుత్సాహము తెచ్చిపెట్టుకొని యతిరాజు వరరంగార్యుల వెంట బయలు దేరిరి. కూరేశదాశరథులు నితరాంతరంగిక శిష్యులు వారిని వెంట నంటిరి.

# శ్రీరంగనివాసము

కలికల్మషశోషిణి యగు కావేరిని సమీపింపగనే శ్రీయతిపతి పులకాంకితులైరి. వెంటనే ప్రసన్న సలిలయగు నా పుణ్యతరంగిణిని తాపత్రయము వాయ గ్రుంకు లిడి యూర్ధ్వపుండ్రములు దాల్చిరి. సంధ్యాదికృత్యములు నిర్వర్తించుకొని మంత్రరాజము జపించుకొనుచు సుఖాసీనులైరి. ఈ దిగ్విజయవార్త తనవారికి ముందుగ తెలియ జేయుటకు వరరంగముని యామునమఠమున కేగిరి. రామానుజులు విచ్చేయుచున్నారన్న వార్త విని ముందుగ మాహాపూర్ణు లెదురేగి కుశలప్రశ్నలు చేసిరి. దేవాలయాధికారులు శ్రీరంగని ఛత్రచామ రాదులను వెలికి తీసిరి. గజతురగాదులతో నూరేగింపు కేర్పాట్లు జరిగెను. శ్రీవైష్ణవులు మాత్రమే గాదు, శ్రీరంగక్షేత్రమే శ్రీ యతి పతి కెదు రేగెను. శ్రీమద్రామానుజుల దివ్యమంగళవిగ్రహమాధురిని కన్నులార నాస్వాదించి సర్వులును సంభ్రమానందాశ్చర్యముల మునిగి తేలిరి!

దిగ్విజయమున కేగి రాజధానీనగరమున కేతెంచిన మహారాజువలెనే యతిరాజు వాచామగోచరమహావైభవముతో శ్రీరంగధామము ప్రవేశిం చిరి. భేరీకాహళాదిమంగళ వాద్యధ్వనులు కర్ణభేరులు బ్రద్దలు సేయగా ఛత్రచామరాదులు ధరించి స్వామివారి యర్చకపరిచారకులు తమ నను గమింపగా, నుభయ వేదాంతపారంగతులగు భాగవతోత్తములు వేదగాన ములతో శ్రుతిమధురముగ దిగ్దిగంతములను ముఖరితము చేయుచుండగా వారు ముందుకు సాగిరి.

క్రమముగా నా యుత్సవము సప్తప్రాకారములను దాటి గర్భా లయము ప్రవేశించెను. రంగనాథుని దర్శించిన రామానుజులకెంత యానందము లభించెనో యంతకు పదిరెట్లు సంతోషముతో యతిప తిని గాంచిన రంగపతి యుబ్బితబ్బిబ్బయిరి. యతిపతి ముఖకువలయము శ్రీరంగనాథపూర్ణశశాంకునిచే వికసింపగా యతిపతిముఖచంద్రోదయముచే రంగనాథసముద్ర మానందతరంగితమై యతివేల మాయెను. అప్పటి వారిరువురి మానసికస్థితిని వర్ణింప నాబోటి వాని కెట్లు సాధ్యము?

ఇట్టి మహదానంద సంధానకారకులు తమ గురూత్తములు మహా పూర్ణులే గదా యని యతిరాజు హర్షనిర్భరులై వారి పాదములకు

సాష్టాంగదండప్రణామ మాచరించి మరి లేవక యట్లే నేలపై బడి యుండిరి. మహాపూర్ణులు లక్ష్మణార్యులను వాత్సల్యముతో లేవనెత్తి యిట్లు పల్కిరి— "వత్సా, నీవు సామాన్యుడవు కావు, కలియుగారంభమున నజ్ఞానాంధకారమున కన్నుగానక కొట్టుమిట్టాడుచున్న జనసమూహము నుద్ధరించుటకు కంకణము కట్టుకొని శఠకోపు లవని నవతరించిరి. ఎంతో ప్రయత్నించియు వా రాపని తమవలన కాజాల దని నిర్ణయమునకు వచ్చి చింతార్ణవ నిమగ్నులైరి. అపుడు వారి మనఃఫలకమున దివ్యతేజోమండల మొకటి గోచరించెను. క్రమముగ నది సర్వసంగ పరిత్యాగియు జగత్కల్యాణైకకాంక్షియు మహార్తిసంపన్నుడు నగు నొక మహామునిరూపము దాల్చెను. అనిర్వచనీయమగు నా తేజోరాశిని జ్ఞానచక్షువున పొడగని భక్తిపారవశ్యముచే నొడలు మరచి వారీ పాశురము పాడిరి—

"పొలిక పొలిక పొలిక పోయిత్తు వల్లుయిర్ చాపం
నలియుం నరకముమ్నైంద నమను క్కింగి యాదొన్ను మిల్లై
కలియుం కెడుం కండుకొణ్మిన్ కడల్ వణ్ణన్ పూదంగల్ మణ్ మేల్
మలియ ప్పగుం దిశై పాడియాడి యులిదర క్కండోమ్."

భవిష్యత్తున నొక మహాపురుషు డీ యిల నవతరించును. ఆ మహాత్ముడే కలివిషాక్రాంతులగు నీ మానవుల నుజ్జీవింపజేయ సమర్థుడగును. సందియము లేదు. అపుడు కలినామ రూపములు లేకుండ రూపరిపోవును. జనులారా! నా యీ మాట మీరు తప్పక మనమున నమ్ముడు. ఆ మహామానవుని యధీతిబోధాచరణ ప్రచారములచే నీ యిల భాగవతసంపత్సమృద్ధమగును.

నమ్మాళ్వారు లట్లానందపరవశులై పాడినది నిన్ను గూర్చియే యని నా కిప్పుడు దృఢపడినది. కాన నిచట నీవు సుఖముగా చిరకాలము నివసించి సర్వవిధకైంకర్యములచే శ్రీరంగనాథుని సేవించుచు భాగవతోత్తములచే సేవలు గొనుచు ప్రాకృతజనుల యజ్ఞానాంధకారమును సమూలముగ పోకార్చి శ్రీశఠకోపసూరి భవిష్యద్వాణిని ధ్రువపరపుము.

గురువు తమపై నంత గొప్ప నమ్మకము కలిగి యున్నందులకు రామానుజు లెంతో యానందించిరి. వారువినయముతో "గురూత్తమా! మీరందరును నాపై నిడిన యీ మహాభారము సామాన్యమానవుడ నగు నే నెంతవరకు భరించి మీ మహదాశయము నెరవేర్చగలనా యని

జంకు వొడముచున్నది. అయిన మీ యాశీస్సులే నా కిట్టి శక్తి సామ ర్థ్యముల నొసగుగాక! నా శక్తివంచన లేక తప్పక మీ యాజ్ఞ నొదల దాల్తును'' అని మహాపూర్ణులకు విన్నవించిరి. శ్రీరంగనాథుని తీర్థప్రసా దములను శఠకోప నిర్మాల్యములను నర్చకస్వాములు యతిపతి కొసగిరి. రామానుజులు వానిని భక్తితో స్వీకరించి యనంతశిష్యసంఘము తమ రిని గొలువ మఠమునకు వెడలిరి. యతిరాజు లచటనే శుశ్రూషువు లగు వైష్ణవులకు పరమార్థరహస్యముల నుపదేశించుచు శ్రీరంగనాథ కైంకర్యముతో నిశ్చింతగా కాలము వెళ్ళబుచ్చసాగిరి.

## గోవిందుడు మరల వైష్ణవు డగుట

రామానుజుల పినతల్లి కుమారుడు గోవిందుడు శివ పూజాపరుడై కాళహస్తిలో కాలము గడుపుచుండెను గదా! ఆతనిని మరల వైష్ణవమత ప్రవిష్టుని చేయవలె నని రామానుజులు తమ మాతులుడు శ్రీశైల పూర్ణు లకు తిరుపతికి వార్తను పంపిరి. వారును తమ శిష్యుని ప్రార్థనాను సారము కాళహస్తి చేరిరి. శైవులతో కలసి సంచరించుచు శివపూజలో కాలము గడుపుచున్న గోవిందుని వైష్ణవుని చేయుట యెట్లాయని వారు చింతింపసాగిరి.

ఒకనాడు గోవిందు డొంటరిగా శివనామ ముచ్చరించుచు శివపూజా ద్రవ్యములగు మారేడు దళములు, గన్నేరు పువ్వులు చేతబట్టుకొని కాళ హస్తీశ్వరుని యాలయమున కేగుచుండెను. అపుడు శ్రీశైల పూర్ణులు తనవెంట వచ్చిన శిష్యులకు పరమార్థోపదేశము చేయుచుండిరి. రుద్రా క్షమాలలు ధరించి పంచాక్షరీజపపరాయణుడై భస్మావలిప్త దేహుడైన తన మేనల్లుని చూచి వారు మనమున చాల విచారించిరి. గోవిం దుని తమవద్దకు పిలిచి "నాయనా, వైష్ణవులము గదా, పరధర్మమగు శైవము నాశ్రయించితి వేల.''

"స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః''

అను గీతాసూక్తి నీకు తెలియనిదిగాదు గదా! సర్వము నెరిగినవా డవు నీవే యిట్లు చేయనగునా'' యని మందలించెను.

క్రిందటినాటి రాత్రియే కాళహస్తీశ్వరుడు గోవిందునకు కలలో కాను పించి "కొంత కాలము నీవు నాభక్తుడవై నా పరిచర్య చేసితివి. ఇక చాలును. రేపు నీమేనమామ శ్రీశైలపూర్ణులు నీ వద్దకు రాగలరు. వారి నాశ్రయించి పంచసంస్కారములు పొంది మరల శ్రీవైష్ణవుడ వగుము. నీకు సర్వము శుభము కాగలదు" అని యాదేశించెను. దానితో నాతని మనస్సున కొంత సంచలనము కలిగెను.

ఇపుడు శ్రీశైలపూర్ణుల ప్రబోధముచే గోవిందుని మనస్సు పూర్తిగా మారి తన కులదైవ మగు విష్ణువు వైపుకు మరలెను. వెంటనే గోవిం దుడు మెడనున్న రుద్రాక్షమాలికలు త్రెంపి దూరముగ పారవైచి మేన నలదిన విభూతి చెఱపివైచెను. శ్రీశైలపూర్ణుల పాదములపై బడి తన యీ మహాపరాధము క్షమింపు మని ప్రార్థించెను. శ్రీశైలపూర్ణులును గోవిందుని లేవనెత్తి తమతో తిరుపతి తీసికొని పోయి పంచ సంస్కా రముల ననుగ్రహించి వైష్ణవ దీక్షితుని గావించెను. తర్వాత నాతనికి మంత్రమంత్రార్థముల నుపదేశించి ద్రావిడ వేదాంతమును గూడ బోధిం చెను.

గోవిందుని వైష్ణవమత ప్రవిష్టుని చేసి తిరుపతికి తీసికొనివచ్చితి నని రామానుజులకు శ్రీశైలపూర్ణులు వార్తనంపగా వారు మిగుల నానం దించిరి.

## మంత్రరాజలాభము

ఒకనాడు యతిపతి మహాపూర్ణుల యింటి కేగి వారి పాదముల కెరగి ద్వయమంత్ర ముపదేశింపుమని ప్రార్థించిరి. వారు నట్లే అతని ననుగ్రహించిరి. తరువాత రామానుజు లిట్లు కోరిరి. "ఆచార్యోత్తమా! యామునార్యులను సందర్శింప నైతినే యను విచారము మీ సద్గోష్ఠితో నాకు దూర మయినది. వారు రచించిన గ్రంథము లుపదేశించి నన్నను గ్రహింపుడు." మహాపూర్ణులు తమ గురువు రచించిన గీతార్థ సంగ్రహము, సిద్ధిత్రయము, ఆగమప్రామాణ్యము మొదలగు గ్రంథము లన్నియు వారి కుపదేశించిరి. తర్వాత శిష్యుని కోరికపై వ్యాసరచిత బ్రహ్మసూత్ర ములు పాంచరాత్రాగమము గూడ నుపదేశించిరి. హరిభక్తాగ్రేసరులగు రామానుజులను పరిపూర్ణజ్ఞానవంతులగు సదాచార్యులుగ భావించి మహా పూర్ణులు తమ కుమారుడు పుండరీకాక్షుని వారికి శిష్యునిగా నొనరించి ధన్యులైరి.

ఒకనాడు మహాపూర్ణులు యతిపతితో "వత్సా, గోష్ఠీపురమున గోష్ఠీపూర్ణులను వారు కలరు. ఆయన ఆత్మజ్ఞానియును మహాపండితులునునగు హరిభక్తాగ్రేసరులు. వారు నా సతీర్థ్యులై యామునార్యులనుండి యనేక మహత్తర పారమార్థిక విషయములను సంగ్రహించిన కుశాగ్ర బుద్ధులు. నీ వేగి వారి శుశ్రూషచేసి వారివద్దనున్న రహస్యార్థము లన్నియు సంగ్రహించి నీ జ్ఞానమును విశాలముగను పరిపూర్ణముగను చేసికొనుము" అని పలికిరి.

తమ గురువు నానతి ప్రకారము రామానుజులు వెంటనే గోష్ఠీపురమున కరిగిరి. వారికి సాష్టాంగదండప్రణామ మాచరించి తన పరిచయము కావించుకొని "స్వామీ! నేను రామానుజదాసుడను. మహాపూర్ణులశిష్యుడను. మహాపూర్ణులు పంపగా తమరి నాశ్రయింప నేతెంచినాను. దయతో మంత్రమంత్రార్థములను, నితరదుర్లభపరమార్థ విషయములను నాకనుగ్రహింపవేడుచున్నా" నని ప్రార్థించిరి.

గోష్ఠీపూర్ణులు రామానుజుల వినయసౌజన్యసౌశీల్య సంపదకు మిగుల నలరిరి. కాని శిష్యుని యధ్యవసాయము తెలిసికొననిదే వెంటనే యుపదేశింపరాదని వారి నిర్ణయము. కాన వారు-- "ఈ కలికాలమున మంత్రమంత్రార్థగ్రహణమునకు తగిన యధికారి కానిపించుటలేదు. కాన నీకు వాని నె· ట్లుపదేశింపగలను" అని పలికెను. 'అయ్యో, నా కోరిక తీరదాయె గదా' యని హతాశులై రామానుజులు శ్రీరంగమునకు మరలిరి.

అయినను వారు మంత్రగ్రహణమం దాశవీడలేక పదునెనిమిది మారులు పాదచారులై గోష్ఠీపూర్ణులవద్ద కేగిరి. అన్నిమారులును గోష్ఠీపూర్ణు లేదో యొక సాకుతో వారిని పంపివేసిరి. చివరిసారిగా శ్రీరంగమునకు గోష్ఠీపురమునుండి తిరిగి వచ్చిన రామానుజులు 'అయ్యో, ఎంత యత్నించినను నాకోరిక తీరదాయె గదా' యని శోకసమాకులులై నిద్రాహారములు గూడ విసర్జించిరి. ఈ వార్త దేశదేశములందును వ్యాపించినది. గోష్ఠీపూర్ణులకు గూడ నీ విషయ మెట్లో తెలిసెను. శిష్యుని యధ్యవసాయము దృఢమయిన దని వారికి నమ్మకము కలిగి "త్రిదండోపవీతములతో మాత్రము తన వద్దకు మంత్రోపదేశము పొందుటకు ర"మ్మని వారు రామానుజులకు వార్త నంపిరి.

ఈ శుభసమాచారము వినగానే యతిపతి పొంగిపోయి కూరేశ దాశరథులను వెంటగొని గోష్ఠీపూర్ణులవద్ద కేగి "స్వామీ! ఇప్పటికై నను తమ దయాలేశము నాపై ప్రసరించినందుకు చాల సంతోషముగా నున్నది. కాన వెంటనే మంత్రరాజ ముపదేశించి నన్ను ధన్యుని చేయుడు" అని ప్రార్థించిరి.

"ఏమయ్యా, ని న్నొంటిగా రమ్మంటిని గదా! ఈ యిద్ద రెవరు? వీ రుండగా నీ కెట్లు మంత్ర ముపదేశించుట?" యని గురువు కోపించెను. "ఆచార్యా, త్రిదండోపవీతములతో రమ్మనిన తమ యాజ్ఞను మీరకుండనే వచ్చినాను. వీరిరువురు నాకు దండోపవీతప్రాయులే" యని పలికిరి. "అయిన వీరిలో త్రిదండ మెవరు? యజ్ఞోపవీత మెవరు?" అని గోష్ఠీపూర్ణులు మరల ప్రశ్నించిరి. "కూరేశుడు నా జన్నిదము, దండము దాశరథి" అని వారు సమాధాన మిచ్చిరి. "అయిన నీ యిద్దరకు మాత్రమే నీవు నే నుపదేశించు మంత్రము చెప్పవచ్చును. మ రెవ్వరికి నుపదేశింపరాదు సుమా?" యని పలికి వారి నేకాంతప్రదేశమునకు గొని పోయి, యితరు లెవరికిని నీ మంత్ర ముపదేశింపనని బహువిధశపథములు వారిచే చేయించుకొని వారికి నారాయణాష్టాక్షరీమంత్రరాజము నర్థ సహితముగా నుపదేశించెను. యతిరాజును నా మంత్రరాజ లాభముతో నానందపరవశులై ప్రదక్షిణ నమస్కారాదుల చేతను దక్షిణాదులచేతను వారిని సత్కరించి వీడ్కొని శ్రీరంగ మేగుదెంచిరి.

పుట్టుకతోనే విశాలహృదయులును లోకసంగ్రహ పరతంత్రులునునగు రామానుజుల హృదయము మంత్రలాభముచే మరింత విశాలమయ్యెను. జన్మజరామరణాది దుఃఖములచే కొట్టుమిట్టాడుచున్న ప్రజలకు ముక్తిమార్గముపదేశింపవలెనను కోరిక వారికి ప్రబలమయ్యెను.

"ఆచినోతి హి శాస్త్రార్థా నాచారే స్థాపయత్యపి,
స్వయ మాచరతే యస్మాత్తస్మా దాచార్య ఉచ్యతే."

శాస్త్రములలోని విషయములను లెస్సగా తెలిసికొని తా నితరులకు బోధించుటయే గాక తాను గూడ వాని నాచరించువాడే యాచార్యుడు. 'గు' అనగా నంధకారము 'రు' అనగా దాని నడ్డగించువాడు అని యర్థము. అజ్ఞానాంధకారము ప్రజలహృదయములందు ప్రవేశించకుండ

నాపువాడే గురువు అను శాస్త్రోక్తుల ననుసరించి వారు తా మెరిగిన పరమార్థవిషయములను తా మాచరించి యితరుల కెరుక పరచుటకే నిశ్చయించిరి. కాననే తాము తమ గురువుకు చేసిన శపథములను గూడ లెక్క చేయక వారు వెంటనే యా నగరమందలి నరసింహస్వామి యాలయ గోపురశిఖర మారోహించి యుచ్చైఃస్వరముతో గోష్ఠీపూర్ణులు తమ కుపదేశించిన మంత్రరాజ ముత్సవసమాగతు లైన వైష్ణవు లందరకు నుపదేశించిరి. నాటినుండియే వారు రామానుజాచార్యులని సార్థక నామధేయులైరి. వా రొక్క రే నిజమున కాచార్యశబ్దార్హులు. ఇతరుల యెడ నాచార్యనామము నేతి బీరకాయ వంటిదే!

ఈ విషయము గోష్ఠీపూర్ణులకు తెలిసినది. పరుగుపరుగున వారు యతిరాజువద్దకు వచ్చి "ఏమి శిష్యా, ఎట్టి గురుద్రోహ మాచరించితివో తెలియునా?" యని నేత్రాంతముల కెంపుగదుర పలికిరి. 'అవును. గురువర్యా, నిస్సందేహముగా నేను గురుద్రోహినే' అని రామానుజులు సమాధాన మిచ్చిరి. "అయిన గురుద్రోహికేమి దుష్టఫలమో నీకు తెలి యకయే యిట్టి ఘోరపాప మాచరించుట కొడిగట్టితివా?" యని గురువు మరల ప్రశ్నించిరి; "గురుద్రోహికి నరకమే గతి యని నిస్సం దేహముగా నే నెరుగుదును" అని రామానుజులు సమాధాన మిచ్చిరి. "మరి నీవిట్టి ఘోరపాపమున కేల ఒడిగట్టితివి?" అని ఆచార్యు డడుగ "నాయీగురుద్రోహముచే ననేక చేతనులు తరింపనుండగా నే నొక్క డనే నరకకూపమున బడిననేమి?" మీ యాజ్ఞ నుల్లంఘించి మంత్ర ముపదేశించిన నా కొక్కనికే నరకము లభించును గాని యా మంత్ర ముపదేశ మందిన వారందరకును ముక్తి కరతలామలక మగుటలో సంది యము లేదు గదా యని తలచి నే నిట్టి సాహస మాచరించితి" నని జంకుచునే యతిరాజు సమాధాన మిచ్చిరి.

లక్ష్మణార్యుల యీ సమాధానము గోష్ఠీపూర్ణులకు మిక్కుటమగు నానంద మిచ్చెను. వారు సంతోషాతిశయముతో శిష్యుని బిగువుగా కౌగ లించుకొని "నాయనా, నీపాటి జ్ఞానమును, దూరదృష్టియును, విశాల హృదయమును నాకు లేకపోయినవి గదా!" యని నొచ్చుకొనిరి. నా కన్నులు తెరపించిన నీవు "ఎంబెరుమానారువు" అని అభినందించిరి. నాకు నాథుడ వని యా మాట యర్థము. నాటినుండి వారికి

గోష్ఠీపూర్ణు లచట నున్న జనులతో "రామానుజుల యీ మహాత్యాగమహిమచే నేటినుండి వైష్ణవదర్శనము రామానుజదర్శన మనుపేర బరగ గలదు" అని యుద్ఘోషించిరి. కాన నాటినుండియు వైష్ణవ సంప్రదాయము రామానుజ సంప్రదాయ మని ప్రసిద్ధి గాంచెను.

తర్వాత రామానుజులను గోష్ఠీపూర్ణులు చాటునకు పిలిచి "యింత కంటెను పరమగోప్య మగు మంత్రము నీ కుపదేశింప దలచినాను. కాని దాని నితరుల కెంత మాత్రము నుపదేశింపరాదు సుమా" యని పలికి గీతాచరమశ్లోకము నుపదేశించి వారికి తమ కుమారు డగు సౌమ్యనారాయణుని శిష్యునిగా చేసి కృతకృత్యులైరి.

## కూరేశదాశరథుల యోగ్యత

తిరుమంత్రమును గోష్ఠీపుర గోపుర మెక్కి రామానుజులందర కుపదేశించినపుడే కూరేశదాశరథులు దానిని పొందిరనవచ్చును. తదనంతరము చరమశ్లోకము నుపదేశింపు డని రామానుజులను కూరేశుడు ప్రార్థించెను. కాని యతిరాజు---

"సంవత్సరకాలము పూర్తిగా శుశ్రూష చేసినవారికే యీ మంత్ర ముపదేశింపవలె నని గుర్వాజ్ఞ. కాన నిది పొందగోరినచో నీవు గూడ నంతకాలమును శ్రద్ధాపూర్ణుడవై గురుశుశ్రూష చేయకతప్ప" దని పలికెను. "గురూ, శరీర మస్థిరమని తెలిసికూడ సంవత్సరకాల మెట్లు సహింపగల" నని కూరేశుడు సమాధాన మిచ్చెను. అట్లే యయిన నొక మాసము దినములు శుష్కోపవాసదీక్ష బూనిననే నీ కది లభ్యము కాగల" దని యతిరాజు వచించిరి. వారి యాదేశానుసార మెంతో క్లేశకర మయినను నెలదినము లుపవాస దీక్ష వహించి యనంతరము కూరేశులు రామానుజులచే చరమశ్లోకము సంపాదించిరి.

తర్వాత దాశరథి "గురువర్యా, నాకు గూడ చరమ శ్లోక ముపదేశింపు"డని యర్థించెను. నేను కూరేశున కొక్కనికే యీ మంత్ర ముపదేశింతు నని వాగ్దానము చేసినాను. దానిని మీరుటకు వీలు లేదు. కాన నీవు నేరుగా గోష్ఠీపూర్ణుల వద్దకే యేగి వారి శుశ్రూషచే నా మంత్రము సంపాదించుకొనుము" అని రామానుజులు బదు లిడిరి.

లేదు. కాన నీవు నేరుగా గోష్ఠీపూర్ణుల వద్దకే యేగి వారి శుశ్రూషచే నా మంత్రము సంపాదించుకొనుము" అని రామానుజులు బదు లిడిరి. దాశరథియు "సరే" యని గోష్ఠీపూర్ణుల వద్ద కేగి చరమ శ్లోకాభిలాషతో వారి పరిచర్య చేయసాగెను. కాని గురువుమాత్రము సుముఖులు కాలేదు. అయినను నిరాశ చెందక దాశరథి ఆరు మాసములు వారిని సేవించెను.

అప్పటికి గోష్ఠీపూర్ణుల హృదయము కొంత ద్రవించెను. వారు "ఓయీ, నీ వెవరవు? నీ వినయమును, నీ తీరును చూడగా రామానుజుల శిష్యునివలె కనబడుచున్నావు. నిజము చెప్పుము" అని ప్రశ్నించిరి. "స్వామీ, మీ రూహించినట్లే నేను శ్రీ రామానుజాచార్యులవారి దాసుడను. నా పేరు దాశరథి యందురు. వారే నన్ను మీవద్దకు చరమ శ్లోక ముపదేశ మందు మని పంపినారు" అని దాశరథి సమాధాన మిచ్చెను.

"విద్యామదము, ధనమదము, అభిజనమదము-- ఈ మూడును మిగుల చెడ్డవి. కాన నీ వీ మదత్రయవిహీనుడవైన తర్వాత నీ మంత్రమునకై రామానుజులనే శరణు పొందుము" అని పలికి గోష్ఠీపూర్ణులు మరల నతనిని వెనుకకు పంపివేసిరి. దాశరథియు శ్రీరంగము చేరి గోష్ఠిపూర్ణు లానతిచ్చిన విషయము స్వాచార్యులకు నివేదించెను.

మహాపూర్ణుని పుత్రిక యత్తుళ్ళాయమ్మ. ఆమె వివాహమై యత్త వారింటికి వెడలెను. అత్తింటివారు తనను పలుబాములకు పాలు చేయుచుండగా నవి పడలేక పుట్టింటికి వచ్చెను. తల్లిదండ్రులతో తన గోడు చెప్పుకొని యామె "మీరొక నౌకరును నా వెంట పంపనిదే నే నచట కాపురము చేయ జాల" నని వినువారి గుండె లవియునట్లు దుఃఖించెను. తమ కొమరిత దుఃఖమునకు హృదయము కరిగిన మహాపూర్ణులు "నీ సోదరుడు రామానుజులే నీ బాధలు మాన్పగలడు. కాన నాయన వద్ద కేగి నీ గోడు చెప్పుకొను" మని యోదార్చిరి.

గురుపుత్రిక దుఃఖవృత్తాంతము యతిపతికి గూడ బాధ కలిగించెను. చరమశ్లోకముకై తమరిని ప్రతీక్షించుచున్న దాశరథిని వారు "నీ వత్తుళ్ళాయమ్మతో నామెయత్తవారింటి కేగి వారు చెప్పిన పనులు చేయు

అచ్చటనున్న వైష్ణవు డొకనా డొక శాస్త్రవాక్యమునకు వ్యతిరేకార్థము చెప్పదొడగెను. వంటపనిలోనున్న దాశరథి యాయనతో "స్వామీ, మీరు చెప్పిన యర్థము సరికాదని యనుకొందును. సంప్రదాయసిద్ధమగు మరొక యర్థము కలదని విన్నాను" అని పలికెను. 'వంటచేసికొని జీవించు వానికి వేదాంతవిషయము లేమి తెలియును? నక్క యెక్కడ? నాకలోక మెక్కడ? నీ దారిని నీవు పొమ్ము' అని దాశరథి నాతడు ఈసడించి కొట్టెను. కాని దాశరథి యా వాక్యమునకు సరి యగు నర్థము వివరించి చెప్పెను. దాశరథి చెప్పిన యర్థమే సరి అయిన దని అచటివా రందరకు గట్టి నమ్మక మేర్పడెను. "ఇట్టి మహా పండితుడవగు నీ వీ దాస్యవృత్తి యేల అవలంబించితివి?" అని ఆ యింటివా రైక్యకంఠముతో దాశరథిని ప్రశ్నించిరి. "నేను రామానుజుల శిష్యుడను. మద్గురు నియుక్తుడనై మీసేవార్థ మరుగుదెంచితి" నని యాయన సమాధాన మిచ్చెను.

ఆ మాట విని వా "రయ్యో, యిట్టి మహాపండితుని సేవలు గొని పాపము మూటగట్టుకున్నామే" యని పశ్చాత్తాపము చెంది క్షమార్పణ వేడుకొని దాశరథిని యింటికి పొమ్మని ప్రార్థించిరి. కాని "నా గురువు రమ్మని కబురంపనిదే నే నిచటనుండి కదలను" అని యాయన పలికి వారిసేవలోనే కాలము గడుపసాగెను. తమ యింట దాశరథి జరిపిన శాస్త్రార్థ వివరణవిషయము వారు రామానుజులకు వివరించుచు కబురు పంపిరి. అపుడు రామానుజులు మదత్రయహీనుడై దమ మలవరచుకొన్నాడని నిశ్చయించి యాతని పిలిపించి చరమ శ్లోకము నుపదేశించిరి.

తర్వాత రామానుజులు వరరంగార్యుల యింటి కేగి వారి నాశ్రయించి వారి ద్వారా ద్రావిడవేద సర్వస్వమును గ్రహించిరి. వానిని కూరేశ దాశరథ్యాది శిష్యుల కుపదేశించుచు తమ మఠమున నుండిరి.

## భగవద్విషయ లాభము

ఒకసారి గోష్ఠీపూర్ణులు శ్రీరంగమునకు వచ్చిరి. అపుడు రామానుజులు వారికి సాష్టాంగ దండప్రణామ మాచరించి వినతులై వారి యెదుట నిలచి యుండిరి. అపుడు శిష్యునియెడ ప్రీతులై వారు

"మాలాధరార్యుల వలన సహస్రగీతి వ్యాఖ్యానము కాలక్షేపము చేయు (విను) మని" పలికి వెడలి పోయిరి. మాలాధరార్యులకే తిరుమాల యాండాన్ అని నామాంతరము.

రామానుజులు మాలాధరుల నాశ్రయించి శఠకోపుల తిరువాయ్ మొళి యను నామాంతరము గల ద్రవిడభాషలోని శఠకోపగీతి యొక్క వ్యాఖ్యానగ్రంథ మగు భగవద్విషయమును శ్రద్ధాభక్తులతో వినసాగిరి. మాలాధరులు కొన్ని గాథల కర్థము చెప్పిరి. "అరియాక్కాలత్తుళ్ళై" యను గాథకు తమ గురువు చెప్పిన యర్థము వదలి మరొక రీతిగా చెప్పిరి. అది రామానుజులకు నచ్చలేదు. కాన వారు "గురూత్తమా, మీరు చెప్పిన యర్థ మిచట సరి పడదు, దీనికి మరి యొక అర్థ ముండు" నని పలికిరి. "ఏమీ, నా వద్ద చదువుకొనుచు నాకే వంకలు దిద్దబూనుకొన్నావా" యని రామానుజులను కోపపడి మాలాధరులు చెప్పుచున్న విషయము నాపివేసి నడుమనే లేచిపోయిరి.

గోష్ఠీపూర్ణుల కీ సంగతి తెలిసెను. వారు మాలాధరుల వద్దకు వచ్చి "ఏమండీ, రామానుజులకు మీ భగవద్విషయ కాలక్షేపము చెప్పుట మానివేసినా రట, కారణ మేమి?' యని ప్రశ్నించిరి. 'మా గురువు చెప్పనట్లుగనే నే నొక పాశురమున కర్థము చెప్పుచుండగా రామానుజులు దాని కది సరికా దన్నా రని, కాన వారి కా గ్రంథము చెప్పుట మానినా' నని మాలాధరులు పలికిరి. అది విని గోష్ఠీపూర్ణులు "రామానుజులు సామాన్యులు కారు. ఆయన ఆదిశేషుని యవతార మందురు. యామునార్యుల హృదయమే రామానుజులది. వారు చెప్పిన యర్థము యామునార్యులు గూడ చెప్పినారు" అని పలికిరి.

వారి మాట నంగీకరించి మాలాధరులు మరల రామానుజులకు భగవద్విషయము చెప్పసాగిరి. ఆ గ్రంథమున మరల గురుశిష్యుల కభిప్రాయ భేదము లేర్పడెను. అపుడు లక్ష్మణార్యులు "మీరు చెప్పిన యర్థము యామునార్యుల హృదయముకా" దని పలికి తమకు తోచిన యర్థము చెప్పిరి. "ఇదే సరియయిన యర్థమని యామునార్యుల హృదయమని యెట్లు నమ్మనగు" నని గురు వడిగిరి. 'నేను యామునార్యుల కేకలవ్య శిష్యుడను గానా' యని యతిపతి మారు పల్కిరి. గోష్ఠీపూర్ణులు తమతో పల్కినది సత్యమే యని యపుడు మాలాధ

రులకు నమ్మకము కల్గెను. కాన తన కుమారుడగు సుందరబాహూ వను వానిని తమ శిష్యుడు రామానుజులకు శిష్యునిగా జేసి యానందించిరి. అంతే గాదు. వారు రామానుజులకు 'నాయనా, మా గురువు యామునాచార్యులు మాకు బోధించిన పరమార్థవిషయములు నీయందే నిక్షేపింపదగిన వని నాకు నమ్మకము కలిగినది. కాన నీవు వరరంగార్యులవద్ద నున్న గూఢ పరమార్థ విషయములు గూడ గ్రహింపు' మని రామానుజులతో పలికిరి.

## వరరంగాశ్రయణము

వరరంగార్యులు దేవదుర్లభ మయిన తమ నాట్య సంగీతములచే శ్రీరంగనాథుని వినోదింప జేయు మహాభక్తులు. వారు యామునార్యుల సత్పుత్రులు. అట్టివారి వద్దకు రామానుజులు వెడలి క్షీరము కాచి యిచ్చుచు నారు మాసములు వారి శుశ్రూష చేసిరి. ధనుర్మాసోత్సవమున శ్రీరంగశాయి యెదుట నాట్యమాడి మిగుల బడలిక చెందిన యా తమ యాచార్యులకు పసుపుతో నలుగుపెట్టి స్నానము చేయించువారు. వారి యీ పరిచర్యకు ప్రీతులై వరరంగార్యు లిట్లనిరి– "యతిరాజా, నాలో నున్న రహస్యార్థములు సంగ్రహింపదలచియే నీవు నన్నిట్లు సేవించుచున్నావు. కాన పరమరహస్య మయినను ముఖ్యమయినది గాన చెప్పుచున్నాను. వినుము. శఠకోపమహర్షి యెడ మధురకవీంద్రుడెట్టి గురుభావము వహించెనో యదే బద్ధచేతనులను తరింపజేయు సాధనము. నీవు గూడ నట్టి యాచార్యప్రతిపత్తి నవలంబించినచో నిహపరలాభము నందగలవు."

> గురు రేవ పరబ్రహ్మ గురురేవ పరం ధనమ్,
> గురు రేవ పరా విద్యా గురురేవ పరాగతిః
> యస్మాత్తదుపదేష్టాఽ సౌ తస్మా ద్గురుతరో గురుః

గురువే పరబ్రహ్మ, గురువే పరమధనము, గురువే పరమవిద్య, గురువే పరమగతి; పరబ్రహ్మ నుపదేశించువాడు గనుకనే యాచార్యుడందరికంటె గొప్పవాడు. ఉపాయము-సాధనము-ఉపేయము-గమ్యము-గూడ గురుడే యని పలికి పంచమోపాయ మనబడిన యాచార్యప్రతిపత్తిని గూర్చి విశదముగ నుపదేశించి తా ననపత్యు డై నందున శొట్టనంబి యను తన సోదరుని రామానుజుల నాశ్రయింప జేసి కృతార్థులయిరి.

ఈ రీతిగ యతిపతి యామునార్యుల శిష్యులగు శ్రీశైలపూర్ణులు, మహాపూర్ణులు, గోష్ఠీపూర్ణులు, మాలాధరులు, వరరంగార్యులు నను నయిదుగు రాచార్యులవద్ద వేదవేదాంత విద్యల నుపదేశమంది, సకల కళాప్రవీణుడగు కళాధరునివలె ప్రకాశింపసాగిరి. కాననే వారు పంచాచార్య పదాశ్రయు లని వ్యవహరింపబడిరి. ఆ యాచార్యు లందరు తమ తమ పుత్రులను సోదరులను వారికి శిష్యులుగ నొనర్చి ధన్యులైరి.

"తచ్ఛీర్షసంబంధబలాచ్చ దేశికాః
పూర్వం స్థితా ముక్తి మవాపు రంజసా,
తదంఘ్రిసంబంధబలా దిహ స్థితాః
స్వరూపసిద్ధిం పరమాం గతా జనాః
వినా చ సంబంధబలేన తస్య
జగద్గురో ర్లక్ష్మణదేశికస్య,
తద్దుర్గమం విష్ణుపదం జనానాం
పూర్వం స్థితానా మధునా స్థితానామ్.
యథామణి ర్మౌక్తికహారమధ్యే
విరాజయం స్తం పరిత స్తదైవ,
మహాత్మనాం దేశికపుంగవానాం,
మధ్యే విరేజే యతిసార్వభౌమః."

రామానుజుల శిరస్సంబంధులు — పైవారు - అయినందున వారి పూర్వు లందరును ముక్తిని బడసిరి. వారి పాద సంబంధులు - తర్వాతి వారు - అయినందున నితరాచార్యులు మోక్ష మందిరి. కాన రామానుజులతో నేదో విధమయిన సంబంధము లేనిదే వారిపూర్వులకు గాని పరులకు గాని పరమపదము దుర్లభము. ముక్తాహారమునడుమ నున్న నాయకమణి యా హారము నందలి ముత్యముల నన్నిటిని ప్రకాశింపజేయునట్లే మహాత్ములయిన యాచార్యోత్తముల మధ్యమున శ్రీ రామానుజాచార్యులు ప్రకాశించుచు వారందరకు వన్నె తెచ్చుచుందురు.

## విషప్రదానము

దైవద్రవ్యాపహరణము రుచి మరగిన శ్రీరంగనాథుని యర్చకులకు శ్రీరామానుజుల పరిపాలనలో నేమియు దక్కకుండెను. అది వారికి కంటకప్రాయమే య్యెను. కాన వారు రామానుజుల నెట్లయిన నంతమందించిననే గాని తమ మార్గము నిరపాయము కాజాల దని నిర్ణయించిరి. వారు పెట్టిన ధనాశకు లోబడి యొక బ్రాహ్మణుడు

భిక్షార్థమై వచ్చు రామానుజులకు విషమిశ్రితాన్న మిడుమని తన భార్య కాదేశించెను. ఆమెయు తమ యింటికి వచ్చినపుడు వారికి విషాన్న మర్పించి అశ్రుపూర్ణముఖియై వారికి నమస్కరించెను. ఆ సంకేతము రామానుజులు గ్రహించి కావేరితీరమున కేగి దానిని పరీక్షించి యది విషాన్నమని తెలిసికొని పారవైచిరి. మూడు దోసిళ్ళ కావేరి జలము మాత్రము త్రావి యాకలి బాపుకొనిరి.

ఈ వృత్తాంతము విన్న గోష్ఠీపూర్ణులు రామానుజులను దర్శింప వచ్చిరి. గురువు వచ్చుచున్నా రని తెలిసికొని రామానుజులు శిష్యప రివారముతో కావేరీతీరమున వారి నెదుర్కొనిరి. అది నిండు వేసవి. మిట్టమధ్యాహ్నము. అట్టి సమయమున చండభానుని ఖర కిరణ తాప మును గూడ లెక్క చేయకుండ సలసలకాలుచున్న యిసుకపై సాగిలబడి రామానుజులు తమగురువర్యులకు సాష్టాంగదండప్రణామ మాచరించిరి. మలమల మాడ్చు నెండలో నేలపై కొరగి దండమిడిన శిష్యుని గాంచి వ్యథ చెంది వారిశిష్యుడు ప్రణతార్తిహరుడను గురుభక్త్యైకప్రవణుడు గోష్ఠీపూర్ణులతో "స్వామీ, యీ మండు టెండలో తాము విచ్చే యుట మాగురువుగారి ప్రాణములు తీయుటకు కాదు గదా!" యని పల్కెను. గోష్ఠీపూర్ణు లాశిష్యుని యాత్యంతిక గురుభక్తికి ప్రీతులై "రామానుజా, ఇకపై నీ వీ శిష్యునిచే మాత్రమే వంట చేయించుకొని భుజించుచుండుము. ఇతరుల నెంత మాత్రము నమ్మవలదు. కొందరు నిన్నెట్లయిన మట్టుబెట్టదలచుచుండుట నీకు తెలిసిన విషయమే గదా" యని పలికిరి. యతిరా జట్లే చేసిరి.

ఒకనాడు రామానుజులు రంగనాథుని సేవింప నేగిరి. అర్చకు డాయనకు విషము కలిపిన తీర్థమిచ్చెను. రామానుజు లా సంగతి గ్రహించి గూడ నా తీర్థము స్వీకరించిరి. కాని శేషావతారుడగు నా యోగీంద్రుడు పానము చేసిన యా విషతీర్థ మాయనపాలిటి కమృతమే యయ్యెను. నిర్వికారులై యున్న వారిని గాంచి యా యర్చకు లెంతో యాశ్చర్యపడిరి. ఇట్లే వారి విరోధులు కొందరు వారిని నిర్మూలిం చుట కభిచారహోమాదులు కూడ చేయించిరి. కాని యతీంద్రుని ప్రభావముచే నవి యేవియు వారికి చెరుపు చేయ లేకపోయినవి. అట్టి వారిని గుర్తించి గూడ యతిరాజు దయతో క్షమించి వదలి వేసిరి. మిత్రశత్రుతటస్థుల నొకటిగా చూచిన యతిరాజు సమదృష్టి—

"సుహృ న్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు,
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే."

అను గీతాసూక్తికి లక్ష్యభూతము గదా! వారి యీ శీలసంపదయే వారు సర్వులను నాకర్షించుటకు నయస్కాంతము వలె పనిచేసినది.

# యజ్ఞమూర్తి పరాజయము

యజ్ఞమూర్తి యను ద్విజశ్రేష్ఠుడు మహాపండితుడు. ఆతడు కాశి కేగి పాండిత్య మలవరచుకొని యద్వైతశాస్త్ర గ్రంథములు క్షుణ్ణముగా నభ్యసించి సంన్యాసము స్వీకరించెను. వారి కనేక శిష్యప్రశిష్యులు గూడ నేర్పడిరి.

రామానుజులు విశిష్టాద్వైతమున నప్రతిమానవైభవముతో విరాజి ల్లుట విని యజ్ఞమూర్తి వారి నోడింప తలపుగొనెను. తాళపత్ర గ్రంథము లలో ననేకశాస్త్రములు వ్రాయించి బండిపై నెక్కించుకొని రామానుజుల నోడించుటకు మహోత్సాహముతో మహావిద్యామదముతో, శిష్యసంఘ ముతో శ్రీరంగమున కరుగుదెంచి తానువచ్చిన సంగతి వారికి కబు రంపెను. రామానుజులును నా వార్త విని సరే, రానిమ్మని మందహాస మొనరించిరి.

యజ్ఞమూర్తి యతిరాజువద్ద కేగి తనతో శాస్త్రార్థము చేయుమని పిలిచెను. అందులకు లక్ష్మణార్యు లిట్లడిగిరి. "నాతో వాదించి యోడిపోయినచో నీవేమి శిక్ష ననుభవింతువు?" అందుకు-- "నే నోడిపోయినచో నా మతము వదలి నీ మతముతో బాటు నీ పాదుకలు గూడ శిరసావహించి నీవు పెట్టిన పేరు ధరింతును." "మరి నీవోడిన నేమి చేయుదు" వని యజ్ఞమూర్తి యడిగెను. "నే నోడినచో నావద్ద నున్న గ్రంథరాజి యంతయు త్యాగము చేయగల" నని రామానుజులు సమాధాన మిచ్చిరి.

ఈ విధముగ ప్రతిజ్ఞలు కావించి వారిరువురును శాస్త్రచర్చకు దిగిరి. యుక్తిప్రతియుక్తులతో పదునేడుదినములు విధి విరామములేక వా రిరువురి నడుమను వాద ప్రతివాదములు కొనసాగెను. ఒకరి కొకరు వాదమున మించుచుండిరే కాని జయ మెవ్వరికిని కలుగుసూచన కను

పింపలేదు. చివరినాడు యతిరాజు వాదమే యోడిపోవు నేమో యని పించెను. నాటి సాయంకాలము యతిపతి స్నానసంధ్యాదు లాచరించి మఠదేవతార్చన యగు వరదరాజుల నర్చించి వారి కిట్లు విన్నవించిరి. "స్వామీ, ఎంతోకాలమునుండి యీ వైష్ణవదర్శన మవ్యాహతముగా ప్రవర్తిల్లుచున్నది. అట్లది నే డీ యజ్ఞమూర్తి వలన నా కాలమున విచ్ఛిన్న మగునట్లు తోచుచున్నది. సరి నీ చిత్త మెట్లో యట్లే జరుగు గాక." తర్వాత వారు వ్యాకులహృదయముతో ప్రక్కపై నొరగిరి.

వరదుడు స్వప్నమున ప్రత్యక్షమై వారి కి ట్లానతిచ్చెను— "వత్సా, విచారింపకుము. పాండిత్యమున నిన్ను గూడ మించునట్టివాడగు నీతని నీకు శిష్యునిగా చేయుటకే నేను పూనుకొన్నాను. నీవు చింతింప బనిలేదు. యామునార్యులచే పరిపాలింపబడి నీచే మిగుల ప్రచారము చేయబడుచున్న యీ వైష్ణవ దర్శనమునకై సమర్థు నొకనిని నీకు లభింపజేయుటకే నే నిట్లు సంకల్పించినాను. నీ వాదసామర్థ్యముచే రేపు నీ వాతని గెలిచి నీ శిష్యునిగా చేసుకొనగలవు" అనిపలికెను.

వెంటనే యతిరాజు హరినామస్మరణతో త్రుళ్ళిపడి లేచి దానిని స్వప్నముగా తెలిసికొని యెంతో యానందించిరి. యజ్ఞమూర్తిని తాను వాదముతో గెలువగల నని వారికి ధైర్య మేర్పడెను. ఉషఃకాలము ననే స్నానసంధ్యాదులొనర్చి శిష్యులతో కలసి వారు పండితసభ కేగిరి. అచట వారు యజ్ఞమూర్తి నిట్లు ప్రశ్నించిరి---

"జ్ఞానరూపం పరబ్రహ్మ తన్నివర్త్యం మృషాత్మకమ్,
అజ్ఞానం చే త్తిరస్కుర్యాత్ కః ప్రభు స్తన్నివర్తనే."

జ్ఞానస్వరూపుడగు పరబ్రహ్మయే మాయకు లోబడినచో నిక దానిని గెలువగలవా డెవ్వడు?

ఈ ప్రశ్నకు యజ్ఞమూర్తి సమాధానము చెప్పలేక తన యేక దండము విసర్జించి యతిరాజుపాదములపై బడి వారిని శరణువేడెను.

ఏకదండ మన నొకే కఱ్ఱ. దాని నద్వైత సంన్యాసులు ధరింతురు. బ్రహ్మ మొక్కటి మాత్రమే సత్య మను భావము నిది సూచించును. త్రిదండము మూడు కఱ్ఱలతో కలిపి కట్టబడి యుండును. చిదచిదీ

శ్వరులు ముగ్గురును సత్యమే యను విశిష్టాద్వైత ధర్మసూక్ష్మము నిది సూచించును.

రామానుజులు యజ్ఞమూర్తికి ప్రాయశ్చిత్తాదు లొనరించి శిఖా యజ్ఞోపవీతములును త్రిదండమును ననుగ్రహించిరి. వారికి అరుళాళప్పెరుమాళెంబెరుమానార్ అని నామకరణ మొనర్చిరి. వీరినే దేవరాజముని యని గూడ నందురు. పంచసంస్కారములతో బాటు వారికి ద్రావిడాగమము గూడ బోధించిరి. కూరేశదాశరథులతో బాటు దేవరాజముని కూడ వారి కాంతరంగిక శిష్యుడాయెను.

యతిరాజు వీరికి తమ మఠదేవతార్చనాకైంకర్యమును వప్పగించిరి. దేవరాజముని దానిని జీవితాంతము వరకు శ్రద్ధాభక్తులతో నిర్వహించుటయే గాక శ్రీ వైష్ణవుల కుపాదేయ మగు జ్ఞానసారము, ప్రమేయసారము నను గ్రంథద్వయము గూడ రచించి లబ్ధప్రతిష్ఠులైరి.

## అనంతార్యులు

సహస్రగీతికి వ్యాఖ్యానమును శిష్యుల కుపదేశించుచు నుడయవర్లు సుఖముగా కాలక్షేపము చేయసాగిరి. ఒకనాడు తిరువాయ్‌మొళిలోని "శిందుపూ మగిళుం తిరువేంగడత్తు" అను పాశురమునకు వా రర్థము చెప్పుచుండిరి. "జీవనపర్యంతమును శ్రీ వేంకటేశ్వరుని కైంకర్యమే చేయుచుండవలె" నని దాని భావము. "అయ్యో, ఈ పాశురమున చెప్పినట్లు వేంకటేశ్వరుని కైంకర్యము చేయుట యెట్లా" యని వారికి తహతహ కలిగెను. అపుడు వారచట నున్న వైష్ణవులను "ఏడు కొండలవానికి నివాస మగు తిరుమలపై పుష్పమండపమువద్ద బృందావన మను పుష్పవనమును నిర్మించి శ్రీస్వామివారికి తులసీ పుష్పకైంకర్యము చేయకలిగినవారు మీలో నెవరైన నున్నారా" యని యడిగిరి.

అది విని యనంతార్యులను శ్రీ వైష్ణవులు భగవత్కైంకర్యపరాయణులు లేచి నిలబడి యిట్లనిరి-- "గురూత్తమా, ఇపుడే మీ యాదేశానుసారము నేను వేంకటాద్రికి వెడలి యచట రామానుజ మని మీ పేరనే బృందావనము నొకదానిని నిర్మించి మీరు చెప్పిన రీతిగనే స్వామికైంకర్యమున నా జన్మము సార్థకపరచుకొనగలను" అని అనుటయేమి-- ఆయన తిరుమల కేగి యచట పుష్పవననిర్మాణాది కైంక

ర్యముతో రామానుజార్యదివ్యాజ్ఞ నవ్యాహతముగా నెరవేర్చుటయేమి-రెండును వెంటనే జరుగుట కెంతో కాలము పట్టలేదు. కొంతకాలము జరిగిన తర్వాత రామానుజు లాకైంకర్యము చూచి యానందించుటకు తిరుపతి కేగిరి. అచట స్వామిని నేత్రోత్సవముగ సేవించి మరి కొన్ని దివ్యదేశములు దర్శింప వెడలిరి.

## కార్పాసారామలక్ష్మి

ఆ యాత్రలో మార్గమధ్యమున వా రష్టసహస్ర మను గ్రామము చేరిరి. అచట రామానుజుల శిష్యులు యజ్ఞేశుడు, వరదార్యులు నను వారిరువురు గలరు. యజ్ఞేశుడు ధనవంతుడు; వరదార్యుడు గర్భదరిద్రుడు. ముందు యతిపతి యజ్ఞేశునకు వార్త నంపిరి. కాని యా కబురు తెచ్చిన వారి నాతడు సరిగా గౌరవింపలేదు. ఇది యెరిగి రామానుజులు శిష్యసంఘముతో ముందుగా వార్త పంపకయే వరదార్యునింటి కరిగిరి.

వరదార్యు లొక తోటలో నొక కుటీర మేర్పరచుకొని సతిసమేతులై నివసించి యుండిరి. ఆ వనమున ప్రత్తిచెట్లు నాటుటచే కార్పాసారామ వరదార్యు లని వారికి పేరు కలిగెను. కార్పాసారామ మన ప్రత్తితోట. ఆయన భార్య పరుత్తిక్కొళ్ళనాచ్చియార్. ప్రత్తితోటలో వనలక్ష్మి వలె సంచరించుటచే నామెకు గూడ కార్పాసారామలక్ష్మి యనిపేరు ప్రసిద్ధమాయెను. రామానుజు లా యింటికి వెడలి నప్పుడు వరదార్యు డక్షయపాత్ర చేబూని భిక్షార్థ మరిగెను.

కార్పాసారామలక్ష్మి జీర్ణవస్త్రము ధరించినందున తలుపు గడియ వైచుకొని ద్వయమంత్రస్మరణతో గృహకృత్యములు నిర్వహించుకొను చుండెను. రామానుజులు వాకిట నిలబడి "వరదార్యు లింట నున్నారా" యని యడిగిరి. యతిపతికంఠస్వరము వెంటనే గుర్తించి యా సాధ్వీమణి తలుపు తెరచి చాటున నిలబడెను. "అయ్యో, గురువు శిష్యవాత్సల్యముతో నా యింటికి వచ్చినారు. వస్త్రహీన నగు నే నెట్లెదురేగి వారి కర్ఘ్యపాద్యాదు లీయగలను" అని విచారించి గూడ నామె కొక యాలోచన తోచినందున చేతులతో చప్పట్లు చరచెను. ఆమె జీర్ణవస్త్రధారిణి యై నందున బైటకు రాజాలకున్న దని గ్రహించి లక్ష్మ

ణార్యులు తటాలున తమ యుత్తరీయము నామె పైకి విసరివేసిరి. దాని నెట్లో చుట్టుకొని యా సతీతిలకము బైటకువచ్చి భక్తియుక్తయై గురుదేవునకు సమస్కరించి యర్ఘ్యపాద్యాదులతో యథాశక్తి నర్చించెను. తర్వాత నామె తన మనమున నిట్లు తలపోసెను—

“ఆహా, నేటికి గదా యీ గృహము పావన మయినది. ఇప్పటికి మా పుణ్యము ఫలించి మా గురువురూపముతో ప్రత్యక్ష మయినది శ్రీ మహావిష్ణువే గదా—

“గురు రేవ పరం బ్రహ్మ గురు రేవ పరా గతిః,
శరీర మర్థం ప్రాణాం శ్చ సద్గురుభ్యో నివేదయేత్.
శరీరం వసు విజ్ఞానం వాసః కర్మ గుణా నమూన్,
గుర్వర్థం ధారయే ద్యస్తు స శిష్యో, నేతరః స్మృతః.”

గురువే పరబ్రహ్మము. గురువే పరమగతి. కాననే శరీరము, అర్థము చివరకు ప్రాణములు గూడ గురువునకు సమర్పింపవలెను. అట్టివాడే శిష్యశబ్దార్హుడు. ఇతరు డెంత మాత్రమును కాడు. అట్టి గురువే తన పరివారముతో కళకళలాడుచు మా యింటి కిన్నాళ్ళకు రాగా నొక్క బియ్యపుగింజయైన లేకుండ పోయినదే! భిక్షకేగిన భర్త యింటికి వచ్చు జాడ గూడ కనిపించుటలేదు.

పాపకార్య మాచరించి యైన గురువున కాతిథ్య మిచ్చుట ధర్మము. చోరవృత్తిచే పూర్వము పరకాలుడు శ్రీవైష్ణవతదీయారాధన చేసినట్లే నేను గూడ పరపురుషుని గూడియైన గురుసత్కారము చేయక తప్పదు.

“మన్నిమిత్తకృతం పాప మపి పుణ్యాయ కల్పతే,
మా మనాదృత్య య త్పుణ్య మపి పాపాయ కల్పతే.”

“నాకై చేయబడిన పాపముగూడ పుణ్యమే. నన్ను కాదని చేసిన పుణ్యము గూడ పాపహేతువే” యని భగవంతుడే పల్కినాడు. ఆ భగవంతుని కంటే గూడ గురువు మిక్కిలి పూజనీయు డనుటలో సందేహ మేమి? ఈ యూరనున్న ధనిక వైశ్యుడొకడు కామాంధుడై నా పొందు గోరి యున్నాడు. ఆయన వద్ద కేగి భోజనాదిసామగ్రి తెప్పించి యీ పూట గురువుకు విందు చేసి మలభూయిష్ఠమగు నా శరీరము నాతని కీ రాత్రి నప్పగింతును గాక.”

ఈ విధముగా నిశ్చయించి ధర్మగతి యెరిగిన యా శీలవతి యతి పతితో "నాచార్యోత్తమా, మీరు కొలది సేపు విశ్రమింపుడు. తదీ యారాధనకు తగిన ప్రయత్నములు క్షణములో జరుగును" అని విన్న వించి తా నా కోమటియింటి కేగి 'అయ్యా, నీవు పూర్వము నన్ను కామించితివి గదా; ఇప్పుడు నీతో నా కొక యవసరము వచ్చినది. అది నెరవేర్చిన పిమ్మట రాత్రికి నేను నీ యింటికి వచ్చెదను. మా గురువు పరివారముతో మా యింటికి విచ్చేసినారు. వారందరికి సరి పడు భోజనాదిసామగ్రి పంపుము' అని పలికి యింటికి వచ్చెను. ఆ వైశ్యుడును నేటికి గదా నా కోరిక ఫలించు సమయము సమీపించె నని యొడ లెరుగని సంతోషముతో నామె యింటికి రకరకము లయిన పాకయోగ్యపదార్థములు పంపెను.

ఆ వస్తువులు చూచి యతిపతి తమ శిష్యురాలి భక్తిప్రపత్తులకు మిగుల నానందించి "అమ్మా, నీవు మడికట్టుకొని వంటచేయుము. ఈ లోపుగ నేను స్నానసంధ్యాదులు నిర్వర్తించి దేవతార్చన చేయు దును" అని పలికిరి.

ఈ విధముగ వరదార్యుని యర్ధాంగలక్ష్మి యగు కార్పాసారామ లక్ష్మి తన సమయస్ఫూర్తిచే పరపురుషసంగమమునకు గూడ సిద్ధమై యతిరాజుకు షడ్రసోపేతముగా విందు చేసి కృతార్థురాలయ్యెను.

ఉడయవర్లు భుక్తాయాసము తీర్చుకొనుటకై విశ్రమించియున్న తరి వరదార్యుడు భిక్షాద్రవ్యములు గైకొని యింటికి వచ్చెను. ఇంటికి రాగానే యాతడు తన సతిచే నాచార్యాగమన వృత్తాంతమును వారి కామె యాతిథ్య మొసగిన విధానమును నాకర్ణించి మిగుల నానందించి యామెతో నిట్లనెను– "నీవు వయస్సుచే చిన్నదానవయ్యును బుద్ధిచే పెద్దదానవు. నీవు చేసిన పని యద్భుతావహము. నా భాగ్యముచే తనే నిన్ను నేను సహధర్మచారిణిగా పొందుట సంభవించినది. గురువు నే విధానముచేత నైన సంతృప్తిపరచువాడే నిజమైన శిష్యుడు. అట్లు చేయనివాడు వంచకుడు.

తర్వాత వరదార్యుడు యతిరాజు వద్దకు వెడలి సాష్టాంగప్రణామ మాచరించి వారి నిట్లు ప్రస్తుతించెను– "యతీశ్వరా, లోకహితము దృష్టిలో నుంచుకొని యవతరించిన శ్రీ మహావిష్ణువే మీరు. మీ

చేష్టలును విలాసములును చిత్రాతిచిత్రములు. అజ్ఞానాంధకారమున బడిన జీవలోకమును రక్షించుట మీకు తప్ప మరెవరికీ సాధ్యము కాగలదు? సర్పవిషపీడితులయిన వారిని, నరేంద్రుడు (విషవైద్యుడు) చికిత్స చేసి స్వస్థులను చేయునట్లు మీ రీ చేతనుల నుద్ధరించుటకై యవతరించినారు. కాననే బ్రహ్మరక్షస్సుచే పీడింపబడిన రాజపుత్రిక బాధను మీరు నివారింపగల్గినారు. మీరే యవతరింపనిచో మాబోటి బద్ధజీవుల బాధలు నివారింప గలవారెవ్వరు? మీ యాగమనముచే మా పాప జాలము భస్మమయినది. మేము ధన్యాత్ముల మయినాము."

ఇట్లు పల్కి వరదార్యుడు సతీసమేతుడై యతిపతి పాదతీర్థమును భుక్తశేషమును భక్తితో స్వీకరించెను.

రాత్రియైన తర్వాత కార్పాసారామలక్ష్మి భర్తనువెంట నిడుకొని యతిపతితీర్థప్రసాదములను తీసుకొని యా వైశ్యునింటి కేగెను. అవి స్వీకరించిన తర్వాత నాతనికి వివేక ముదయించెను. వెంటనే యాతడా దంపతులకు భక్తితో ప్రదక్షిణ నమస్కారములు చేసి వారి పాదములపై బడి "మీరు నా తల్లిదండ్రులు. నా దుశ్చింతను క్షమింపనిదే లేవను. నా యీ పాపమునకు ప్రాయశ్చిత్తమును గూడ మీ రనుగ్రహించక తప్పదు" అని కన్నీరు చెక్కులనుండి జాలువార ప్రార్థించెను.

వరదార్యు డాతని లేవనెత్తి "నిజముగా నీవు నీ దుశ్చింతకు పశ్చాత్తప్తుడ వైనచో మా గురువు యతిరాజుపాదము లాశ్రయింపుము. నీ పాపము తప్పక నశించు" నని పల్కెను. వెంటనే యా వైశ్యుడు వారివెంట నేతెంచి రామానుజుల యడుగుదమ్ములపై వ్రాలి జరిగిన దంతయు వారికి నివేదించి హృదయతాపము శమింపజేసికొనెను. చేసిన పాపము చెప్పిన పోవునందురు గదా!

పాపాత్ములపై గూడ కరుణాకటాక్షమును ప్రసరింపజేయు నా దేశికోత్తముడు మరునా డా వైశ్యునకు పంచసంస్కారముల ననుగ్రహించి యాతని నుద్ధరించెను. ఈ విధముగా పూతశీలయగు కార్పాసారామలక్ష్మి తన ధర్మగత వివేకముచే గుర్వర్చనకావించి తనకు ద్రోహము తలపెట్టిన వైశ్యుని గూడ భక్తిప్రపత్తులు గల వానినిగ నొనరించి సతీతిలకములలో విశిష్టస్థానము నందుకొనెను.

# యజ్ఞేశుడు

ఇక నా యష్టసహస్రగ్రామమున యజ్ఞేశుని కథ నరయుదము— తమ గురు వరుదెంచి రన్న వార్తవిని యజ్ఞేశుడు ఖ్యాతిలాభపరుడై వారి యాతిథ్యమునకు తగిన సన్నాహములు పెద్ద యెత్తున చేయసాగెను. ఇంటిముందు పెద్ద పందిరి వేయించెను. ద్వారములకు తోరణములు కట్టించెను. ఆసనశయ్యాదులు సిద్ధము చేయించెను. తర్వాత గురువు రాకకై స్వాతివానకు ముత్తెపుచిప్పవలె నుత్కంఠతో నెదురు చూడ సాగెను. కాని యెంతసేపు చూచినను గురువు వచ్చు జాడ లేనం దున యతిరా జెచట నుండిరో చూచిరమ్మని తనవారి నా యూ రంతటను వెదుక బంపెను. కొంత సేపటికి గురువు వరదాచార్యుల యింట భుజించి విశ్రాంతి తీసుకొనుచున్నా రని తెలియవచ్చెను. అది విని "అయ్యో, వారు నాకు ముందు కబురుపంపగా సమయమున కెదు రేగి వారిని న్నా యింటికి తీసుకొని రా నైతిని గదా" అని వెతగుంది వెంటనే కొంతమందిని వెంటబెట్టుకొని వరదార్యులయింటి కేగి యతిపతి పాదములపై నొరగి దుఃఖాశ్రువులు రాల్చ సాగెను.

దయార్ద్రహృదయు లగు రామానుజులు తమ శిష్యుడు పడు పరితాపము నర్థము చేసుకొనిరి. వెంటనే యాతని లేవనెత్తి లోకో పకారార్థమై యిట్లుపదేశించిరి— "యజ్ఞేశా, మించిన దానికి వగచిన ఫల మేమి? ఆత్మహితమగు నా యీ యుపదేశము నాచరణములో నిడుకొనుము. పంచసంస్కారలాభము, భాగవతార్చనము, అర్థపంచక విజ్ఞానము, ఆచార్యాధీనాచరణము— ఇవి మాత్రమే చాలవు. వీని యన్నిటిని మించినది తదీయారాధనము. (విష్ణుభక్తులకు నిండు హృద యముతో నాతిథ్య మిచ్చుటయే తదీయారాధనము) ప్రపన్నునకు వైష్ణ వాతిథి పూజ యొక్కటియే యాత్మోజ్జీవనము. శ్రమచెందిన యతిథి కింటికి రాగానే విసనకఱ్ఱతో బడలికతీర విసరవలెను. తర్వాత పాద్యమును, అర్ఘ్యమును, ఆచమనీయమును సమర్పింపవలెను. విష్ణువే సాక్షాత్తుగా నతిథిరూపుడై తన యింటికి వచ్చినా డని తలచి యాయ నను భక్తిప్రపత్తులతో లోనికి తీసుకొనిపోవలెను. అచట సుఖాసనమున నా యతిథిదేవత నాసీనుని జేసి యథాశక్తిగా నన్నపానాదులతో సంతృ ప్తుని జేయవలెను. భుజించిన తదుపరి పుష్పచందనతాంబూలాదులతో

నాతని సంభావింపవలెను. తర్వాత నాతని భుక్త శేషమును తన వారితో గలసి భుజింపవలెను. పైన చెప్పిన ట్లెవ రనుష్ఠింతురో యట్టివారికి మాత్రమే వైష్ణవత్వసిద్ధి కలుగును. కాన శ్రీ వైష్ణవు డగు వానికి వైష్ణవాతిథి పూజనమును మించిన కర్తవ్యము మరేది యును లేదు. కాని నీయెడ ముఖ్యమైన యా యతిథి పూజ లోపిం చుట నాకు మిగుల విచారము కలిగించుచున్నది. నీ వాడంబరము కొఱకు మాత్రమే ధర్మకార్యములు చేయుచున్నావు. ఖ్యాతిలాభమం దున్న యాసక్తి యాత్మహితకరమగు ధర్మకార్యములపై నీకు లేదు. ఇక మీదనయిన నీ ప్రవర్తన చక్క బరచుకొని యథార్థధర్మపరుడవై యిహపరము లందుకొనుము."

"హితం మనోహారి చ దుర్లభం వచః" హితవాక్యములు మనస్సున కింపు గల్గింపవు గదా. అయినను యతిపతి పల్కులు విని యజ్ఞేశుడు తన యాచరణకు మిగుల లజ్జితుడై, బద్ధాంజలియై యిట్లు విన్న వించెను. "ఆచార్యా, యీ తప్పు కాచి నీనిని రక్షింపుడు. మీరు వచ్చుచున్నా రని యానందపరవశుడనై మీ యాతిథ్యమునకు తగిన సన్నాహము చేయుచు నా వద్దకు మీరు పంపిన వారి కాతిథ్యసత్కా రములు చేయజాల నైతిని. అంతే గాని యొడలు తెలియని గర్వముతో నే నీ పని చేయలేదు. కాన నీ కింకరుడు మీ కుచిత మనితోచె నేని క్షంతవ్యుడు."

ఈ మాటలు విని యతిపతి "ఇకమీద నైన నీవు తదీయారాధన ప్రాముఖ్యమును మనమున నిడికొని నడచుకొనుము. ఇంటికి వచ్చిన వైష్ణవాతిథినిమాత్రము గౌరవించుట మానకుము—" అని పలికిరి.

ఈ విధముగ యజ్ఞేశున కానతిచ్చి లక్ష్మణార్యులు కంచి చేరిరి. అచట కాంచీపూర్ణులను, వరదరాజుస్వామిని సేవించి శ్రీ వైష్ణవ మహాసంఘము తమవెంట నడువ వేంకటాచలము చేరిరి. దానికి దక్షిణమున కపిలతీర్థము కలదు. శఠకోపాదులగు పదుగురాళ్వారులును నా వేంకటాచలపతిని సేవించి యచటనే యుందు రని ప్రసిద్ధి. కను కనే యా కపిలతీర్థమునకు దివ్యసూరితీర్థ మని గూడ నామాంతరము రూఢమాయెను. యోగిరాజగు లక్ష్మణార్యు లా ప్రదేశమును సమీపించి యందు స్నానమాడి జపతపాదులు పూర్తి చేసుకొని యా దివ్యసూరు లను సేవించిరి. అచట వారు కొన్ని దినము లానందముతో గడపిరి.

# శ్రీనివాస సందర్శము

యతిరా జచట వేంచేసి యున్నా రని తెలిసికొని యా దేశ పాలకుడగు విట్టలదేవభూపతి వారిని సేవింపవచ్చెను. ఆ రాజు వారి యతిమానుషవైభవము గాంచి పులకితాంగుడై ఆయన గురుత్వమం గీకరించి బహుళధనము సమర్పించుటయే గాక తనదేశ మగు తొండీర మండలములోని యిళమండియమను గ్రామమును గూడ గురుదక్షిణగా సమర్పించెను. ఆ గ్రామమున తన నాశ్రయించి యున్న ముప్ప దిమంది ద్విజోత్తములకు యతిరాజు దానముగా నా గ్రామము నిచ్చి వేసెను.

అనంతార్యాదులగు వైష్ణవు లందరును కలసి యతిపతి వద్ద కేగి తిరుమలవాసుని మంగళాశాసనమునకు విచ్చేయుడని ప్రార్థించిరి. కాని యతిపతి "సరోయోగి మొదలగు పదుగురాళ్వారులును శేషశైలమును సాక్షాత్తుగా నాదిశేషుని యవతారముగా భావించి దాని నారోహింప లేదు గదా! వారి శిష్యుడనగు నేను నా పాదములతో దాని నారోహిం చుట ధర్మదూరము గాదా" యని వారితో పలికిరి.

అపు డనంతార్యుడు "స్వామీ, మీ రిపుడు కొండపైకి రానిచో మిమ్ములనే యాదర్శముగా నిడుకొని యిక నెవరును నా పర్వత మెక్కరు. శ్రీ వేంకటేశుని సేవింపరు. ఆపైన దేవరచిత్తము" అని పలికెను. బుధజనుల యభిప్రాయానుసారము రామానుజులు వారిని వెంటనిడుకొని పర్వతారోహణకు సిద్ధమయిరి. శ్రీశైలపూర్ణులు స్వామి తీర్థప్రసాదములను వారికి తెచ్చి యిచ్చిరి. ఆచార్యు లిట్లు చేయుటకు నొచ్చుకొని వారు "గురూత్తమా, మీరు నాకై శ్రమపడి ప్రసాదము గొని వచ్చుటయా? ఎంత యపచారము చేసితిని. ఏ బాలునిచే నైన దీనిని పంపిన బాగుండి యుండెడిది గదా!" యనిపలికిరి. అందుకు గురువు "నేను యచటనున్న వారిలో నెల్ల చిన్నవాడను. నాకంటె చిన్నవారు లేరు" అని సమాధాన మిచ్చిరి. తమ గురువుయొక్క యీ సహజవినయసంపదకు రామానుజు లెంతో యానందించిరి.

వైష్ణవు లందరితో రామానుజులు గాలిగోపురము దాటి సోపాన రహితమార్గమున నడువసాగిరి. ఏకాంతులు, యతులు, అర్చకులు నయిన వైష్ణవు లందరును విశిష్టాద్వైత దర్శనాచార్యు లగు రామానుజాచార్యుల

వారు శ్రీనివాసునకు మంగళాశాసనము చేయుచున్నారని తెలియగానే మహాసంభ్రమముతో నెదురేగుదెంచి వారిని తగురీతిని సత్కరించిరి.

తిరుమల చేరిన యతిపతి స్నానసంధ్యాదులు నెరవేర్చి నాలుగు వీథులను ప్రదక్షిణ మాచరించిరి. అనర్ఘమణిమయములగు గొప్ప యెత్తైన గోపురములను విమానమండపాదులను సందర్శించి యనంతార్యులు నాటిన రామానుజవనము తనివితీర గాంచిరి.

రమ్యము లగు నుద్యానములను నందలి చెట్లకొమ్మల నెక్కి యాడు చున్న వానరసంఘములను గాంచుచు లక్ష్మణార్యులు పక్షిసంఘముల కలకలనాదము విని పరవశులేయయిరి. ఆ పశుపక్షిమృగాదులను పరమ పదవాసు లగు నిత్యసూరులుగనే భావించి తన్మయత చెందిరి. మహా వరాహస్వామికి నమస్కరించి కులశేఖరసోపానము దాటి బలిపీఠమునకు ప్రణమిల్లి పుష్పమండపమునకు ప్రదక్షిణ మాచరించిరి. ధనుర్మాస శుక్లపక్షమున ద్వాదశి యుషఃకాలమున సర్వతీర్థములును సంగమించు నను ప్రసిద్ధి వహించిన స్వామిపుష్కరిణీ తీర్థము సేవించి తిరుమలను ప్రవేశించిరి.

మహానసమును, యాగశాలను, శ్రీమణిమంటపమును ప్రణమిల్లి విష్వక్సేనాదుల కెరగి యానందనిలయమను దివ్య విమానమును గాంచిరి. తర్వాత గర్భాలయము ప్రవేశించి శ్రీ వేంకటనాథుని సేవించి హర్షోత్ఫుల్లహృదయు లైరి. చాలసేపు ప్రాంజలియై వారియె దుట నిలచి భక్తితో తీర్థశఠకోపాదులు స్వీకరించిరి. సాక్షాత్తుగ నా దేవుడు వైకుంఠనాథుడే యని, యా దివ్యదేశము కలియుగవైకుం ఠమే యని వారు తలచిరి.

ఇతరాహార మేదియు తీసికొనక భగవద్గుణానుభవమను నమృత పానము చేతనే సంతృప్తిచెంది యచట లక్ష్మణార్యులు మూడు దిన ములు నివసించిరి. భగవత్కైంకర్య లక్ష్మీసంపన్ను లగు యతిపతి ముఖావలోకన మాత్రముచే శ్రీనివాసుని ముఖచంద్రబింబమునం దానం దచంద్రిక వెల్లి విరిసెను. లక్ష్మణార్యులు నాల్గవదినమున నా స్వామిని వీడ్కొని కొండదిగి శ్రీశైలపూర్ణుల యింట భుజించిరి. వారివలన శ్రీమద్రామాయణమునందలి విశేషార్థములను వినుచు కొంతకాలము

వారి యింటనే నివసించిరి. శ్రీశైలపూర్ణుల కృషిచే శైవము వదలి మరల వైష్ణవుడయిన గోవిందుడు వారికైంకర్యము చేయుచు నవుడచటనే యుండెను.

## గోవిందుని గురుభక్తి

శ్రీశైలపూర్ణులవద్దకు వచ్చినప్పటినుండి గోవిందుడు పూర్తిగా మారిపోయెను. గురువునకు సంబంధించిన ప్రతి చిన్నపనియు తానే చేయసాగెను. ఒకనా డతడు గురువుకై ప్రక్క పరచి దానిపై ముందుగా తానే శయనించెను. "ఇది యేమి విపరీత" మని రామానుజు లడిగిరి. శ్రీశైలపూర్ణు లాతనిని చీవాట్లుపెట్టి "గురుతల్పశయనునికి శిక్షయేమో తెలియునా" యని అడిగిరి. "అట్టివారికి నరకము తప్ప మరేదారియు నుండ"దని గోవిందుడు సమాధాన మిచ్చెను. "తెలిసి గూడ నిట్టి దుష్కార్యమేల చేసితి" వని గురువు రెట్టింపగా "మీకు నల్లులు మొదలగు వానిచే బాధ కలుగు నేమోయని యట్టి వానిని చూచి ముందుగా నిర్మూలనచేయుటకే నే నీ పాపమున కొడిగట్టు కొంటి"నని గోవిందుడు సమాధాన మిచ్చెను. ఇది చూచి యతిరాజు గోవిందుని గురుభక్తి కెంతో యానందించిరి.

ఒకనాడు లక్ష్మణార్యులు శ్రీశైలపూర్ణుల తోటకు వెళ్ళిరి. అచట గోవిందు డొక త్రాచుపామునోటిలో చేయిదూర్చి వచ్చి స్నానమాడి మరల గురువు శుశ్రూషకై సిద్ధ మాయెను. "ఇదేమి విపరీత" మని యతిరాజు పలుక "నీ పాము నాలుకలో ముల్లు గ్రుచ్చుకొనగా దానిని తీసితి" నని యాతడు సమాధాన మిచ్చెను. "ఆహా, నీవి భూతదయ యెంత స్పృహణీయ" మని రామానుజు లచ్చెరువంది యానందించిరి.

శ్రీశైలపూర్ణులు రామానుజులకు శ్రీమద్రామాయణమును విశేషార్థముతో నారు మాసములు కాలక్షేపము చెప్పిరి. అది ముగిసిన తర్వాత యతిపతి శ్రీరంగము వెడలుట కనుమతి యుండని గురువును కోరిరి. 'ఇంత దూరము వచ్చి శ్రమపడి రామాయణము వింటివి గదా! నీ కేమి బహుమతి ఈయగలను' అని శ్రీశైలపూర్ణు లనిరి. అందులకు లక్ష్మణార్యులు "మీకంత దయయే యీ దాసునిపై నున్నచో సదా మీసేవ చేయు గోవిందుని నా కిం'డని యడిగిరి. తనకు నమ్మిన

బంటయిన గోవిందుని వదలి యుండుట బాధాకరమే యయ్యు నాడిన మాటను వీడలేక గురు వాతని రామానుజుల కుదకధారాపూర్వకముగా నప్పగించిరి.

గురువు సాగనంపగా యతిపతి యటనుండి కదలి ఘటికాచలము (అహోబలము)న కేగి నరసింహస్వామిని సేవించిరి. అటనుండి వెడలి గృధ్రసరస్తీరవాసి యగు విజయరాఘవునకు ప్రణమిల్లి యటనుండి కాంచీ పురి చేరి కాంచీపూర్ణుల సందర్శనముచే ధన్యాత్ములైరి. తనకు మిక్కిలి కూర్చు గురువు సేవకు దూర మయినందున గోవిందు డనారోగ్యముచే పాలిపోయెను. ఇది చూచి యతిపతి వ్యాకులితాంతఃకరణులై 'నీ వొకపరి తిరుపతి కేగి శ్రీశైలపూర్ణులను సేవించిర' మ్మని యాత నిని పంపి తాను వరదుని కైంకర్యమున నిమగ్నులై కొంత కాలము కాంచీపురిలోనే గడపిరి.

గోవును వదలియున్న లేగదూడ యవకాశము వచ్చినప్పు డెట్లు గంతులు వైచుచు దానిని సమీపించునో యట్లే 'నా గురువును చేరుచున్నాను గదా!' యని యానందముతో గోవిందుడు తిరుపతి చేరి గురువు నింటికి వెళ్ళెను. అతని వెంట రామానుజులు పంపిన మనుష్యులు గూడ నుండిరి.

శ్రీశైలపూర్ణులు తాను దానముగా నిచ్చివేసిన గోవిందుని తమ యింటివద్ద చూడగనే మిగుల కోపించి యాతనిని వెంటబెట్టుకొని వచ్చినవారితో "నీత డేల మాయింటికి తిరిగి రావలసి వచ్చినది?" అని యడిగిరి. వారు గోవిందుని యనారోగ్యమును గూర్చి వివరించిరి. అపుడు శ్రీశైలపూర్ణులు 'ఇచట వానికి చోటు లేదు. ఎవరి కిచ్చితినో యచ్చటనే యాత డుండుగాక' యని పలికిరి. అయినను గురుపత్ని దయతో 'నిది యేమి చోద్యమండీ, ఎంతో కాలమునుండి మీ శుశ్రూష నొనరించినందులకు గోవిందున కిదియేనా మీరిచ్చు ప్రతిఫలము? చాలు చాలును. లోనికాతని పిలిచి భోజనము పెట్టి తగురీతిగా నాతని యోగక్షేమము లరయుటయే మన కర్తవ్యము' అని పలికెను.

అందులకు శ్రీశైలపూర్ణులు 'అమ్మివేసిన గొడ్డుకు గడ్డి వేయుట లోకమం దెచ్చట నేని చూచినామా! ఇతనికి నావద్ద నిక నెంతమాత్రము నాశ్రయము దొరకదు' అని ఖండితముగా నిరాకరించిరి. ఈ విధముగా నిరాశుడయిన గోవిందుడు గురువు గృహమునకు దూరము నుండియే నమస్కరించి మరల రామానుజుల సేవలోనే కాలము గడవు టకు కంచి కరుదెంచెను. గురువు ప్రవర్తన విని యతీంద్రు లబ్బురపడి గోవిందుని తగురీతిని నాదరించి యాతని చింతాశల్యమును దూరము గావించిరి. తర్వాత గోవిందుని వెంట బెట్టుకొని యతిపతి కంచి వదలి శ్రీరంగము బైలుదేరిరి.

# మహాచార్య [ఎంబారు] మహాకవి

శ్రీశైలపూర్ణులపై తనకు గల భక్తిభావనను గోవిందుడు లక్ష్మణార్యుల మీదకు మరలించెను. వా రెచటికేగిన వారి వెంట నచటి కేగుట, వారికి పాదసేవ మొదలగు సర్వవిధ కైంకర్యములు చేయుట గోవిందుని నిత్యకృత్యము లాయెను. నిద్రాహారములమాట గూడ నాతడిక తలపెట్టడాయెను. ఒకనాడు చాలమంది కూడిన యొక సభలో లక్ష్మణార్యులును, నితరవైష్ణవులును గోవిందుని యెదుటనే యాతని భక్తిజ్ఞాన వైరాగ్యాదులను, గురుభక్తిని ముక్తకంఠముతో ప్రశంసించిరి. ఇది విని గోవిందుడు కూడ 'మహాత్ములారా! మీరు పల్కినది నిక్కము. గోవిందుడు మీయీ ప్రశంస కర్హుడే' యని పలికెను.

రామానుజు లందుల కచ్చెరువంది 'వత్సా, ఇదేమి? మాతోబాటు నీవు కూడ నిన్ను మెచ్చుకొనుట తగునా? ఆత్మశ్లాఘము పరనిందవలెనే మహాపాతకము గదా! ఇతరులు తనను భూషించి నపుడు నైచ్యానుసంధానము చేయుట గదా శిష్టులు చేయదగిన పని'యని మందలించిరి. అందులకు గోవిందు డిచ్చిన ఈ సమాధాన మెంత నీతిదాయకము!

'కరుణాసింధువగు నాచార్యోత్తమా, ఈ యాత్మ భగవన్మాయచే నింతవరకు నజ్ఞానముననే మునిగియుండెను. ఎనుబదినాల్గు లక్షల యోనులలో దిక్కు తెలియక పుట్టుచు చచ్చుచు పరిభ్రమించెను దరిలేని దుఃఖమును బాధలను ననుభవించెను. ఘోరనరకానుభవము

తర్వాత నేదో పుణ్యలేశముచె ఘుణాక్షరన్యాయముచే నీ మానవజన్మ మెత్తితిని. ఈ దేహము లభించిన తర్వాత గూడ మూఢుడనై చాల కాలము కాళహస్తిలో శివపూజలో గడపితిని. అట్టివాడనై యుండి గూడ మీ దయ నాపై ప్రసరించిన వెంటనే మీ కృషి చేతనే మరల మీ శ్రీపాదమూలము చేరి నా పాపపంకమును ప్రక్షాళనము చేసికొనగంటిని. దేవాదులకు కూడా అలభ్యమయిన మీ కరుణ నంద గల్గిన నేను సామాన్యుడ నెట్లగుదును? అయినను నే నింత వాడ నగుటకు మీ దయయే గదా మూలము! కాన నిది నన్ను నేను పొగడుకొనుట యెంత మాత్రమును గాదు. మరి నన్నింత వానిని చేసిన మీ సుగుణ సంపదను గానముచేయుటయే యగును."

ఇది విని, యతిపతి పొంగి పోయిరి. "నీ సమాధానము సముచి తముగ నున్న" దని పలికి గోవిందుని గాఢముగా కౌగిలించుకొనిరి.

ఒకనా డుదయమున గోవిందుడు వాకిట నిలువబడి యుండుట ఒక శిష్యుడు చూచి యతిపతికి నివేదించెను. అప్పుడు వా రే 'యోయీ, నీవు వేశ్యానృత్యగానములు చూచుచు నిత్యకృత్యములు వదలివేసినా వట నిజమేనా? అని యడిగిరి. అప్పుడు గోవిందుడు "మీ గుణగరిమా తిశయమును వారు పాటలుగా కట్టి పాడుచుండగా పరవశుడనై యవి వినుచు నేను నిత్యకృత్యములు మరచిన మాట నిజమే. క్షమింపుడు" అని తన తప్పు నొప్పుకొనెను. అతనికి గల యాచార్యప్రావణ్యమునకు రామానుజులు మిగుల సంతసించిరి. గోవిందుడు తన కాల మంతయు నీ రీతిగా గురుసపర్యలోనే గడుపుచుండువాడు.

గోవిందుని తల్లి ద్యుతిమతి శ్రీశైలపూర్ణుని చెల్లెలే గదా! ఆమె తన కుమారుని "నీ భార్య పెద్దమనిషి యయి చాలదినము లయినది. ఆమెను మన యింటికి తెచ్చుకొనవలసి యున్నది గదా! ఏమందువు?" అని యడిగెను. దానికి గోవిందుని సమాధాన మిది-- "యతిపతిపద సేవ నేను వదలి విశ్రాంతిగా నున్నపు డా సంగతి జ్ఞప్తి చేయుము." కాని యెప్పుడు చూచినను నారామానుజుల నాతడు వదలియుండు సమయమే ఈమెకు లభింపలేదు. ఇక విధి లేక యామె గోవిందునకు గర్భాధానము చేసి కోడలి నింటికి తీసికొని రావలసిన యవసరము వచ్చి నదని యతిపతికి నివేదించెను.

గోవిందున కపుడు లక్ష్మణార్యులు "ఋతుమతి యైన నీ భార్యను కాపురమునకు తెచ్చుకొనుట నీ కర్తవ్యము కాన నామెను వెంటనే నీ యింటికి తెచ్చుకొనుము" అని పలికిరి. గోవిందుడు విధిలేక యత్తవారింటి కేగి యా శుభకార్యము ముగించుకొని మూడు దినము లచట నామెతో నేక శయ్య నుండెను. కాని యాతని మనస్సు సుంతయైనను కామావిష్టము కాలేదు. నాల్గవ దినమున నాతడు భార్యను తన యింటికి తెచ్చుకొనెను. కాని రేబవళ్ళు యతిపతిస్మరణ సేవలలోనే గడుపు నాతనికి భార్యపైకి మన సెట్లు పోవును? కాన నాతడు రాత్రులందేకశయ్యనుండి గూడ భార్యకు భక్తిజ్ఞానవైరాగ్యములనే. బోధింపసాగెను.

గోవిందుని యీ చేష్టచే నాతని భార్య నానాటికి కృశించి పోసాగెను. అత్తగా "రమ్మా, అల్లేల యున్నా"వని నొక్కి నొక్కి యడుగగా చివర కా నవోఢ తన భర్త తనయెడ చూపుచున్న వైరాగ్యము నామెకు సూచించెను. అపుడు ద్యుతిమతి మరల రామానుజులను "తన కుమారుని యీ నిర్లిప్తత నెట్లయిన తొలగింపవలెనని కోడలితో కాపురము చేయునట్లు చేయు" డని ప్రార్థించెను. వారును గోవిందుని పిలిచి "ఏమోయీ, ఏమి నీ యీ ప్రవర్తన? భార్య నింటికి తెచ్చుకొన్నవాడ వామె నిట్లు బాధింపవచ్చునా? ఇక నైనను బుద్ధితెచ్చుకొని మరుగు చూచుకొని నీ భార్యను కలియు"మని శాసించెను.

కాని గోవిందుని పరిస్థితి యథాప్రకారముగనే యుండెను. ఇది తెలిసికొని యాతనిని 'యేమి యీ విపరీత' మని యతిపతి నిలువదీసి యడిగిరి. అందుల కాతడాచార్యా, నే నేమి చేయుదును? లోపలను వెలుపలను గూడ మీ రూపమే నాకు ప్రత్యక్షమై యంధకారము దూరము చేయుచుండగా నిక నాకు మరు గెక్కడ లభించును? మరుగున భార్యతో సంగమము చేయు మని గదా మీ రాదేశించినారు'— అని పలికెను.

అపుడు యతిపతి యాతనితో 'సరి, అయిన నిక నీకు నీ భార్యపై మనసు పోదని తేలిపోయినది. ఏ యాశ్రమమునన్నవారా యాశ్రమవిధులు నెరవేర్పక తప్పదు. సంసారముననున్నవాడు భగవత్కైంకర్యబుద్ధితోనే భోగముల ననుభవింపవలెను. విషయవిరక్తుడ వయిన నీ విక గృహస్థుడవుగా నుండ దగవు. సంన్యసింపవలసినదే' యని

పల్కిరి. గోవిందుడు గురు వెప్పుడు సంన్యాసమున కనుమతించునా యని ఎప్పటి నుండియో కాచుకొనియుండెను. కాన నాతడు 'నాకు సంన్యాస మనుగ్రహింపు'డని గురువును యాచింప సాగెను. యతిపతి యును గోవిందుని సంన్యాసదీక్షితుని గావించి 'యెంబెరుమానా'రనుతన పేరే యాతనికి పెట్టిరి. గోవిందుడు భీతుడై యా పేరునకు తానెంత మాత్రమును తగ నని యిట్లభ్యంతరము పల్కెను-- "స్వామీ, మీరు సాక్షాత్తుగా శేషుని యవతార మని పేరు మోసినవారు. జగద్గురువు లును, విభూతిద్వయనాయకులునునగు మీకా పేరెంతో తగియున్నది. ఇక నేనో కృతఘ్నుడను. పరవంచకుడను. అట్టి నేను మీ పేరుతో పిలువబడుటయా? శిష్యుని యా మాటకు సంతసించి రామానుజులా పేరును 'ఎంబార్' అని కుదించి గోవిందునకు పెట్టిరి. వారికే మహాచార్యులను నామముకూడ రూఢ మాయెను.

మహాచార్యుడు రామానుజార్యాష్టపది యను స్తోత్రగ్రంథము రచించి మిగుల ప్రసిద్ధిగాంచెను. ఆయన కవిత ఎంత మృదుమధురగంభీరమో తెలిసికొనుటకు స్థాలీపులాక న్యాయముగా నీ శ్లోకముద్ధృతము---

"యో౽ భూ న్నిత్యశిఖామణిః, ర్భువనభృచ్ఛేషః సుమిత్రాసుతః
కేశిప్రాణహరాగ్రజః, స్స్వమహిమా, నిర్ణద్రచించాతరుః
దివ్యో భవ్యగురు ర్మహాన్ యతిపతి, స్స్వామ్యోపయంతా మునిః
సో౽ యం కో౽పి పరః పుమాన్ విజయతాం నిర్వ్యాజచింతామణిః."

## శ్రీ భాష్య నిర్మాణము

ఒకనాడు ధీశాలి యగు రామానుజు లిట్లు తలచిరి-- "యామునార్యుల యవసానసమయమున మూడు మహాకార్యములు నెరవేర్చెద నని వాగ్దానము చేసితివి గదా! వానిలో గూడ నత్యంతముఖ్యము వ్యాసకృత బ్రహ్మసూత్రములకు శ్రీ భాష్యనిర్మాణము. కాన లోకక్షేమ మును దృష్టిలో నుంచుకొని యా కార్యమును నెరవేర్చవలసి యున్నది. కాని యా గ్రంథమునకు భాష్యము వ్రాయవలెననిన పూర్వము దానికి బోధాయనుడను మహర్షి రచించిన బోధాయనవృత్తి (వ్యాఖ్యానము) పరిశీలింపనిదే యా పని సాధ్యము కాదు" అందుచే వారు తన కాంత రంగికుడగు కూరేశుని తమ వెంటనిడుకొని యా గ్రంథము గల కాశ్మీరదేశమునకు బయలుదేరిరి.

కాశ్మీరదేశవాసులకు స్వరద్రూపముతో బాటు ధీవిభవముగూడ జన్మ జాతము. అందును నచటి ద్విజశ్రేష్ఠులు కవిత్వ నిర్మాణ మునందును, వివిధశాస్త్రపాండిత్యమునందును విశ్వవిశ్రుతులు. వారు శారదాపీఠమను నొక సంస్థను స్థాపించి మహత్త్వపూర్ణములగు తాళపత్ర గ్రంథములను భూర్జపత్రగ్రంథములను సంగ్రహించి వానిని ప్రాణపదముగా కాపాడుకొనుచుండిరి. ఆ గ్రంథాలయమందు ఋగ్యజుస్సామాథర్వ వేద ములు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను నారు వేదాంగములు; చతుర్దశ విద్యలు, వీనికి సంబంధించిన గ్రంథములు నన్నియు నానాడు సేకరించిరి. వేయేల, భారతశారదకే యది పీఠము. కాననే యా పీఠము సురభారతీసంస్కృతికి, భారతీయ సంస్కృతికి గూడ పట్టుగొమ్మయై విరాజిల్లె ననుటలో నావంతయు నతిశయోక్తి లేదు.

రామానుజులు కొన్ని మాసములకు కాలినడకతో కాశ్మీరమునకు చేరిరి. వారము రోజు లచట బసచేసి యచట పండితులను వేదాంత శాస్త్రచర్చలో జయించి బోధాయన వృత్తిని తమ కిమ్మని యడిగిరి. కాని యందుకు వారు నిరాకరించిరి. ఈ పడిన శ్రమ యంతము వ్యర్థ మయ్యెను గదా యని హతాశులై యతిపతి కూరేశునితో శ్రీరం గమునకు మరలిరి. పుస్తకము చేతికి చిక్కనందున విచారించుచున్న యతిరాజుకు కూరేశుడు "గురువర్యా, మీరు చింతింపకుడు. అచ్చట నున్న దినములలో రాత్రులందు నే నాపుస్తకమును సాంతముగ పరి శీలించినాను. కాన మీ కందలి విషయ మంతయు తు, చ, తప్పక తెలుపగలను" అని నివేదించెను. ఆ మాటలు లక్ష్మణార్యులు విని తన్ను మించిన శిష్యుడు తనకు దొరికినాడు గదా యని తమ శ్రమ చరితార్థమైనందుకు సంతోషసాగరమున నోలలాడిరి.

శ్రీరంగము చేరి యతిరాజు కూరేశాది శిష్యులతో నిట్లు పల్కిరి— "తత్త్వమసి" మొదలగు వేదాంతవాక్యములకు విపరీతార్థములు కల్పించి యద్వైతవాదులు తమ మతములు స్థాపించుకొనుచున్నారు. కాన వానిని ఖండించుటకు వీలగునట్లుగా బోధాయనవృత్తి నాధారముగా చేసికొని నేను వ్యాససూత్రములకు శ్రీ భాష్యనిర్మాణము చేయదలచినాను. ఇది విశి ష్టాద్వైతదర్శనమునకు పెట్టని కోట కాగలదు. కర్మజ్ఞానభక్తి ప్రపత్తుల ద్వారమున శ్రీమన్నారాయణుని నిత్యనివాసమగు పరమపదము చేర

దగిన మోక్షమార్గ మా గ్రంథనిర్మాణముచే సుకరము కాగలదు.” వారి యీ మహోద్యమమును శిష్యు లందరును కొనియాడిరి. కూరేశుని వలన శ్రీరామానుజులు బోధాయనవృత్తివిషయములు పూర్తిగ తెలిసికొనిరి. వారు బ్రహ్మసూత్రములకు భాష్యము చెప్పుచుండగా కూరేశుడు దానిని వ్రాసెను. ఆదిశేషుని యవతారామగు యతిసార్వభౌము లతిగంభీరవేదాంతార్థములను తమ సులభసుందరవాక్యములతో గంగాప్రవాహమువలె సహజవేగముతో చెప్పుకొని పోవుచుండగా నంతర్వాహిని యగు సరస్వతివలెను కూరేశుడు దాని నాకళింపు చేసుకొనుచు వ్రాయుచు బోయెను. ఈ విధముగా రామానుజులు చెప్పుచుండగా కూరేశుడు శ్రీ భాష్యముతో బాటు వేదాంతదీపము, వేదాంతసారము, వేదార్థసంగ్రహము, గీతాభాష్యము అను గ్రంథములు వ్రాసెను. అంతకు ముందే యతిపతి గద్యత్రయమును, భగవదారాధనక్రమమును రచించి మహాకవిగా వన్నె కెక్కిరి. ఈ గ్రంథముల నిర్మాణముచేతను భగవంతుడగు శ్రీ మన్నారాయణుని స్వరూపరూపగుణవిభూత్యాదులను లోకమందు ప్రకాశింపచేయుటచేతను వారు భగవద్రామానుజులైరి.

ఈ విధముగ యతిరాజు శ్రీ భాష్యనిర్మాణమును గూర్చిన యామునార్యుల ప్రథమ పరితాపమును పోగొట్టి యాచార్యఋణమును తీర్చు కొనినవారైరి.

## దక్షిణ యాత్ర

యతిపతితో వారి శిష్యు లిట్లు విన్నవించిరి-- “మహాత్మా, ఇచటనే యుండి పరవాదిభీకరులై మీ రెంతో సామర్థ్యముతో విశిష్టాద్వైతమును వృద్ధిచేసి జగద్గురువుగా వన్నెకెక్కినారు. కాన నిక మీద మీరు దశదిశలకు గూడ నేగి యితరమత పండితులను జయించి దివ్యదేశములను దర్శింపవలసి యున్నది. అందులకు సంసిద్ధులు కండు.”

వారి విన్నప మంగీకరించి యతిపతి స్వీయశిష్యులను నితర వైష్ణవులను వెంట నిడుకొని ముందు దక్షిణదేశయాత్రకు బయలువెడలిరి. ప్రథమమున చోళమండలమున నున్న దివ్యతీర్థములు సేవించి యచటి పండితులను వాదమున జయించి తన శిష్యులనుగా చేసుకొనిరి. తర్వాత పాండ్యమండలము లోని విష్ణుస్థలములను సేవించి కురుకాపురి చేరిరి.

అదియే ప్రపన్నజనాగ్రేసరులగు నమ్మాళ్వారులను నామాంతరము గల శఠకోపుల జన్మస్థలము. శఠకోపమహత్త్వప్రతిపాదకమును, నాచార్యప్రపత్తిమూలమును నగు మధురకవిరచితమగు "కణ్ణినుణ్ శిరుత్తాంబు" అను దశగాథాత్మకమగు దివ్యప్రబంధమును వారియెదుట భక్తితో విన్నవించిరి. దివ్యసూరి మూర్ధన్యులగు నా శఠారిని తమ యాశుకవితచే స్తుతించిరి---

> "వకుళధవళమాలావక్షసం వేదబాహ్య
> ప్రబల సమయవాదచ్ఛేదనం పూజనీయమ్,
> విపులకురుకనాథం కారిసూను కవీశం
> శరణ ముపగతోఽహం చక్రహస్తేభ చక్రమ్."

పొగడపూలమాలను ధరించినవారును, వేదబాహ్య మతములను ఖండించినవారును, కారిసూనులును, కవిచక్రవర్తియునునగు శఠకోపుని శరణు జొచ్చితిని.

తర్వాత వారు కురంగనగర మను దివ్యక్షేత్రము చేరిరి. దానికి తిరుక్కురుంగుడి యనియు నామాంతరము. శఠకోపు లీ దేవుని గూడ తన సహస్రగీతిలో భక్తితో పాడిరి. మహోన్నతాకారుడగు నా స్వామిని భక్తియుక్తులై భాష్యకారులు ప్రస్తుతించిరి. యతిరాజుని యలౌకిక సామర్థ్యమును గుర్తించిన యా దేవాధిదేవు డాయనతో నిట్లు పల్కెను. "యతిసార్వభౌమా, శిష్టజనరక్షణార్థమై నే నీ యిలపై రామ కృష్ణాద్యవతారములు ధరించినాను. అయినను నన్ను జనులు సామాన్య మానవునిగనే తలచినారు. కంసాదిరాక్షసులను సంహరించి భూభార ముడుపుటకు శ్రీకృష్ణుడనై యవతరించిన నన్ను జనులు కేవలము పశువులమేపు గోపాలునిగనే భావించి నామాటలు పెడచెవిని బెట్టినారు. అంతే గాని జగత్కారణుడ నగు నేను వైకుంఠమునుండి వచ్చి వారి రక్షణకై యీ యిల నవతరించినా నని వా రెంత మాత్రమును ననుకొనలేదు. అట్టి జనుల నందరను నీ వే మంత్రముతో వశపరచుకొన్నావో యని నా కాశ్చర్యము గలుగుచున్నది. ఆ మంత్రమును నాకు గూడ చెప్పిన విని యానందింతును."

యతిపతి వారి కిట్లు సమాధాన మిచ్చిరి-- "దేవాధిదేవా! సర్వజంతుసంతారకమగు మంత్రరత్నమును నానుండి మీరు గ్రహింపదలచుట నా భాగ్యమే యనవచ్చును. అయినను ప్రతిదానికిని నొక

క్రమవిధాన మవసరము గదా! మంత్రోపదేశము పొందువా రవలంబించు విధానమును మీరు గూడ ననుసరించినచో దానిని మీకు చెప్పుటకు నా కెట్టి యభ్యంతరమును లేదు.''

వెంటనే కురంగనగరీపూర్ణులు సింహాసనమునుండి దిగి దానిపై యతిపతిని గూర్చుండ ప్రార్థించి తాము వారి యెదుట భక్తిశ్రద్ధలతో నిలువబడిరి. యతిరా జా సింహాసన మధిష్ఠించి గురువర్యులు మహాపూర్ణార్యులే తమ జిహ్వాగ్రమం దుపవిష్టులైనట్లు భావించి యా దేవుని దక్షిణకర్ణమున నారాయణమంత్ర ముపదేశించి వైష్ణవనంబి యని యాస్వామికి నామకరణము చేసిరి. అపు డా దేవుడు రామానుజులను బ్రహ్మరథమున నారూఢుని చేసి యెంతో గారవించెను. ఈ విధముగా శ్రీమహావిష్ణువునకు గూడ గురుత్వము చేసిన రామానుజు లచటినుండి కేరళదేశమునకు పయనమైరి.

## శారదార్చనము

శ్రీరామానుజులవారు విశిష్టాద్వైతమతమును విష్ణుభక్తిసంప్రదాయమును వృద్ధిచేసి లోకమున ప్రచారముచేయుట కనేక సంన్యాస పీఠములనే గాక 74 గృహస్థపీఠములను గూడ నేర్పాటు చేసిరి. వీరు గృహకృత్యములు నిర్వర్తించుకొనుచునే తమకు యతిరాజు నిర్దేశించిన ప్రచారకార్యక్రమములు కడుసమర్థతతో నిర్వహించుచుండువారు. ఈ పీఠాధిపతు లందరును తమ వెంటరాగా వారు తిరువనంతపురము చేరి యనంతపద్మనాభస్వామిని మూడుద్వారములనుండియు పాదాది కేశపర్యంతము కన్నుల కరవు దీర సేవించిరి. అచట తమ పేరుతో రామానుజమఠము స్థాపించిరి. తర్వాత నా దేశమందలి దివ్యక్షేత్రములను దర్శించి క్రమముగా నితరదేశములను, రాజ్యములను తమ వాదశక్తి చేతను నుపదేశచాతుర్యముచేతను జయించుచు నుత్తరదిశకు సాగిరి.

పశ్చిమసముద్రతీరము వెంట ప్రయాణము చేయుచు వారు ద్వారకకేగిరి. అటనుండి మధుర, బృందావనము, సాలగ్రామము, అయోధ్య, నైమిశారణ్యము, పుష్కరము మొదలగు పుణ్యక్షేత్రములు సేవించి సుప్రసిద్ధమగు బదరికాశ్రమము జొచ్చిరి. అచటి పరమతస్థులను వాదముచే జయించి రెండవపరి కాశ్మీరము ప్రవేశించి శారదాపీఠము చేరిరి.

రామానుజులు తన వద్ద కేతెంచుట తెలిసి శారదాదేవి స్వయముగా తన యాలయపు తలుపులు తానే తెరచుకొని బైటకు వచ్చెను. యతిపతిని తగురీతిని గౌరవించి 'కప్యాసం పుండరీకమేవ మక్షిణీ' యను శ్రుతివాక్యమునకు నీవు చెప్పిన యర్థము వినిపింపుమని కోరెను. వారిట్లు వివరించిరి—

"కం జలం పిబతీత్యస్మాత్కపి రిత్యుచ్యతే బుధైః,
తేన సంస్ఫుటితం పద్మం కప్యాస మితి కథ్యతే.
తత్తుల్యే లోచనే విష్ణోరిత్య ర్థోఽస్యాశ్రుతే ర్మతః.

ఈ యర్థమునకు శారదాదేవి మిగుల నానందించి వారు రచించిన శ్రీభాష్యమును శిరసావహించి గౌరవించెను. వారి హస్తమును తన కరకమలముచే గ్రహించి "బ్రహ్మసూత్రములకు నీ యీ భాష్యము సర్వోత్కృష్టముగా నున్నది. కాన నీవు 'భాష్యకారు లను పేర ప్రసిద్ధుడ వగుదువుగాక" యని శ్లాఘించెను. అంతేకాదు, హయగ్రీవమూర్తి నొక దానిని వారి కిచ్చి దీని యర్చనచే పండితసభలలో నజేయుడవగుదు వని గూడ దీవించెను.

అది విని లక్ష్మణార్యు లా దేవితో "అమ్మా, అరవిందాసన సుందరీ, నాపై నీ వీ విధముగా దయనెరప హేతు వేమి?" యని యడిగిరి. అందుకు వాగ్దేవి "ఇచటికి శంకరాచార్యులు గూడ నీవలెనే వచ్చి కప్యాసశ్రుతికి శ్రీ మహావిష్ణువునేత్రములు కోతిపిఱ్ఱలవలె నెఱ్ఱనివి యని జుగుప్సాకరమగు నర్థము చెప్పెను. నీ వా శ్రుతికి చేసిన వ్యాఖ్య యెంతో సహజముగను యుక్తియుక్తముగను నున్నది. కాననే నీపై నాకు గౌరవమేర్పడినది" అని సమాధాన మిచ్చెను.

అంతకుపూర్వమే యతిపతి మహిమాతిశయము వినియున్న కాశ్మీర దేశాధిపతి, శారదాదేవి గూడ వారిని గౌరవించిన వార్త విని మంత్రి సామంతాదిపరివారముతో నేతెంచి లక్ష్మణార్యుని సమాశ్రయించి వారికి శిష్యుడాయెను.

ఆ దేశపండితు లిది వరకే రామానుజులచే పరాజయమందిరి గదా! వారు యతిపతికీర్తి ప్రఖ్యాతు లఖండముగా నభివృద్ధి చెందుచున్నందుకు లోలోననే కుమిలిపోవ నారంభించిరి. ఇపుడు తమ రాజు కూడ వారి శిష్యుడాయె ననువార్త గోరుచుట్టుపై రోకటిపోటువలె వారికి

దుస్సహమైపోయెను. యతిపతి కనిష్టము కలిగించుట కా తుంటరులు రహస్యముగా నభిచారహోమము చేసిరి. దాని నెరిగిన యతిరాజు తగిన ప్రతిక్రియ గావించి యా సంగతి యెరుగనట్లే ప్రవర్తించిరి. అది బెడిసి కొట్టి యా హోమము చేసినవారినే నానారీతులుగా పీడింపసాగెను. గ్రహావిష్టులవలె నా నీచు లవాచ్యములు పలుకుచు వీథులలో తిరుగసాగిరి.

అది చూచి రాజు "యతిరాజా, వీరు పండితులై యుండి గూడ మూర్ఖులవలె మీయెడ మహాపచారము చేసినారు. అయినను నల్పహృదయులగు వీరి యపరాధము గణింపక దయాసాగరులగు మీరు వీరిని స్వస్థులను చేసి కీర్తిలాభము గాంచు"డని ప్రార్థించెను. ఆ పండితులు మరల రామానుజుల దయచే స్వస్థచిత్తులైరి. వారందరును భాష్యకారుల పాదములపై బడి 'తమ తప్పు క్షమింపు'డని ప్రార్థించుటయే గాక వారి శిష్యులై విశిష్టాద్వైతమత మవలంబించిరి, కాశ్మీరాధిపతి యటనుండి బయలుదేరిన లక్ష్మణార్యులను రెండామడవరకు తన పరివారముతో గలసి వెడలి సాగనంపెను.

ఈ విధముగా శ్రీమద్రామానుజులు శారదాపీఠమునకు రెండవ పరి దిగ్విజయార్థ మేగి శారదాదేవిచే నభ్యర్చితులై భాష్యకారబిరుదము సంపాదించిరి. తద్దేశ భూపాలార్చిత పాదపద్ములై శత్రువులను నిర్జించి వారణాసిక్షేత్రమునకు పయనమాయిరి.

## జగన్నాథ సంభాషణము

భాష్యకారులు సపరివారులై కొన్ని దినములకు కాశీనగరిని చేరిరి. భోగిభోగశయనీయశాయియగు విష్ణువు నచట సేవించి యర్చించి పండిత వర్యులను వాదములో జయించి క్రొత్తశిష్యులను గూడ వెంటనిడుకొని పూరీజగన్నాథమని ఖ్యాతి గాంచిన పురుషోత్తమక్షేత్రము ప్రవేశించిరి. రామానుజమఠము నిర్మించి జగన్నాథస్వామిని సేవించుచు నచటనే కొంతకాలము నిలచిరి.

ఆ క్షేత్రమున పాంచరాత్రాగమప్రకారము పూజార్చనోత్సవాదులను జరిపింపవలె నని వారి కూహాతట్టెను. వెంటనే యచటి యర్చకవర్యుల నందరిని పిలిచి 'భగవత్సేవకులారా! శ్రీరంగాది దివ్యక్షేత్రములందు పాంచరాత్రాగమప్రకారము భగవదారాధనము చేయుచున్నారు.

మీరు గూడ నదే విధముగ చేసిన నీ స్వామిమహిమాప్రభావములు సైతము దినదినాభివృద్ధి గాంచును' అని పలికిరి. కాని యీ సూచన వారికి రుచించనందున సంభాషణ మధ్యముననే త్రుంచి వైచి మొగము మాడ్చుకొని యర్చకులు వెడలిపోయిరి.

ఆ నగరాధిపతిగూడ తమ శిష్యుడే యయినందున రామానుజు లా క్షేత్రమున పాంచరాత్రాగమోక్త ప్రకారముననే బలాత్కారముగ నైన నర్చనాదులు జరిపింప నిశ్చయించిరి. అది తెలిసికొని యాలయార్చకు లా రాత్రి స్వామి సన్నిధికేగి యిట్లు విన్నవించిరి-- 'జగన్నాథా! పురు షోత్తమా! ఎంతో కాలమునుండి సర్వం జగన్నాథం అను సూక్తిప్రకారము పూజార్చనాదులు నడచుచున్న యీ క్షేత్రమున రామానుజుడను యతి పతి దక్షిణాదినుండి వచ్చి పాంచరాత్రార్చన విధానమును ప్రవేశపెట్ట బూనుకొన్నాడు. మేము చిరకాలమునుండియు ప్రస్తుతపద్ధతికే యల వాటుపడి యున్నాము. కాన నిచట క్రొత్త పద్ధతి యేర్పడినచో మే మందరము కట్టకట్టుకొని సముద్రమున దూకవలసినదే గాని మార్గాం తరము లేదు" అని మొఱపెట్టుకొనిరి. అపుడు జగన్నాథుడు 'అర్చక పరాధీనో విధత్తేఽఖిలం' అను ప్రాచీనసూక్తి ననుసరించి వారియెడల కరుణాళువై "మీకేమియు ప్రమాదము రానీయను, నిశ్చింతగనుండు" డని యభయ మనుగ్రహించెను.

ఆ రాత్రి యీ స్వామి యతిపతికి స్వప్నమున ప్రత్యక్షమై "రామా నుజా, ఏమి నీ బలత్కారము! ఈ నా క్షేత్ర పూజాపద్ధతిని మార్ప నీ కే మంత యవసరము వచ్చినది?" అని యడిగెను. అందులకు వారు "శ్రీరంగాది దివ్యక్షేత్రముల మహిమ దీనికి గూడ కల్గించు టకే నా యీ ప్రయత్నము. మీ క్షేత్రమున నాళ్వారుల ప్రతిష్ఠ లేదు. దివ్యప్రబంధానుసంధానము మొదలే లేదు. అది లేని మీ యాలయము శిష్టపరిగృహీత మెట్లు కాగలదు?" అని యెదురుప్రశ్న వేసిరి. అందుల కా జగజ్జనకుడు "తక్కిన వైష్ణవక్షేత్రములు నీ యిచ్చ వచ్చినట్లు చేసికొనుము. నా కభ్యంతరము లేదు. ఇది యొక్కటియు నా యధీనమున నుండనిమ్ము. ఇది పతితపావన క్షేత్రము. సర్వప్ర వేశార్హము. ఇచట ప్రజలందరు స్వేచ్ఛగా మద్భజనపరులై సంచరించి యిహపరములు పొందగలరు" అని పలికెను.

"ఆ పద్ధతి నా కిష్టము లే" దని యతిపతి మరల సమాధాన మిచ్చిరి. ఇది యంతయు రామానుజుల స్వప్నగత సంభాషణము.

ఈయన నిచట నుండనిచ్చినచో తన పూనిక నెరవేర్చుకొనక మానడని తలచి జగన్నాథుడు లక్ష్మణార్యుల నా నిద్రావస్థలోనే యోగ మాయచే శ్రీకూర్మమునకు పంపివైచెను.

## శ్రీ కూర్మనాథుడు

"హరిః పరాయణం పరం హరిః పరాయణం పరమ్,
పునః పునర్వదామ్యహం హరిః పరాయణం పరమ్."

అని హరి నామోచ్చారణము చేయుచు తెల్లవారగనే రామానుజులు నిద్ర మేల్కాంచిరి. కాని కండ్లు తెరచి చూడగనే వారి యాశ్చర్యమున కంతు లేకపోయెను. "ఇదేమి, నే నెచట నున్నాను? ఇది నేను రాత్రి నిద్రించిన తావు గాదే!" యని తలచి వారు బైటికి వచ్చి పరిశీలించి చూచి యది శ్రీకూర్మక్షేత్ర మని గ్రహించిరి. వారివద్ద నూర్ధ్వపుండ్ర ధారణమునకు తిరుమణి (శ్వేతమృత్తిక) లేనందున నుపవాసముతోనే యా దిన మంతయు గడపి రాత్రికి నిద్రగూరిరి.

స్వప్నమున శ్రీకూర్మనాథుడు వారికి ప్రత్యక్షమై యిట్లు పలి కెను— 'యతిరాజా, నీ రాక మాకు చాల నానందదాయకముగా నున్నది. ఇచటి శైవు లజ్ఞానముచే నన్ను శివలింగమని భావించి పూజించుచున్నారు. వారి కన్నులను మాయ కప్పివైచినది. నే నిచట శంఖచక్రాదిధరుడనై యున్నాను. నీ విప్పుడు నన్ను విమ ర్శించి చూడుము. నా యాలయము నెదుట స్వచ్ఛమగు తిరుమణి గలదు. దానిని నీవు ధరించి నన్నారాధించి మదర్పితాన్నము భుజిం పుము. కొన్ని దినములు నీ విచట నుండిన నాకు గూడ తృప్తిగా నుండును. నీ వారందరును జగన్నాథమునుండి యిచటికే రాగలరు. ఈ క్షేత్రమును నీ యిష్టానుసారము దివ్యక్షేత్రముగా మార్చుము.'

యతిపతియు నుదయముననే నిద్రలేచి తనకు వచ్చిన కలకు మిగుల వింత పడిరి. దైవదేశానుసారము తిరుమణి తెచ్చి యూర్ధ్వపుండ్ర ములు ధరించిరి. జపతపాదుల తర్వాత దేవతార్చన చేసి తన్నివేదిత

పదార్థము నానందముతో భుజించిరి. అచట వా రా నాడే పాంచ రాత్రాగమ ప్రకారము పూజావిధానమును, దివ్యప్రబంధానుసంధానమును మొదలు పెట్టిరి. శ్రీకూర్మవాసు లందరును యతిరాజు భక్తిప్రభావా దులను గమనించి వారికి శిష్యులయిరి. జగన్నాథమున నున్న తమ పరివారమంతయు నెమ్మదిగా శ్రీకూర్మము చేరువరకు వారచటనే యుండిరి.

కొంతకాలము వారటనే శ్రీకూర్మనాథుని సేవించుచు నివసించి సింహాచలమునకు ప్రయాణమైరి.

## సింహగిరి కృష్ణమార్యకవి

శ్రీరామానుజులు సింహాచలము కొండక్రింద నున్న జనార్దన స్వామిని సేవించి భక్తితో సపరివారులై యా కొండనెక్కిరి. అచటి తరుగుల్మలతాదుల ప్రకృతిరామణీయకము నేత్రోత్సవముగా దర్శించుచు నా యానందముచే నొడలు పులకరింపగా కొండపైకి చేరిరి. అచట లక్ష్మీవరాహనరహరిని తనివి దీర సేవించి గంభీర వేదాంతసూక్తులతో నాయన మహిమను పలురీతులుగా ప్రస్తుతించిరి. వారి తీర్థప్రసాద ములు స్వీకరించి యాలయమునుండి బైటకు వచ్చుచు రామానుజులా యాలయ మండపమున కృష్ణమాచార్యుడను నొక రాజసబ్రాహ్మణుని చూచిరి. ఆయన భగవత్కవి గూడ. ఆ కవిశేఖరుడు చిటితాళము లును, వీణెయును చేతుల బూని యా నరసింహుని పాటలు గట్టిగా పాడుచుండగా నా దేవు డాతని పాటలకు పరవశుడై యొడలు మరచి నాట్యమాడుచుండువాడట.

ఈ రసవత్కథ నాచార్యసూక్తిముక్తావళి యను నాంధ్రదివ్య ప్రబం ధమునందు శ్రీమాన్ నంబూరి కేశవాచార్యకవి మృదుమధురోక్తులతో కన్నులకు గట్టినట్లు చిత్రించినారు. మనము గూడ నా మహాకవివాక్కు లతోనే యా కథ ననుసంధించుకొని యానందాబ్ధి నోలలాడుదమురండు!

కృష్ణమార్యుని యహంకారముగుర్చి వినియున్న యతిపతి దానిని తొలగించి యాతనిని సత్త్వగుణసంపూర్ణుడగు ప్రపన్నునిగ నొనరింప దలచి యాతనితో నిట్లనిరి-- "ద్విజవర్యా, మీరీ నరసింహస్వామిని ప్రతిరాత్రియు భక్తిరసప్రకర్షచే మీకన్నుల మ్రోల నాడింపగలరని విని

యున్నాను. దయతో మీరీ రాత్రి యాతనిని 'ఎంబెరుమానారు' అను యతిపతి మన యీ కొండకు నిన్ను సేవింపవచ్చినాడు. ఆయనకు మోక్షమున్నదా లేదా' యని యడిగి దానికి తగిన సమాధానము తెలిసి కొని నాకు తెలిపినచో సంతసింపగలను, శ్రమయనక యీ యుపకారము నాకై చేసి పెట్టుడు."

"ఓ, అదెంత పని? ఇది యేమి భాగ్యమా, బంగారమా? తప్పక యడిగి నీకు సమాధానము చెప్పగల" నని కృష్ణమార్యుడు సమాధాన మిచ్చెను.

సీ. అంతట కృష్ణార్యుఁ డారాత్రి హరిమ్రోలఁ
దాళంబు వీణె హస్తములఁ బూని
పాడ నా నరహరి యాడుచుండెడివేళ
యతిరాజు వృత్తాంత మంతఁదెలుప
నతనికిఁ గలుగగా నాతఁడిచ్చినవారి
కందఱికిని మోక్ష మబ్బు ధ్రువము
అని హరి పలికిన నా కృష్ణమార్యుఁ డా
యతిపతి దొడ్డ వాఁడనుచు దెలిసి,
తే. హరిని వీడ్కొని తన గృహమందు నిద్ర
నల్పిప్రొద్దున మేల్కాంచి సంధ్యవార్చి
దేవళము జెందె నెప్పటి తెఱంగు ననుచు
వాదిభీకరగురుం డనె మోదమలర."

కృష్ణమార్యు డా రాత్రి నరసింహదేవునకు రామానుజు లడిగిన విషయము విన్నవించెను. "యతిరాజుకు మాత్రమే గాదు, ఆయన యెవరి కిచ్చిన వారికే మోక్షము లభింపగలదు" అని యా దేవుడు సమాధానమిచ్చెను. "ఈ సంన్యాసి సామాన్యు డనుకొన్నాను. ఈతడు గొప్పవాడే నన్న మాట" యని కృష్ణమార్యు డనుకొనెను.

మరునాడు రామానుజు లాతనిని చేరి "ఏమండీ, నా మాటలకు హరి యేమని సమాధాన మిచ్చె" నని ప్రశ్నించిరి. దాని కాతడు "నీకు మాత్రమే గాక నీ విచ్చిన వారందరకును మోక్షము లభింపగలదని హరి చెప్పె" నని జవాబిచ్చెను.

సీ. "భక్తిసంపద్గర్వపరిపూర్ణుఁడైనట్టి
యా కృష్ణమాచార్యు లన్నమాట
లాలకించి యతీంద్రుఁడతని కిట్లని పల్కె
గలుగునో లేదో మోక్షంబు నీకు

నడుగుమీ యా హరి నని పల్క నాతఁడు
భాష్యకారుల కిట్లు పలికె మరల
హరిని గన్నుల మ్రోల నాడింపఁగల మాకు
సంశయ మేమి మోక్షము లభింప
తే.ననుచు బల్కిన నతనికి యతివరేణ్యు
డడిగినను దప్పలే దన నతఁడు హరిని
దెలియ నడిగెద నని సమ్మతించెననుచు
వాదిభీకరగురుం డనె మోదమలర.”

హరిభక్తిసంపద నా యొక్కని చేతిలో మాత్రమే కలదని విఱ్ఱవీగు నా కృష్ణమాచార్యునితో యతిపతి “నా సంగతి యడిగినట్లే మీకు కూడ మోక్ష మున్నదో లేదో యీ రాత్రి విష్ణువు నడిగి రేపు వచ్చి చెప్పడు” అనిరి. దాని కాతడు “ఏమీ, శ్రీమహావిష్ణువును కనుసైగతోనే నాట్లాడింపగల మాకు మోక్షము లభింపకపోవుటయా” యని కనుబొమలు ముడివడగా ప్రతివచన మిచ్చెను. “నా విషయ మడిగినట్లే మీవిషయము గూడ నడిగిన తప్పేమిటి?” యని యతిరాజాతని సమాధాన పరచిరి. ‘వల్లె’ యని కృష్ణామార్యుడును సమ్మతించెను.

కృష్ణమార్యు డా రాత్రి నరసింహస్వామిని గీతవాద్యములచే ప్రపన్నుని చేసుకొని “మరి నాకు మోక్షము కలదా లేదా చెప్పు” మని యడిగెను. దాని కా దేవుడు నిరుత్తరుడాయెను. “ఏమి స్వామీ, సమాధానము పలుకక మౌనము దాల్చినా రేల” యని తన ప్రశ్న నాతడు రెట్టించెను. అపుడా స్వామి యిట్లు పలుకుచున్నాడు—

సీ.“ముక్తి నా సొమ్మని ముల్లోకము లెఱుంగు
మూలస్మృతులు వేదజాల మెఱుంగు
నా ముక్తి యయ్యెఁ బరాయత్త మెట్లన్న
వినుము చెప్పెద నీకు విశదముగను
మాకు దక్షిణపెల్లు మహి రంగధామ మం
దహిరాట్శయాను న న్నడిగినంత
నెంబెరుమానారు కిచ్చితి ముందు నే
నుభయవిభూతల నూర్జితముగ
తే.నిచ్చెదను గాని మరల నే నేమిగొనను
గనుక సంశయమయ్యె నీ కాంక్షఁ దీర్ప
భక్తవశ్యుఁడనే నని పలికె ననుచు
వాదిభీకరుగురుఁడనె మోదమలర.”

"మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్' అను నభియుక్తోక్తి ననుసరించి మోక్షము నా చేతిలోనిదే యను మాట సర్వవిదితము. కాదనను. అయినను మోక్ష మెవరికైన నిచ్చుట యనునది యిపుడు నా చేతులు దాటిపోయినది. కారణము వివరింతు నాలకింపుము. మాకు దక్షిణ మున విశ్రాంతిగృహము శ్రీరంగధామము. అచట నే నాదిశేషునిపై శయనించియుండగా నీ యెంబెరుమానారు మోక్షముపై నధికారము తనకిమ్మని యడిగెను. దాని నాతని కిచ్చివైచితిని. ఇచ్చినదాని నుదారులు స్వీకరింపరు గదా! కాననే నీ కోర్కి యెట్లు తీర్చుటయాయని సందిగ్ధావస్థలోపడి నీకు సమాధానము చెప్పలేకపోయినాను. కాని వేరేమియు గాదు.

"ఉభయవిభూతులను (ఇహపరలోకములు) నుడయవరుల కిచ్చిన నాటినుండియును వాని నాతడే ఎవరికైనను నీయదగియున్నాడు. నాకు మోక్ష మిచ్చు నధికారమెంత మాత్రమును లేదు. కాన నీకు ముక్తికలదో లేదో యతిపతియే తేల్చి చెప్పవలసిన విషయము."

శ్రీహరి పలికిన యీ పలుకులకు కృష్ణమార్యు డొడలు మండి యా స్వామి నిట్లు తూలనాడుచున్నాడు-- "అక్కటా, ఒక్క బోడి సంన్యాసికై నావంటి యాంతరంగిక భక్తుని కూడ వంచించుటయా! ఇది యేమి న్యాయము! ఏ పాప మెరుగని మా సీతమ్మ తల్లి నగ్నిప్రవేశము కావించిన కిరాతకుడవు కావా నీవు? అట్టివాడ వెంత మిత్రద్రోహమునకైన నొడిగట్ట. గలుగుదువు!

సీ. "కలకాలమొకరీతి గలగీతములఁ బాడి
కవితయుఁ జెప్పి నీకడనె యుండి
నీ నృత్యకేళికి నిత్యసాహ్యము జేసి
నిన్నుఁ గన్నులఁబ్రోల నే భజించి
నిఖిలలోకములలో నే దొడ్డభక్తుఁడ
నని పేరువడి యెప్ప డాత్మఁ నిన్నఁ
గడపముంగిట కల్పకం బని తలఁతు నా
ముంగొంగు పసిఁడని మురియుచుండు

తే. భక్తిభావన లన్నియుఁబదటఁ గలసె
మాయసంన్యాసి నిన్నేమొ మరులుకొల్పె
ననుచుఁ బలికెను గృష్ణార్యుఁ డతని కనుచు
వాదిభీకరుఁగురుఁ డనె మోదమరల.

పుట్టి బుద్ధియెరిగిన నాటినుండియు నీ యెదుటనే మధురగీతిక లాలపించితిని. నీ మీదనే కవిత చెప్పితిని. రేబవళ్ళు నీ ముంగిటనే పడిగాపులు పడి యుంటిని. నీ వాడుటకే నేను పాడితిని. నిన్నే కన్నులలో పెట్టుకొని భజించితిని. కృష్ణమాచార్యునివంటి భక్తుడు కంచుకాగడా వేసి వెదకినను లభింపబోడని ముల్లోకముల మెప్పు వడసితిని. నా భక్తిభావన లేయేట గలసినవో గదా! ఆ మాయసంన్యాసి నీ కేదో మందుపెట్టి యుండబోలును."

శ్రీహరి యాతని కిట్లు సమాధాన మిచ్చుచున్నాడు-- "ఓయీ, నన్ను దూఱ నేమి ప్రయోజనము? నీ యహంకారమే నీ కిట్టి ప్రాయశ్చిత్తము చేసినది. అకారత్రయము నెరిగి (అనన్యార్హ శేషత్వము, అనన్యశరణత్వము, అనన్యభోగ్యత్వము) అర్థపంచకజ్ఞానవంతులై పంచ సంస్కారములను పొందిన ప్రపన్నులకు మాత్రమే ముక్తి కరతలామలక మగును. అట్టి వారే పరమపదము చేర నర్హులు.

సీ. "భువిఁ జరాచరరూపములు రెండు మా కగు
  వినుము నీ కవి రెండు విశదపఱతుఁ,
జరవిగ్రహము దొడ్డ సంన్యాసిరూపము
  ట్లచరరూపము విగ్రహాదికంబు
అస్మత్స్వరూపు రామానుజాచార్యాఖ్య
  శాస్త్రోక్తయుతి సదారనిరతుఁ
గను గొని లేచి మ్రొక్కక యూరకుంటివి
  పాడితి నని గర్వపడితి వీవు
తే. భక్తిభావనకతనఁ గన్పడితి నీకుఁ
  బాడితివి గాన నాడితిఁ బరమ పదము
జ్ఞాననిష్పాద్య మని పల్కెఁ జక్రి యనుచు
  వాదిభీకరగురుఁ డనె మోదమలర.

నేను రెండు రూపములతో భువిపై సంచరించుచుందును. ఒకటి చరరూపము. నా చరరూపమే యాచార్యుడు. రామానుజులే యా యాచార్యుడు. రెండవది యచర రూపము. అదియే యాలయము లందలి యర్చావతారము. నే నొక ప్రక్క రామానుజుల రూపముతో ప్రపన్నుల కిహపర లాభము కల్గించుచు మఱొక ప్రక్క శ్రీరంగాది దివ్య ప్రదేశములం దర్చారూపము ధరించి భక్తాభీష్టప్రదుడనై యుందును. అట్టి నా స్వరూపమగు నెంబెరుమానారును నీవు దర్శింపగనే లేచి నమస్కరింప వైతివి. నరసింహుని నాడింప గలవాడ నైతిని గదా యని

గర్వముతో విఱ్ఱవీగితివి. నీ భక్తికి తగిన ప్రతిఫల మెప్పటి కప్పుడే ముట్టజెప్పుచున్నాను గదా! నీవు పాడినావు, నేను ఆడినాను. సరికి సరి. ఇక పరమపద మందువా? అది జ్ఞానైకసాధ్యము. నీవు నన్నన రాని మాటలన్నావు గాన నీ కవిత్వ మగ్రజన్మముల వారి కంటరానిదై మాలదాసరుల పరమగు గాక!"

కృష్ణమార్యుడు గూడ హరి యిచ్చిన యీ శాపముచే నొడలు మండి "నీ గుడిశిఖరము నేల గూలును గాక! ఏడు దినము లహోరాత్రములు కాలిపోయి గూడ నీ గుడి చెక్కు చెదరకుండు గాక!" యని ప్రతిశాపమిచ్చెను.

శ్రీహరి శాపానుసారము కృష్ణమార్యుల కీర్తనలు శిష్టపరిగ్రహ యోగ్యము కాకపోయెను. ఆ భక్తుని శాపము ననుసరించి కొంతకాల మేగిన తర్వాత 'మలికినేబ' ను యవనుడచటకు వచ్చి యీ దేవుని గుడి విమానము నేల గూల్చెను. కూల్చించి యాత డా గుడిని గూడ నేలపాలు చేయుటకు ఎంతో ప్రయత్నించెను కాని యీ గర్భగుడి కాని విగ్రహములు కాని యెంతమాత్రమును చెడిపోలేదు.

చంటిబిడ్డకును కన్నతల్లికిని నడుమగల సంబంధము వంటిది గదా భక్తునకును భగవంతునకును గల సంబంధము! కొద్ది దినములకే కృష్ణమాచార్యుడు తన తప్పు తెలిసికొనెను. విష్ణువునే సర్వస్వముగా నమ్మిన యీ భక్తవరుడు పశ్చాత్తప్తుడై మరల నొక రాత్రి వెళ్ళి సింహాద్రి నాథుని పాదపద్మములపై బడి తన తప్పు గావ వేడెను. అపుడా హరి "ఓయీ! పిచ్చివాడా, పదునాల్గులోకములను కాపాడునట్టి నాకు నిన్ను బ్రోవ భారమా! నన్ను చేరిన ఘోరాపరాధిని గూడ రక్షించుటకే కంకణము కట్టుకొన్నా నని నీ వెరుగవా! 'రామో ద్విర్నాభిభాషతే' శ్రీరాము డాడినమాట తప్పవాడు గా డని గదా నా ప్రతిజ్ఞ—

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేతద్వ్రతం మమ."

ఒక్కసారి నేను నీ వాడను అని శరణుజొచ్చిన వానికి సదాభయ హస్తముద్రిక ననుగ్రహింతును. ఇది నా వ్రతము గదా! ఇప్పటికైనను యథార్థము గుర్తించి రామానుజుల నాశ్రయించినచో నీకు మోక్షము

కరతలామలకము కాగలదు. కాన నిక నైన నాలసింపక యాతని చేరి యాశ్రయించుట నీకు లగ్గు!"

కృష్ణమార్యుడు విధి లేక మరునా డుదయము యతిపతి వద్ద కేగెను. ఆ యతిపతి వైభవ మెట్టిదో కాంచి యానందింతమా---

సీ. "ధవళమృద్విరచిత ద్వాదశచ్ఛిద్రోర్ధ్వ
పుండ్రమధ్యములందుఁ బొలుపుమీఱఁ
బదునాల్గు వన్నెల బంగారుచాయలు
గలుగు శ్రీచూర్ణరేఖల ధరించి
తులసీసరోజాక్షకలితమాలికలను
లలితకంఠముల నలంకరించి
గురుని కెల్లప్పుడు కోరి దాస్యముసల్పు
శంఖచక్రాంకితచారుభుజుల
గీ. యతుల నేకాంగులను బీఠపతుల నిట్లు
సంఖ్యలేనట్టి వైష్ణవసంఘములను
జూచి యుక్కఁ జపడెఁ గృష్ణసూరి యనుచు
వాదిభీకరగురుఁ డనె మోదమలర."

ద్వాదశోర్ధ్వపుండ్రధారులై తులసిమాలలు, తామర పూసల మాలలు కంఠములందు ధరించి చక్రాంకితులైన శ్రీవైష్ణవులు వేలసంఖ్యలో శ్రీరామానుజులను సేవించుచుండిరి.

అట్టి రామానుజుల నివాసమునకు ముందు వేత్రహస్తులగు ద్వాంపాలురు కావలి గాయుచుండిరి. వారి ద్వారా యాతడు "కృష్ణమాచార్యు డను బ్రాహ్మణుడు దర్శనార్థియై వచ్చి యున్నా" డని యతిపతికి వార్త నంపెను. "కృష్ణమాచార్యు డను వానితో మా కేమియు పనిలే" దని యతిపతి సమాధాన మంపిరి. ఈ వార్త మరల శ్రీహరి కెరిగించి కృష్ణమార్యుడు దీనవదనముతో 'నిప్పుడేమి చేయుమందు' వని యడిగెను.

అందులకు నరసింహస్వామి యిచ్చిన సమాధాన మిది-- "కృష్ణమాచార్యుడు వచ్చినా డని యతిపతికి వార్త నంపుటయే నీ కీ ముప్పు తెచ్చి పెట్టినది. కాన నీ సార్థియైన నభిమానమువదలి "నీ పాదదాసుడు కృష్ణదాసుడు వచ్చినా' డని కబురు ఘంపినచో నీ తలచుకొన్న కార్యము సానుకూలము కాగల"దని యానతిచ్చెను.

మరునా డుదయము కృష్ణమార్యుడు స్వామిచెప్పినట్లు చేయగా నెంబెరుమానారు వారిని ప్రేమతో తనవద్దకు పిలిపించుకొనిరి. అపుడు కృష్ణమార్యు డెంత బ్రహ్మానంద మనుభవించెనో వర్ణించుట కీ పద్యము మాత్రమే తగియున్నది.

సీ. "పుట్టుదరిద్రుండు భూరిశేవధి భంగి
జాత్యంధకుండు నిరీక్షణము మాడ్కి
ధన్వధ్వనీనుండు ధారాసలిలమట్లు
వికలపాదుం డంఘ్రి విప్లాతికరణి
నా కృష్ణమార్యుండు యతిపతి సన్నిధి
జెంది యావందించి సిరివహించి
దండప్రణామంబుఁ దగఁ జేసి యున్నంత
నతనిఁ గటాక్షించి యతివరుండు
తే. పంచసంస్కారముబు నర్థపంచకంబు
నాకృతిత్రయు మాదిగా నఖిలహితము
లాచరించి వచించె నిట్లతని కనుచు
వాదిభీకరగురుఁ డనె మోదమలర."

నిరహంకారుడై సాష్టాంగ దండప్రణామ మాచరించి యెదుట చేతులు కట్టుకొని వినయముతో నిలువబడియున్న కృష్ణమాచార్యులకు యతిరాజు దయతో పంచసంస్కారముల ననుగ్రహించెను. 'వత్సా, ఈ సింహాద్రినృసింహుని మహిమ వాచామగోచరము. నా పనుపున నీవీ స్వామి నర్చించుచు నిందే వర్ధిల్లు' మని పలికి లక్ష్మణార్యులు కృష్ణమార్యుల కా నరహరి కైంకర్యసంపదనే మరల నప్పగించి యా క్షేత్రమును వదలి ముందుకు సాగిరి.

సీ. "ఏ సూరి రజకుని యింట వ్రుతానుజు
నడపించెఁ బిత్రుకాననంబు దనుక
నా బ్రహ్మరుద్రులకైనఁ గన్పడనట్టి
నృహరి నాడించెను నిత్య మెవ్వఁ
డెవని శాపమున సర్వేశుని గుడిమైన
నేడహములు కాలె నేకరీతి
నట్టి కృష్ణార్యుని కైన లక్ష్మణముని
నాశ్రయింపక ముక్తి యమరదమ్మ
గీ. నట్టి రామానుజార్యుల నాశ్రయింప
కున్న కుమతికి మోక్షేచ్ఛ యంబుదధి వింధ్య
పర్వతప్లవకాంక్షగాఁ బరఁగు నమచు
వాదిభీకరగురుఁ డనె మోదమలర."

ఒక చాకలివాడు చనిపోగా నాతని శవమును శ్మశానమువరకు నడపింపగల్గిన మహామహిమాన్వితుడు కృష్ణమాచార్యుడు. బ్రహ్మరుద్రేంద్రాదులకు గూడ నగమ్యుడైన విష్ణువును తన కవితామృత గానముచే కట్టివేసిన మహాభక్తుడాతడు. అంతటివానికి గూడ రామానుజాచార్యుల నాశ్రయింపనిదే మోక్షము లభింపలే దనిన నితరులమాట వేరుగా చెప్ప నేల?

## కృష్ణమాచార్యుని కవితాచంద్రిక

ఈ కృష్ణమాచార్య మహాకవి క్రీ. శ. 13 వ శతాబ్ది చివరి భాగమున జన్మించి 14 వ శతాబ్ది పూర్వభాగమున జీవించెనని చరిత్రకారులు చెప్పుచున్నారు. అప్పుడీతడు రామానుజుల సమకాలికుడగుట పొసగదు. అది విషయాంతరము గదా! అప్పుడైనను రామానుజుల తర్వాత నీతడు జన్మించి హరిభక్తు డగుటలో విప్రతిపత్తి యుండదు.

ఈతడు సంకీర్తనము లనుపేర బరగిన భక్తిపరమగు వచనైకరచన కాదికవి. వీనిని పదకవిత లనియు నందురు. సింహగిరి నరహరిని స్తుతించునవైనందున వీనిని సింహగిరివచనము లను పేరుతో హైదరాబాద్ ఆంధ్రరచయితల సంఘమువారు ప్రచురించి సాహితీపరుల యాదరాభిమానములను దోచుకున్నారు. కృష్ణమాచార్యకవి కవితాసౌరభము నాస్వాదింప కుతూహలము కలిగియున్నవారి కీ నాటికీ ప్రచురణకర్తల పుణ్యమా యని వానిని స్థాలీపులాక న్యాయముగనైన రుచిచూచు భాగ్యము కల్గినది. ఈ సందర్భమున శ్రమకోర్చి యీ గ్రంథమును కూర్చిన సంపాదకులు శ్రీ డాక్టరు యమ్. కులశేఖరరావుగా రభినందనీయులు.

ఈ వచనములు భక్తిరసపూర్ణములు; విష్ణుస్తుతి గర్భితములు. ఇవి హృదయార్తిస్ఫోరకములై గానయోగ్యతను గూడ సంతరించుకొని రామాయణమువలె "పాఠ్యే గేయే చ మధురం" అను ఖ్యాతిని గడించుకొన్నవి. భావములలో ఇట్టిదే హిందీభాషలోని తులసీదాస విరచిత వినయపత్రిక. వీనికి ఛందోనియమము గాని పరిమాణనియమము గాని లేవు. శతకములకువలె వీనికి మకుటము సైతముండుట విశేషము!

ఇవి చాతుర్లక్షసంఖ్యాక మని కృష్ణమార్యుడే పేర్కొన్నాడు. కాని యిందు శతాంశభాగము మాత్రమే లభించుట మన దురదృష్ట మనక తప్పదు.

మహాభారత హరివంశాదులశైలినే యీ వచనములు గూడ పోలియున్నవి. వీని రచన లాక్షణికము; సరళము, సుబోధము. శ్రీరామానుజుల గద్యత్రయమును దృష్టిలోనుంచుకొని యీ వచనములు రచింపబడిన వని వీనిని సూక్ష్మేక్షికతో పరిశీలించువారికి తట్టకపోదు.

"గద్యం కవీనాం నికషం వదంతి" గద్యమే కవులరచన కొరపిడి రాయి. "వాక్యం రసాత్మకం కావ్యం" -- రసవంతమగు వాక్యమొక్కటియైనను కావ్యమేయగును "విశ్వశ్రేయః కావ్యం" -- లోకక్షేమము కూర్చునదే కావ్యము -- అను కావ్యనిర్వచనము లీ వచనములయెడ సర్వథా సార్థక మగును. కాన సాహిత్యరీత్యా పద్యమున కెంత గౌరవము గలదో గద్యమునకు గూడ నంతేగల దనుట కీ క్రింది యుదాహరణలే చాలును. నన్నయభట్టారకుడు ఆంధ్రపద్యకవిత కాద్యుడయినట్లే యీకవి వచనైకరచన కాద్యుడగుట మన యాంధ్రజాతికిని, ఆంధ్రసాహితికిని గూడ గర్వకారణము!

1. "దేవా, విష్ణుభక్తిలేని విద్వాంసునికంటె హరికీర్తనము చేయునతఁడే కులజుండు. శ్వపచుం డైన నేమి? ఏ వర్ణంబైన నేమి? ద్విజునికంటె నతడె కులజుండు, దృష్టింజూడగా విద్వజ్జన దివ్యభూషణము, సింహగిరి నరహరి దలంచిన యాతండె కులజుండు. సంధ్యాదినిత్యకర్మానుష్ఠానంబులు దప్పక నడపిన నేమి? చతుర్వేదషట్శాస్త్రములు సదివిననేమి? శతక్రతువు లాచరించిన నేమి? సకల ధర్మంబులు సేసిన నేమి? మా సింహగిరి నరహరిదాసులకు దాసులైనం గాని లేదు గతి! స్వామీ? సింహగిరి నరహరీ, నమో, నమో దయానిధీ" (ఇది మకుటము)

2. "దేవా! అంకిలి యనియెడి తెవు లింటింటికిఁ ద్రిప్ప. అసత్యకృతమే ముప్ప. తగవుధర్మము నడపినదే యొప్ప. అనాథపతీ; నరహరీ; మిమ్ముఁ దలంపనిదే తప్ప."

3. "దేవా! శ్రీమన్నారాయణా, పరబ్రహ్మస్వరూపా, అఖిలాండ కోటిబ్రహ్మాండనాయకా, వేదవేదాంతవేద్యా, పురాణ పురుషోత్తమా, పురందరవంద్యా, దేవా, కపటనాటక సూత్రధారీ, మాయావినోదా, అగణితమహిమావతారా! ఆశ్రితజనమందారా, సకలకల్యాణగుణోన్నతా, సకలజగదంతర్యామీ, శ్రీమదయోధ్యాపురవరాధీశ్వరా, దశరథరాజనందనా, కౌసల్యాగర్భశుక్తిముక్తాఫలా!"

4. "దేవా, ఏడు రామాయణములు, పదునెనిమిది పురాణములు, భగవద్గీతలు, సహస్రనామంబులు మొదలయినవి చదివిరేమి? వినిరేమి? వ్రాసిరేమి? మీ సంకీర్తనకు వెయ్యొవపాలింటికి సరిరావు. కడమ సంకీర్తన లనేకసార్లు విన్నారు. ఇందుకు తప్పదు. మీ శంఖచక్రంబు లాన, మీ పాదపద్మంబు లాన, నారాయణ, నారాయణ యని మంత్రం బని రేమి? దూది కొండలమీద వటబీజమాత్ర మగ్నిహోత్రుడు ప్రవేశించిన దగ్ధంబై పోదా!"

5. "దేవా, పెద్దతనంబునఁజేసి మిమ్ము మెప్పించెదనంటిన్నా, జాంబవంతుండు, మీసన్నిధినే యున్నాఁడే దేవా, బుద్ధినే మెప్పించెదనంటినా, విభీషణుండు మీసన్నిధినే యున్నాఁడే. దేవా, బంటుతనంబుజేసి మిమ్ము మెప్పించెదనంటినా, అంజనీదేవిసుతుండు హనుమంతుడు మీ సన్నిధినే యున్నాఁడే. దేవా, తీర్థంబు లాడి మిమ్ము మెప్పించెద నంటినా, సూర్య చంద్రాదులు మీసన్నిధినే యున్నారే. దేవా, వేదవేద్యుండనై మిమ్ము మెప్పించెదనంటినా, బ్రహ్మ మీ నాభికమలమందుద్భవించి యున్నాడే!"

6. "దేవా, ఇంద్రాదిదేవతలు, నూఱును, హిరణ్యగర్భు లిన్నూఱును, కాశ్మీరగిరులు మున్నూఱును తిలధాంచన గిరులు నన్నూఱును, పతివ్రత లేనూఱును, నగ్రహారంబు లారునూఱ్లును, స్త్రీమూర్తు లేడు నూఱ్లును, నుభయస్తోమకు లెనిమిది నూఱ్లును, కపిలధేనువులు వేయిని, కాలచక్రంబులు లక్షయును, తులాపూరుషంబులు కోటియును, కన్యాదానంబులు

పదికోట్లును, నివి యన్నియుఁగూడిన మీ దివ్యనామసంకీర్తన వినినందుకు వేయిలో నొక్క భాగంబును సరి గావు. ఈ సంకీర్తనఫలం బెవరు వ్రాసిరి, యెవరు చదివిరి, యెవరు వినిరి, వారి కాయురారోగ్యైశ్వర్యంబులు కృప చేతువు. మా యతి రాజమునివరము. దాతారు. అనాథమతీ, స్వామీ, సింహగిరి నరహరీ, నమో, నమో, దయానిధీ"

ప్రసక్తానుప్రసక్తముగా నీ కృష్ణమార్యుని కవితాసుమసౌరభము నాంధ్ర మహోలోకమున వ్యాపింపజేయనెంచి శాఖాచంక్రమణము చేసిన యీ రచయిత రసికభక్తలోకముచే క్షంతవ్యుడు!

## తిరుమలను విష్ణుక్షేత్రము చేయుట

సింహాచలమునుండి బైలుదేరిన యతిపతి గారుడాద్రి యనబడు నహోబలక్షేత్రమును ప్రవేశించిరి. అచటి నరసింహస్వామిని సేవించి వేంకటాద్రి యను తిరుమలకు ప్రయాణమైరి. తిరుపతిచేరి యేడు కొండలనెక్కి శ్రీనివాసుని సమీపించిరి. శంఖచక్రాదులు ధరింపని శ్రీవేంకటేశ్వరుని గాంచి యచటి శైవులా దేవుడు మా వాడని వైష్ణవులతో కలహింపసాగిరి.

భాష్యకారులు శైవులతో నిట్లనిరి-- "మీరీ దేవుని సుబ్రహ్మణ్యేశ్వరుడని గదా వాదించుచున్నారు. శివుడు ధరింపదగిన త్రిశూలడమరుకములును, విష్ణువు ధరింపదగిన శంఖచక్రములును నీ దేవుని వద్ద నుంచి మనము వెడలిపోవుదము. ఆ దేవుడు శైవచిహ్నములు ధరించినచో శివుడుగాను వైష్ణవచిహ్నములు ధరించినచో విష్ణువుగాను భావించుటకు మీ కభ్యంతరము లేదు గదా!"

శైవులును, వైష్ణవులును గూడ నీ ప్రస్తావమున కంగీకరించిరి. శూలాదులను, శంఖచక్రాదులను నచటనుంచి తలుపులు గట్టిగా బంధించి యందరును వెడలిపోయిరి. మర్నా డుదయం యతిపతితో పాటందరును స్వామిసన్నిధికి వచ్చి చూడగా స్వామి శంఖచక్రములు ధరించి శూలాదులను దూరముగా నెట్టివేసెను. అది చూచి లజ్జితులై శైవులటనుండి వెడలిపోయిరి.

రామానుజులు హర్షాతిరేకముతో స్వామికి మంగళాశాసనము చేసి స్వర్ణ నిర్మిత లక్ష్మిని వక్షఃస్థలమున ధరింపుడని సమర్పించిరి. నాటి నుండి యా దేవునకు రామానుజులు మామయును గురువును కూడ నాయిరి.

ఆ దివ్యదేశము రక్షించుటకు కచట నిద్దరు సన్యాసి పీఠాధిపతులను నియమించి యతిపతి యా కొండలు దిగి కాంచీక్షేత్రమునకు చేరి వరదుని సేవించిరి. అనంతరము మధురాంతకమున వీరనారాయణ స్వామిని సేవించి శ్రీరంగము చేరిరి.

ఈ విధముగ యతిపతి భూప్రదక్షిణముతో బాటు పండితదిగ్విజయము గూడ చేసివచ్చి శ్రీరంగనాథుని చేరి బహువిధములుగా నుతించి తమ మఠము ప్రవేశించిరి.

# కూరేశుని శ్రీరంగనివాసము

శ్రీరామానుజుల కాంతరంగికు డయిన కూరేశుడు కూరగ్రామ నివాసి. ఆ గ్రామము కంచికి చాల సమీపమున నున్నది. కూర గ్రామమున కాయన యధిపతి గాననే యాయన కూరేశు డాయెను. ఆయన సతతాన్నదానపరుడు. సంపత్తికి కుబేరుడు. బుద్ధికి బృహస్పతి. సూర్యోదయ మారంభించి రాత్రి రెండు జాములవరకును నాయుదారుని యింట నెడతెగకుండ ననాథులకు వికలాంగులకు నన్నదానసంరంభము సాగుచునే యుండును.

ఆయన భార్య యాండాళమ్మ భర్తకు తగిన భార్య. చేతికెముక లేని యా యిల్లా లతిథిసత్కారమున నన్నపూర్ణనే పోలి యుండెను. ఆమె కుదయమునుండి రాత్రివరకు తెరపియే యుండెడిది కాదు.

ఒకనాడు కూరేశుని యతిథిశాల తలుపులు మేఘగర్జనను బోలిన ధ్వనితో మూయబడుట సుదూరముననున్న శ్రీరంగమునకు చేరి శ్రీరంగ నాయకి చెవుల బడెను. "అర్ధ రాత్రివేళ యింత గొప్ప ధ్వని యెక్కడనుండి వచ్చినది" అని యా దేవి తనపతి నడిగెను. కూరేశుని నిరతాన్నదానమును గూర్చి శ్రీరంగపతివలన విని యామె "అట్టి మహోదారుని నేను తప్పక చూడవలసియున్నది. కాన నిచటి

కాతని పిలిపింపు"డని యామె పలికెను. అంతట రంగనాథుడు కాంచీ పూర్ణులను పిలిచి కూరేశుని వెంటనిడుకొని రమ్మని యాదేశించెను. వారును కూరగ్రామమున కేగి శ్రీరంగేశు నాజ్ఞ నాతని కెరిగించిరి. కూరేశుడది విని కాంచీపూర్ణుల కిట్లు విన్నవించెను--

"ఆహా, ఏమి నా భాగ్యము! కృతఘ్నుడను, పాపిష్ఠుడను, దురహంకారుడను నగు నేనేడ? బ్రహ్మరుద్రేంద్రాదివందితయును, జగన్మాతయును సాక్షాల్లక్ష్మియును నగు రంగనాయకి నన్ను చూడ దలచుటయేడ? ఇది యెంత చిత్రము! శ్రీమహావిష్ణువుయొక్క వక్షఃస్థలమునే విహారప్రాంగణముగా చేసికొన్న లక్ష్మీదేవి యనుగ్రహపాత్రుడను కాదగిన యర్హత నా కెక్కడిది? విద్యా ధనాభిజనమదములతో కొట్టుమిట్టాడుచున్న నే నా తల్లిని జేరదగుదునా? కాన నీ క్షణమే యీ సంపదను, నిండ్లను, వాకిండ్లను తృణప్రాయముగా విసర్జించి రిక్తుడనై నా తల్లియొడిని చేరుటకు శ్రీరంగమునకు ప్రయాణమయ్యెదను."

కూరేశుని యీ నిర్ణయమున కాయన భార్య యాండాళమ్మ గూడ నెంతో యానందించెను. ఆమెకూడ కట్టుబట్టలతో పతి ననుగమించెను. సర్వమ్మును తనవలెనే విడనాడి తన్ను వెన్నాడి వచ్చుచున్న యా పతివ్రతా శిరోమణిపై కటాక్షవీక్షణములను బరపుచునే కూరేశుడు ముందుకు సాగెను. ఒక యరణ్యమార్గమున నా దంపతులు నడచిపోవలసివచ్చెను. అపు డా యింతి "యిచట మనకు భయ మేమియు లేదు గదా" యని ప్రశ్నించెను. "అసలు మనవద్ద నేమైన నున్నగదా భయప్రసక్తి? కొంపతీసి నీ వేమైన వెంటగొనితెచ్చినావా యేమి?" యని కూరేశుడు ప్రతి ప్రశ్నవైచెను. "మీరు పాలు త్రాగుట కొక బంగారు పాత్రను మాత్రము తెచ్చినా"నని యామె బదులు పల్కెను. దాని నామెనుండి తీసికొని కూరేశుడు దూరముగ బారవైచి నిశ్చింతగా ముందుకు సాగిపోయెను.

ఈ విధముగ తన కనుకూలాచారయగు సహధర్మచారిణిని వెంట నిడుకొని కూరేశుడు శ్రీరంగము చేరెను. కూరేశాగమనవార్త విన్న భాష్యకారులు తన శిష్యులను వారి కెదురు పంపి సగౌరవముగా రప్పించి యాతిథ్యసత్కారములు చేసిరి. కూరేశు డిక నచటనే నిత్య

నివాస ముండి యుంఛవృత్తితో నుదరపోషణ చేసికొనుచు రంగనాథ సేవాపరాయణుడై కాలక్షేపము చేయసాగెను.

## పరాశరవ్యాసభట్టారకులు

సర్వశాస్త్రవిశారదు డగు కూరేశుడు కోరి తెచ్చుకొనిన దారిద్ర్యముతో శ్రీరంగమున నుంఛవృత్తితో కాలము గడుపసాగెను. వర్షాకాలమున నొకనాడు కుంభవృష్టి కురిసినందున నిల్లు వదిలి యెటు కదలుటకును వీలులేకపోయెను. కాన స్నానసంధ్యాదులు నిర్వర్తించి యేదో పండు దేవతా నివేదన మిడి సాలగ్రామ తీర్థము మాత్రము స్వీకరించి యాయన సంతృప్తినందెను. సాయంకాలము రంగనాథుని సేవించి వచ్చి శఠారిసూక్తులను పఠించుకొనుచు శయనించెను.

రంగని మహానైవేద్యసమయ మది. ఆ వాద్యధ్వని విని కూరేశుని పత్ని పతిప్రాణయయిన యాండాళమ్మ తన మనమున రంగని గూర్చి "ఏమి స్వామీ, ఏమి న్యాయ మిది? నీ యీ భక్తు డాకలితో నుండి యా మాట యైనను తలపెట్టక పస్తు పరుండి యుండగా నీకు షడ్రసోపేతభోజన మెట్లు నోటికి పోవుచున్నదయ్యా" యని మొర పెట్టుకొనెను. ఆశ్రితవత్సలుడగు రంగని చెవి నా మొర తత్క్షణమే చేరెను. ఉత్తమ పూర్ణు డను నాలయాధికారికి కలలో కనుపించి "వెంటనే నా ప్రసాదమును మేళతాళములతో తీసుకొనిపోయి కూరేశు నింట నిచ్చి రమ్ము" అని యాదేశించెను. అట్లే జరిగెను.

అయాచితముగ లభించిన భగవత్ప్రసాదమును స్వీకరించిన కూరేశునకు భగవంతుని యవ్యాజభక్తవాత్సల్యమున కొడలు పులకరించెను. ఆయన దానితో కడుపు నింపుకొని "యిపు డీ ప్రసాదమును రంగనాథుడు నాకు పంపుట యవ్యాజముగా మాత్ర మయియుండ" దని తలచి భార్యతో "రంగని నీ వేమయిన కోరుకొంటివా యేమి?" యని యడిగెను. "అట్టి పని యేమియు తెలిసి చేయలేదు. కాని రంగనాథుని నైవేద్య ఘంట వినబడగనే 'నా పతిదేవు డన్నము లేకుండ పరుండి యుండగా నీవు కడుపార భుజించుట న్యాయమా?' యని మాత్ర మను కొంటి" నని యామె సమాధానమిచ్చెను. "జగత్పితను గూర్చి మనమున నైన నిట్టి దుర్భావన రానిచ్చుట మహాపచారము

గదా" యని కూరేశుడు భార్యను మందలించి ప్రసాదశేషము నామె కిచ్చెను.

తన యపచారమునకు పశ్చాత్తప్తయై భక్తితో భగవత్ప్రసాదము స్వీకరించిన యా సాధ్వి గర్భవతి యాయెను. నవమాసములు పూర్ణము కాగా నొక శుభలగ్నమున సీతామతల్లికి కుశలవులవలె నా తల్లికి శ్రీరంగనాథు ననుగ్రహముచే వ్యాసపరాశరుల యంశమున నిరువురు పుత్రులు కవలలై యుదయించిరి. ఈ శుభవార్త వినగనే రామానుజు లెంతో యానందించిరి. పురుటిస్నానము కాగానే భాష్యకారులా బిడ్డలను తమవద్దకు తీసుకొని రమ్మని గోవిందుని కూరేశునింటికి పంపిరి. అతడును మంత్రరత్నమును జపించుచునే యా పుత్రులను తెచ్చి వారి కప్పగించెను.

సర్వాంగసుందరు లయిన యా బాలకుల ముఖకమల లావణ్యమునకు యతిపతి ఎంతో పొంగిపోయిరి. పంచాయుధాకారమున నిర్మించబడిన సువర్ణభూషల నా శిశువుల కంఠములయందు తమ శ్రీహస్తములతో యతిరాజు ధరింపజేసి గోవిందునితో శంఖచక్రాంకన లాంఛనము జరిపించిరి. పెద్దవానికి పరాశరభట్టారకు డని చిన్నవానికి వ్యాసభట్టారకు డని తామే నామకరణమంగళము గావించిరి. ఆ యిరువురిలోను సుందరతరుడైన జ్యేష్ఠునకు రామదేశికు డని ప్రత్యేకముగ ముద్దుపేరు పెట్టిరి. ఒక వైష్ణవబాలునకు పరాశరమునిపేరు పెట్టెద మని యామునార్యుల యంత్యసమయమున తాము చేసిన రెండవ ప్రతిన నీ విధముగ నెరవేర్చి యతిరాజు తమ్ము ధన్యాత్మునిగా భావించుకొనిరి.

రామదేశికనామాంతరు డగు నా పరాశరభట్టారకుడు శ్రీరంగనాయకిచే దత్తపుత్రుడుగా పోషింపబడుచు గోవిందుని శిష్యాగ్రేసరుడై సర్వశుభలక్షణలక్షితుడై దినదినాభివృద్ధి గాంచుచు 'యతిపతి తర్వాత శ్రీవైష్ణవ దర్శనము నీతడే వ్యాప్తిచేయగల' డను విశ్వాసమును శ్రీవైష్ణవులకు గల్గించెను.

గోవిందునకు తమ్ము డొకడు గలడు. అతని పేరు బాలగోవిందుడు. అతని కొక పుత్రుడు జన్మించెను. అది విని రామానుజు లాతని యింటి కేగి యా బిడ్డను గాంచి యానందించిరి. అతనికి

పరాంకుశపూర్ణు డని నామకరణ మిడి యామునార్యుల మూడవ మనో రథమును గూడ నెరవేర్చిరి.

## పరాశరుని బాల్యము

పరాశరభట్టార్యుడు శ్రీరంగనాయకీ రంగనాయకుల కటాక్ష పాత్రుడై తన్నివేదితాహారముచేతనే వృద్ధి నందుచుండగా భక్తిజ్ఞాన వైరాగ్యాది కల్యాణగుణసంపద గూడ నా బాలునిలో వికసింపసాగెను. ఆ బాలునకు నాల్గవ వత్సరముననే శఠకోపముని రచిత సహస్రగీతి శ్రుత పాండిత్యముచే కంఠపాఠమాయెను. ఆ గ్రంథస్థవిషయముల నా బాలుడు తర్కించుచుండగా యతిపతి గూడ ముక్కుపై వ్రేలు వేసుకొనువారు.

ఒకనా డాతడు తోడి బాలురతో వీధిలో ఆడుకొనుచుండెను. అపుడు సర్వజ్ఞభట్టను పండితుడు వచ్చినా డని పెద్దపెద్ద పండితులు సైతమాతనిని చూచుట కచట గుమికూడిరి. ఇంతలో పరాశరుడు పిడికిలి నిండ నిసుక తీసుకొని గొప్పపరివారము వెన్నంటి వచ్చుచున్న యా సర్వజ్ఞభట్టును సమీపించి— "అయ్యా, మీరు, సర్వజ్ఞులు గదా! నా చేతిలోని యిసుక పరిమాణ మెంతో తెలుపుడు" అని ప్రశ్నించెను. దానికి తగిన జవాబు వెంటనే చెప్పలేక యాపండితుడు దిక్కు మొగమువైచుకొని దిక్కులు చూడసాగెను. "ఇదేమండీ, పిడికిలితో నేను పట్టుకొనిన యిసుకను పిడికెడని చెప్పట గూడ మీకు చేతకాలేదే! ఇక మీ రెట్టి సర్వజ్ఞులు; ఎట్టి పండితులు? ఇక నా పేరుతో బాటు మీకుగల పటాటోపముగూడ వదలివేసిననే యీ యూర మీ పరువు నిలువగలదు" అని హేళనచేసెను.

అసమాన మేధానిధి యయిన యా బాలుడు ప్రసిద్ధ పండితుడగు కూరేశుని పుత్రుడేయని తెలిసికొన్న యా సర్వజ్ఞభట్టు బాలుని చేరబిలచి శిరము మూర్కొని; చుంచు దువ్వి, చుబుకంబు పుడికి, ప్రేమతో తన వెంట బెట్టుకొని పోయి కూరేశుని యింట దిగవిడచి యట్టి సుపుత్రుని గన్న యా తండ్రి భాగ్యము నభినందించెను. తల్లి యా బాలుని లోనికి గొనిపోయి దృష్టితీసి యెంతో యానందించెను.

కూరేశుడు పరాశరునకు గర్భాష్టకముననే యుపనయనము గావించి వేదాధ్యయమునకై గురుసన్నిధి కంపెను. రెండురోజులు మాత్ర మాతడా పాఠశాలకుపోయి తర్వాత మానివేసి వీథులలో నాటలు సాగించెను. ఇది తెలిసికొని కూరేశు డాతనిని పిలిచి "నాయనా, నిన్ను వేదములు నేర్చుకొ మ్మని గురువువద్దకు పంపగా నది వదలి వీథుల వెంబడి నీ రీతిగా తిరుగవచ్చునా" యని మందలించెను. అందుకాతడు "తండ్రీ, నిన్న చెప్పిన పాఠమే నేడును మరల చెప్పచున్నారు. పాడినదే పాట యన్నట్లు చదివినదే చదువుట విసుగనిపించి వచ్చి వేసినాను. అంతే గాని చదువు రాకగాదు. చదువుపై శ్రద్ధలేక యంతకంటె గాదు-- నేను బడిమానుట"యని వినయముతో జవాబు చెప్పెను.

తండ్రి "అయిన నిన్న నీవు చదివిన వేదపాఠ మప్పగింపగలవా" యని యడిగెను. "సందియమేల? ఇదిగో విను" డని యేక సంధా గ్రాహి యగు నా బుడుత డెల్లరు నబ్బురపడునట్లు వేదసూక్తములను సస్వరముగా, శ్రావ్యముగా వినిపించెను. ఇక నీ బాలునకు సామాన్యులు చదువు చెప్పలే రని కూరేశుడు నిర్ణయించెను. మరునాటి నుండి యా బాలునికి తామే తర్క వేదాంత వ్యాకరణ శాస్త్రాదు లందును, కావ్యనాటకాలంకారాదులందును చక్కని శిక్షణ యిచ్చిరి. ప్రతిభావంతు డైనందున నాత డా విద్య లన్నియు నశ్రమమున నల్ప కాలముననే నేర్చుకొనెను.

"అంగాని వేదా శ్చత్వారో మీమాంసా న్యాయవిస్తరః,
పురాణం ధర్మశాస్త్రం చ విద్యా హ్యేతా శ్చతుర్దశ."

ఋగ్యజుస్సామాథర్వణ వేదములు నాలుగు; శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను వేదాంగము లారు; మీమాంస, తర్కము, అష్టాదశ మహాపురాణములు, మనుస్మృతి మొద లగు ధర్మశాస్త్రములు, ఇవి పదునాల్గు విద్యలు. చతుర్దశ విద్యావిశార దుడై సకలకళాపూర్ణుడగు పరాశరభట్టారకు డను నా బాలచంద్రుడు షోడశ వసంతమున ప్రవేశించెను. సంప్రాప్తయౌవనుడగు కుమారుని చూచి లోలోన మురియుచున్న కూరేశు డొకనాడు యతిపతిని చేరి యా బిడ్డని యభ్యుదయము వారికి నివేదించి యా బాలుడు వివా హోచితవయస్కు డాయె నని విన్నవించెను.

ఈ శుభవార్తకు లక్ష్మణార్యు లెంతో సంతోషించి కూరేశునితో ననిరి-- 'అయిన నాతనికి త్వరలోనే వివాహము చేయుదము. ఆభిజాత్య సంపదగల మహాపూర్ణుని వంశీయుడగు నొక ద్విజోత్తముని యింట శుభ లక్షణాంగియగు నొక కన్యకామణి గల దని విన్నాను. ఆ బాలికకును మనవానికిని పాణిగ్రహణ మహోత్సవము జరిగినచో లెస్సగా నుండు నని నా యభిప్రాయము.'

వెంటనే కూరేశుడు బాలగోవిందుని, మరికొందరు పెద్దలను వెంట బెట్టుకొనియేగి యా వధువును తన కుమారున కిమ్మని యా వైష్ణవు నడిగెను. వరుని విద్యావినయసంపద నెరిగియుండి కూడ కన్యాపిత క్రొత్త సంబంధ మని సంశయించి తన బిడ్డనీయ నిరాకరించెను.

ఆ రాత్రి శ్రీరంగనాథు డా పిల్ల తండ్రికి స్వప్నమున ప్రత్యక్షమై 'నా దత్తపుత్రుడగు పరాశరభట్టారకునకు నీ కన్య నిచ్చి పెండ్లి గావించినచో, నీ కుటుంబమున కభ్యుదయ పరంపరాభివృద్ధి కలుగు' నని యానతి చ్చెను. ఆయనయు దైవాదేశము శిరసావహించి కొద్ది రోజులలోనే పెద్దలు నిర్ణయించిన సుముహూర్తమున తన కన్యను పరాశరభట్టారకున కిచ్చి మహావైభవముతో పరిణయము జరిపి కృతార్థుడాయెను.

ఈ విధముగ యతిపతి పరాశరుని పాణిగ్రహణము నెరవేర్చి కూరేశ దాశరథి గోవిందాది శిష్యులకు శ్రీభాష్యభగవద్విషయాది వేదాంత గ్రంథములు బోధించుచు శ్రీరంగమున సుఖముగా నుండిరి.

## ధనుర్దాసు

అతిమానుషవైభవోపేతుడైన శ్రీరంగనాథుని కైంకర్యము నడ్డు లేకుండ జరుపుచున్న రామానుజుల కా ప్రాంతము వారు మాత్రమే గాక దూరదేశాగతులగువారు గూడ శిష్యులయి వారి కరుణాదృష్టికి పాత్రు లయి యిహపరలాభము నందుకొనుచుండిరి.

నిచుళానగరమున ధనుర్దాసుడను మల్లు డొకడు కలడు. దేహ బలమున నాతడు చాణూరుని గూడ మించినవాడు. ఎంత గొప్ప మల్ల విద్యావిశారదులు గూడ నాతనికి తీసికట్టే. హేమాంబ యను నర్తకి యొకర్తాతనికి ప్రియురాలు. పేరున మాత్రమే గాక యామె శరీర

మున గూడ సువర్ణశోభయే నర్తన మాడుచుండును. అనన్యసామాన్య లావణ్యవతియగు తన ప్రేయసి గాసిచెందినచో తత్తనూసౌందర్యరేఖ యెక్కడ క్షీణించునో యని యామెను కన్నులలో బెట్టుకొని యా మల్లుడు కాపాడుచుండెడివాడు. అంత మహోత్కృష్టమైన దామెయెడ నాతని ప్రేమపరిపాకము! దాని పరాకాష్ఠ నాతడే కనుగొనజాలకపోయి నాడన నిక మన మెంతవారము!

ఒకపరి రంగనాయకునకు వసంతోత్సవము చేయదలపెట్టిరి. సకల జననయనానందకరమగు నా యుత్సవము గాంచు కోరికతో హేమాంబ గూడ నిచుళాపురమునుండి శ్రీరంగమునకు బైలుదేరెను. సహజ సుంద రియగు నామె తనూవల్లిని సువర్ణరత్నాభరణములతో నలంకరించు కొని నడచుచు చూపరుల కనులను మాత్రమేగాక హృదయములను గూడ నయస్కాంతమువలె నాకర్షింపసాగెను.

స్వామిసందర్శనము చేసుకొని యింటికి తిరిగి వచ్చువరకు గూడ హేమాంబను వదలియుండలేక ధనుర్దా సామెను వెంటనంటి శ్రీరం గము వచ్చెను. ఆమె ముఖకమల మెండ దెబ్బకు గందిపోవునేమో యని భీతిజెంది యా కామాంధు డామెపై గొడుగుపట్టి యామె మొగ మును చూచుచునే. నడువసాగెను.

కావేరిలో స్నాన మాడి శిష్యులతో స్వామిసన్నిధికి మరలి వచ్చు చున్న రామానుజు లీ వింత దృశ్యము చూచి తన వారితో "చూచి తిరా, ఈ విచిత్రము! ఉచితానుచితములు లెక్కింపక వివేకమునకు తిలోదకము లిచ్చి నడివీధిలో నా మగువపై గొడుగుపట్టి నడచుచున్న యా సిగ్గుమాలినవా డెవరో గదా!" యని పలికిరి. అపు డా మనుజుని వివరములు తెలిసినవా రాతని వృత్తాంతమును యతిపతికి నివేదించిరి.

అపుడు రామానుజులు 'చాటున తమ ప్రియురాండ్ర కెవరైన సేవచేయుట సహజము. కాని యింతమందిలో స్త్రీలోలతను చాటు నీ యకార్య మత్యంతగర్హ్యము గదా! కామార్తులు లజ్జను పరిత్యజించి ప్రవర్తింతు రనుట కింతకు మించిన యుదాహరణ మేమి యుండును? అయినను వీనిని రంగనాథకృపైకపాత్రుని చేయ యత్నింతును'— అని

పలికి తమ మఠము ప్రవేశించి ధనుర్దాసును తమ వద్దకు రమ్మని యొకరితో వార్తనంపిరి.

చెంత కేతెంచి నమస్కరించిన ధనుర్దాసును దీవించి యతిపతి యాదరముతో "వత్సా, మీ దే యూరు? ఏమి చేయుచుందువు? ఇచ్చటి కేల వచ్చినావు?" అని ప్రశ్నించిరి. ధనుర్దాసు వినయముతో వారికి-- 'స్వామీ, నేను నిచుళాపుర నివాసిని. మల్లుడను. నా పేరు ధనుర్దాసు. శ్రీరంగనాథుని యుత్సవము దర్శింప నా భార్యతో నేతెంచినాను' అని సమాధాన మిచ్చెను. మరల యతిపతి "ఓయీ, నీమేలుకోరి యొక మాట చెప్పదలచినాను. కోపగించుకొనవు గదా?" యనిరి. అందుకాతడు 'ఎంత మాట స్వామీ, పెద్దలు చెప్పిన మాటలు శ్రద్ధతో వినుటయే నా స్వభావము. కాన నిస్సంకోచముగా సెలవిండు' అని పలికెను. అపుడు యతిరా జాతనిని 'కామాతురులు తమ ప్రేయసులకు చాటున సేవలు చేయుట సహజము. కాని నీ వీ విధముగ నీ భార్యకు రాజవీథిలో గొడుగు పట్టి నడచుట చూపరులకు విడ్డూరముగ కన్పట్టును గదా! మహావీరుడవగు నీ విట్టి జుగుప్సావహమగు కార్యము చేయనగునటయ్యా' యని ప్రశ్నించిరి.

యతిరాజుపలుకులకు నాతని మొగము లజ్జచే నించుక యెఱ్ఱవాఱెను. వినమ్రవదనముతో నాత డిట్లు సమాధానమిచ్చెను-- "యతివర్యా, నేను స్త్రీలోలుడను కాను, కామాంధుడ నంతకంటెను గాను. నా భార్య హేమాంబ కుసుమసుకుమారి. ఆమె నేత్రములు పద్మదళాయతములు. కాననే యవి న న్నత్యంత మాకర్షించినవి. కాదు కాదు -- అవి నా యెదనే దోచుకొన్నవి. మహాతపస్వులగు మీ యెదుట నసత్యమాడ నోరాడుట లేదు. ఖరకర కరస్పర్శచే నామె ముఖపంకజము సంతప్త మైనచో నామె నేత్రములు వాడిపోయి నిస్తేజము లగును గదా! అపుడు నా హృదయమున పెను తుఫాను రేగక మానదు. ఆ బాధ నూహించుకొనుటకు గూడ జంకి యామె ముఖకమలమున కెండదెబ్బ తగులకుండ గొడుగు పట్టుచున్నాను. కారణమును మనవి చేసినాను గదా! ఇది విన్న మీ రెట్లాదేశించిన న ట్లాచరించెద సెలవిండు."

అతని హృదయావేదన నవధరించిన యతిపతి యిదియే యాతని మనసు మార్ప నదనని తలచి-- "ఓయీ, నీ వాదము సహేతుక

మైనదే కావచ్చును. కాని యా తరుణి నేత్రసౌందర్యమును మించిన లోచనద్వయిని చూపెద నాతో వచ్చెదవా"? యని ప్రశ్నించిరి.

"నా ప్రియురాలి కన్నులయందమును మించిన నయనములే లభ్యము కావలె గాని యంతకు మించినది నాకు కావలసినది యేమి యుండును? మీ కటాక్షముచే నట్టి వ్యక్తి నాకు లభించినచో తత్సేవలోనే యావజ్జీవ మును గడపి నా జన్మము చరితార్థము చేసికొనగలను. వెంటనే చూపి పుణ్యము కట్టుకొనుడు"అని పలికి మల్లరాజు ధనుర్దాసు యతిరాజును తొందరపెట్టెను.

శ్రీరామానుజులు వెంటనే యాతని తనవెంట నిడుకొని శ్రీరంగ నాథుని సన్నిధానమున కేగిరి. ఫణీంద్రతల్పమున శయనించి యున్న యా దేవాధిదేవు డాజానుబాహువు అరవిందదళాయతాక్షుడు, మందహాససుందర వదనారవిందాంచితుడు, మాణిక్యరంజితభూషణాలంకృతసుందరదేహుడు. అట్టి యా శ్రీహరియొక్క దివ్యమంగళవిగ్రహము దర్శింపగనే ధనుర్దా సానంద రసాంబుధి నోలలాడెను. విశేషించి యా విశాలనేత్రుని దృష్టి ప్రసారభంగీమధురిమ యా సహృదయుని హృదయపంజరమున ప్రవేశించి యచటనే స్థిరనివాస మేర్పరచుకొనెను.

శ్రీరంగనాథుని నేత్రలావణ్యముచే ధనుర్దాసుహృదయమును పరవ శింప జేసి యతివరుడు "ఇప్పుడు చెప్పుము. ఈ స్వామి దృష్టిసౌంద ర్యమును మించిన నేత్రద్వయిని నీ వెచటనైన చూచితివా?" యని యాతని నడిగిరి. అందుల కాతడు-- "స్వామీ, మీ రానతిచ్చినది ముమ్మాటికిని నిజము. ఇక నీ రంగనాథుని సేవలోనే నా జీవిత శేషమును గడుప నిశ్చయించినాను. ఇంతవరకు నజ్ఞానాంధకారముచే కన్ను గానక విషయలోలుడనై కాలమును దుర్వినియోగపరచినందుల కెంతయో నొచ్చుకొనుచున్నాను. కాన నా పాపమును మాపు నుపా యము మీరే యుపదేశించి యీ జీవిని కడతేర్చక తప్ప" దని పలికి యానందబాష్పములు లోచనద్వయినుండి వెలువడి చెక్కుల మీదుగా ప్రవహింపగా నా ధారలతో రామానుజుల పాదకమలద్వయి నభిషేకిం చుచు తదేకనిష్ఠతో భక్తిపారవశ్యముచే పైకిలేచుట యనుమాటయే మరచెను.

లక్ష్మణార్యులు శిష్యవాత్సల్యముతో భుజములు పట్టుకొని యాతని లేవనెత్తి "వత్సా, లెమ్ము. నేటికి నీ పాతకాగ్నికీలలు శ్రీరంగనాథకటాక్షామృతవర్షధారలచే నుపశమించినవి. ఇకమీద నిచటనే నివసించి యాస్వామిసేవలోనే కాలముపుచ్చుచు జన్మసార్థక్య మందుదువు గాక" యని యనుగ్రహించిరి.

ఈ తీరుగా యతిపతి సంబంధబలముచేతను, రంగపతి కృపాబలము చేతను కామక్రోధలోభమోహమదమాత్సర్యములను నరిషడ్వర్గమును జయించి ధనుర్దాసు భక్తాగ్రేసరుడై రామానుజుల శిష్యవర్గమున గణనీయుడయ్యెను. తచ్ఛిష్య సంబంధబలముచే భాగవతప్రతిపత్తిగూడ నాతనిలో బలపడెను. శ్రీరంగనాథనేత్రమాధురీదిదృక్షతోనే దివానిశములు గడపుచు నాతడు నిద్రాహారముల మాటయే తలపెట్టడాయెను.

కొంతకాల మాతని చిత్తశుద్ధిని, నచంచలభగవత్కైంకర్యనిష్ఠను పరిశీలించి లక్ష్మణార్యు లొకనా డాతనిని తన మఠమునకు పిలిపించి పంచసంస్కారములతో బాటు మంత్రరత్నమును గూడ నాతని కనుగ్రహించిరి. ఈ విధముగా నవ్యాజకరుణచే తన యజ్ఞానాంధకారమును బాపి, కోరి తన శిష్యునిగా చేసుకొనిన లక్ష్మణార్యుల దయకు ధనుర్దాసెంతో పొంగిపోయె నని వేరుగా చెప్పనక్కరలేదు గదా! క్రమముగా నాతడు భగవద్భాగవతాచార్యకైంకర్యప్రవణుడై గురు సన్నిధినే కాలము గడుపసాగెను.

ధనుర్దాసుని ఈ మనఃపరివర్తన వృత్తాంతము విన్న యాతని ప్రేయసి హేమాంబ కొంతకాలమువరకు ప్రియవియోగమునకు మిగుల దురపిల్లెను. కాని యెట్టివా డయినను పతియే సతికి గతి యని నమ్మిన యా సాధ్వీతిలకము కామాదులను జయించి భక్తిజ్ఞానవైరాగ్యములు తన హృదయమున ముప్పిరిగొనగా నొకనాడు రామానుజులవద్ద కేతెంచి దుఃఖాతిశయముచే మొదలునరికిన చెట్టువలె నాయనపాదమూలమునబడి లేవలేక పోయెను. యతిరా జామెను లెమ్మని పలికి తగురీతి నూరడింపగా నామె పతిని విడిచి తా నొంటిగా జీవింపజాల నని, తనను గూడ ధనుర్దాసువలెనే కరుణించి తమ పజ్జకుచేర ననుగ్రహింపు డని మరి మరి వేడుకొనెను. ఆమెచిత్తశుద్ధిని పరిశీలించి రామానుజులు హేమాంబకు గూడ పంచసంస్కారముల ననుగ్రహించి తన పాదదాసిని గావించుకొనిరి. ధనుర్దాసుతో

బా టాతని యిల్లాలుగూడ జ్ఞానవైరాగ్యాది సద్గుణసంపదగూడ యాభరణములుగా దాల్చినదై భర్తకుతగిన భార్య యని నిరూపించుకొనెను. లక్ష్మణదేశికేంద్రపాదారవిందామృతపాన మత్తు లగు హేమాంబాధనుర్దాస దంపతులు తదీయకైంకర్య వ్రతులై భాగవతోత్తముల మన్ననల నమితముగా నందుకొనజొచ్చిరి.

## హేమాంబ

శ్రీమద్రామానుజాచార్యులవారు శ్రీరంగమున నపారశిష్య కోటితో ననంతగరుడవిష్వక్సేనాదిపరిజనపరీవృతుడగు భగవానుని (శ్రీరంగనాథుని) వలెనే విరాజిల్ల సాగిరి. కాననే వారిని తద్భక్తులు భగవద్రామానుజలని పేర్కొనుచుండువారు. శ్రీరామచంద్రుని నిత్యకైంకర్యమున నా రామానుజుడు లక్ష్మణస్వామి యెట్లో, ఈ రామానుజుల సేవలో ధనుర్దాసా లక్ష్మణుని యట్లు నిమగ్నుడై వారి కే లోపమును కలుగకుండ చూచుకొనుచుండెను.

ఒకసారి శ్రీరంగనాథుని బ్రహ్మోత్సవము జరుగుచుండెను. ఆ కల్యాణోత్సవశుభసమయమున చివరిదినమున లక్ష్మణార్యులు దాశరథి చేయిపట్టుకొని కావేరి స్నానమునకై పరివారసహితుడగు రంగనాథునితో పాటేగిరి. స్నాతులై యూర్ధ్వపుండ్రములు ధరించి సంధ్యాదులు నిర్వర్తించుకొని తిరిగివచ్చునపుడు ధనుర్దాసుహస్త మవలంబించి శిష్యులతో మఠము చేరిరి.

ఆ దృశ్యమును చూచి విస్మయముతో నచటి బ్రాహ్మణులు యతిపతితో 'ఆచార్యా, ఇది యెంత విపరీతము, స్నానాంతరము శూద్రుని తాకుట సదాచారమేనా?' యని ప్రశ్నించిరి. వారికి యతిరా జిట్లు సమాధాన మిచ్చిరి—

> "విద్యామదో ధనమద స్తృతీయోఽభిజనో మదః,
> ఏతై ర్మదావలిప్తానా మేత ఏవ సతాం దమాః."

విద్యామదము, ధనమదము, అభిజనమదము అను మూడును దురహంకారులకు చెరువు గల్గించును. ఇవి సత్పురుషుల యెడ విపరీతము లయి — అస్తవ్యస్త మయి — దమముగా ఇంద్రియ నిగ్రహముగా మారును.

ఈ మల్లుడు ధనుర్దాసు నీ మదములు మూడును తమ యంత తామే వదలివేసినవి. కాననే యాతని చేతిని గ్రహించి నేను నడచి నాను.''

ఆ మాటకు చెవులుమూసికొని యా వైష్ణవు లిట్లనిరి-- "రామ రామ, ఈ శూద్రుడా మదత్రయహీనుడు? కామాంధుడును జన్మచేతనే యశుచియునగు నితనికి వేదాంతపారంగతు లగు బ్రాహ్మణోత్తములతోనా సామ్యము?

ఇట్లు పలికి వా రుభయవేదాంత విశారదులై యుండియు నాచార్యాభిమానపాత్రు డని కూడ దలపక ధనుర్దాసును నిష్కారణముగా నిందింపసాగిరి. అవకాశము వచ్చినపు డాతని నెట్లయిన నవమానించి యధోగతిపాలు చేయవలె నని వారందరు కుట్రలు పన్నసాగిరి. వారి యీ దుశ్చింత రామానుజులు క్షణములో పసిగట్టి వారికి తగిన శాస్తి చేసి బుద్ధి గఱపుసమయమునకై వేచియుండిరి.

ఒకనాడు లక్ష్మణార్యులు తమ యాంతరంగిక శిష్యు నొకనిని బిలిచి వానికి రహస్యముగా నిట్లాదేశించిరి. "ఓయీ, నేటిరాత్రి ధనుర్దాసును నిందించిన యీ వైష్ణవు లారవేసుకొన్న కాషాయవస్త్రములనుండి కౌపీనమునకు సరిపడునంత గుడ్డముక్కలను చింపి తీసుకొని రమ్ము." సరి, శిష్యుడు వారి యానతిని యథావిధిగా నిర్వర్తించెను.

తెల్లవారెను. తమ కాషాయాంబరములందు చిన్న చిన్న ముక్కలు చింపబడియుండుట చూచి యా సంన్యాసి పీఠాధిపతులు క్రోధావిష్టులై పరస్పరము నిందించుకొనుచు కలహింపసాగిరి. చిలికిచిలికి గాలివానయయ్యె నన్నట్లు చివరకది కొట్లాటగా రూపొందెను. చేతులు చేతులు కలుపుకొని యుద్ధము చేయుచున్న యా వైష్ణవపండితులను లక్ష్మణార్యులు సాంత్వనవాక్యములతో శాంతపరచిరి. చేయునది లేక ఎట్లో యా వైష్ణవులు గూడ శాంతించిరి.

కొంత కాలము గడచెను. ఒకనాటి రాత్రి యతిరాజు ధనుర్దాసుని పిలిచి యాతనితో వీధి యరుగుపై నిష్ఠాగోష్ఠి చేయసాగిరి. మొదటి జాము గడువగనే కాషాయవస్త్రములు చిరిగిపోయి బాధపడుచున్న వైష్ణవులలో నిద్దరను చాటుకు పిలిచి వారితో నిట్లు పలి

కిరి-- "ధనుర్దాసు డిచటనే యున్నాడు గదా! అతని భార్య యీ పాటికి నిద్రపోవు చుండును. మీ రాతని యింటి కేగి నిద్రించు చున్న హేమాంబ సొమ్ము లన్నియును నెమ్మదిగా సంగ్రహించి నావద్దకు వానిని కొనితెండు. కాని యిది పరమగోప్యముగా జరుగునట్లు చూచు బాధ్యత మాత్రము మీదే!"

గుర్వాజ్ఞను శిరసావహించి యీ వైష్ణవులు ధనుర్దాసు నింటి కేగిరి. అచట తలుపు చేరవైచి భర్తరాకకై ఎదురు చూచుచు మంచముపై మేను వ్రాల్చిన హేమాంబ కప్పడే కునుకుపట్టెను. ఆమె గాఢనిద్రలో నున్న దని యీ వైష్ణవచోరులు తలచి తమ గురువు తమకు ఒప్పగించిన పని సులభముగనే చేయనగునుగదా యని యానందించిరి. ఎడమప్రక్క కొత్తిగిలి పరుండియున్న యీ సుందరాంగి సొమ్ము లన్నియు వారు నేర్పుగా తీయసాగిరి. చేతిమురుగులు, మెడలోని హారములు, చెవికమ్మలు మొదలగున వన్నియును సంగ్రహించిరి. ముక్కుపుడక తీయుచుండగా నా లలితాంగి కితరకరస్పర్శచే మెలకువ వచ్చెను. కొలదిగా కనులు తెరచి యామె తన సొమ్ములను తీసుకొనుచున్న వైష్ణవులను గుర్తించి రిచ్చవడి యచ్చెరు వందెను. కాని భాగవతోత్తములు కోరినట్లు ప్రవర్తింపవలెనే గాని యీ జీవునకు స్వాతంత్ర్యి మనునది లేదు అను నాచార్యసూక్తిని హృద్గతముచేసుకొన్న యీ భక్తురా లెంతమాత్రమును కదలక, తన దేహమందలి కుడిప్రక్క సొమ్ములను గూడ వారు తీసుకొనుటకు వీలుగా నెమ్మదిగా రెండవప్రక్క కొత్తిగిలెను. 'ఇతరు లెవరును చూడకుండ నీ కార్యము నెరవేర్చుకొనిరం' డని గురు వాజ్ఞాపించిన మాట చెవిలోనే మ్రోగుచున్నందున వా రిరువురు నా యాభరణ సంగ్రహకార్యము నడుమనే వదలివైచి పిల్లివలె నడుగులు వైచుకొనుచు నిల్లు వదలి బ్రతుకు జీవుడా యని బయటపడి మఠము దారి బట్టిరి. మఠమును చేరిన యీ శిష్యులను చూచి రామానుజులు ధనుర్దాసు నాతనింటికి పంపివైచిరి.

అత డటు వెడలగనే శిష్యులు తాము గుర్వాజ్ఞనెంత నేర్పుతో నెరవేర్చిరో యీ విషయమును వివరించి రామానుజుల యెదుట బీరములు పలుకసాగిరి. అపుడు యతిపతి వారిని "సరి, మీరు ధనుర్దాసు వెంట నేగి యాతని యింట నా భార్యాభర్తలకు జరుగు సంభాషణము చాటునుండి విని నా కెరుకపరపు" డని నియమించిరి. వారును

నాచార్యాదేశము శిరసావహించి ద్రుతగతితో ధనుర్దాసును కలసికొని యజ్ఞాతగమనులై యాతనివెంట నడచిరి.

చేరవైచియున్న తన యింటితలుపు తెరచుకొని ధనుర్దాసు లోన ప్రవేశించెను. కనులు మూసికొని జరిగిన యా విచిత్ర చౌర్యములోని పరమార్థ మేమయి యుండునా యని యాలోచించుచున్న హేమాంబ యలికిడి విన్నంతనే లేచి కూర్చొనెను. ఒక ప్రక్కమాత్రమే సొమ్ములు ధరించియున్న తన భార్యనుకాంచి యాత డాశ్చర్యముతో "ఏమి జరిగి నది? ఇట్లున్నావేమి?" యని యాతురుడై ప్రశ్నించెను. హేమాంబ యా రాత్రి యాత డిలువీడి యతిరాజువద్ద కేగిన తర్వాత జరిగినది జరిగినట్లు దాచక యాతనికి వివరించెను.

అధి విని క్రుద్ధుడై ధనుర్దా సామెతో ననెను– "శ్రీవైష్ణవులు నీ స్వొమ్ములు తీసికొనుచుండగా నీ వేల ప్రక్కకు తిరుగవలసి వచ్చినది? నీవు మేల్కొన్న సంగతి తెలిసికొనియే గదా వచ్చినవారు నీ శరీరముపై మిగిలియున్న నగలను తీసికొనకుండ నడుమనే వెడలి పోవుట సంభవించి నది. నీవీ స్వాతంత్ర్య మేల యవలంబించితివి? భాగవతోత్తముల యెడ స్వాతంత్ర్యము వహించుట పాతకహేతువని నీకు తెలియదా? ఛీ, ఇక నీ మొగము నాకు చూపకుము." తరువాత నామె చేసిన యకార్యమునకు మనస్సు విరిగి చివర కెట్లో నిద్రించెను.

ఇది యంతయు జాగ్రత్తగా చాటున నుండి విన్న శిష్యులు వెంటనే రామానుజులవద్ద కేగి యా భార్యాభర్తల నడుమ జరిగిన సంభాషణ మంతయు నివేదించిరి. అపుడు లక్ష్మణార్యులు వైష్ణవులతో నిట్ల నిరి– "చూచితిరా, ధనార్దాస దంపతుల భాగవత ప్రతిపత్తి! సొమ్ములు దొంగిలింప వచ్చినవారు వైష్ణవు లని తెలిసికొని తన శరీరమున నొక ప్రక్కనున్న వన్నియు వారు దోచుకొనుట చూచుచు నూరకుండు టయే గాక మిగిలిన సొమ్ములు గూడ తీసుకొనుటకు వీలుగా నామె ప్రక్క కొత్తిగిల్లిన దని మీరే చెప్పుచున్నారు! 'వచ్చినవారు భాగవతో త్తము లని నీవు తెలిసికొని యుండిగూడ ప్రక్కకు నొత్తిగిల్లు స్వాతం త్ర్యము నీ వేల వహించినావు?' అని ధనుర్దాసు ఆమెను దండించుట గూడ మీరు మీ కనులతోనే చూచి వచ్చినారు గదా! లోగడ మీరు కాషాయవస్త్రములనుండి యెవరో ముక్కలు చింపి తీసుకొని

పోయినా రని మీరు చేసిన కలహకాండ నొక్కసారి జ్ఞప్తికి తెచ్చు కొని పునర్విమర్శ చేసికొనుడు. మీ యపరాధ మెంత గురుతరమో మీకే తెలియును. సర్వసంగపరిత్యాగమును సూచించు కాషాయము కట్టినంత మాత్రమున ప్రయోజనమేమి? 'తలలు బోడు లైన తలపులు బోడులా' యను సూక్తిని మీరు సార్థకపరచినారు గదా! కావిగుడ్డ ముక్కలు పోయి నందుకే మీ రంత బాధపడినారే! మరి ధనుర్దాసదం పతులు తమ సువర్ణ రత్నాభరణములు పోయినందు కెంత బాధపడవలసి యుండును? ఆ బాధ లేక పోగా పై పెచ్చు వారు మన నగలు వైష్ణవులే గదా తీసికొని పోవుచున్నారని యెంతో యానందించుట మీరే కాంచివచ్చినారు కదా!

దీనిని బట్టి యేమి తెలియుచున్నది? 'గుణాః పూజాస్థానం గుణేషు న చ లింగం న చ వయః' – సద్గుణములు గల వాడే గొప్ప వాడు. జాతిమాత్రముచే నెవడును గొప్పవాడు కాడు అను మాట రూఢమగుట లేదా! కాన నిక మీదనైన సత్పురుషులను ద్వేషించుట మానుడు. అప్పుడే మీరు బాగుపడగలరు."

శ్రీమద్రామానుజుల యీ మందలింపుచే నా సంన్యాస శిష్యులు కనులు తెరచుకొని జ్ఞానవంతులైరి.

తెల్లవారెను. ధనుర్దాసును యతిపతి పిలిపించి "రాత్రి జరిగిన విషయమంతయు నాతనికి విశదపరచి తాము తెప్పించిన సొమ్ము లాతని కిప్పించిరి. గురుపరతంత్రుడు గాన నాతడును వారిమాటకు మారు మాటాడ వెరచి యవి తన యింటికి తీసుకొనిపోయి యర్ధాంగి కిచ్చి జరిగిన దంతయు నామెకు పూస గుచ్చినట్లు వివరించెను. ఆమెయు తమ దంపతులపై రామానుజులకు గల వాత్సల్యాతిశయమున కెంతో యానందించెను. ఆ దంపతులు యతిపతి నితోధిక శ్రద్ధాభక్తులతో నారాధింపసాగిరి.

ఈ విధముగ సర్వ విషయములందును నాచార్య పరతంత్రులై ప్రవర్తిల్లినందుననే ధనుర్దాసదంపతులు వారి శిష్యులలో విశిష్టస్థానము నంది విఖ్యాతిగాంచిరి. యతిపతియు నప్పుడప్పుడు కావేరీస్నానమున కాతని చేయి పట్టుకొని యేగుచు 'నిది యేమి వింత?' యని యడిగిన వారి కా దంపతుల యాచార్యప్రతిపత్తిని విశదపరచుచుండువారు.

## గురుకటాక్ష మహిమ

మారనేర్నంబి యను మహాజ్ఞాని పరమపదించెను. మహాపూర్ణులు బ్రహ్మమేధవిధానముతో నాయనకు సంస్కారము చేసిరి. అది చూచి "శూద్రునకు బ్రాహ్మణుడైన వాడు పితృమేధ సంస్కారము చేయుటయా? వర్ణాశ్రమాచార ధర్మము లెట్లు మంటగలియుచున్నవో! ఏమి కలిమహిమ!" అని కొందరు మూర్ఖులగు వైష్ణవులు చెవులు కొరుకుకొనసాగిరి. మహాపూర్ణుల పుత్రిక యత్తుళ్ళాయమ్మ తండ్రికి సంక్రమించిన యీ దుష్కీర్తికి చాల వ్యథ చెంది దానిలో కొంత రంగనాథునిపై గూడ నారోపించెను. ఆమె కోవెల కేగి రంగని తీర్థప్రసాదములు స్వీకరించుట గూడ మానివేసెను.

ఈ సంగతి లక్ష్మణార్యులు తెలిసికొని మహాపూర్ణుల వద్ద కేగి నమస్కరించి "ఆచార్యా, లోకాచారమునకును, శాస్త్రమునకును భిన్నముగ మీ రిట్లేల చేయవలసి వచ్చినది? మీ ప్రతిపనికిని నేదో యొక గూఢార్థముండకపోదు. మీ కభ్యంతరము లేనిచో దాని నీ దాసునకు తెలుప ప్రార్థన" యని ప్రశ్నించిరి. అపుడు మహాపూర్ణు లిట్లనిరి— "వత్సా, ధర్మము సామాన్యము, విశేషము అని రెండు విధములు. ఒకప్పుడు ధర్మ మయినది మరొకప్పు డధర్మము కావచ్చును. అట్లే అధర్మము గూడ ధర్మము కావచ్చును. ఇక్ష్వాకువంశాలంకారు డగు శ్రీ రామచంద్రుని కంటె నేను గొప్పవాడనా! గృధ్రరాజు జటాయువుకంటె నీ మారనేర్నంబి తక్కువవాడా? సామాన్య ధర్మనిరతు డగు ధర్మరాజుకంటె నేను గొప్పవాడనా? విదురుని కంటె యీ నంబి తక్కువ వాడా!"

ఈ మాటలు విని ఉడయవరుల సందేహము తీరిపోయెను. మహాత్ముల వృత్తము లిట్లేయుండును గదా యని వారు తలచిరి.

ఒకప్పుడు లక్ష్మణార్యు లొక మూగవానిని చూచి వానిని తమతో నింటిలోనికి తీసుకొనిపోయిరి. తలుపులు మూసి వేసి యా మూగవానికి "నా యీ పాదములే రక్షకముగా గ్రహింపు" మని సంజ్ఞతో తెలియజేసిరి. అత డట్లే చేసెను. అతనితో రామానుజులు – నా పాదములే రక్షకమని నమ్మి యుండు" మని పల్కిరి. ఇది కూరేశుడు

తలుపు సందులో నుండి చూచి "అయ్యో, నే నీ పాటి యాచార్య కటాక్షమునకు గూడ నోచుకొనకపోతిని గదా! నే నగ్రవర్ణమున జన్మించి మాత్ర మేమి లాభము? నేను గూడ మూగవాడనై జన్మించి యుండినచో యతిరాజు నిర్హేతుక దయకు పాత్రుడనై యుండెడివాడను గదా! నా జీవితము వ్యర్థమై పోయినదే! నా యీ శాస్త్రజ్ఞానము కాల్పనా?" యని సంతాపము చెందిరి.

పూర్వ మొకపరి రామానుజులు గోష్ఠీపూర్ణుని దర్శింపనేగిరి. అపుడు వారు తలుపులు మూసుకొని చాలసేపు గురుధ్యానముచేసి తర్వాత రామానుజులను కుశలప్రశ్నలు వేసిరి. అపుడు సాంజలిబద్ధులై రామానుజులు గురువును "ఆచార్యోత్తమా, మీ ధ్యాన మేది? మీ మంత్రమేది? వివరించి న న్ననుగ్రహింపుడు" అని ప్రార్థించిరి.

గోష్ఠీపూర్ణుల సమాధాన మిది-- "కావేరీనదిలో మద్గురువర్యులు యామునార్యులు స్నాన మాడి జపము చేసుకొనుచుండగా వారి వీపు కూర్మపృష్ఠమువలె భాసించుచుండెడిది. వారి వీపే నా ధ్యానము. తన్నామస్మరణమే నా మంత్రము. గురుశరీరమే ధ్యానింపతగినది, తన్నామమే జపింపదగినది. మూగవారు, చెవిటివారు, గ్రుడ్డివారు, కుంటివారు, పిల్లలు పెద్దలు -- వారు వీ రననేల -- అందరును పై జెప్పినట్లు చేసిన వా రాచార్యకటాక్షపాత్రులై పరమగతి నందుదురు.

గురువుచెప్పిన మాటను బట్టియే లక్ష్మణార్యులు సర్వులకును పై జెప్పినరీతిగా మోక్షము ననుగ్రహించిరి. ఇట్లే బధిరపంగ్వంధాదులకు గూడ మోక్షమార్గ ముపదేశించి తమ కర్తవ్యమును లెస్సగా నాచరించిరి. కూరేశ దాశరథి ప్రముఖ శిష్యాదులకు శ్రీభాష్యాదుల యర్థము విశదీకరించుచు నుడయవరులు శ్రీరంగమున నుండిరి.

"గురుపాదాంబుజం ధ్యాయేత్ గురో ర్నామ సదా జపేత్."

అను సూక్తిప్రకారము తమ యాచార్యులపాదపద్మములనే స్మరించుచు తన్నామమునే జపించుచు వారి యంగభంగిమను నాచారావిచారములను సదా తలచుకొనుచు గురువే తమ సుఖజీవనమున కుపాయ మని నమ్మి యుండువారి కెల్లరకును మోక్షము కరతలామలక మని బోధించుటయే తమ జీవితలక్ష్యముగా తలచి యతిపతి దానిని పూర్తిగా

నాచరణలోనికి తెచ్చినందుననే యాదర్శ జగద్గురువు, మతకర్త యని విఖ్యాతి గాంచిరి.

## చోళరాజు

రామానుజులు నిర్వ్యాపారులై కూర్చుండుట రంగనాథున కిష్టము లేదు. చోళదేశమును హిరణ్యకశిపునిబోలిన క్రూరరాక్షసరా జానాడు పరిపాలింపసాగెను. అతని పేరు క్రిమికంఠుడు. అతడు కేవలము ధర్మ విధ్వంసముకొరకే జన్మించి నటు లుండెను. దక్షిణ దేశమునంతను తన కబంధహస్తములతో బంధించి మంచివారిని బాధించుట యాతని వినోదక్రీడలలో నొకటి. అతడు శివభక్తుడు. పరమవిష్ణుద్వేషి.

అగ్నికి వాయువు తోడయినట్లు వానికి దొరకిన పురోహితుడు గూడ నట్టి వాడే యయినందున వాని పాలనలో ధర్మపరాయణు లయిన ప్రజలింకను బాధపడసాగిరి. అందును విష్ణుభక్తులకు దిన మొక యుగముగా గడచుచుండెను.

ఆ రాజు సకలదుర్గుణాకరుడు; తన రాజ్యములోని ప్రజలందరను శైవులు కండని నిర్బంధించువాడు. తన దేశమునందలి పండితుల నందరను పిలిపించి వారిచే "శివాత్పరతరం నాస్తి" శివుని మించిన పరత త్త్వములేదు, అని వ్రాయించి పుచ్చుకొనువాడు. అట్లు వ్రాసి యిచ్చిన వారెవరయిన శివమతమునకు విరుద్ధముగ నడచినచో వారి గ్రుడ్లు పీకించుట, కాలుసేతులు తెగగొట్టించుట మొదలగు క్రూరశిక్షలతో వారి ననేకరీతులయిన చిత్రవధలకు గురి చేయుచుండువాడు.

కొంతమంది తాము కోరిన ధనగృహారామాదిసంపత్తి లోభము చేతను, వాని క్రూరశిక్షలు పడలేక మరి కొందరును, తమ యంత రాత్మను చంపుకొని యాతడు చెప్పినట్లే నడచుకొనుచుండువారు.

శాస్త్రవేత్తయగు ద్విజు డొకడు క్రిమికంఠునివద్ద మంత్రిగా నుండెను. అతడు రాజుతో – "మహారాజా, ఈ సామాన్యపండితులలో 'శివాత్పరతరం నాస్తి' యని వ్రాయించిన నేమి లాభము! ఈ కాలమున వైష్ణవమతమునకు మూలస్తంభమగు రామానుజులచే గాని యాతని శిష్యుడు కూరేశునిచేత గాని యిట్లు మీరు వ్రాయిం

చినపుడు గదా మీకు దిగ్విజయముతో బాటు త్రిలోకైక ప్రశస్తి గూడ లభించుట!" అని పలికి ఆ దుష్టుని దుష్కార్యాచరణకు మరింత ప్రోత్సాహమిచ్చెను.

సరి, రామానుజులను పిలిపించి వారిచే 'శివుని మించిన పరతత్త్వము లేదు' అని వ్రాయించి తీరవలె నని ఆ రాజుకు కోరికకలిగెను. వెంటనే యాతడు యతిపతి యెచ్చట నున్నను వెదకి పట్టి తెం డని కొందరు భటులను పంపెను. వారు శ్రీరంగము చేరి 'రామానుజు లెచ్చట' యని యడుగుచు వారి మఠము తెలిసికొని యందు జొచ్చిరి.

ఆ సమయమున రామానుజులు దండకమండలువులను కాషాయ వస్త్రములను వదలి స్నాన మాడుటకై వెడలిరి. చోళరాజభటులు యతిపతిని పట్టుకొని పోవుటకై వచ్చినారని కూరేశుడు తెలిసికొనెను. వెంటనే తమ గురువుయొక్క కాషాయవస్త్రములు ధరించి వారి దండ కమండలువులు చేబూని తానే రామానుజుడ నని పలికి యా వచ్చిన రాజభటులవెంట చోళరాజువద్దకు పయనమాయెను.

యతిరాజు స్నానమాడి వచ్చిరి. వారికి తమ కావి బట్టలు, దండ కమండలువులును యథాస్థానమున కనుపింపలేదు. అవియేమైనవని వార డుగగా దాశరథి జరిగిన వృత్తాంతము వారికి నివేదించెను. కూరేశుడు వానిని ధరించి చోళరాజు వద్ద కేగెనన్న వార్త విని "యయ్యో, నాకైనా శిష్యుడు ప్రమాదమున చిక్కెను గదా" వెతగూరికూడ యాతని గురుభక్తికి పరమానందవిహ్వలితాంతరంగు లైరి. అయినను చేయునది లేక లక్ష్మణార్యులు కూరేశుని సామాన్యవస్త్రమును తాను ధరించి చోళరాజుబారినుండి తాత్కాలికముగా తప్పించు కొనుటకు పడమటి దిక్కుగా ప్రయాణమైరి.

## శబరుల యాతిథ్యము

నిద్రాహారములుగూడ కరువు కాగా నారుదినము లహోరాత్రములు రామానుజులు కతిపయశిష్యులు వెంటరాగా పయనము చేసిరి. ఆర వనాటి రాత్రి వా రొక ఘోరారణ్యము ప్రవేశించిరి. అచట నొక కొండగుట్ట కనుపించెను. దానికి సమీపమున నొక నెగడు మండుచుం

డెను. చలికి గడగడ వణకుచున్న యతిపతి చలికాచుకొనుచున్న కొంద రిని చూచి "యిచట నేదైన గ్రామము కలదా" యని ప్రశ్నించిరి. మంచెపై కూర్చొనిన మనుష్యులు కొందరు క్రిందికి దిగి వచ్చి వారు దారి తప్పి వచ్చిన బ్రాహ్మణు లని గుర్తించి వారి నా నెగడువద్దకు తీసుకొని పోయిరి. చలిచే వణకుచున్న వారందరకును నా కోయలు పొడి బట్టలు కట్టనిచ్చి ఊచబియ్యము, తేనె మొదలగునవి భుజింప నర్పించి యథాశక్తి నాతిథ్యమిచ్చిరి.

ప్రయాణశ్రమనుండి యాగంతుకులు తేరుకొన్న తర్వాత నా భిల్లులు "మీ రెవరు? ఏ దేశమునుండి వచ్చుచున్నారు? ఇట్టి యరణ్యమార్గమున ప్రయాణము జేయు గారణ మేమి?" యని యాదరముతో ప్రశ్నించిరి. అపుడు వైష్ణవులు వారితో "మేము శ్రీరం గమునుండి యొకానొక కారణముచే నిట్లు వచ్చినాము" అని పలికిరి. "అట్లనా, అయన రామానుజులు సుఖముగా నున్నారా" యని మరల నా కిరాతులు ప్రశ్నించిరి. "రామానుజులను మీ రెట్లెరుగుదు" రని వైష్ణవులు ప్రశ్నింప బోయలిట్లు సమాధాన మిచ్చిరి—

"నదీప్రవాహమున కొట్టుకొని వచ్చిన శవము పంచ సంస్కార చిహ్నిత మగుట చూచి యది వైష్ణవుని దని తెలిసికొని యెవరు దాని కగ్ని సంస్కారము చేసినారో అట్టి రామానుజులనే యెరుగమా మేము? వారి పరిపూర్ణ కటాక్షముచేతనే మా దేశమున పంటలు పండుచున్నవి. మేము సుఖముగా నున్నాము. నల్లాన్‌కుల శేఖరుడగు మా గురువుగారు మాకు పంచసంస్కారములు చేయుచు రామానుజుల పాదములే మీకు రక్షకములు అని పలికినందున వారి నామమును మే మెప్పుడును జపించుకొనుచునే యుందుము. ఆ మహాత్ముడగు జగద్గురువు దర్శనము మా కెప్పటికి లభించునో గదా!"

ఈ మాటలు పలుకునపు డా కోయల కన్నులనుండి యానంద బాష్పములు జాలువారెను, అపు డా వైష్ణవులు వారి భక్తిప్రపత్తులకు ప్రీతులై "వీరే యా రామానుజులు" అని తమలో నున్న యతిపతిని వారికి చూపిరి. అపు డా శబరులు పొందిన పరమానందము వర్ణింప నేరి తరము? వా రందరును రామానుజుల పాదములపై బడి తమ కన్నీటిధారలతో వాని నభిషేకించిరి. అపుడు యతిపతి వారి నందరను

లేవనెత్తి యభినందించిరి. తర్వాత నా వ్యాధులు ఊచ బియ్యము, మొక్కజొన్నలు, తేనె మొదలగువానిని యతిరాజుకు సమర్పించి తమ భక్తిప్రపత్తులను తెలియజేసిరి.

"అహో, నా శిష్యులలో ముఖ్యులగు నల్లాన్‌వారి దయచే నజ్ఞానాంధకారమగ్నులగు ఘోరకిరాతులు గూడ నా పాదాక్రాంతు లైనారు గదా! నల్లాన్ కాలమేఘ మిట్టి ఘోరారణ్యములలో వర్షించి మాకెంత యుపకారము చేయుచున్నది! ఎంత మహదానందకరవార్త" అని తలచుకొని రామానుజు లానందతుందిలు లైరి. వా రిచ్చిన పండ్లు, పాలు మొదలగు వానిని దేవతార్పితము చేసి భుజించి లక్ష్మణార్యులు తమ శిష్యసంఘముతో గూడ నా రాత్రి యచ్చటనే సుఖముగా గడపిరి. అకల్మషహృదయులగు నా శబరుల యాతిథ్యసత్కారము చూచి వారి హృదయ మానందసాగరమున మునకలు వేసెను.

తెల్లవారగనే యతిరాజు కాలకృత్యములు తీర్చుకొని తాము సుఖముగా నున్నామని, తమకై విచారింపవల దని శ్రీరంగమునకు వార్త నంపిరి.

ఆ కొండకు రెండు క్రోసులదూరమున నొక కోయపల్లి కలదు. ఆ కోయలు రామానుజులను వారి శిష్యులను నచటకు తీసుకొని పోయిరి. శూద్రుల యింట వంట చేసుకొని భుజింపరు గాన వీరికి భోజనసదుపాయములు సమకూర్చుట యెట్లా యని కోయదొరలు విచారింపసాగిరి. అంతలో నొకడు "సమీపముననే యొక పల్లెలో నొక బ్రాహ్మణగృహము కలదు. అక్కడకు వీరిని తీసికొనిపోయిన నచటనే వంట చేసికొని భుజింపగలరు" అని పలికెను.

## చేలాంచలాంబ

ఆ బ్రాహ్మణుని భార్య పంచసంస్కారములను పొంది వైష్ణవ ధర్మమును స్వీకరించిన సుజ్ఞానసంపన్నురాలు. చేలాంచలాంబ యను నా మహాసాధ్వి 'కొంగుపిరాట్టి' యని పిలువబడుచుండెడిది. ఆమె యా భాగవతోత్తములను చూడగనే యానందముతో నొడలు పొంగి వారికి శ్రద్ధాభక్తులతో నర్ఘ్యపాద్యాదుల నొసగి పూజించెను. 'మీకై వంటకములు సిద్ధము చేసెదను. స్నానసంధ్యాదు లింతలో నిర్వర్తించు

కొని యీ దాసురాలి యింట భుజించి మమ్ములను కృతార్థులను చేయుడు' అని యామె వారికి నివేదించెను.

వా రామెతో 'సాధ్వీశిరోమణీ, మీ యీ పూజాదులతోనే యానందమైనది. మా భోజనమునకై నీవు శ్రమపడవల'దని పలికిరి. అపుడామె యనెను -- "నేనును రామానుజ పాదదాసినగు శ్రీవైష్ణవినే. మా యింట భుజించుటకు మీ కనుమాన మేల? నా పూర్వకథ వినినచో మీ యనుమానము తీరగలదు. ఆలకింపుడు—

"పూర్వ మొకప్పు డీ దేశమున పెద్ద కరువు సంభవించెను. దానికి భయపడి యిచ్చటనుండి ప్రజ లాహారాన్వేషణకై పలు దేశములకు వెడలిపోయిరి. నేనును నా భర్తతో నపుడు శ్రీరంగమున కేగితిని. ఒకనాడు నేను మా యింట నుండగా శిష్యసంఘపరివృతులగు రామానుజ యతిరాజు నా దృష్టికి గోచరులైరి. ప్రతిదినమును వా రేదు వైష్ణవ గృహములలో భిక్షాటన చేయువారు. ఒకనాడు నేను భిక్షను తీసుకొని యింటి కేగుచున్న వారి దారి నడ్డగించితిని.

'అమ్మా, నన్నేల యాపినా' వని వారు నన్ను ప్రశ్నించిరి. 'స్వామీ, మీరు భిక్షాటన రతులు గదా! అట్టి మిమ్ము రాజాధిరాజులును, వేదవేదాంతపారంగతులునగు పండితులును గూడ కొలువ కారణ మేదియో యెంత యాలోచించినను నాకు తెలియుట లేదు. తమ కభ్యంతరము లేనిచో కాదనుకుండ నా యీ సందియము బాపి నన్ను ధన్యను జేయ ప్రార్థించుచున్నాను' అని నేను వారికి విన్నవించితిని.

'సాధ్వీ, అదియా నీ సందియము? సరే ఆలకింపుము. నేను వారందరకును నారాయణాష్టాక్షరీమంత్ర ముపదేశించినాను. కాననే వారు నన్నింతటి శ్రద్ధాభక్తులతో పూజించుచున్నారు' అని యతిపతి నాకు సమాధాన మిచ్చిరి. అపుడు నేను వారిని 'అయిన ఆ మంత్రము నాకు గూడ ననుగ్రహించి ధన్యాత్మను చేయుడని' ప్రార్థించితిని. అపుడు రామానుజు లవ్యాజ శిష్యవాత్సల్యముతో నా మంత్రమును నాకు గూడ ననుగ్రహించిరి.

కొంతకాలమున కీ దేశమున కరువు దూరమయి పంటలు చక్కగా పండసాగెను. ఈ సంగతి విని మేము మరల నీ యూరు వచ్చివేయ

దలచితిమి. కాని యతిరాజు చెప్పిన మంత్రము మరచిపోయినందున నేను వారివద్దకు మరల నేగి నమస్కరించి యిట్లు ప్రార్థించితిని — "ఆచార్యా, మీ రుపదేశించిన మంత్రము మరచినాను. కాన దయతో శ్రమ యనక మరొకపరి యా మంత్రము నా కుపదేశింప వేడు చున్నాను. నా భర్తతో స్వదేశమున కేగుదును. కాన దేవతార్చ నలో నిడి యర్చించుకొనుటకు వీలుగా నాకు మీ పాదుకలు గూడ ననుగ్రహింపుడు."

అపుడు దయ వహించి గురువర్యుడు యతిరాజు గురుపరంపరయు తిరుమంత్రద్వయ చరమశ్లోకములును మరల నా కనుగ్రహించుటతో పాటు తమ పాదుకలు గూడ నిచ్చిరి."

ఎప్పుడో జరిగిన యా వృత్తాంత మీ విధముగా నా వైష్ణవులకు చెప్పి చేలాంచలాంబిక 'ఆహా, శిష్యవత్సలుడగు నా గురువు దర్శనము మరల నెప్పటికి లభించునో గదా!' యని పలికి దుఃఖానందములు మనస్సున పెనగొనగా కన్నీరు కార్చెను.

ఆమె చెప్పిన యీ వృత్తాంతము వినగనే లక్ష్మణార్యులు గూడ పూర్వ మామె తనకు శిష్యురా లయిన సంఘటనను జ్ఞప్తికి తెచ్చి కొనిరి. ఆమె నిర్మలభక్తి కెంతో యానందించిరి. 'ఈవరలో గురువు నందు భక్తిగలవారి నెందరనో కన్నాము, విన్నాము. కాని యీమె భక్తి మాత్రము నిరుపమానము; పరాకాష్ఠ వహించినది' అని మనసులోనే యామెను ప్రశంసించి 'సరే, వంట చేయుము. మీ యింటనే భుజించెదము' అని యామె నాదేశించిరి. తమ శిష్యులగు వైష్ణవులకు "ఆమె యే రీతిగా నాహారపదార్థములు పాకము చేయునో చూడు" డని యాజ్ఞాపించిరి.

కొంగుపిరాట్టియు గురువు నానతిప్రకారము స్నానమాడి యార వేసిన వస్త్రములు ధరించి శుచియై రామానుజ పాదపద్మములనే మదిలో ధ్యానించుకొనుచు యతిపతి తన కిచ్చిన పాదుకలను దేవతా ర్చన గృహమున నుంచెను. గురుపరంపరను, ద్వయమంత్రమును జపించి యనంతర మా పాదుకల కభిషేకము చేసి యా తీర్థమును శిరమున జల్లుకొనెను. తర్వాత గంధపుష్పాక్షతలతో యథావిధిగా వానిని పూజించి

గురుధ్యానపరయై తలుపులు మూసి తాను వండిన పదార్థముల నా పాదుకల కారగింపు చేసెను. తర్వాత నామె వంటయింటినుండి లోనికి వచ్చి యచట నున్న వైష్ణవస్వాములందరకు నమస్కరించి హర్షోత్ఫుల్ల వదనపద్మ యై భక్తితో వారందరి పాదపద్మములను తానే లెస్సగా కడిగెను. తర్వాత "స్వాములు భుజింప విచ్చేయవచ్చు" నని మనవి చేసెను.

ఇది యంతయు తనవారివలన వినిన యతిపతి యామె యాతిథ్య పద్ధతి కానందించి 'యేదీ, యా పాదుకలు నాకు తెచ్చి చూపు'మని యానతిచ్చిరి. అపు డామె వెంటనే లోనికేగి వానిని తెచ్చి వారికి చూపెను. తన శిష్యురాలి యట్టి విశిష్టమైన భక్తిప్రకర్షకు లోలో ననే పొంగిపోయినవారై యతిపతి – "అమ్మా, రామానుజులు చెప్పిన యా మంత్రము నీవు నా కిపుడు చెప్పనిదే నీ వైష్ణవులు నీ యింట భుజించుటకు సందేహించుచున్నారు. కాన నా మంత్రము నా చెవిలో చెప్పుము" అని పలికిరి. వారి కెట్లయిన నాతిథ్యమిచ్చి కృతార్థురాలు కాదలచిన యా భాగవతోత్తమురాలు యతిపతి కా మంత్రము చెప్పెను. అపుడామె రామానుజులవద్ద పంచ సంస్కారములనందిన స్త్రీయే యని వారందరకు నమ్మకము కల్గెను. "అమ్మా, నీవు వైష్ణవ దీక్షితు రాల వగుట నిశ్చయము. కాన వీరిలో నీ మంత్రోపదేష్ట రామానుజు లున్నారేమో పరిశీలించి కనుగొను" మని లక్ష్మణార్యు లామెతో పలికిరి. ఆమెయు తనకోరిక ఫలింపవచ్చు నను సంతోషముతో ప్రతి వారిపాదములను శ్రద్ధగా చూచెను. క్రమముగా నామె రామానుజుల వారివద్దకు వచ్చి వారి పాదములను పరీక్షించెను. వారే రామానుజు లయి యుండవచ్చునని నిర్ణయించు కొని తాను తెచ్చిన పాదుకలను వారి పాదములకు తొడిగెను. చిత్రముగా నవి వారికి సరిగా సరిపో యెను. అపు డామె "దండకమండలములును, కాషాయవస్త్రములును లేనందున గుర్తు తెలియుట లేదు. కాని వీరే నాకు మంత్రప్రదాత యగు రామానుజులు" అని పలికెను.

అపుడు యతిపతి "కల్యాణీ, నీకు మంత్ర ముపదేశించిన రామా నుజుడను నేనే గాని మరొకరు కారు. శ్రీరంగమునుండియే నే నిపుడు వచ్చినాను" అని పలికిరి.

తమ గురువే యెదుట నున్నా రని తెలిసికొన్న యా సాధ్వి యానంద మేమి చెప్పను! ఆమె వెంటనే "స్వామీ, మీ యీ పాదదాసిని క్షమించి రక్షింపక తప్ప" దని పలికి వారి పాదములపై వ్రాలెను. అట్లు వ్రాలిన యామెను యతిపతి లేవనెత్తి తగుమాటలతో తృప్తిపరచిరి.

తర్వాత యతిపతి తనవారితో ననిరి – "దుర్యోధనాది భూపతుల యింట భుజించుట మాని శ్రీకృష్ణుడు విదురునింట విందారగించినట్లే భోగ్యత్వపావనత్వాది గుణసంపన్నమగు వైష్ణవపాకము భుజించుట యెంతవారికో గాని లభింపదు. కాన సందియపడక మీరందరు నిచట భుజింపదగును." గుర్వాజ్ఞ శిరసావహించి యా సాధ్వి యిడిన భోజన మా శ్రీవైష్ణవు లందరును తృప్తిగా నారగించి సుఖముగా నిద్రించిరి.

తదుక్తశేషము నామె యొక పాత్రలో భద్రపరచి తీసుకొనిపోయి భర్తచే భోజనముతోబాటు దానిని భుజింపజేసెను. తాను మాత్రము భుజింపకయే భూమిపై వేరుగా శయనించెను. అపు డామె భర్త "నీ వేల భుజింపవైతివి? నేలపై నేల శయనించితివి?" అని యామెను ప్రశ్నించెను.

అపుడామె తన భర్త కిట్లు సమాధాన మిచ్చెను– "శ్రీరంగము నుండి మా గురువు రామానుజులు వచ్చినారు. నేను ప్రార్థించినను వారు మన యింట భుజింపలేదు. కారణమడుగగా "నీ భర్త వైష్ణవుడు కాలేదు. కాన మీ యింట భుజించుట కుదరదు" అని పలికిరి. ఇంటికి వచ్చిన గురువును పస్తు పరుండబెట్టి నే నెట్లు భుజింపగలను?" అని యామె సమాధాన మిచ్చెను.

"అయిన నందుకు నేను చేయదగిన దేమి కలదు" అని భర్త యడిగెను. "మీరు గూడ చక్రాంకనసంస్కారము నందిననే వారు మన యింట భుజింపగల" రని యామె సమాధాన మిచ్చెను. "సరే, రేపుదయము రామానుజుల నాశ్రయింతు" నని యాతడు శపథము చేసెను. భర్త వాగ్దాన మీ రీతిగా బడసి చేలాంచలాంబ యా రాత్రి గడపెను.

తెల్లవారగనే యామెభర్త స్నానసంధ్యాదులు నిర్వర్తించుకొని భార్యను ముందిడుకొని యతిపతి చెంతకు చేర తన్ను గూడ మంత్ర దానముచే ననుగ్రహింపు డని యర్థించెను. యతిపతి యాతనితోబాటు గృహధర్మచారిణి యైనందున మరల నామెకు గూడ పంచసంస్కార ములు చేసి మంత్ర ముపదేశించి యాతనికి రంగద్దాసని నామకరణము చేసిరి. రంగదాసుడును యతిపతిని తత్పరివారమును వస్త్రాభరణాదు లతో లెస్సగా పూజించెను.

అచటనే యతిపతి నాల్గుదినములు శిష్యసంఘముతో గూడ సుఖ ముగా గడిపిరి. కాషాయవస్త్రములు దండకమండలువులు తెప్పించి వానిని తమ కులదైవము వరదరాజు సన్నిధి నుంచి ధరించిరి. రంగదాసుతో బాటు చాలమంది వారి కా గ్రామమున శిష్యులైరి. చేలాంచలాంబ యాతిథ్యము యతిరాజుచే రంగనాథుని సేవను గూడ మరపించెను.

## విష్ణువర్ధనుడు

ఆ దంపతులు కొంతదూరము తనను సాగనంపగా రామానుజులు పరివారముతో బయలుదేరి పశ్చిమముగా సాగిరి. వహ్నిపుష్కరిణివద్ద మూడు దినములుండి మిథిలా ప్రాంతముననున్న యొక గ్రామము చేరిరి. అచట బ్రాహ్మణు లద్వైతమతావలంబులైనందున లక్ష్మణార్యుని పూజిం పరైరి. ఆ జనుల యజ్ఞానము పోగొట్టి మోక్ష మనుగ్రహింప నెంచి తన శిష్యుడు దాశరథితో యతిపతి "ఈ గ్రామవాసు లందరు నెచటనుండి నీరు తెచ్చుకొనుచుందురో యా సరోవరము వద్దకేగి నీ పాదము లుంచుకొని కొంతసేపచట కూర్చొని యుండుము" అని యాదేశిం చిరి. తత్పాద తీర్థగ్రహణ ప్రభావముచే నా గ్రామవాసు లందరును జ్ఞానవంతులై రామానుజుల నాశ్రయించిరి. అపు డా గ్రామమునకు లక్ష్మణార్యులు సాలగ్రామమని నామ మిడిరి.

అటనే వారాంధ్రపూర్ణుడను శిష్యుని విశేషముగా కటాక్షించి యాయనకు తన శ్రీపాదముద్రల ననుగ్రహించిరి. అచటనుండి నార సింహక్షేత్రము చేరి యా స్వామిని సేవించి యా యూరనే క్రిమికంఠ నిర్మూలనముచే లోకహితము కల్గించుటకై యభిచారహోమము గావించిరి.

భక్తగ్రామపూర్ణుని చూచు నుద్దేశ్యముతో నచటినుండి వారు భక్త గ్రామము చేరిరి. యతిపతి తన యూరిని తన యింటిని వెదకికొనుచు వచ్చుచున్నారను వార్త తెలిసికొని యా వైష్ణవుడు మిగుల నానందముతో నెదుర్కొని ఘనముగా వారి కాతిథ్య మిచ్చిరి. అచట లక్ష్మణార్యులు తమ పరివారముతో కొంతకాలము సుఖముగా నుండిరి.

ఆ దేశమును విఠలదేవు డను భూపతి పాలించుచుండెను. ఆతనికే బిట్టిదేవు డని చరిత్రప్రసిద్ధనామము. ఆ రాజు పుత్రికను బ్రహ్మరక్షస్సు పట్టుకొనెను. రాజాజ్ఞచే ననేక మాంత్రికు లా గ్రహ బాధనుండి యామెను వదలించుట కెన్నో ప్రయత్నములు చేసికూడ విఫలమనోరథు లైరి. దుష్టగ్రహావిష్ట యగు తనబిడ్డ దిగంబరయై తిరుగుచు కనిపించిన వారినెల్ల నశ్లీలాలాపములకు గురిచేయుచుండుట చూచి పాప మామె తల్లి లోలోన యెంత కుమిలిపోవుచుండెనో వర్ణింప నెవరితరము?

భక్తగ్రామపూర్ణు డుంఛవృత్తి చేసుకొనుచు యాదృచ్ఛికముగా నా యూరికేగెను. అచట తన కుమార్తె దుఃస్థితికి వగచుచున్న రాజ పుత్రికతల్లిని చూచి యామె నూరడించి యా బ్రాహ్మణుడు 'వచ్చి మీాదపడిన యాపదయను కొండను తొలగించికొన యత్నింపవలెను గాని విచారించుచుండిన నెట్లు? మా గురువు రామానుజుల మహిమా ప్రభావము లమేయములు. వారి నిటకు రప్పింప గలిగినచో వారిని చూచినవెంటనే యా దుష్టపిశాచము మీా బిడ్డను వదలి పారిపోగలదు. పూర్వము గూడ రామానుజుల ప్రభావముచే నొక పిశాచ మొక బాలికను వదలి పోయినది' అని యాదవప్రకాశుని వద్ద చదువుకొనుచున్న కాలమున రాజకుమారిని పట్టుకొన్న బ్రహ్మరాక్షసుని వారు వదలించిన వృత్తాంతమును వివరించెను.

ఆ మాటలు రాణి రాజుకు తెలియజేసెను. రామానుజు లంత సమర్థులయినచో వారిని వెంటనే యాశ్రయింతు నని పలికి "మా యింటికి దయ చేయుడ"ని రామానుజులవద్దకు రాజు దూతను పంపెను. వారచటకు పోవలెనా వలదా యని యాలోచించుచుండగా నాత్మీయులు కొందరు వారితో "ఈ రాజును శిష్యునిగా చేసుకొన్నచో మీారు తలచుకొన్న వైష్ణవదర్శనవ్యాప్తికి చాల ప్రోత్సాహము లభింపగలదు" అని పలికిరి. యతిపతి దాని నంగీకరించి తన శిష్య సమూహముతో నా రాజభవనమును ప్రవేశించిరి. విఠలదేవుడు మంత్రి సామంతాది పరివారముతో

వారికి కొంతదూర మెదురేగి కోటలోనికి తీసుకొనివచ్చెను. ఉన్నతా సమున కూర్చుండజేసి వారికి రాజోచితమర్యాదలతో నతిథిసత్కారము జేసెను. అపుడు యతిపతి ప్రీతులై యా భూపతికి తమ శ్రీపాద తీర్థ మనుగ్రహించిరి. తత్తీర్థస్పర్శచే నా బ్రహ్మరక్షస్సు రాజకుమారిని వదలిపారిపోయెను.

తన కొమరిత గ్రహబాధానిర్ముక్తయై పూర్వమువలె స్వస్థచిత్తురా లయినందున విఠలదేవదంపతు లెంతో యానందము నందిరి.. భార్యతో గూడిన యా నరపతికిమాత్రమే గాక యతిరాజా రాజ పరివారమున కంతకును పంచసంస్కారముల ననుగ్రహించి తమ హృదయవైశాల్యము నెరుక పరచిరి. ఆ రాజుకు వారు విష్ణువర్ధను డను నామ మిడి యా వంశమునకు గొప్ప ఖ్యాతి కల్గించిరి.

ఈ విషయము విఠలదేవుని గురువగు బౌద్ధాచార్యునకు తెలిసెను. అతని శిష్యులు మొత్తము వేయిమంది. వారందరును మా వాడగు విఠల దేవుని రామానుజుడు తన మతమున చేర్చుకొనుట మేము చూచుచు నూరకుండ గలమా యని పలికి వాదమున మమ్ము జయిం చిన యెడలనే మిమ్ము వదలిపెట్టగల మని పలికి రామానుజులను చుట్టుముట్టిరి. ఇది పని కాదని రామానుజు లా సభలో నొక తెర కట్టించిరి. దాని మాటున నిలచి తమ సహజమగు వేయితలల యాది శేషుని రూపము దాల్చి ఒక్కొక్క ముఖముతో నొక్కొక్క బౌద్ధుని వాదముచే జయించిరి. ఈ విధముగ కొలది క్షణములలోనే వాదమున నా బౌద్ధుల నందరను ననంతుని యవతారమగు లక్ష్మణార్యు లోడించి తన యాత్మీయులకును విష్ణువర్ధనునకును మాత్రము స్వస్వరూపము చూపి యనుగ్రహించిరి.

ఈ విధముగ రామానుజులు తమ సహజదివ్యశక్తితో నా సహస్ర సంఖ్యాకబౌద్ధులను శ్రీరాముడు ఖరదూషణాదులను వలెనే జయిం చిరి. విఠలదేవవిష్ణువర్ధన మహారాజున కానందము గల్గించి యాతనిచే పూజితు లగుచు కొంతకాల మాతని రాజభవనమున నివసించిరి.

## యతిరాజసంపత్కుమారుడు

భక్తగ్రామమున విష్ణువర్ధనుచే పూజింపబడుచు రామానుజు లితర బాధలు మరచిరి. కాని వారు శ్రీరంగమునుండి యూర్ధ్వపుండ్ర

ధారణమునకై తెచ్చిన తిరుమణి అయిపోయెను. దానిని మరల నెట్లు సంపాదించుటయా యని వారికి చింత పట్టుకొనెను. కాన నొక నాటి రాత్రి వారు తిరుమణి యెచట దొరుకునా యని వ్యాకులతతో నిదురించిరి.

ఆ గ్రామమునకు కొంతదూరమున యదుగిరి యను పర్వతము కలదు. అట నున్న నారాయణుడు స్వప్నమున ప్రసన్నుడై యతిపతితో నిట్లు పలికెను – "వత్సా, నీ కేల యీ విచారము! ఇతరుల కగపడకుండ నేను నివసించుచున్న యాదవాచలము కడకు రమ్ము. నీ కచట వలసినంత శ్వేతమృత్తిక లభింపగలదు. నే నచట నొకచోట పూజాపురస్కారములు లేక మఱుగుపడి యున్నాను. నన్ను వెలికి తీసి ప్రతిష్ఠించి యచట నొక గుడి కట్టించుము."

తెల్లవారెను. రాత్రికలలో జరిగిన సంగతి యతిపతి జ్ఞప్తికి తెచ్చుకొని దానిని తన శిష్యుడు విఠలదేవునకు చెప్పిరి. రామానుజుల యితర శిష్యులును, విఠలదేవుడును గూడ యదుగిరికి పోవు విషయమై వారికి పూర్తిగా సహకరింతు మని వాగ్దానము చేసిరి. ఒక మంచి ముహూర్తమున పెద్ద పరివారమును వెంటనిడుకొని విఠలదేవభూపతి వెంటరాగా తన శిష్యసమూహముతో రామానుజులు యదుగిరికై బయలుదేరిరి. కాని మార్గ మంతయు చెట్లుచేమలతో దుర్గమమై యుండగా విఠలదేవుడు బాటపట్టు ప్రదేశమును నరకించి మార్గమేర్పరచెను.

గమ్యస్థానము చేరిన రామానుజులు వేదపుష్కరిణీ తీరమున పరిధానశిలాతలమున కాషాయవస్త్రములు ధరించి యా శిలపై కూర్చొని దత్తాత్రేయునివలెనే వెలుగొందిరి.

కాని యా కొండపై దేవుని వెదకి గూడ వారు కనుగొనలేక పోయిరి. ఆ స్వామి నా కేల దర్శన మీయలేదా యని చింతాక్రాంతులై యా రాత్రి నిద్రించిరి. అపుడు యాదవాచలపతియగు నారాయణుడు వారికి స్వప్నమున – "కల్యాణతీర్థమను సరోవరతీరమున నీ కొండక్రింద దక్షిణభాగమున చంపక వృక్షముల గుంపొకటి కలదు. దాని కుత్తరమున తులసీవృక్ష మున్నది. దాని క్రిందనున్న పుట్టలో నే నున్నాను. గరుత్మంతుడు నా యాజ్ఞచే శ్వేతద్వీపము నుండి శ్వేతమృత్తిక దెచ్చి యా కల్యాణతీర్థమున కుత్తరదిక్కున కొండ

మొదట నిక్షేపించినాడు. దానిని నీ వూర్ధ్వపుండ్రధారణ కుపయోగించు కొనుము. అది యక్షయనిధి" యని యానతిచ్చెను.

ప్రత్యక్షముగ పల్కినట్లు స్ఫుటముగ వినబడిన యా పలుకులు విని లక్ష్మణార్యులు వెంటనే యా సంగతి యంతయు విఠలదేవున కెరిగించిరి. వారంద రప్పటి కప్పుడే స్నానమాడి శుచితో తులసీ వృక్షమూలముననున్న వల్మీకమువద్దకు చేరి నారాయణుని దర్శించిరి. ఈ విధముగా బహుధాన్యవత్సర పుష్యమాసమున శుక్లపక్షచతుర్దశినాడు గురువారమున పునర్వసు నక్షత్రమున తిరునారాయణస్వామి యాదవాచ లమున నావిర్భవించెను. ఆ స్వామిని కనుగొన్న వా రందరు నానందాతిరేకముతో సింహనాదములు చేసిరి. శంఖభేరీ మృదంగాది మంగళ వాద్యధ్వనులు మిన్నుముట్టెను. స్వామిని యతిపతి గోక్షీర ముతో నభిషేకించిరి. మూడుదినములు స్వహస్తములతో నర్చనాదులు జరిపి కృతార్థులైరి.

తర్వాత కల్యాణసరస్సు కుత్తరదిక్కుననున్న పర్వత ప్రాంతమును త్రిదండముతో త్రవ్వగా వారికి తిరుమణి కనుపించెను. ఆ శ్వేత మృత్తిక తీసుకొని యూర్ధ్వపుండ్రములు ధరించి త్రిదండమండితకర కమలుడై యా వన మంతయు నరకించి రామానుజు లా కొండపై నొక నగరము నిర్మించిరి. అదేనేడు తిరునారాయణపురము -- మేలు కోట -- యని పిలువబడుచున్నది. విఠలభూపతి యా మందిరమును, ప్రాకార మండపములతోను నత్యున్నత గోపురములతోను నిర్మించెను. చాతుర్వర్ణ్యములవారును నచట గృహములు కట్టించుకొనిరి.

పాంచరాత్రాగమమునందలి సాత్వతసంహితోక్త ప్రకారమున శ్రీరంగ రాజభట్టరుచే నా స్వామికి వారు యథావిధిగా సంప్రో క్షణాదికార్యములు చేయించిరి. నిత్యోత్సవాదులు వారికృషితో నారంభ మయ్యెను. ఆ స్వామికి బ్రహ్మోత్సవము గూడ యతిపతి చేయింప నెంచిరి. కాని స్వామి కుత్సవవిగ్రహము లేనందున నది యెట్లు లభించునా యని విచారింపసాగిరి.

అపుడు మరల వారికి స్వప్నగతుడై తిరునారాయణస్వామి "నా యుత్సవదేవుడు రామప్రియుడు ఢిల్లీశ్వరు డగు యవనచక్రవర్తి యంతః పురమున నున్నాడు. నీవు వెళ్ళి దానిని వెంటనే తెమ్ము" అని

యానతిచ్చెను. వెంటనే యతిపతి లేచి విఠలదేవుని నిద్రలేపి కర్తవ్య మాలోచించిరి. భూపతి కృతాంజలి యై యిట్లనెను---

"యతిరాజా, మీరు సర్వజగద్గురువులు. సాక్షాచ్ఛ్రీమన్నారాయణ స్వరూపులు. అట్టి మీ కసాధ్య మేమి యుండును? శిష్యసంఘములతో మీరు ఢిల్లీ చేరినచో యవనచక్రవర్తి తనంత తానే యా దేవుని మీకు సమర్పించి మీ వాంఛిత మీడేర్పగలడు. ఈ జైత్రయాత్రకు కావలసిన ధనాదు లీ దాసునివి; మీరు స్వేచ్ఛగా నుపయోగించుకొన వచ్చును. ఈ రాజ్యమే మీది. నేను నిమిత్తమాత్రుడను. నా ప్రజ లందరును గూడ మీ శిష్యులే గదా! కాన ఢిల్లీకి వెంటనే ప్రయా ణము కట్టుడు. మీ యడుగుజాడలనే మేమును అనుసరింతుము."

విఠలదేవుని యీ నిరుపమానభక్తి రామానుజులను పూర్తిగా లో గొనెను. "నీబోటి శిష్యుని బడసిన నా కసాధ్య మేముండును" అని యతిపతి యా రాజును తగురీతిగా సంతోషింపజేసిరి.

వెంటనే సైన్యములు సిద్ధము చేయబడెను. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రజాతులవా రందరును వారివెంట ప్రయాణ మగుటకు పిలువ కుండగనే వచ్చిరి. ఈ విధముగా రామానుజులు రామప్రియుని యుత్సవ బేరమును కొనితెచ్చుటకై యొక సుముహూర్తమున ఢిల్లీకి బయలు దేరిరి.

సైనికు లందరును నితరులతో బాటూర్ధ్వపుండ్రములును, పద్మాక్ష మాలికలును, తులసీతావళములును ధరించి తలపాగలు దాల్చి ధాటీపంచ కము పఠించుచు మెరపువలె కనులు జిగేలు మనిపించునట్టి రామానుజ నామాంకిత మగు కరవాలములు కేల బూని వేలసంఖ్యలో ముందుకు సాగిరి. పండ్రెండు వేల యేకాంతులును, చతుస్సప్తతి పీఠాధిపతులును, నితరు లనేకులును తమ వెంటరాగా యతిసార్వభౌములు ఢిల్లీకి బయలు దేరిరి. నేల యీనినట్లు వచ్చుచున్న జనవాహిని తమ సేనాసముద్ర మున కలియుచుండగా వారు ఢిల్లీ చేరిరి.

అసంఖ్యాకమగు నా యతిపతిసేనను గూర్చి విని ఢిల్లీశు డత్యంత విస్మితుడై వెంటనే మంత్రులను రావించి పరామర్శించెను. ఆ బల మజేయ మని, సామముతోనే వారి పని సాధించి పంపినచో తమ

రాజ్యమునకు క్షేమము కలుగు నని, వారివలన తెలిసికొనిన ఢిల్లీశుడు యతిపతిరాకకు కారణము తెలిసికొనుటకు తన చారులను వారివద్దకు పంపెను. అపుడు రామానుజులు తగు రీతిగా నా చారులకు సమాధాన మిచ్చి పంపి నీతివిశారదులగు తమ శిష్యులతో తమ యాగమనకారణము తెలుపుటకు మా యతిసార్వభౌములే వచ్చుచున్నారని ఢిల్లీశునకు ముందుగా వార్త నంపిరి.

రామానుజులు ఢిల్లీదర్బారు చేరగనే యవనచక్రవర్తి వారి కెదురేగు దెంచి సగౌరవముగా లోనికి గొంపోయి యాతిథ్యసత్కారముల నొనర్చెను. తర్వాత నుచితాసనాసీనులను జేసి వారిని వచ్చిన కారణమడిగెను. ఆ చక్రవర్తి ప్రవర్తనకు సంప్రీతులై యతిరాజు "మీ యంతఃపురమున మా దేవు డున్నా డని తెలిసి వచ్చినాము. కాన నా విగ్రహమును మా కిప్పింపుడు" అని కోరిరి.

అపుడు ఢిల్లీశ్వరుడు తాను పూర్వము నానాదిక్కులనుండి జయించి తెచ్చిన శైవవైష్ణవవిగ్రహములు లోనుండి తెప్పించి చూపెను. కాని వానిలో రామప్రియుని విగ్రహము లేనందున యతిరాజు విచారింప సాగిరి. అందు కా యవనచక్రవర్తి మీ దేవు డిక్కడ నున్నచో మీరు పిలచిన రాకమానునా" యని చమత్కరించెను.

ఈ మాటకు కొంచెము బాధపడి యతిపతి 'ఇది యేమి ఇట్లు జరిగినది' అనుకొనుచు నిజనివాసము చేరిరి. ఆ రాత్రి రామ ప్రియుడు నిద్రలో వారికి కనుపించి "ఓయీ, ఏల యీ విచారము! నేను ఢిల్లీశుని పుత్రికయంతఃపురమున నామెచే చక్కగా పూజింప బడు చున్నాను. కాన నీ వచ్చుటకు వచ్చి నన్ను తీసికొనిపొమ్ము" అని వచించెను. వెంటనే వారు లేచి ఢిల్లీపతి కీ సంగతి యెరిగించిరి. అది విని యందు కచ్చెరువంది యాతడు లక్ష్మణార్యుని తన కొమరిత యంతఃపురమునకు గొనిపోయెను.

అచట కేగి యతిరాజు బయట నిలబడి "రామప్రియా, రమ్ము" అని పిలచిరి. తోడనే యా దేవుడు పసిబాలునివలె పీతాంబరధరుడై కస్తూరీతిలకము మొగమునకు వింత చెలువను కల్గింపగా కాలియందె యలు గల్లుగల్లున నాడగా నొడలు పులకరింప ముద్దులు మూటగట్టు

భువనమోహన రూపముతో నడచి వచ్చి రామానుజుల తొడపై కూర్చొనెను. అపుడు యతిరాజానందమున నొడలు మరచి "రమ్మి నా సంపత్కుమారా" యని పలికి పుత్రవాత్సల్యముతో నా దేవుని కౌగిలించుకొనిరి. కాననే యా దేవుడు యతిరాజసంపత్కుమారు డని సార్థకనామము ధరించెను. ఆ దేవుడు యతిరాజుకు పుత్రుడనియే యచటి వారందరకును తోచెను.

యతిరాజు ప్రభావము నీ రీతిగా కన్నులార గాంచిన ఢిల్లీశ్వరుడు వారి నెన్నో రీతులుగా పూజించి గౌరవించెను. తగు మర్యాదలతో వారిని తన నగరినుండి సాగనంపెను.

కాని రామప్రియునే తన సర్వస్వముగా భావించి యాతనితోనే యాడుకొనుచు నన్యకాలక్షేప మెరుగని యా ఢిల్లీశ్వరుని పుత్రిక తద్వియోగబాధను భరింపలేక దుఃఖముతో నేలపైబడి పొరలసాగెను. ఈ వార్త యామె చెలికత్తె లెరిగింపగా చక్రవర్తి వెంటనే వ్యాకులితాంతరంగముతో నామె వద్దకేగి "తల్లీ, నీ దుఃఖమునకు కారణ మేమి? వెంటనే నీకు కావలసిన దానిని తెప్పించి యిచ్చెదను, తెలుపుము" అని పలికెను.అందు కామె "తండ్రీ, నా కత్యంతము ప్రీతిపాత్రుడును నా జీవిత సర్వస్వమునునగు రామప్రియు నెవరివెంటనో పంపితివి గదా! ఇక నేనెట్లు జీవింపగల" నని దుఃఖభారముతో గుండియలు వ్రీలగా విలవిలలాడసాగెను. ఆ బాలికదుఃఖము శ్రీరాముడు వనమున వదలిన నాటి సీతమ్మ కన్నీటి గాథనే తలపించిన దన్న బాగుండు నేమో?

ఉ."ఎన్నటికిన్ రఘూద్వహుని నేనును నన్నిఁక రామచంద్రుఁడున్
గన్నులఁ జూడఁ గల్గనొకొ! కల్గకయుండినఁ బ్రాణ మేల పో
దన్న, రఘుప్రవీరు చెవులారఁగ నింతయుఁ దెల్పు నాదు మే
నున్నది, చెంత గంగమడు గున్నది, యైనటు లయ్యెడున్ దుదిన్."
---కంకంటి పాపరాజు.

"అపి గ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయం" అని భవభూతి మహాకవి వర్ణించినట్లుగా నేలపైబడి దొరలుచు విలపించుచున్న తన పుత్రిక దుఃఖమును చూడలేక ఢిల్లీసార్వభౌముడు యతిసార్వభౌముని వద్ద కేగెను. తన పుత్రిక రామప్రియునకై పడు పరితాపమును వారికి నివేదించి "యయ్యా, మా దేవుని మరల మా కిచ్చి మా బిడ్డ ప్రాణ

ములు నిలువబెట్టు" డని పలికి విషయ మంతయు విన్నవించి వారి పాదములపై బడి ప్రార్థించెను.

అందులకు రామానుజు లిచ్చిన సమాధాన మిది– "రాజా, నీ కోరిక సమంజసమే, కాదనను. కాని యా దేవుని కొఱకే గదా, మే మింత శ్రమపడి యిచటకు వచ్చినది! అట్టి మా దేవుని మరల మీ కిచ్చుట యెట్లు పొసగును? మీ దేవుడయినచో మీరే కొనిపొండని లోగడ నీవు మా కిచ్చిన వాగ్దానము జ్ఞప్తికి తెచ్చుకొనుము, మా దేవుడు గనుకనే గదా రామప్రియుడు మీరందరు చూచుచుండగనే నా వద్దకు నడచి వచ్చినాడు! అట్టి నా ముద్దుబిడ్డను మరల మీకు నప్పగించిన నే నుండగలనా?"

ఇక మారుపలుకక ఢిల్లీపతి యంతిపురి చేరి మంత్రి సామంతాదులతో నాలోచించి మార్గాంతరము తోచనందున తన బిడ్డను మంగళ శిబికపై నెక్కించి వస్తువాహనాదులతో దాసదాసీజనముతో రామప్రియుని వెంట పంపెను. సుఖముగా నామెను యదుగిరికి చేర్చవలసినదిగా పలికి తన కుమారుని చతురంగబలముతో వెంట బంపెను.

సంపత్కుమారు ననుగమించిన ఢిల్లీశ్వరాత్మజ యీ విధముగా భర్త ననుసరించిన భార్యను జ్ఞప్తికి తెచ్చుచు ప్రేక్షకుల కెంతో యానందము కల్గించెను.

యదుగిరిలో నుత్సవాదులు చేయుట కుపయోగించు రామప్రియు నొక్కనిని మాత్రమే గాక సయాచితముగ లభించిన స్త్రీరత్న మగు ఢిల్లీశ్వరుని పట్టిని గూడ తనతో బాటు, గొని వచ్చు రామానుజులు శ్రీరామాదులకు వివాహము చేసి మిథిలానగిరినుండి యయోధ్యాపట్టణమునకు మహాసంతోషముతో తమ కోడండ్రను వెంటబెట్టుకొని వచ్చు శ్రీదశరథ చక్రవర్తినే చూపఱకు జ్ఞప్తికి తెచ్చిరి.

కాని యా సుందరాంగి మార్గమధ్యముననే చూచువారెల్లరు వింత పడునట్లుగా నా దేవునిలో నైక్యమై పోయెను. రామానుజులును తామెంతో కష్టపడి వెంటతెచ్చిన సంపత్కుమారదేవుని యుత్సవ విగ్రహమును యథావిధిగా ప్రతిష్ఠించి సంప్రోక్షణాది కార్యములు నెరవేర్చిరి.

హరిపాదైక్యము చెందిన ఢిల్లీశుపుత్రిక విగ్రహము గూడ చేయించి సంపత్కుమారుని పాదమూలముననే ప్రతిష్ఠించిరి. ఆమెయే బీబీనాచ్చియారు!

తమ కొమరిత హరిలో నైక్య మందిన వార్త విని ఢిల్లీశుడు దుఃఖముతో బా టామె చేసుకొన్న సుకృతమున కానందము గూడ నందెను.

ఆ దేవుని ఢిల్లీనుండి తెచ్చుటకు సాయపడిన వర్ణబాహ్యులగు విష్ణుభక్తులకు యతిపతి శాశ్వతమైన మర్యాద నొక దాని నేర్పరచిరి. పంచమజాతివా రందరును బ్రహ్మోత్సవసమయమున ప్రతిసంవత్సరమునను కల్యాణ సరసిలో స్నానమాడి యూర్ధ్వపుండ్రధరులై యా విష్ణ్వాలయమున ప్రవేశించి బలిపీఠము సమీపించి యటనుండి స్వామిని దర్శింపవచ్చు ననుటయే యా మర్యాద! హరిజను లా దేవమందిరమునకు ప్రదక్షిణ మాచరించి నూనె, బియ్యము నా స్వామికి సమర్పించి కృతార్థులై తమ తమ యిండ్ల కరుగుట, తర్వాత స్వామివారికి సంప్రోక్షణాదులు చేసి మిగిలిన యుత్సవము చేయుట, నేటికిని నచట ననూచానాచారముగ వచ్చుచున్నది.

యాదవాచలమున మఠము నొక దానిని నిర్మించుకొని లక్ష్మణార్యు లచటనే చాలకాలము గడపిరి. శ్రీభాష్యభగవద్విషయాదులను శిష్యసంఘమునకు బోధించుచు వా రచట నివసించుచునే శ్రీవైష్ణవ సిద్ధాంతము దశదిశలందును దట్టముగా వ్యాపింపజేసిరి.

రంగనాథసేవాహీనతచే కలిగిన దుఃఖము సంపత్కుమారుని యుత్సవాదులచే దూరము కాగా రామానుజులు బ్రహ్మానందామృతసింధువున నోలలాడిరి. రంగనాథునిపై గల ప్రేమబంధముకంటె రామానుజులకు సంపత్కుమారునిపై పాశము సుదృఢము కాసాగెను. ఎవరికైనను తండ్రిపై కంటె కొడుకుపై ప్రసరించు ప్రేమ ఘనిష్ఠము గదా! రామానుజ రహితమగు శ్రీరంగము శ్రీరాముడు లేని యయోధ్యవలెనే శోభావిహీన మాయెను. అహా, కాలమహిమ యెట్టిది? దాని చేతనే కదా యోడలు బండ్లను బండ్లోడలును నగుచుండుట!

# మహాపూర్ణ కూరేశుల నేత్రోత్పాటనము

శ్రీరంగమునుండి వైష్ణవు డొకడు రామానుజులను దర్శింప వచ్చెను. ఆయన కూరేశ మహాపూర్ణుల వృత్తాంతమును రామానుజుల కిట్లు విన్నవించెను—

"కూరేశుడును, మహాపూర్ణులును చోళరాజువద్ద కేగుట మీారెరుగుదురు కదా! వా రిద్దరును తమ యాస్థానము చేరిన తర్వాత కూరేశుడు తన గురువు బదులుగా వచ్చి తనను మోసగించినాడని తెలిసికొని క్రిమికంఠుడు మహాకోపముచే ప్రళయకాలరుద్రుడే యాయెను. అయినను నెట్లో నిగ్రహించుకొని "శివాత్పరతరం నాస్తి" యని వ్రాయుమని వా రిద్దరి నాజ్ఞాపించెను. శ్రీమన్నారాయణుడే పరతత్త్వ మనుటకు కూరేశు డెన్నో శాస్త్రవచనములను శరపరంపరగా నుపన్యసించెను. కాని యవి యన్నియు నా క్రూరుని యెదుట చెవిటివాని చెవిలో నూదిన శంఖమువలెనే వ్యర్థమాయెను. కాన నాతడు మండిపడి "నీ మాయ మాటలు నాదగ్గర సాగవు. హనుమంతుని యెదుట కుప్పిగంతులా? నీవు నేను చెప్పినట్లు వ్రాయక తప్ప" దని కూరేశుని నిర్బంధించెను. అపుడు కూరేశుడు "ద్రోణమస్తి తతః పరం" అని వ్రాసెను. దాని యర్థమే మని క్రిమికంఠుడు తన యాస్థాన పండితుల నడుగగా వారు శివము, ద్రోణము కొలపాత్ర యనియు శివమును మించినది ద్రోణ మను పాత్ర కల దని కూరేశుని మాటల యర్థ మనియు వారు తెలిపిరి. ఈ పరిహాసమున కుడికిపోయి యా నీచుడు కూరేశ మహాపూర్ణు లిద్దరి కనులను తన భటులతో నిర్దయగా పీకించి వారిని పొం డని వదలి వైచెను.

ఆ బాధతోనే వా రిద్దరును శ్రీరంగమునకు మరలిరి. బాధ దారిలోనే మిక్కుటమై మహాపూర్ణులకు ప్రాణోత్క్రమణ మాయెను. నూటయిదు వత్సరములు జీవించిన మహాపూర్ణు లీ విధముగా శరీర త్యాగము గావించి స్వాచార్యపాదమూలము చేరిరి. వెంట వచ్చిన వైష్ణవులు దుఃఖముతో వారి కచటనే దహనసంస్కారము గావించి కూరేశుని శ్రీరంగమునకు గొని వచ్చిరి. "అయ్యో, మహాపూర్ణులకు మోక్ష మనుగ్రహించిన రంగనాథునకు నాపై నింకను దయ రాలేదు గదా" యని కూరేశుడు మిగుల ఖిన్ను డాయెను.

ఈ విధముగా కూరేశమహాపూర్ణుల కన్నులు క్రిమికంఠుడు పీకించెనని, మార్గమధ్యముననే తమ గురువు మహాపూర్ణు లస్తమించి రని యతిపతి విని దుఃఖాకులిత చేతస్కులైరి. విధినిర్ణయ మిది. జరిగిన దానికి మీబోటి ధీరులు చింతింపరాదని శిష్యు లోదార్చగా నెట్లో తేరుకొనిరి. తర్వాత స్వామిసన్నిధిలో నుభయ వేదములను, శ్రీమద్రామాయణ మహాభాగవతములును, విష్ణుపురాణశ్రీభాష్యములను పారాయణము చేయించిరి. షడ్రసోపేతములగు భక్ష్యభోజ్యాది పదార్థములతో భాగవత తదీయారాధన చేయించిరి. ఈ విధముగ తిరువధ్యయనోత్సవము (శ్రాద్ధము) జరిపి మహాపూర్ణులపై తమకు గల గురుభక్తిని సార్థకపరచుకొనిరి.

ఒక ప్రక్క పరమపదించిన మహాపూర్ణులను, మరొక ప్రక్క తమను రక్షించుటకై నేత్రములనే పోగొట్టుకొని దుర్భరబాధ ననుభవించుచున్న గురుభక్తిపరు డగు కూరేశుని తలచుకొని వారు దుఃఖింపని క్షణమే లేకపోయెను. వెంటనే కూరేశుని తమవద్దకు తీసికొని రమ్మని వారు తమ శిష్యులను శ్రీరంగమునకు పంపిరి.

## క్రిమికంఠ దుర్మరణము

కనులు పోయిన కూరేశుడు నెమ్మదిగా నడచుచు కొలది దినములకు శ్రీరంగమునకు చేరుకొనెను. చోళరాజ భటులు రామానుజ పక్షపాతులగు వైష్ణవుల నందరను శ్రీరంగమునుండి వెడలగొట్టిరి. కొంద రర్చకులు మాత్రము రంగనాథుని పూజాది కైంకర్యము చేయుచు ముండ్లమీద నున్నట్లు కాలము గడుపసాగిరి.

ఇది విన్న కూరేశుడు రామానుజులపేరు గూడ పనికి రాని యా ప్రదేశము తనకు ప్రవేశార్హము కా దని నిర్ణయించి యచటనుండి 'వానమామల' యను నామాంతరము గల సుందరాచలము జేరి యచటి సుందరబాహుస్వామి సేవలో కాలము గడుపజొచ్చిరి. అచ్చటనే వారు పంచస్తవములలో నాల్గింటిని - శ్రీస్తవము, 'సుందరబాహుస్తవము, అతిమానుషస్తవము, శ్రీవైకుంఠస్తవము అను వానిని మృదుమధురశైలిలో భక్తిరసము జాలువారగా సంస్కృతమున రచించిరి.

రామానుజులు పంపిన వైష్ణవుడు కూరేశుని శ్రీరంగమున కానక

యచటినుండి వా రున్న సుందరాచలము చేరి యతిపతి సందేశము ఆయన కెరిగించెను. అది విని కూరేశుడు తన యాచార్యునకు తనపై గల వాత్సల్యాతిశయమునకు మిగుల నానందించెను.

ఇంతలో క్రిమికంఠుని పాపము పండెను. అతని కంఠమున ఘోర వ్రణము పుట్టి యది పగిలి యందు పురుగులు పడెను. దానిచే లోక కంటకు డగు నా రాక్షసుడు దయనీయమగు మరణమునకు పాల్పడెను. ఈ వార్తను కొందరు శ్రీరంగమునుండి యదుగిరి కేగి రామానుజులకు నివేదించిరి. లక్ష్మణాచార్యు లా లోకప్రియవృత్తాంతము విని 'నేటికి గదా! ధర్మమున కేర్పడిన విఘాతము తొలగిన' దని సంతృప్తి నందిరి. ఇక వారు శ్రీరంగమునకు ప్రయాణ మగుటకు సన్నాహములు చేయసాగిరి. అప్పటికి వారు శ్రీరంగము వదలి పండ్రెండు సంవత్సరము లాయెను.

కాని యదుగిరిలో వారికి చాలమంది శిష్యు లేర్పడిరి గదా! వారందరును లక్ష్మణార్యుని వీడియుండుట కెంత మాత్రము నంగీకరింపరైరి. అపుడు యతిరాజు వారికోరిక యెట్లుతీర్పనగునా యని యెంతో యాలోచించి తమ విగ్రహము చేయించి పూజార్థము వారి కిచ్చుటయే పరిష్కార మార్గ మని చివరకు నిర్ణయించిరి. అందుచే నిపుణులగు శిల్పులచే తమ యర్చామూర్తిని చేయించి తమ కళల నందావాహనము చేసి వారి కిచ్చిరి. "నా విగ్రహమును నన్నుగానే భావించి పూజించుచు మీ మీ వాంఛితముల నందు" డని యతిపతి వారికి కట్టడ యిడి తిరునారాయణు నతికష్టముతో వీడ్కొని కతిపయ శిష్యులతో శ్రీరంగము చేరిరి.

## రామానుజ పునరాగమనము

శ్రీరామానుజులు దాశరథ్యాది శిష్యసమేతులై శ్రీరంగమునకు విచ్చేసినపుడు నగరవాసులు సంతోషపరవశులైరి. లక్ష్మణార్యులకు దాశరథి ఛత్రము పట్టెను. గోవిందుడు వీవనతో విసరెను. శంఖభేరి కాహళాది ధ్వనులతోడను, వందిమాగధుల జయశబ్దములతోడను, శ్రోత్రియుల వేదపాఠములతోడను, దిగంతములు ముఖరితము లగుచుండగా యతిపతి వాచామగోచర వైభవముతో శ్రీరంగము ప్రవేశించిరి.

వెంటనే స్వామిని సేవింపనేగిన రామానుజులను గాంచి పగడపు కెమ్మోవితో రంగనాథుడు పలుకరించి కుశల మడిగి "వత్సా, క్రిమి కంఠుడు చనిపోయినాడు గదా! వైష్ణవుల భయ మిక తీరిపోయి నది లెమ్ము" అని పర్యామర్శ చేసినట్లే యా దేవుని వదనారవిందము దర్శించిన వారి కనుభూతి కల్గెను. పెంపుడు తండ్రిని బోలిన రంగ-నాథుని దర్శించిన యానందముతో యతిరాజు తమ శరీరమునే మర చిరి. కొంతవడికి చైతన్యము గాంచిన రామానుజుల కర్చక స్వాములు తీర్థ ప్రసాదములును, శఠకోపమును ననుగ్రహించిరి.

తర్వాత వెంటనే వారు కూరేశుని యింటి కేగిరి. యతిపతి వచ్చుచున్న వార్త విని యంతకు ముందే కూరేశుడు సుందరాచలము నుండి శ్రీరంగము చేరెను. లక్ష్మణార్యుని యాగమనవార్త వినగానే కూరేశుడు తడుముకొనుచు బోయి వారి పాదములను తన యశ్రు జలముతో నభిషేకించెను. తమ పంచప్రాణములలో నొక ప్రాణమైన కూరేశుని నేత్రహీన పరిస్థితిని చూడగనే యతిరాజు గుండె గతితప్పెను. రామానుజు లా గురుభక్తిపరాయణుని వెంటనే లేవనెత్తి 'శిష్యశేఖరా, కూరేశా, నాకై నీ కన్నులు పోగొట్టుకొన్నావు గదా. నా పాపపరిపా కమే నీ కిట్టి దుర్దశ తెచ్చిపెట్టినది' అని తండ్రి బిడ్డకై దుఃఖించునట్లే మిగుల వగచిరి. తర్వాత కూరేశుని చేయి పట్టుకొని తమ మఠము ప్రవేశించిరి.

క్షేమముగా భాష్యకారు లింత కాలమున కిల్లు సేరిన వార్తవిని శ్రీరంగవాసులే గాక సుదూర గ్రామవాసులు గూడ తండోపతండ ములుగా వచ్చి రామానుజుల సందర్శించి యానందాపారపారావారమున నోలలాడిరి. వారి నందరను లక్ష్మణార్యులు తగు రీతిని సత్కరించిరి.

ఒకనాడు కొందరు వైష్ణవు లేతెంచి వారి కిట్లు నివేదించిరి— "స్వామీ, మేము చిత్రకూటమునుండి వచ్చుచున్నాము. అచటి విష్ణుదేవతావిగ్రహములను క్రిమికంఠుని మనుష్యులు ధ్వంసము చేసి వాని స్థానమున శివలింగములను శైవవిగ్రహములను ప్రతిష్ఠించినారు. అచటి గోవిందరాజ స్వామి విగ్రహమును శైవులు సముద్రమున పారవేయ యత్నింపగా తిల్లయను పేరు గల మానినీమణి యెట్లో యా విగ్రహ మును సంపాదించి చాటుగా తిరుపతి చేర్చెను. కాన నా గోవింద

రాజస్వామిని తిరుపతిలో మీరు సుప్రతిష్ఠితుని చేయు భారము వహిం పక తప్పదు."

ఆ మాటలు విని యతిరాజు గోవిందరాజస్వామికి సంభవించిన ప్రమాదము తమ కుటుంబమునకు కలిగినట్లే భావించి వెంటనే కతిపయ శిష్యులతో బైలుదేరి మహాసాహసమును చేసిన యా తిల్లను ప్రస్తుతించి గోవిందరాజస్వామిని దిగువ తిరుపతిలో నొక సుక్షేత్రమున ప్రతిష్ఠించిరి. తిల్లచే రక్షింపబడిన స్వామి గాన నా దేవునకు తిల్లగోవిందరాజస్వామి యని వారు నామకరణము చేసిరి.

తర్వాత తిరుమలకొండ లెక్కి శ్రీనివాసుని దర్శించి యటనుండి కాంచీపురి కేగి కన్నతండ్రిని బోలిన వరదరాజస్వామిని సేవించి మరల శ్రీరంగము చేరిరి. అట రంగనాథుని సేవాకైంకర్యముతోను శిష్యులకు వైష్ణవసంప్రదాయార్థములు బోధపరచుటలోను మరల సుఖముగా కాలము పుచ్చసాగిరి.

## కూరేశుని నేత్రప్రాప్తి

రామానుజు లొకపరి కూరేశునితో "నీవు నీ కవితా విభవమును వరదరాజస్వామి కర్పించినచో నీ దృష్టిని యథాప్రకారముగా పొంద గల"వని పలికి యాయనను నిర్బంధించి కరిగిరివరదునిపై స్తోత్రము రచింపజేసిరి. అదే కూరేశ విరచితమగు పంచస్తవములలో చివరిదగు వరదరాజస్తవము. మచ్చున కందలి యొక శ్లోకము---

"నీలమేఘనిభమంజనపుంజ శ్యామకుంతల మనంతశయం త్వామ్,
అబ్జపాణిపద మంబుజనేత్రం నేత్రసాత్కురు కరీశ, సదా మే."

ఓ కరివరదా, నీల మేఘనిభమును, కాటుకను బోలిన నల్లని కేశ పాశము కలదియు, శేషశాయియు పద్మముల వంటి కరచరణములు గలదియు నగు నీ శరీరదర్శనము నా కనుగ్రహింపుము.

ఈ స్తవము పూర్తిగా విని యతిపతి యానందించిరి. దీనిని కరిగిరివరదునకు విన్నవించినచో తప్పక నీకు దృష్టి లభింపగలదని పలికి కూరేశుని తనవెంట నిడుకొని కంచికేగిరి. కూరేశు డా స్వామి

సన్నిధి కేగి యాస్తవము పఠింపగనే వరదుడు సంతోషించి దయతో నాయనకు దృష్టి ననుగ్రహించెను.

కరిగిరివరదలబ్ధ నేత్రదృష్టియగు కూరేశు డానందముతో నా స్వామి నా పాదమస్తకము సేవించి తనివితీర నుతించి తర్వాత లక్ష్మణార్యుని వెంట శ్రీరంగమునకు మరలెను.

## గోదాభీష్ట పూరణము

పూర్వము గోదాదేవి 140 పాశురములు గల 'నాచ్చియార్ తిరు మొళి' యను గ్రంథముతో శ్రీమహావిష్ణువును పలు తెరగుల స్తుతించెను. అందొకదానితో నామె సుందరాచలమునందలి సుందరబాహూ స్వామికి -- "నాకు రంగనాథునితో పాణిగ్రహణము జరిగినచో నీకు నూరు వెన్న భాండములను, నూరు చక్కెరపొంగలి ఘటములను నారగింపు సేయింతు" నని మ్రొక్కుకొనెను. మ్రొక్కుకొన్నదే గాని యామెకు దానిని తీర్చుట కవకాశము లేకపోయెను. శ్రీరంగనాథునితో పాణిగ్రహణము జరుగగనే యామె తత్పాదమూలమున నైక్యమైపోయెను గదా!

గోదాదేవి యీ మ్రొక్కును రామానుజులు తీర్చుటకు సిద్ధమైరి. వారు వానాద్రి చేరి యామె మ్రొక్కు తాము చెల్లించిరి. తర్వాత నామె జన్మించిన శ్రీవిల్లిపుత్తూరు కేగి వటపత్రశయనుని సేవించి విష్ణుచిత్తాత్మజ చెంతకేగి బద్ధాంజలియై నిలువబడిరి. అపు డా దేవి తీర్థప్రసాదము లర్చకముఖమున వారి కనుగ్రహించి యన్నవలె తన కోరికను తీర్చిన రామానుజులకు గోదాగ్రజు డని బిరుద మిచ్చి సత్కరించెను.

అచటనుండి వారు కురుకాపురి చేరి నమ్మాళ్వారులను సందర్శించిరి. అపుడు వారు "ప్రపన్నజనాగ్రేసరులగు నీ శఠకోపులు మహర్షి. అనేక కారణములచే మరుగుపడియున్న యనాదియైన యీ వైష్ణవ దర్శనమును మరల నుద్ధరించి ప్రపంచమున వ్యాపింపజేసిన మహాముని వీరే! అమరులకు గూడ దుర్లభమగు చతుర్వేదార్థములను ద్రావిడ భాషలో నిబంధించిన మహాకవి గదా వీరు - నా కొక కుమారుడైన లేకపోయెనే? ఉన్నచో లోకసంరక్షకుడగు నీ మహామహుని పేరు పెట్టి ముద్దుగా పిలచు

కొనుచుండువాడను గదా! ఆ మహామహుని ఋణము తీర్చుకొను నుపాయమే కానరాకున్నదే; ఏమి చేయుట" యని పరితపించిరి.

అపుడు భూరిశ్రీశైలపూర్ణు డను పేరు గల వారి శిష్యు డొకడు లేచి "యాచార్యా, బిడ్డలు లేరని మీకు విచారమేల? నన్నే మీ దత్తపుత్రునిగా స్వీకరింపుడు" అని వారి వద్దకు వచ్చి ప్రార్థించెను. రామానుజు లందులకు సంతసించి యాయనకు నమ్మాళ్వారు లను నర్థమిచ్చునట్లుగా 'కురుకేశు' డని పేరు పెట్టిరి. తర్వాత కొన్నిదిన ములచట నివసించి యతిపతి శ్రీరంగమునకు మగిడిరి.

"తే సుస్థటం చ భుజయో ర్ధృతశంఖచక్రాః
సమ్య గ్లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రాః,
కంఠే విలగ్న తులసీనళినాక్షమాలాః
భేజు ర్ముకుందపదవీం యతిరాజ భక్తాః."
"ఏవం మహాత్మా యతిచక్రవర్తీ
రంగేపురే లక్ష్మణదేశికేంద్రః,
ఆసేతుశీతాచల భూమిభాగే
జితారివర్గ స్సుతరాం విరాజే."

యతిపతి శ్రీరంగవాసము చేసిన కాలమున ప్రతివారును వైష్ణవులై శంఖచక్రాంకిత భుజు లైరి. ఊర్ధ్వపుండ్రములను నొసట తీర్చిదిద్దిరి. కంఠములను తులసితావళములచే నలంకరించుకొనిరి. తాను రామానుజ దాసుడ నని ప్రతివాడును నిరూపించుకొనెను.

ఈ విధముగ యతిశేఖరులైన రామానుజులు శ్రీరంగమున నుండియే యాసేతు హిమాలయమును తన బోధలచే లొంగదీసికొని శత్రువుల కజేయులై చక్కగా విరాజిల్లిరి.

## పూర్వాచార్యప్రకాశిత రామానుజ వైభవము

సృష్టిస్థితిలయకారకుడగు శ్రీహరి యనేకావతారము లెత్తి గూడ లోకమును బాగుచేయలేకపోయి విచారించుచుండగా నాయన సేనాపతి విష్వక్సేనుడు నేను మీ చింతతీర్చెదనని పంత మాడి కురుకాపురిలో శఠకోపుడై యవతరించెను. కాని పాముకాటు తిన్నవాడు వికారచేష్టలు చేయునట్లే కలిదోషసమాక్రాంతమగు లోకము దుర్విషయాసక్తమగుట చూచి యా శఠకోపులు గూడ సహింపలేక, యా పాపకార్యములు

చూడనోడి కనులు మూసికొనియే పదునాఱు వత్సరములు చింతచెట్టు తొఱ్ఱలో కూర్చుండి యోగాభ్యాసపరులై కాలము గడిపిరి. అపుడు వారిట్లు తలచిరి—

"ఈశ్వరునకు గూడ నసాధ్య మయిన లోకరక్షణమను గురుతర భారమును శిరసావహించుట నా యవిచారచేష్ట యని తేలినది. నా ప్రతిజ్ఞ వ్యర్థమే యయినది. అయిన నేమాయెను? కలియుగమున నాల్గువేల వత్సరములు గడచిన తదుపరి యాదిశేషులే రామానుజులై యవతరింతురు. తత్సంబంధమాత్రము చేతనే మానవులు పాపపంక నిర్ముక్తులై పునరావృత్తిరహిత పరమపదము నందగలరు."

తాము మనమున తలచిన ఈ భావమునే వారు తమ సహస్ర గీతిలో "పొలిక పొలిక పొలిక" యను పాశురమున "భాగవతోత్తములు నేల యీనిన ట్లవతరించి భూమిపై స్వేచ్ఛగా సంచరించుచు సంతత హరినామోచ్చారణతో పాపాత్ముల నందరును పుణ్యాత్ములనుగా చేయు మంచి దినములు వచ్చితీరును. ప్రజలారా! అట్టి దృశ్యమును గాంచి మీరు తప్పక ధన్యాత్ములు కాగలరు" అని గానము చేసిరి.

రామానుజు లవతరించి లోకమును తరింపజేయగలరని పైవిధముగా మొట్టమొదట సూచించినవారు నమ్మాళ్వారులు.

వ్యాసమహర్షి చతుర్వేదములు వర్గీకరించి వేదవ్యాసుడని యెట్లు ప్రసిద్ధి గాంచెనో యట్లే చతుస్సహస్ర గాథాత్మకమగు ద్రావిడవేదమును సంపాదించి మించిన నాథముని యొకపరి వీరనారాయణ గ్రామమున తటాకతీరమున నిలబడి ప్రజలందరితో నిట్లనెను-- "ఈ చెరువునుండి కాలువలగుండ వెలువడిన నీ రే రీతిగా సస్యములను తడిపి పంటలను పండించుచున్నదో యట్లే శ్రీహరి యను జలధినుండి వెడలిన వేదార్థ ములను నీరములు, మహాజ్ఞాని యైనట్టి యొక మహాత్ముడను మడుగున ప్రవేశించును. అటనుండి పూర్వాచార్యు లను కాలువల గుండ బైలు దేరి ప్రాణిసస్యములను పండింపగలవు."

రామానుజుల వైభవమును విన్న యామునార్యులు కాంచి కేగి దూరమునుండియే వారిని చూచి తమ శిష్యులతో "ఈ మహాపురు

షుడు వైష్ణవమతావలంబియగుచో జనులందరును నీతని యుద్యమ ములచే మహాభాగవతోత్తములు కాగలరు" అని పలికిరి.

రామానుజు లొకపరి శిష్యసంఘసమావృతులై రాజవీథిలో నడచి వచ్చుచుండిరి. అపుడు గురువు మహాపూర్ణులు వారికి సాష్టాంగ ప్రణా మమాచరించిరి. రామానుజులును ప్రతినమస్కారము చేసిరి. అపుడు వైష్ణవులు యతిపతిని "స్వామీ, మీరు మీ గురువు నమస్కరింపగా దానిని స్వీకరించుట భావ్యమేనా?" యని ప్రశ్నించిరి. అపుడు లక్ష్మ ణార్యులు వారికి "గుర్వాదేశప్రకారము నడచుటయే శిష్యుని కర్తవ్యము. అది యధర్మమైనను సరే. కాననే నా యాచార్యుల యిష్టానుసారము నేను ప్రవర్తించుట జరిగినది" అని సమాధాన మిచ్చిరి.

అపు డా వైష్ణవులు మహాపూర్ణులను "స్వామీ, మీ శిష్యుడగు రామానుజులకు మీరు నమస్కరించుట శాస్త్రీయమేనా?" యని ప్రశ్నించిరి. దాని కా గురువు సమాధాన మిది-- "రామానుజులు మా గురువు యామునార్యుల కే మాత్రము తీసిపోరు. ఈయనను చూడగనే యామునార్యులే జ్ఞప్తికి వచ్చినారు గాన వారికి నమస్కరిం చినాను. నా గురువుతో సమానుడగు నా శిష్యునకు నమస్కరించుట శాస్త్రవిరుద్ధము కాబోదు."

మంత్రరాజము నుపదేశించు నపుడు గోష్ఠీపూర్ణులు రామానుజు లతో "నిది యెవరికి నుపదేశింపరాదు సుమా" యని పలికిరి. దానిని పెడచెవిని బెట్టి వా రా మంత్రమును శ్రీవైష్ణవులకు భూరిదానము చేసిరి. అపుడు గోష్ఠీపూర్ణులు క్రుద్ధులై "నీ వేల యిట్లాచరించితి" వని శిష్యు నడుగ వారు "నే నొక్కడను నరకమునకు పోయిన నేమి? ఆ మంత్రము నాచే విన్నవా రందరు మోక్షార్హులే గదా!" యని సమాధాన మిచ్చిరి. "అయ్యో, నీకున్నపాటి వివేకము నాకు లేకపోయె గదా!" యని గోష్ఠీపూర్ణులు విచారించిరి.

ఈ రీతిగనే యనేకులు రామానుజుల గురువులైయుండి గూడ వారి ఘనత నంగీకరించిరి. కాననే శ్రీమద్రామానుజులు పూర్వాచార్యు లందరిలో ముఖ్యు లనుట నిర్వివాదము. వారి యీ యపూర్వ త్యాగ

మహిమను పురస్కరించుకొనియే విశిష్టాద్వైతసంప్రదాయమునకు రామానుజసంప్రదాయ మను పేరు రూఢమయ్యెను.

## రామానుజుల సర్వముఖ్యత్వము

రామానుజులవైభవము శ్రీరంగనాథాది దేవతలు గూడ ప్రకాశింపజేసినారు. కాననే నాథముని మొదలగు పూర్వాచార్యులకంటె లక్ష్మణార్యులు శ్రేష్ఠు లనుటలో సందియ మిసుమంతయును లేదు. అనేక గ్రంథములందు ప్రతిపాదిత మైన యీ విషయ మిట చర్చింతము--

శ్రీమహావిష్ణువు దుష్టశిక్షణ శిష్టసంరక్షణాది కార్యములు నెరవేర్చుటకై యసంఖ్యావతారము లెత్తెను. వానిలో శ్రీరామకృష్ణ నరసింహావతారములు ముఖ్యములు. తపస్స్వాధ్యాయనిరతులగు మునీశ్వరులలో పారాశర్యాదులు ప్రధానులు. శ్రీహరి యష్టోత్తరశతదివ్యదేశములందును శ్రీరంగము, తిరుమల, హస్తిగిరి (కంచివరదుడు) యాదవాచలము ఇవి ముఖ్యము. పదుగు రాళ్వారులలోను శఠకోపులు ప్రథమగణ్యులు. పూర్వాచార్యులగు నాథయామునార్యాదు లందరిలోను భగవద్రామానుజాచార్యులు ముఖ్యాతిముఖ్యులు.

ఒక పసివానిమాటకు విలువ నిచ్చి "ఓరి తులువా, ఏడి రా నీ హరి? ఎందున్ననాడో చూపు" మన్న హిరణ్యకశిపునకు క్రుద్ధుడై స్తంభమునుండి తత్క్షణ ముద్భవించి యాతని సంహరించి ప్రహ్లాదుని రక్షించుటయే నృసింహావతారము ఘనత.

"నీ వార" మని తన్ను శరణు జొచ్చిన విభీషణ సుగ్రీవుల కభయప్రదానము చేసి వారిని ప్రాణమిత్రులనుగా స్వీకరించుట; అడవిజాతివాడగు గుహునియెడ గూడ సోదర భావము నెరపుట; "ప్రాణేభ్యోపిః గరీయసీం" అన్నట్లు తన ప్రాణముకంటెను మిన్నగా ప్రేమించిన తన యిల్లాలిని కాపాడుటకై యసువులు గోల్పోయిన జటాయువును పక్షిమాత్రునిగా గాక తన తండ్రిగానే తలచి 'గచ్ఛ లోకా ననుత్తమాన్' 'తండ్రీ, నా తండ్రి దశరథునకు గల్గిన యుత్తమగతియే నీకును గలుగుగాత!' యని పలికి రాజబంధువగు నా గృధ్రరాజు కగ్నిసంస్కారము చేయుట, అత్యంతభక్తినే మహాభాగ్యమని స్వీకరించి సభ్యతా సంస్కార

ములు, శుచి శుభ్రతలను నెరుగని శబరిచేతి యెంగిలి పండ్లారగించుట— మొదలగు ఘనకార్యములచే శ్రీరామచంద్రుని యవతారము ప్రశస్తి గాంచినది.

ఈ రక్తసంబంధులను సంహరించి నెత్తురు కూడెట్లు భుజింతు నని కురుక్షేత్రసంగ్రామమున దుఃఖవికలుడై "యచ్ఛ్రేయస్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నం" — "నా క్షేమియు పాలుపోవుట లేదు. ఈ శిష్యునికి శ్రేయోమార్గము నుపదేశించి యనుగ్రహింపుము" అని పలికి యగతికుడై తన్ను శరణు జొచ్చిన యర్జునునకు ఫలాసక్తి రహితముగా విహితకర్మ నాచరింపు మని యుపదేశించుట; దుర్యోధనాదులు పెట్టిన రాజభోజనము తృణీకరించి "విదురాన్నాని బుభుజే శుచీని గుణవంతి చ" అన్నట్లుగా భక్తితో పెట్టి నది పట్టెడైనను చాలు నని పలికి విదురుని యింట విందారగించుట మొదలగు పనులచే శ్రీకృష్ణుడు గొప్పవాడైనాడు.

లోకసారంగమహామునిని పంపి యస్పృశ్యుడైనను మహాభక్తు డయి నందున శ్రీపాణయోగిని తనవద్దకు పిలిపించుకొనెను కాన రంగనా థుడు ఘనుడు. శ్రీవేంకటేశ్వరుడు తొండమాన్ చక్రవర్తితో సంభా షించువాడు. కాంచీపూర్ణునితో కంచి వరదరాజస్వామి ముచ్చటించు చుండువాడు. యాదవాచలమందలి తిరునారాయణస్వామి రామానుజు లను కోరి తనవద్దకు పిలిపించుకొని తన యుత్సవవిగ్రహము ఢిల్లీనుండి తెప్పించుకొని వారినే తండ్రిగా గౌరవించెను. కాన నాయన గొప్పవాడు. ఈ విష్ణుదేవత లందరును నీ రీతిగా శ్రేష్ఠులైరి—

ఋగాది చతుర్వేదములను లోకమందు వ్యాపింపజేసినందున వేద వ్యాసుడై "వ్యాసో నారాయణః స్వయం" అని ప్రశస్తి గాంచిన పారాశర్యమహర్షి యా వేదములను మరల కర్మకాండ బ్రహ్మకాం డలుగా వర్గీకరించి బ్రహ్మప్రతిపాదకములగు ఛాందోగ్యపురుషసూక్తాదుల నాధారముగా గొని గూఢార్థ ప్రతిపాదకములగు బ్రహ్మసూత్రములను నిర్మించుటయే గాక యష్టాదశపురాణములను సృష్టించి—

> "సత్యం సత్యం పునస్సత్య ముద్ధృత్య భుజముచ్యతే,
> వేదాచ్ఛాస్త్రం పరం నాఽస్తి న దైవం కేశవాత్పరమ్."

— చేయి యెత్తి యుచ్చైఃస్వరముతో శపథముచేసి పలుకుచున్నాను. వేదమును మించిన శాస్త్రమ్ము గాని కేశవుని మించిన దైవముగాని లేరని యుద్ఘోషించెను కాననే వ్యాసుడు గొప్పవాడయ్యెను.

వేదవేత్తయగు పరాశరమహర్షి చిదచిదీశ్వరతత్త్వమును వివరించు నట్టి విష్ణుపురాణము నిర్మించి మహోదారు డని యామునార్యులచే కీర్తింపబడెను. కాన పరాశరుడు మహామహుడయ్యెను.

మం. "సముఁడై యెవ్వడు ముక్తకర్మచయుఁడై సంన్యాసియై యొంటిఁబో
వ మహాభీతి నొహో కుమార యనుచున్ వ్యాసుండు సీరంగ వృ
క్షములున్ దన్మయతన్ బ్రతిధ్వనులు చక్కం జేసె మున్నట్టి వే
దమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్ ధీమణిన్."

అని పోతనార్యునిచే కీర్తింపబడిన శుకమహర్షి బాలుడై యుండి గూడ పరీక్షిత్తుకు గంగాతీరమున నొక్కవారము దినములలోనే భాగవత మహాపురాణమును వినిపించిన జ్ఞానాధికు డగుటచేతనే యీ జగత్తున శుకు డొక్కడే జీవన్ముక్తుడు అని ప్రసిద్ధి బడసెను. కాననే శుకుని ప్రాముఖ్యమును బ్రహ్మజ్ఞానులైన విద్వాంసు లంగీకరించిరి.

శౌనకమహాముని విష్ణుధర్మోత్తర ఖండమునను నింకను ననేక పురాణములందును త్రిమూర్తులలోను జగజ్జన్మాది కారణము హరియే యని, యాతడే సర్వజీవులకును మోక్షప్రదాత యని ధ్రువపరచెను. కాన నాతడును ముఖ్యుడాయెను.

"భుజయుగమపి చిహ్నై రంకితం యస్య విష్ణోః
పరమపురుషనామ్నాం కీర్తనం యస్య వాచి,
సురుచిర మపి పుండ్రం మస్తకే యస్య కంఠే
సరసిజమణిమాలా, యస్య తస్యాస్మి దాసః."

ఎవని భుజయుగము శంఖచక్రాంకన సంశోభితమో, ఎవరి ముఖ పద్మము లా పరమపురుషనామోచ్చారణాలంకృతము లయియుండునో, ఎవరి ఫాలతలముల కూర్ధ్వపుండ్రములు నిండుదనము నిచ్చునో, ఎవరి కంఠములు తులసీమణిమాలా విభూషితములో, యట్టివారికి మాత్రమే నేను దాసుడ నని పల్కిన దేవర్షి నారదుడు సర్వశ్రేష్ఠుడు.

సహస్రశాఖలలో విభక్తమయి దుర్గ్రాహ్యార్థములు గల సూక్తమణి గణమునకు నిధానములగు చతుర్వేదములందలి సారమును సంగ్రహించి శఠకోపమహర్షి ద్రావిడభాషలో నాల్గుగ్రంథములను నిబంధించెను. వాని యధ్యయన విషయమున స్త్రీశూద్రాది విపక్ష చూపక సర్వులకు నధికారము కల్గించుటయే గాక నాథమునికి వాని నుపదేశించి సర్వదర్శనసారమగు విష్ణుదర్శనము వృద్ధిచేసెను. కాననే నమ్మాళ్వారు లాళ్వారులలో ప్రముఖులైరి.

కాని పై జెప్పిన దేవత లందరిలోను, మహర్షు లందరిలోను, భక్తులందరిలోను, నాచార్యు లందరిలోను గూడ రామానుజాచార్యులు మిగుల గొప్పవారు. ఏలయన పై జెప్పిన వారందరు చేసిన ఘనకార్యములను లక్ష్మణార్యులు తా మొక్కరే చేయగలిగిరి.

శ్రీరామచక్రవర్తి విభీషణున కుపదేశించినట్టి –

"సకృదేవ ప్రపన్నాయ తవాఽస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేతద్వ్రతం మమ."

– ఒక్కసారి నీవాడ నని శరణు వేడిన వాని నెట్టి నికృష్టుడైనను కాపాడుటకే నేను కంకణము కట్టుకొన్నాను అను వాక్యముల నక్షరాల ననుష్ఠించి చూపినారు.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

"సర్వధర్మములను వదలి నన్నొక్కనినే శరణుపొందుము. నిన్ను నేను సర్వపాపములనుండియు నుద్ధరింతును. విచారము వలదు" అని శ్రీకృష్ణు డర్జునున కుపదేశించిన శ్లోకము గల భగవద్గీతకు భాష్యము వ్రాసి యందలి యనేక తత్త్వార్థములను విశదపరిచిరి.

శఠకోపాదులగు నాళ్వారులు నిర్మించిన దివ్యప్రబంధములందలి యర్థములను తా మాచరించి యితరుల కుపదేశించి వానిని విరివిగా ప్రచారము చేసిరి.

వ్యాససూత్రముల భావమును శ్రీభాష్యాది గ్రంథముల రూపముగా దయాళువులై లోకహితార్థము నిర్మించిరి.

ఇతరమతములను తమ వాదముతో జయించి విశిష్టాద్వైతమతము స్థాపించి వైష్ణవదర్శనమునకు శ్రీరామానుజదర్శన మని పేరు వచ్చు నట్లుగా మానవులకు సాధ్యము గానంత మహాకృషి చేసిరి.

ఇట్టి లోకహితకార్యముల ననేకము లాచరించుటచేతనే వారు భగవద్రామానుజు లని రామానుజాచార్యులని సార్థకనామముల నందిరి.

"తస్మా దయం లక్ష్మణదేశికేంద్రః
సాక్షాద్ధరి ర్లోకగురు ర్మహాత్మా
తస్యైవ సంబంధ బలేన తేన
మోక్షో హి సిద్ధో నిఖిలాత్మకానామ్."

శ్రీమహావిష్ణువునకు శయ్యాసవాహనాదులుగా నుపయోగించు నాదిశేషుడే శ్రీరామచంద్రున కనుజుడైన లక్ష్మణుడై యనేకరీతులుగా భగవంతుడగు తన యగ్రజుని సేవించి కృతార్థుడైనాడు. రామానుజుడైన యా లక్ష్మణుడే మరల నీ రామానుజమునిగా నవతరించి విష్ణు భక్తిని విరివిగా వ్యాపింపజేసి సాక్షాద్విష్ణుస్వరూపు డని జగద్గురు వని కీర్తింపబడినాడు. కాననే వారి సంబంధబలముచేత మాత్రమే సర్వ జంతువులకును ముక్తి కరతలామలకము కాగలదు. ఇతరు లెవ్వరు నీ కలియుగమున మోక్షప్రదాతలు కాజాలరు. ఇది త్రికాలసత్యము.

## భగవత్కవితాసౌరభము

శ్రీరామానుజు లాదిశేషుని యవతారము. కాననే వారి కవిత సర్వకావ్యలక్షణములకును కాణాచి. సంస్కృత సారస్వత సౌరభము వారి కవితాసుమములద్వారమున దశదిశలందును సదా వ్యాపించుచుండును.

సంస్కృతముననే గాక వారు ద్రావిడమున గూడ గ్రంథరచన చేసియే యుందురు. కాని యవి యేవియు నింతవరకును లభింపక పోవుట మన దురదృష్టము. కాని వారు ద్రావిడ కవితానిర్మాణమున గూడ సిద్ధహస్తులనుట కీ గ్రంథమున కులశేఖరచరిత్రలో నుదాహరించిన వారి పాశురమే సాక్షి!

వీరు వ్యాసకృతబ్రహ్మసూత్రములకు శ్రీభాష్యము రచించిరి. అంతే గాక వేదాంతసారము వేదాంతదీపము అను గ్రంథములలో నా బ్రహ్మ

సూత్రములకే లఘువ్యాఖ్య వ్రాసిరి. నిత్యభగవదారాధనము, వేదార్థ సంగ్రహము, భగవద్గీతాభాష్యము నను గ్రంథములు గూడ నిర్మించిరి.

కాని వీరి గ్రంథము లన్నింటను గద్యత్రయ మపూర్వ కవితా చమత్కారములకు నిధి. 'గద్యం కవీనాం నికషం వదంతి' అను వాక్యమునకు 'వాక్యం రసాత్మకం కావ్యం' అను సూక్తికి నీ గద్య కావ్యము నిదానము. ఇందలి రీతి, రసము, శయ్య, అలంకారములు, శైలి మొదలగున వన్నియు పరమరమణీయములు. ఆ గ్రంథములోని యుదాహరణములు కొన్ని మచ్చుగ నిందీయబడుచున్నవి. సంస్కృత భాష యెరిగిన వారికి మాత్రమే యిందలి మాధుర్య మనుభవైక వేద్యము. కాన నీ యుదాహరణములకు తెలుగున నర్థ మీయ లేదు.

# శరణాగతి గద్యము

ఓం భగవన్నారాయణాభిమతానురూప స్వరూపరూప గుణవిభ వైశ్వర్యశీలాద్యనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణగణాం పద్మవనాల యాం భగవతీం శ్రియం దేవీం నిత్యానపాయినీం నిరవద్యాం దేవదేవ దివ్యమహిషీ మఖిలజగన్మాతర మస్మన్మాతర మశరణ్యశరణ్యా మనన్యశ రణశ్శరణమహం ప్రపద్యే పారమార్థిక భగవచ్చరణారవిన్దయుగ ళైకాన్తికా త్యన్తిక పరభక్తిపరజ్ఞాన పరమభక్తికృత పరిపూర్ణానవరతనిత్యవిశదతమా నన్య ప్రయోజనానవధి కాతిశయప్రియభగవదనుభవజని తానవధికాతిశయ ప్రీతికారి తాశ్శేషావస్థోచి తాశేషశేషతైక రతిరూపనిత్య కైఙ్కర్యప్రాప్త్య పేక్షయా పారమార్థికీ భగవచ్చరణారవిన్దశరణాగతి ర్యథావస్థితావిరతాస్తు మే.

# శ్రీరంగగద్యము

స్వాధీన త్రివిధచేతనాచేతనస్వరూప స్థితిప్రవృత్తిభేదం, క్లేశకర్మాద్య శేషదోషాసంస్పృష్టం, స్వాభావికానవధి కాతిశయజ్ఞానబలైశ్వర్యవీర్యశక్తి తేజస్సౌశీల్యవాత్సల్యమార్దవార్జవ సౌహార్దసామ్యకారుణ్యమాధుర్యగామ్భీ ర్యౌదార్య చాతుర్యస్థైర్యధైర్యశౌర్యపరాక్రమ సత్యకామ సత్యసఙ్కల్ప కృతిత్వకృతజ్ఞతా ద్యసఙ్ఖ్యేయ కల్యాణగుణగణౌఘ మహార్ణవం పరబ్రహ్మ భూతం పురుషోత్తమం, శ్రీరఙ్గశాయినం, మస్మత్స్వామినం, ప్రబుద్ధనిత్య

నియామ్య నిత్యదాస్యైకరసాత్మ స్వభావోఽ హం, తదేకానుభవ స్తదేక ప్రియః పరిపూర్ణమం భగవన్తం విశదతమానుభవేన నిరన్తర మనుభూయ, తదనుభవజనితానవధికాతిశయప్రీతికారి తాశేషావస్థోచితాశేష శేషతైక రతి రూప నిత్యకిఙ్కరో భవాని.

# శ్రీ వైకుంఠగద్యము

"కదాఽహం భగవంతం నారాయణం, మమ కులనాథం, మమ కులదైవతం, మమ కులధనం, మమ భోగ్యం, మమ మాతరం, మమ పితరం, మమ సర్వం సాక్షాత్కారవాణి చక్షుషా కదాహం భగవత్పాదామ్బుజద్వయం శిరసా సఙ్గ్రహీష్యామి, కదాఽహం భగవత్పాదామ్బుజ ద్వయ పరిచర్యాకరణయోగ్యస్తదేకభోగస్తత్పాదౌ పరిచరిష్యామి కదాఽహం భగవత్పాదామ్బుజద్వయ పరిచర్యాశయా నిరస్తసమస్తేతర భోగాశోఽపగ తసమస్త సాంసారిక స్వభావః తత్పాదామ్బుజద్వయం ప్రవేక్ష్యామి, కదా మా మ్భగవాన్ స్వకీయయాఽతిశీతలయా దృశా అవలోక్య స్నిగ్ధ గమ్భీరమధురయా గిరా పరిచర్యాయా మాజ్ఞపయిష్యతీతి భగవత్పరిచర్యాయా మాశాం వర్ధయిత్వా, తయై వాశయా తత్ప్రసాదోపబృంహితయా భగవన్త ముపేత్య దూరాదేవ భగవన్తం శేషభోగే శ్రియా సహాసీనం వైనతేయాదిభి స్సేవ్యమానం, 'సమస్తపరివారాయ శ్రీమతే నారాయణాయ నమః' ఇతి ప్రణమ్యోత్థాయోత్థాయ పునః పునః ప్రణమ్యా త్యన్తసాధ్య సవిన యావనతో భూత్వా, భగవత్పారిషదగుణనాయకై ర్ద్వారపాలైః కృపయా స్నేహగర్భయా దృశావలోకిత స్సమ్యగభివన్దితై స్తై స్తై రేవానుమతో భగవన్త ముపేత్య శ్రీమతా మూలమన్త్రేణ మా మైకాన్తికాత్యన్తికపరి చర్యైకకరణాయ పరిగృహ్ణీష్వేతి యాచమానః ప్రణమ్యాత్మానం భగవతే నివేదయేత్."

అతిగంభీరమైన వీరి వేదాంతగ్రంథములందలి విషయ చర్చ కిది తావు కాదు. ఈ రచయిత కట్టి సామర్థ్యమును లేదు. కాన నా విషయము లెరుగదలచినవా రీ యా గ్రంథములు పరిశీలించి యందలి సారము తెలిసికొందురు గాక!

# రామానుజ దర్శనము

శ్రీరామానుజులు విశిష్టాద్వైతమతమును ప్రచారము చేసిరని యెల్ల రకును తెలియును. కాననే విశిష్టాద్వైతము రామానుజదర్శన మాయెను. ఈ ప్రకరణమున దాని స్వరూపస్వభావములను సిద్ధాంతములును స్థూల ముగా తెలిసికొందము.

అద్వైత మన నేమియో తెలిసిన తర్వాత విశిష్టాద్వైతము సులభ ముగా తెలియును. "ద్వయోర్భావః ద్వితా" రెండు వస్తువులు వేరుగా నుండుటయొక్క భావమే ద్విత. ద్వితయే ద్వైతము. "న + ద్వైతం = అద్వైతమ్" రెండు లేనిది లేక రెండు కానిది అద్వైతము. జీవుడు, దేవుడు అని ఇద్దరుండ రని ఈశ్వరు డను వా డొక్క డే కలడని అద్వైతమను పదమునకు భావము.

విశిష్ట + అద్వైతము = విశిష్టాద్వైతము. రెండు వస్తువులు విశేషణముగా గల్గిన యొక వస్తువు ప్రపంచమున శాశ్వతముగా నుండు టయే విశిష్టాద్వైతము. దేవు డొక్క డే యున్నాడు. ఇతర మేమియును లేదు అనుట యసంబద్ధము. ఏలయన దేవుడు మనకు కనబడుట లేదు గాని దేవుడుగాని ఇతరవస్తువులు మనకు కనబడుచున్నవిగదా! ఒక మఱ్ఱిచెట్టును చూచినపుడు దాని యుత్పత్తికి మూలమైన విత్తన మొకటి యుండు నని తోచునట్లే ఈ ప్రపంచ మను మహావృక్షమును చూచినపుడు కూడ దీని సృష్టికి మూల మేదో యొకటి యుండు నని తోచకపోదు. కాన దేవుడు ఈ దృశ్యమాన ప్రకృతిని దాని ననుభవించు జీవుని గూడ స్వరూపముగా గలిగియున్నా 'డని విశిష్టాద్వైత మను పదమునకు భావము.

దశరథ చక్రవర్తి యీ భూలోకము నేకచ్ఛత్రాధిపత్యముగా పాలిం చెనన్నప్పుడు దశరథచక్రవర్తితో సమానుడు గాని గొప్పవాడు గాని లేడని మాత్రమే యర్థము గాని యీతనికి రాజ్యముగాని దానిని నడుపు మంత్రులుగాని లేరని యర్థము కాదు గదా! అట్లే యయినచో నా చక్రవర్తిత్వమునకు ప్రయోజన మే ముండును? అట్లే లోకమునున దున్నప్పుడు దాని ననుభవించువారు గూడ నుండక తప్పదు గదా! ఈ లోకమును సృష్టించునది మనము కానప్పుడు సృష్టికర్త మరొక డుండక తప్పదు. అడుగో ఆ సృష్టికర్తయే దేవుడు.

దేవుడు కనిపించడు గదా! అట్టివా డున్నాడని యెట్లు నమ్మ వచ్చును? అని ప్రశ్నింప వచ్చును. నీటిలో వేసిన పంచదారకరగి పానకమై యా నీటిని తీయగా చేయును గాని యప్పుడు పంచదార కనిపించునా? మరి యా పంచదార నీటిలో కనుపించనంత మాత్ర మున నది యందులో లేదన వీలగునా? పంచదారయే కదా యా నీటికి మాధుర్యము గూర్చినది! పానకములోని పంచదారవలెనే దేవుడు గూడ తల్లిలో, తండ్రిలో, గురువులో, అతిథిలో ఉండి మనలను ప్రతిక్షణ మును కాపాడుచుండును. దీనినే గదా వేదము -- 'మాతృదేవో భవ' 'పితృదేవో భవ' 'ఆచార్య దేవో భవ' 'అతిథి దేవో భవ' అని ఘోషిం చినది!

ప్రపంచములోని కష్టసుఖముల ననుభవించువాడే జీవుడు. ప్రపం చము పాంచభౌతిక మయినందున నశ్వరము. కాని జీవుడును దేవుడును శాశ్వతులే. దేవు డనిన స్వయముగా ప్రకాశించువా డని వ్యుత్పత్తి. ఈ దేవునకే యీశ్వరుడని గూడ వ్యవహారము.

జీవేశ్వరులకు సచ్చిదానందములను మూడు ధర్మములును సమా నము. సత్ = శాశ్వతత్వము, చిత్ = జ్ఞానము, ఆనందము = మిక్కుటమగు సంతోషము. కాని యీ సమాన లక్షణములు కల్గి యున్నంత మాత్రమున నీ యిద్దరిలో భేదము లేనే లే దనరాదు. సూర్యుడు వెలుగు నిచ్చును. దివిటీ గూడ వెలుగు నిచ్చును. వెలుగు నిచ్చినంత మాత్రమున నా రెండును నొకటి కావు కదా!.

దేవు డీశ్వరుడు కాననే యీ జగత్తుకు ప్రభువు. ఆతని సేవ కుడు జీవుడు. ఆతని సేవ మాని దారపుత్రాది వ్యామోహమున మునిగియుండు కారణముచేతనే జీవుడు పలు బాముల బడి భ్రష్టుడగు చున్నాడు. విషయలంపటునకును, మోక్షమునకును చుక్కెదురు గదా!

కళత్రపుత్రాది బంధములు వదలించుకొని పరమపదము చేరి సమస్త కల్యాణగుణాకరుడును నప్రాకృతదివ్యమంగళ విగ్రహుడును నగు శ్రీమన్నా రాయణునే ధారకపోషకభోగ్యములుగా స్వీకరించి యనుభవించుచు వాని గుణగణాదులు గానము చేయుచు ప్రొద్దుపుచ్చుటయే మోక్షము.

ఈశ్వరుడు శ్రీమన్నారాయణుడే. ఆతడొక్కడే నిత్యుడు. ఇతర దేవతలు గాని జీవులుగాని యందరును నాతనికి విశేషణములే — అప్రధానములే. భక్తియొక్కటియే వాని జేరు మార్గము. తైలధారవలె నవిచ్ఛిన్నముగ భగవంతుని దెసకు ప్రవహించు భావధారయే భక్తి. అట్టి భక్తియే పరిపక్వమై ప్రపత్తిరూపము దాల్చును. స్వప్రవృత్తి నివృత్తియే ప్రపత్తి. అనగా భగవంతుని చేరుట నా చేతిలోని పని అను భావము వీడుటయే ప్రపత్తి. భగవంతుని శరణు చెందుటయే ప్రపత్తి. ప్రపత్తికి జాతిభేదము గాని లింగభేదము గాని లేదు.

ప్రపత్తిచేత మాత్రమే జీవునకు భగవద్దర్శనము లభించును. జ్ఞాన నేత్రముతో భగవంతుని దర్శింపగల్గుటయే దర్శనము. దీనికి వెరవు కల్గించు దర్శనమే విశిష్టాద్వైత దర్శనము!

"స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః."

స్వధర్మసంరక్షణమున ప్రాణము పోగొట్టుకొన్నను మేలే గాని పర ధర్మము మాత్ర మాశ్రయింపరా దను గీతాసూక్తి ననుసరించి వైష్ణ వునకు విశిష్టాద్వైత సిద్ధాంతమార్గమే యనుసరణీయము.

జీవు డజ్ఞానముచే ననేక దోషములు చేయును. కాన దేవుడు వానిని శిక్షించుటకే ప్రయత్నించును గాని రక్షింప బూనడు. కాన యా జీవుని తప్పులను భగవంతునిచే క్షమింప చేసి యాతని రక్షింపజేయు భారము గురువు తనపై వేసికొనును. తల్లి తన బిడ్డల దోషము కప్పి పుచ్చి తండ్రిచే వారిని క్షమింపజేసి రక్షింపజేయునట్లే యాచార్యు డొక్కడు మాత్రమే జీవకోటి దోషము లీశ్వరునిచే క్షమింపజేసి వారికి మోక్షమిప్పింప సమర్థు డగును.

## నాలాయిర దివ్యప్రబంధము

శ్రీ వైష్ణవధర్మమును శ్రీ మహావిష్ణువు శ్రీదేవి కుపదేశింపగా నామె దానిని విష్వక్సేనునకు చెప్పెను. ఈ విధముగా నిది గురుపరం పరానుగతముగా శ్రీరామానుజులకు సంక్రమించి వారివలన చతుస్సప్తతి సింహాసనాధిపతులగు నాచార్యులద్వారా లోకమున వ్యాపించెను.

భగవంతునకును భాగవతులకును నడుమగల సంబంధమును విశద పరచునది గాన భాగవత సంప్రదాయమనియు, శ్రీదేవిద్వారా వ్యాపించినదిగాన శ్రీసంప్రదాయ మనియు, దీనికి నామాంతరములు. భగవద్రామానుజులు దీనిని విశాల విశ్వమున విరివిగా వ్యాపింపజేసినందున రామానుజసంప్రదాయ మని గూడ దీని నందురు.

కాన నీ సంప్రదాయమునకు మూల మాళ్వారుల సూక్తులే యనుట మరువరాదు. అట్టి యాళ్వారులలో ముఖ్యులు పన్నిద్దరు. కాని వీరిలో గూడ నమ్మాళ్వారులు శరీరి యని — ప్రాణమని -- ఇతరులు వారికి కరచరణాద్యంగప్రాయులని ప్రథ!

ఈ యాళ్వారుల శ్రీముఖముల నుండి వెలువడిన జ్ఞానగంగా ప్రవాహమే. ద్రావిడవేదము. ఇది చతుస్సహస్రగాథా పరిమితము. ఇందులో నాల్గువేల పద్యము లుండును. కాన దీనికి నాలాయిర మని ద్రావిడ నామము. సుమారు నాల్గువే లుండు నని మాత్రమే యర్థము. ఆ గంగవలె నీ జ్ఞానగంగ కూడ నున్నతధారుణీధ్రశిఖరోత్పతదచ్ఛపయస్వినీ ఝరీ సన్నిభము -- గలగల ప్రవహించు నమిత వేగము గల గంగా నదిని బోలినట్టిది. వీరిది భగవత్కటాక్షజన్యవాగ్ధోరణి. కాననే యందు నిర్మలభక్తిరసమే యన్ని రసములకంటె నుజ్జ్వల నీలమణియై వింత వెలుగుల నీనుచుండును. పాపమాలిన్యము దూరము చేసి ప్రాణికోటిని తరింపజేయుటయే వీరి కవితకు చరమలక్ష్యము.

దైవీ శక్తి యుక్తులగు నాళ్వారులు సృష్టించిన దగుటచే నీ గ్రంథ సమూహమునకు దివ్యప్రబంధ మని పేరు వచ్చినది. ఈ నాలాయిర ప్రబంధమున "ముదలాయిర" మనబడు 1) ప్రథమసహస్రమున వేయి పాశురము లుండును. పెరియాళ్వార్ రచించిన "పెరియాళ్వార్ తిరుమొళి" మొదటి సగపా లాక్రమించుకొన్నది. తర్వాత నాయన సుపుత్రిక యాండాళ్ అని పిలువబడు గోదాదేవి రచనలు 2) నాచ్చియార్ తిరుమొళి 3) "తిరుప్పావై". అనునవి గలవు. అనంతరము కులశేఖరుల 4) పెరుమాళ్ తిరుమొళి, అటు తర్వాత తొండరడిప్పొడియాళ్వారుల 5) తిరుప్పళ్ళియెళుచ్చి 6) "తిరుమాల" గణనకు వచ్చును. తదుపరి తిరుప్పాణాళ్వారుల 7) "అమలనాదిపిరాన్" మధురకవి యాళ్వారుల 8) "కణ్ణినుణ్ శిరుత్తాంబు" కలవు. "కణ్ణినుణ్ శిరుత్తాంబు" భగ

వంతుని కంటె భగవంతుని చూపిన గురువే గొప్ప వాడని వివరించి యాచార్యప్రతిపత్తిని నిరూపించును. చివరి రెండు గ్రంథములందును సుమారు పదేసి పద్యములు మాత్రమే గలవు. ముదలాయిరమున చిట్టచివర కూర్చబడిన 9) "తిరుచ్చందవిరుత్తం" అను గ్రంథమునకు రచయిత తిరుమళి యాళ్వారులు.

ద్వితీయసహస్రమునకు "ఇయఱ్పె" అని పేరు. ఇందు ముదల్ తిరువందాది, తిరువిరుత్తం, తిరువాశిరియం, పెరియ తిరువందాది, పెరియ తిరుమడల్, శిరియ తిరుమడల్, తిరువెళుక్కూత్తిరుక్కై యను పది గ్రంథములు గలవు. మొదటి నాల్గును వరుసగా, పోయ్‌గయాళ్వారు, పూదత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిశయాళ్వారు రచించినవి. తిరువిరుత్తం, తిరువాశిరియం, పెరియతిరువందాది నమ్మాళ్వారులు రచించిరి. చివరి మూడును తిరుమంగయాళ్వారులు రచించినవి.

తృతీయసహస్రమున పెరియతిరుమొళి, తిరుక్కురుందాండకం, తిరునెడుందాండకం గలవు. ఈ మూటికిని గూడ తిరుమంగయాళ్వారే కర్త.

నాల్గవసహస్రము సహస్రగీతి యనబడు తిరువాయ్‌మొళి. దీనికర్త ప్రత్యేకించి నమ్మాళ్వారులే!

శఠకోపు లనబడు నమ్మాళ్వారులు శరీరి యని చెప్పబడినట్లే వారి సూక్తి యగు తిరువాయ్‌మొళి గూడ నీ ద్రావిడ వేదమున శీర్షస్థానీయము. కాననే దీనికి చరమప్రబంధ మని ప్రసిద్ధి. వీరు తమ నాల్గుగ్రంథము లందును ఋగ్యజుస్సామాథర్వవేదముల సారమును ప్రతిపాదించినా రని వైష్ణవాచార్యుల విశ్వాసము.

ఈ నాల్గు ప్రబంధముల యర్థము వివరించుటకై తిరుమంగయాళ్వారులు వేదాంగములను బోలిన గ్రంథముల నారింటిని రచించిరి. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను వేదాంగములను బోలినట్టివే వీరి షట్ప్రబంధములును. వీరు చతుష్కవిశిఖామణియని ప్రసిద్ధులు. ఆశు మధుర చిత్ర విస్తర కవితలే చతుష్కవితారీతులు. ఇవి యన్నియు వీరి కావ్యములందు కాన

నగును. వీరి పెరియతిరుమొళి భగవత్కావ్యములలో మిగుల ప్రౌఢము, రసవంతము. నాలాయిరమున సంఖ్యలో వీరి కృతులే యధికము.

ఈ ద్రావిడవేదమునకు పరిశిష్టముగా "తిరువరంగత్తముదనార్" అను కవి రచించిన "ఇరామానుశ నూత్తందాది" మణవాళమహాముని రచించిన "ఉపదేశరత్తినమాలై" పఠింపబడుచుండును. మొదటి గ్రంథమునకు ప్రపన్నగాయత్రి యనే నామాంతరము.

రామానుజాచార్యులవారే యీ ద్రావిడవేదమును, బహుళ ప్రచారములోనికి తెచ్చినవారు. అయినను వారు తమ రచన లేవియును నీ దివ్యప్రబంధమున చేర్చకుండుట గమనింపదగిన విశేషము.

వీరు ద్రవిడభాషలో గాక సంస్కృతమున గ్రంథరచన చేసిరి గదా! మరి వారికి ద్రవిడవేదముపై నంత ప్రీతి యున్నచో నా భాషలోనే యేల గ్రంథరచన చేయ లేదని సందేహించువారును కలరు. కాని యది సరికాదు. యావద్భారతీయభాష యగు సంస్కృతమున తమ సిద్ధాంతము ప్రచారము చేసినచో నాసేతుశీతాచలము నది వ్యాప్తి చెందు నను నుద్దేశ్యముతోనే వారు సంస్కృతమున గ్రంథరచన చేసియుందురు కాని మరొకటి కాదు.

రామానుజులు ద్రవిడమున వ్రాయలే దనుట గూడ సరికాదు. వారు పెరియ తిరుమొళికిని, పెరుమాళ్ తిరుమొళి కిని వ్రాసిన ద్రావిడ స్తుతి పద్యములు (తనియన్లు) పరిశీలించినచో వారి కా భాషయందుగల వైదుష్యముమ కవితాపటిమయు గోచరించును. కులశేఖరచరిత్రలో నీ గ్రంథమందే వీరి పాశుర మొకటి యుదాహృతము.

## అర్చావిగ్రహప్రతిష్ఠ

శ్రీ రామానుజులు కాంచీపురిలో నరువదివత్సరములును శ్రీరంగమున నరువదివత్సరములును నివసించిరి—

"శతాయుః పురుషః" అను సూక్తానుసారము తమకు నూరువత్సరములు దాటినందునను, తా మీ పుడమిపై నవతరించిన ప్రయోజనము పూర్తిగా నెరవేర్చగలిగి నందునను, నిక వారు స్వస్థానము చెందగోరిరి.

ఈ సంగతి శిష్యకోటికి తెలియగనే వారు పొందిన పరితాపమున కంతే లేకపోయెను. అపుడు యతిపతి వారి ని ట్లూరడించిరి.

"శిష్యులారా, జాతస్య మరణం ధ్రువం" అను సూక్తి మీరెరుగనిదా? నశ్వరమగు నీ శరీరమునకై ప్రాకృతులవలె మీరు గూడ ప్రాకులాడ దగునా? నిజమునకు పూజించి ప్రేమింపవలసినది వ్యక్తులను గాదు. మరి యా వ్యక్తుల గుణగణములను, ఆదర్శములను. నాపై మీకు శ్రద్ధాభక్తు లేర్పడినచో నవి వ్యక్తిగతముగ చూపుటలో మాత్రము తృప్తినందక నేను చేసిన బోధలలో నే మాత్రము పరమార్థమున్నదని తోచినను దాని నాచరింప యత్నింపుడు."

ఇట్లు పలికి వారు శ్రీవైష్ణవుల కత్యంతావశ్యక ధర్మములు సంగ్రహించి 74 వార్తలు వారికి బోధించిరి. వారు పల్కిన బోధ లీశ్లోకమున గలవు.

"శ్రీ భాష్యం ద్రవిడాగమప్రవచనం శ్రీశస్థలే ష్వన్వహం
కైంకర్యం యదుశైలనిత్యవసతి స్స్వార్థం ద్వమోచ్చారణమ్,
యద్వా భాగవతాభిమాన వసతిః శ్రేయస్సతా మిత్యయం
శిష్యాన్ ప్రాహ యతీశ్వరః పద మగా ద్విష్ణోఃపదం శాశ్వతమ్."

దీనిభావ మాచార్యసూక్తిముక్తావళిలో నీ పద్యమున సుందరముగా కూర్చబడినది.

సీ."శ్రీ భాష్య మాచార్యసేవచేఁ బఠియించి
శిష్యముఖంబుగాఁ జెప్పవలయు,
నదియొనర్ప నశక్తుఁడాయెనా శఠవైరి
శ్రీ సూక్తులే విశ్వసింపవలయు,
నట్లు రంగాదులం దమరి యా హరికిఁబ్ర
సిద్ధకైంకర్యమే చేయవలయు,
మంత్రరత్నార్థమే మననంబు సేయుచుఁ
గలిగిన కాలంబు గడపవలయు,
గీ.సతతవైష్ణవపూజలే సలుపవలయు,
నొదిగి యదుగిరి చెంతనుండవలయు,
నేమ మిదియని యతిపతి చెప్పె ననుచు
వాదిభీకరగురుఁడని మోద మలర.

రామానుజు లిన్ని విధములుగ తమకు నచ్చజెప్పినను మీ వియోగ బాధను మేము భరింపజాల మని శిష్యులు మొరపెట్టుకొనిరి. వారి

ప్రాణత్యాగ నిశ్చయము విని వారి జన్మస్థలమగు శ్రీ భూతపురి నుండి గూడ వారి శిష్యు లనేకు లేతెంచి విచారము తెలియజేయసాగిరి. ఆ శిష్యులకు మనశ్శాంతి కల్పించుటకై రామానుజులు తమ స్వరూప మును బట్టి రెం డర్చావిగ్రహములు సమర్థులగు శిల్పులచే చేయించిరి. వానిలో కళల నావాహన చేసి ప్రాణప్రతిష్ఠ చేయించిరి. ఒక దానిని భూతపురికి పంపి యట దాశరథిచే దానిని ప్రతిష్ఠింపజేసిరి. రెండవది శ్రీరంగమున ప్రతిష్ఠింపబడెను.

భూతపురిలో కేశవస్వామిసన్నధిలో నా విగ్రహము ప్రతిష్ఠించిన సమయమున లక్ష్మణార్యులకు శరీరాయాస మధిక మాయెను. దానికి నేత్రోన్మీలనము చేయు సమయమున వారి నేత్రములనుండి రక్తము స్రవించెను. కాననే భూతపురిలోని రామానుజుల యర్చావిగ్రహము సంపూర్ణకళలతో విరాజిల్లెను.

## చరమదశ

తమ యవసానకాలమున శ్రీమద్రామానుజులు పరాశర భట్టారకుని రంగనాథాదాస్యసామ్రాజ్యమున పట్టము గట్టి విశిష్టాద్వైతసిద్ధాంతమున కాయనను కిరీటము లేని చక్రవర్తిగా జేసెను.

నాడు మాఘ శుద్ధదశమి. ఆ దినము దేహత్యాగమునకు మంచి దిగా వారు నిర్ణయించి తా నిక జీవింప నని శిష్యులతో పల్కిరి. ఆ మాట విని శిష్యులకు దుఃఖము తలమున్క లయ్యెను. వారి నందరను తగురీతిగా నోదార్చి లక్ష్మణార్యులు గోవిందుని తొడపై శిరము నుంచి యాంధ్రపూర్ణుల యొడిలో పాదపద్మములు చాపి శయనించిరి.

మన గురువు మనలను వీడిపోవుచున్నాడు గదా యని దుఃఖముతోనే సమీపముననున్న ద్విజశ్రేష్ఠు లందరును భృగువల్లి, యానందవల్లి మొద లగు వేదసూక్తములను, గద్యత్రయములను, తిరువాయ్మొళి మొదలగు దివ్యప్రబంధములను పఠించుచుండగా రామానుజులు బ్రహ్మకపాలము ఛేదించుకొని బ్రహ్మరంధ్రమార్గమున పరమపదము జేరి నారాయణ సాయుజ్య మందిరి. అది క్రీస్తుశక ప్రకారము 1137వ సంవత్సరము. వారు నూటయిరువది సంవత్సరములు జీవించిన దీర్ఘాయుష్మంతులు.

అపుడా నగరమున నున్న జను లందరును పొందిన దుఃఖము వర్ణనాతీతము. ఎంతో కాలమునుండి తమను తల్లిగా, తండ్రిగా, గురువుగా, దేవునిగా సాకిన యాచార్యుడు తమ కిక లేనే లేడా? అనలా భావము నైనను తాము సహింప గలరా! కాననే వారందరును 'నిక నే మున్నది, ధర్మము నశించిపోయిన' దని యుచ్చైఃస్వరముతో కంటికి కడవెడు కన్నీరుగా విలపింపసాగిరి.

దుఃఖించువారి నచట నోదార్చువారే కరవయిరి. అందరును రామానుజ వియోగముచే దుఃఖము ననుభవించువారే గదా! దాశరథి, ఆంధ్రపూర్ణుడు, గోవిందుడు, కురుకేశుడు — ఈ నలుగురును వారి యుత్తరక్రియలలో పాలుపంచుకొనిరి. కురుకేశుడు పుత్రప్రాయుడయినందున తమ గురువు శరీరమునకు యథావిధిగా నుత్తరక్రియలాచరించెను. కూరేశుడు ముందే పరమపదించెను గదా. కాన నాయన గురువియోగ బాధనుండి తప్పించుకొని గురువునే బాధించెను. గోవిందునకు మాత్ర మాచార్యుని వియోగవేదన భరింపక తప్పలేదు. పరాశరభట్టార్యుడు రామానుజవియోగదుఃఖమునుండి యెట్లో తేరుకొని శ్రీరంగమున రామానుజార్యదివ్యాజ్ఞ నవ్యాహతముగా పరిపాలింప సాగెను. ఆ కవిచంద్రుడు శ్రీ రంగనాయకిని నుతించుచు సంస్కృతమున రచించిన "శ్రీగుణరత్నకోశ"మను స్తోత్రగ్రంథము వైష్ణవభక్తలోకమున సుప్రసిద్ధము. మృదుమధురశైలీ విరాజితమును ప్రతిపద్యరసోదయమును నగు నా కావ్యరత్నము సాహిత్యరసికులకే గాక యా తల్లి కటాక్షము నర్థించు ప్రతి మనుజుడును కంఠహారముగా ధరింపదగిన మనోహర మణిమాల! అందలి యొక శ్లోకరత్నముచే నీ కృతిరత్నమునకు మంగళాశాసనము చేయుదుము గాక!

"ఉల్లాసపల్లవితపాలితసప్తలోకీ
నిర్వాహకోరకిత నేమకటాక్షలీలామ్,
శ్రీ రంగహర్మ్యతలమంగళదీప రేఖాం
శ్రీ రంగరాజమహిషీం శ్రియ మాశ్రయామః."

అర్ధకటాక్షపాతమాత్రము చేతనే సప్తలోకములను హేలగా పరిపాలించు నదియును, జంగమహేమవల్లిని బోలిన తనూవిలాసముతో శ్రీరంగనాథాలయముననే గాక యా దేవునిహృదయసదనమునగూడ మంగళ దీపరేఖవలె సంచరించు శ్రీరంగనాథుని పట్టపురాణియును నగు శ్రీరంగనాయకినే మన మందరము నాశ్రయింతముగాక!

శా. మీ కాషాయము మీ త్రిదండమును మీ స్మేరాంకురాస్యంబు మీ
శ్రీకాంతాంఘ్రి సరోజదాస్యమును మీ శ్రీభాష్యవైదుష్యమున్
మీ కల్యాణగుణప్రభావమును స్వామి! లక్ష్మణాచార్య! యిం
దా కల్పాంతము నిత్యమంగళము నిత్యశ్రీగ వర్ధిల్లుతన్.

-- శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్యులు.

ఉ. వేదశిరోర్థసంతతుల వెంతయునున్ దరిగానలేని యా
ద్వాదశసూర్యరూపుఁడగు వామను దివ్యగుణాళిఁబల్కు నీ
ద్వాదశ దివ్యసూరి చరితన్ విబుధస్పృహణీయరీతిగా
నీ దయఁ జెప్ప గంటి నిటు నీలఘనాభ! ముకుంద!! శ్రీహరి!!!

* * *

# సాగరసంగమము

"రసో వై సః రసగ్ం హ్యేవాయం లబ్ధ్వా౽౽నందీ భవతి."

— తైత్తిరీయోపనిషత్

భక్తోత్తములారా! భాగవతోత్తములగు మన యాళ్వారుల జీవిత చరిత్ర ముగింపు చేయవలసిన సమయము వచ్చినది సుమండీ! శ్రీమద్వాల్మీకిరామాయణమును గూర్చిన ఈ శ్లోకము సుప్రసిద్ధము.

"చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్."
"శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పద మేవ వా,
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా."

శతకోటిగ్రంథపరిమిత మగు శ్రీరామచంద్రుని చరిత్రయగు శ్రీ రామయణమునందలి యొక్కొక్క యక్షరమే మహాపాతకములను భస్మీపటలము చేయును. రామాయణమున నొక్క పాదము గాని పదము గాని విన్నవాడును చదివినవాడును బ్రహ్మసాయుజ్యమునంది వానిచే పూజితుడు కూడ కాగలడు.

అట్టి రామకథను గూడ మించినట్టిది ఈ ద్వాదశసూరి చరిత్ర. భగవంతునికంటె భక్తులే యధికప్రభావవంతు లను విషయము సాక్షాత్తుగ శ్రీమహావిష్ణువే యంబరీషోపాఖ్యానమున కంఠోక్తిగా చాటియుండగా ఇందుకు వేరు నిదర్శన మేల—

ఆ. నాకు మేలు కోర నాభక్తుఁడుక గాని
భక్తజనుల కేన పరమగతియు,
భక్తుఁడెందుఁ జనిన బఱతెంతు వెనువెంట
గోవు వెంట దగులు కోడెభంగి.

—పోతనార్యుడు

ఒక పిల్లి వలసినన్ని పాలు త్రాగి తృప్తి కాంచవచ్చునను తమితో క్షీరసాగరమును చేరినదట. కాని దాని కడు పెంత? అది త్రాగ గల పాలెన్ని? ఈ భావము విద్వత్కవికుల తిలకులు శ్రీపూతలపట్టు శ్రీరాములు రెడ్డిగా రెంత మధురముగా వర్ణించినారో!

ఉ.బేలతనంబు గల్గు నొక పిల్లి ప్రయత్నముతోడ వేడ్కమై
పాలసముద్రముం దరిసి పట్టుగ నిండలి పాలు మొత్తముం
గ్రోలెదఁ గాక యుంచుఁ బనిగొన్న విధంబున రామచంద్ర లీ
లా లలితప్రభావబహుళం బగు దీనిని వ్రాయఁబూనితిన్.

హరినామామృతమాధుర్యము ననుభవింప జేయుటయే ఉత్కృష్ట కావ్యముల లక్షణము, లక్ష్యము -- అని మాత్రమే నా పై వక్తవ్య మునకు సారాంశము.

బాలు డయినను పూర్ణబ్రహ్మజ్ఞానియు భగవత్ప్రేమార్ద్రచిత్తుడును నగు ప్రహ్లాదుడు హరినామచింతనామృతపానమును సర్వాతిశాయిగా నెట్లనుభవించి మన కన్నులకు గట్టినాడో తిలకించి ఆనందపులకితుల మగుదమా!

సీ.మందారమకరందమాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికలఁదూగు
రాయంచ చనునె! తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియై సొక్కు
కోయిల సేరునే? కుటజములకు,
పూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరకం
బరుగునే? సాంద్రనీహారములకు

ఆ.నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపానవిశేష మత్త
చిత్త మే రీతి నితరంబు సేర నేర్చు?
వినుత గుణశీల! మాటలు వేయు నేల?

—పోతనార్యుడు

సత్యము! నారాయణచరణారవిందేందిరాయమానమగు మత్త చిత్తము మరొక వస్తువుపై కెట్లు మరలగలదు! కనుకనే యీ యాళ్వార్లు భగవన్నామము నెంత సేవించినను తృప్తి కల్గింపని యమృ తముగా వర్ణించినారు.

ఉ."నా మెయి నీ మెయిన్ గఱఁగి నల్లదలం జని నల్గఁ జేసితో
సామి! సుధాభిరామ! వరిసొగులు నెట్టని వడ్ల మెన్నులున్
జామరలట్లు వీవ, బలసంపద నొందు 'తిరుక్కుడంద' శో
భామయ భూషల న్వెలసి పండుక యుండగ నిన్నుఁ గాంచితిన్ౕ"
---శఠకోపగీతామృతము

విద్యకు ప్రధానలక్ష్య మమృతప్రాప్తియే. చూడుఁడీ సూక్తము.

"విద్యాం చాఽవిద్యాం చ య స్తద్వేదోభయం తతః,
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే"

మానవుడు విద్యను అవిద్యను రెంటిని నేర్వవలెను. అవిద్యచే నిహ దుఃఖాదులను పోగొట్టుకొని, విద్యచే నమృత స్వరూప మయిన అనగా నాశము లేనట్టి - మోక్షము నందవచ్చును. విద్య యనగా బ్రహ్మ విద్య - లేక మోక్షోపాయవిద్య - అని పిండితార్థము. మెట్లెక్కనిదే కొండశిఖరము నెట్లెక్కలేమో, అట్లే లౌకికవిద్య నేర్వనిదే బ్రహ్మవిద్య గూడ నర్థము చేసికొనలేము. లౌకికవిద్యయే యవిద్య.

దేవతల యాహార మమృతము. దానికొఱకే గదా దేవదానవులు భీషణసంగ్రామ మొనర్చినది. ఎన్నో కడగండ్ల పాలయిన తర్వాతగాని దేవతల కది లభింపకపోయెను గదా! ఆ సంగ్రామమున జయించుట గాని అమృతము సంపాదిచుటగాని శ్రీమహావిష్ణువు దయచేతనే సురలు సాధింపగల్గినారు.

చెప్పవచ్చిన దేమన నిట్టి యమరులకు గూడ లభింపనిది సుడీ భగవద్గుణానుభవామృతము! దేవతలశత్రువైన బలిని త్రివిక్రముడై పాతాళమున కణగద్రొక్కి వామనుడాతని యింటికి కాపలాకాచి యాతని కమృతస్వరూపమగు మోక్షము నిచ్చినా డనుట మనము మరువరాదు. హరినామామృత పానము చేసినందుననే రాక్షసకుమారుడగు ప్రహ్లాదుడు భాగవతోత్తములలో మూర్ధన్యస్థాన మలంకరించినాడు. విను డీ శ్లోకము. దీనిలో రాక్షసవంశజు లెంతమంది విష్ణుభక్తులు గలరో తలపోయుడు—

"ప్రహ్లాదనారదపరాశరపుండరీక
వ్యాసాంబరీషశుకశౌనకభీష్మదాల్భ్యాన్,
రుక్మాంగదార్జునవసిష్ఠబలిర్విభీష
ణాదీ నిమాన్ పరమభాగవతాన్ స్మరామి."

కాననే భగవద్భక్తుల ప్రసక్తిలో దేవదానవుల భేదము లేదు. ఉచ్చ నీచభావ మసలే లేదు. జాతిభేద మంత కంటె గణనకు రాదు.

సంతతభగవత్సాక్షాత్కారమే బ్రహ్మవిద్యకు ఫలము. ఈ భగవద్దర్శనమే అమృతసేవనమువలె బ్రహ్మానందమును సంధానించును. నేత్రాంజ

లులతో తదీయముఖకమలామృత పానము చేయుచు నొడలు మరచునట్టి వారే నిత్యసూరులు. దీనినే వైదికసూక్త మిట్లు నిర్వచించినది—

"తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః,"

ఈ నిత్యసూరులు సూర్యసమధిక తేజోవంతులు. నిరంతర భగవత్సేవచే నొడలు మరచి యుండువారు.

అసలు జీవకోటి మూడు విధములు - నిత్యులు - బద్ధులు - ముక్తులు నని. సదా దారపుత్రవిషయాదిలంపటులై!

ఉ. "అచ్చపుఁ జీకటిం బడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణు లైనవారికిన్,
జెచ్చెరఁ బుట్టునే? పరులు చెప్పిననైన, నిజేచ్ఛనైన, నే
మిచ్చిన నైనఁ గానలకు నేగిన నైన, హరిప్రబోధముల్."

—పోతనామాత్యుడు

అను భాగవతపద్యములో వర్ణింపబడిన జీవకోటికి చెందినవారు బద్ధులు: సదాచార్యసమాశ్రయణముచే కుటుంబజంబాలపటలమునుండి ముక్తులై పరమపదనాథుని జేరనరుగువారు ముక్తులు; నిత్యులు ముందే జెప్పబడిరి గదా! — కాని భగవంతుని జేరు మార్గము మాత్రము సుకరము గాదు.

"క్షురస్య ధారా నిశితా దురత్యయా
దుర్గం పథ స్తత్కవయో వదంతి."

కత్తివాదరవలె పదనైనదని బ్రహ్మప్రాప్తిమార్గమును తత్త్వవేదాంత వేత్తలు వర్ణించినారు.

అయిన మన కర్తవ్య మిక నెద్ది? జన్మమరణాది దుఃఖములనే ప్రసాదించు నీ తనువును నశింపజేయు మని మరణ పర్యంత మీశ్వరుని ప్రార్థించుచుండుటయే!

మ. "దయ నొందం దగు దాససత్తములకుం దానుండ నాయందునన్
దయఁ జేయన్ బనిఁ బూనె చక్రి; యుదియు న్నా యిచ్ఛమైఁ జేయు; నీ
వయి నీ భూమినిఁ బుట్ట గోర; మనసా! పైఁబాయు నజ్ఞాన మె
వ్వియు నడ్డంకుల గట్టి పెట్టి కొలుమా! విష్ణ్వంఘ్రి వాట్టారునన్"

---శఠకోపగీతామృతము

నేను విష్ణువునకు దాసానుదాసుడను, నాపై చక్రి తప్పక దయ చూపును. ఇకపై నీ భూమిపై పుట్టు కోరిక నాకు లేదు. కాన జన్మరాహిత్యమునకై యో మనసా! ఆ శ్రీమహావిష్ణువు శ్రీపాదము లనే సదా భజించుచుండుమా!

ఉ. "మిన్నున నున్నవారలును మేదినివారలు నానఁజేయు సం
పన్నుఁ డె వచ్చి నా మనసుఁజట్టెను, నా కిఁక మచ్చెకంటి, వి
త్తోన్నతి, సత్సుతుల్ మిగుల నోరిచి నాపయిఁ గూర్మిచేయు వఱ
గన్న మదంబ మత్పతియు, నా సకలంబును నాతండే యగున్."

ఈ ప్రపంచములోని సర్వవస్తువులలో శ్రీమహావిష్ణువే నాకు ముఖ్యుడు. దివి మీదగాని భువిమీదగాని, యున్నవారందరును కోరు నట్టి సంపత్కు మారుడే నా మనస్సు నావేశించినాడు. ఇక నా కీ భార్య యేల? తుచ్ఛ మగు నీ యైహిక సంపదతో నా కేమి పని? ఈ బిడ్డలు రక్షక మని నమ్మనేల! మిక్కిలి కూరిమితో నన్ను కని సాకిన తల్లితో నాకు పొత్తు వలదు. సర్వాధికుడగు తండ్రికూడ నా కక్కరలేదు. పైజెప్పిన వారందరి కర్తవ్యములను తానే నెరవేర్చు నా స్వామియే నన్ను సాకగలడు.

ఈ గ్రంథాదిని రసతరంగిణియను ప్రకరణమున వివరింపబడిన విష యములు పాఠకులు మరచియుండ రనుకొందుము. భక్తినది పరమాత్మను చేరుననియే గదా యందలి సారాంశము. దక్షిణభారతమున మహర్షు లగు ఆళ్వారు కవుల ముఖకమల వినిస్సృత మయిన యీ భక్తిరస తరంగిణి సర్వలోకోపరిస్థితుడై పరమపదమున విరాజిల్లుచున్న పరతత్త్వము శ్రీమ న్నారాయణు డను క్షీరసాగరమున నైక్యమగు ననుట గూడ విజ్ఞులెరుగని విషయము కాదు గదా!

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"

— యను వేదాంతసూక్తి ననుసరించి యవాఙ్మానసగోచరు డైన పరబ్రహ్మ యను నానందసాగరమున లీన మగుటయే యీ వైష్ణవభక్తి మందాకినికి పరమచరమలక్ష్యము.

సంసార మను నశ్వత్థవృక్షమువంటిదే యీ భక్తినది. కాని యిది తద్విలక్షణము. ఆ వృక్షమునకు మూల మూర్ధ్వముఖము కాగా నీ నదికి మూల మధోముఖము. బ్రహ్మజ్ఞానము గల జీవకోటిని పర

మానందసాగరమున నోలలాడించి హర్షనిర్భరులను చేయగల ఇట్టి ద్వాదశసూరుల స్వరూపస్వభావముల నాముక్తమాల్యదాకారు డెంత హృద్యముగా చిత్రించినాడో పిష్టపేషణ మనక మరొకపరి స్మరించుకొందుము గాక! ఈ యొక్క పద్యమణి చాలదా సాహితీసమరాంగణ సార్వభౌముడును కవితా ప్రావీణ్య ఫణీశుడును నగు శ్రీకృష్ణదేవరాయ కవిచక్రవర్తి యపూర్వశేముషీవిభవమును చాటుటకు!

మ. "అల పన్నిద్దఱుసూరు లందును సముద్యల్లీలఁ గాపున్న బె
గ్గలికం దాపము బాప నా నిజమనఃకంజాతసంజాత పు
ష్కలమాధ్వీకఝరి న్మురారి సొగియుంగా జొక్కి ధన్యాత్ములౌ
నిల పన్నిద్దఱుసూరులం దలఁతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్."

సూర్యుడు ద్వాదశాత్ముడని ప్రసిద్ధము. కాని యీ ద్వాదశసూరులు మాత్రము దేశకాలపాత్రరీత్యా విభిన్నులైనను భగవదేకాత్ము లగుట చిత్రాతిచిత్రము. తామర పూవులు సూత్రబద్ధమై యెట్లు ధారణ యోగ్యము లగుచున్నవో యట్లే యీ దివ్యసూరుల సూక్తిసుమములు గూడ భక్తిసూత్ర గ్రథితములై సహృదయకంఠధారణయోగ్యతకు నోచుకున్నవి. దివ్యప్రేమసురభికల్పతరు ప్రసూనము లివి!

అలౌకికప్రతిభాసంపన్ను లగు నీ పన్నిద్దరు పరమయోగుల చతుస్సహస్రగాథాత్మక దివ్యప్రబంధ మందలి భగవద్గుణానుభవామృతమును తనివితీర గ్రోలగలిగి నపుడు మాత్రమే మనము చరితార్థులమై బ్రహ్మానందసాగరమున నోలలాడి పునరావృత్తిరహిత మగు నమృతఫలమందు కొనగలము.

"దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభంగురః,
తత్రాఽపి దుర్లభం మన్యే వైకుంఠప్రియదర్శనమ్."

ఎనుబదినాలుగులక్షల జీవరాసులలో మనుష్యజన్మ ముత్తమము. కాని విష్ణుభక్తివిహీను డగు మానవుని జన్మ వ్యర్థము. విష్ణుప్రీతికి మాత్రమే పాత్రు డగుట చాలదు; విష్ణుభక్తుల యనుగ్రహము గూడ పొంద నర్హతగల మానవు డీ లోకమున చాల దుర్లభుడు. ఇట్టి నరజన్మము సార్థకము చేసికొనవలె నన్న వైకుంఠపాదయుగళీవిభూషిత శిరస్కు లగు వకుళభూషణుల నుతించు క్రింది సూక్తియే సదా మననీయ మని పలుకుచు నిక నీ సువర్ణ సుందర కృతికన్యకు గురు మంగళగీతిక నాలపింతమా!

"సమజ్జనస్య చిత్తభిత్తి భక్తి చిత్రతూలికా
భవాహివీర్యభంజనే నరేంద్రమంత్రియంత్రణా,
ప్రపన్నలోకకైరవప్రసన్నచారుచంద్రికా
శఠారిహస్తముద్రికా హఠాత్కరోతు మే తమః!"

శఠకోపుల వరదాభయహస్తముద్రిక యాశ్రితుల హృదయకుడ్యములపై భక్తకథాచిత్రముల లిఖించు తూలిక. సంసారభోగిసందష్టజీవుల విష మడచుటలో నది నరేంద్రుని (విషవైద్యుని) మంత్రప్రయోగము వలె నమోఘముగా పని చేయును. ప్రపన్నజనోత్పలములపాలిటి కీ కవిచంద్రుని హస్తముద్రిక రాకాచంద్రికను బోలినట్టిది. అట్టి యా ముని యభయ హస్తముద్రికయే మన యజ్ఞానాంధకారము దూరము చేయుగాక!

"వకుళాలంకృతం శ్రీమచ్ఛఠకోప పదద్వయమ్,
అస్మత్కుల ధనం భోగ్య మస్తు మే మూర్ధ్ని భూషణమ్."

వకుళకుసుమాలంకృతమును అస్మత్కుల ధనమునునగు శ్రీశఠకోపుల పాదారవిందద్వయమే నా శిరోభూషణమగు గాక!

"యుత్పదాంభోరుహధ్యాన విధ్వస్తాశేషకల్మషః,
వస్తుతా ముపయాతోఽ హం యామునేయం నమామి తమ్."

"మాతా పితా యువతయ స్తనయా విభూతి
స్సర్వం యదేవ నియమేన మదన్వయానామ్,
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా."

"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్."

యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తుతే."

"కాయేన వాచా మనసేంద్రియై ర్వా
బుద్ధ్యాఽఽ త్మనా వా ప్రకృతేః స్వభావాత్,
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి."

"మంగళం శఠకోపాయ కలికల్మషశోషిణే,
శ్రీమత్కారి తనూజాయ సదా భవతు మంగళమ్!"

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

మంగళంమహత్

శ్రీ శ్రీ శ్రీ

